# కుశలవాక్కు

పుణ్యమనీషులారా! శ్రీకృష్ణావతారతత్త్వమున నాలవ ప్రకరణ మీయది వెలువరించుభాగ్యము నాకొదవినది. కాలము యథాపూర్వమే కాన దానింగూర్చి మరల వ్రాయఁబూనను. ఈప్రకరణమునందు శ్రీకృష్ణపరమాత్మను దర్శింప నక్రూరుఁడు గోకులమున కరుగుట, అందు మహామునులు గోపికలై పుట్టియుండుట, అర్జునుని యద్భుతవృత్తాంతము, నారదముని రాధాలోకమునకుంబోయి మానిని యగుట, యక్రూరునకు శ్రీకృష్ణబలరాములు యమునాజలముల స్వస్వరూపములఁ గనంబఱచుట, మధురానగరప్రవేశము, రజకాదులకు ముక్తి నొసఁగుట, కంసవధము, ఉగ్రసేనపట్టాభిషేకము, శ్రీహరి నందునకాధ్యాత్మికవిషయాదులఁ దెలుపుట లోనగుపవిత్రగాథలు ప్రధానములు. పద్మపురాణాదులనుండి యీకథలు గ్రహింపఁబడినవి. కుబ్జావరదానము, చాణూరముష్టికులకు ముక్తిని ప్రసాదించుట యనుమొదలగువిషయములందు నావ్రాసినభావము పరిశీలింపఁదగినది. అభిప్రాయభేదము లుండవచ్చునుగాని శ్రీకృష్ణచరిత్రమున నించుకయేనియు దోషలేశము లేదని నానమ్మిక.

కరుణాసింధువులారా! ఎట్లో ఈమహాగ్రంథమున నాలు ప్రకరణములు వ్రాయఁగల్గితిని. ద్రవ్యసహాయమే ప్రధానము. ఈసమయమునందు మ. రా. శ్రీ పుట్టా నాగసుబ్బరాయశ్రేష్ఠి గారు పరమేశ్వరప్రేరణమున నిరువదియైదురజతముద్రికలను

విరాళ మిప్పించి రనుసంతోషవార్తను దెలుపఁగల్గితిని. క్రొత్త పోషకులును బదిమంది చేరిరి. పోషకులను జేర్చి యీకార్యమును గొనసాగించు నుత్తమచిత్తు లొక్కరు గలరు. వారివిషయ మిపుడు విశేషించి వ్రాయక వెనుకఁ దెలుపుకొనియెదను. ఇంకను క్రొత్తపోషకులు చందాదారులుచేరి నాయీపూనిక్కకి సాయపడుదురని నమ్మియున్న వాఁడ.

"కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావాత్
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి."

అనుసూక్తినే నెఱనమ్మియున్న వాఁడను. నాయీప్రయత్నము సత్యమూలమయ్యేనేని విజయము గాంచునని నమ్మెదను. విశేషించి వ్రాయవలసినవిషయము లింతకంటె నిట లేవని తెల్పుకొనుచు నపరాధముల క్షమింపఁ బండితులఁ బ్రార్థించుచున్న వాఁడను.

ఇట్లు విన్నవించు భక్తజనపాదసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ శ్రీ శ్రీ

# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించు పుణ్యపురుషులు.

కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
,, విరూరు పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. యల్.
,, కొనూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్.
,, యన్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్.
,, బి. పి. దేవరాజులునాయుడుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.
,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.
,, కే. సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.
,, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులు శ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, దేవతి పిచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వేంకటేశముశ్రేష్ఠిగారు.

మ. రా. శ్రీ. మల్లెంకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, మాలేపాటి చిన్నవెంగన్నశ్రేష్ఠిగారు.
,, అన్నలూరు శేషగిరిరావుగారు.
,, మాలేపాటి వీరయ్యశ్రేష్ఠిగారు.
,, బి. శేషగిరిరావుగారు.
,, శ్రీకంఠము నరసింహయ్యగారు.
,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్. టి.
,, పి. వీరభద్రరావుగారు.
,, పుష్పాల వేంకటస్వామినాయుడుగారు.
,, కాట్రపాటి చలపతిరావుగారు.
,, బొందలగుంట వేంకటనారాయణరావుగారు.
,, ఆర్. గోవిందరావుగారు, బి. ఏ., తహసీల్ దార్.
శ్రీమతి తలుపుల వేంకటసుబ్బమ్మగారు.
మ. రా. శ్రీ. బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, సకలా వేంకటసుబ్బయ్యగారు.
,, చిల్లా వేంకటకొండయ్యగారు.
,, వీరబోయిన కొండయ్యగారు.
,, మాకం జంగంశ్రేష్ఠిగారు, చీమలపెంట. [పల్లె.
,, గంగవరము, వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారి
,, పి. సీతారామయ్య పంతులుగారు, ఎమ్. ఏ., మండలాధికారులు.
,, నగరం గురురావుగారు, బి. ఏ., ఆఫిషియల్ రిసీవర్, యుత్తురువై ఎస్టేటు, వీరకేరళము.
,, గడియారము కృష్ణస్వామయ్యగారు

## కామలాపురము.

మ. రా. శ్రీ. బచ్చురాఘవయ్యశ్రేష్ఠిగారు.
,, జి. సుబ్బరావుగారు.
,, రాణువ ఫణిరావుగారు.
,, హానుమగుత్తి. చెంచిరెడ్డిగారు, గ్రామమునిసిప్.

## వల్లూరు.

మ. రా. శ్రీ. సముద్రాల రామస్వామిగారు.
,, బెస్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు.
,, తంగటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు.
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుఁడు సుబ్బయ్య శ్రేష్ఠిగారు.
,, పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠిగారు, ఆరణిపోలేపల్లిసుబ్బయ్యశ్రేష్ఠి [గారు

## ఎఱ్ఱగుంట్ల.

మ. రా. శ్రీ. ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము.
,, ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు.
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లము సూరయ్యగారు.
,, పేర్ల నాగిరెడ్డిగారు.
,, వి. శ్రీనివాసులునాయడుగారు.
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిరుజువ్వి.

## పులివెందుల

మ. రా. శ్రీ. మద్దాల బోగాది శ్రేష్ఠిగారు, వేములకొత్తపల్లి.
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, వేం [పల్లి.
,, పుల్లగూర వేంకటశేషయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి. [గారు.
,, కావుటూరు ఆనందరావుగారు, పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు

మ. రా. శ్రీ. లింగిరెడ్డి గంగిరెడ్డిగారు, ఎద్దులాయెగారి క్రొత్తపల్లి
,, వడ్లకుంట అశ్వత్థమయ్యగారు, వేంపల్లి.

ప్రొద్దుటూరు.

మ. రా. శ్రీ. కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు.
,, వంగీపురము శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ., ప్లీడరు,
,, సి. నరసరామ శాస్త్రిగారు, బి. ఏ., ప్లీడరు.
,, యం. రామస్వామయ్యగారు, ప్లీడరు.
,, రావులూరు సుబ్బరావుగారు, డిస్ట్రిక్టు నాజరు.
,, ఉప్పులూరు భద్రయ్యగారు.
,, డి. రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు.

రాజంపేట.

మ. రా. శ్రీ. ఆర్కాటు పరశురామరావుగారు, యం. యల్. సి., నెందలూరు
,, ఏచూరు చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము.
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట.
,, పిడతల చిన్న వేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు.
,, అచ్యుతన్న రామచంద్రరావుగారు, టంగుటూరు.
,, మంచి వీరరాఘవయ్యగారు, మందపల్లె.
,, పుట్టా నాగసుబ్బరాయశ్రేష్ఠిగారు, చిట్టివేలు.

సిద్ధవటము.

మ. రా. శ్రీ చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లి.
,, గోపవరము గోపాలురెడ్డిగారు, గోపవరము.
,, యాదాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లె.

## రాయచోటి.

మ. రా. శ్రీ. కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

,, రేవులూరు సిద్దయ్యశ్రేష్ఠిగారు, కస్తూరిరాజుగారిపల్లె.

,, చిన్నబయ్యన్నగారి లక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె.

,, కుర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె.

,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, నూలివేడు.

,, పుల్లగూర బాలసుబ్బయ్యదత్తుకుమారుఁడు పిచ్చయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

## అనంతపురమండలము, హిందూపురము.

మ. రా. శ్రీ. దొంతి భీమయ్యగారు.

,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు.

,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు.

,, సేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు.

,, గోరంట్ల వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.

,, ఆర్. వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.

,, పి. ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు.

,, కరణము కృష్ణరావుగారు, దేవినహళ్లి.

,, శ్రీరాము తిమ్మయ్యశ్రేష్ఠిగారు.

,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు.

,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె.

,, ఈడిగె అంజనప్పగారు.

,, చి. నారాయణరావుగారు, ఉపాధ్యాయులు, మడకశిర.

## అనంతపురము.

మ. రా. శ్రీ. వెలమకూరు ఆత్మారామప్పగారు, పినాకినీముద్రాక్షరశాలాధి
కారులు.
„ హట్టి శివరావుగారు, ప్లీడరు.
„ పులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు.
„ జి. భద్రయ్యశ్రేష్ఠిగారు.
„ జి. రామయ్యశ్రేష్ఠిగారు.
„ బి. వేంకటప్పగారు.
„ ఏ. జి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసిప్.
„ వి. ఓబుళేశప్పగారు.
„ పైడి. లక్ష్మయ్యగారు, అచ్చంపల్లి.

## గుత్తి

మ. రా. శ్రీ. పి. యం శ్రీనివాసయ్యంగారు, బి. ఏ., ఎం. ఎల్.
డిస్ట్రిక్టు మునిసిపు.
„ యస్. సుబ్బరావుగారు, బి. ఏ. ప్లీడర్.
„ వై. రామస్వామిగారు, బి. ఏ, ప్లీడర్.
„ జి. యం. హనుమంతరావుగారు, భూస్వాములు.
„ వై. శేషప్పగారు, ప్లీడరు.
„ వై. కొండలరావుగారు.
„ సి. సుందరరామయ్యగారు, హెడ్క్లర్కు మునిసిపుకోర్టు.
„ ఆర్కాటు గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
„ సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు; బి. ఏ., ప్లీడరు.
„ కోపూరు. వేంకటరావుగారు, పెన్షనర్.
„ నిట్టూరి లక్ష్మీనారాయణరావు. బి. ఏ., ప్లీడరు.

మ. రా. శ్రీ. తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల.
,, జంబులపాడు పెద్దవేంకటప్పగారు, ధర్మపురి.
,, కానుగోవి. కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్‌స్పెక్టరు.
(ఇప్పటినివాసము, అవుకు)

## బళ్లారి మండలము.

మ. రా. శ్రీ. విట్టా శేషప్ప శ్రేష్ఠిగారు, ప్రజాసంఘకార్యదర్శులు.
,, రావుసాహెబు, జే. పాపయ్య శ్రేష్ఠిగారు.
,, అయ్యగారి బుస్సెట్టిగారు, కణేకల్లు.
,, ఏ. భీమరావుగారు, వ్యాపారస్థులు, ఆదవాని.

## కందనూలుమండలము.

మ. రా. శ్రీ. ఖాదర్ బాదర్ అంబాజీరావుగారు, నంద్యాల.
,, అవధానము వేంకటనరసయ్యగారు, ఉయ్యాలవాడ.

## నెల్లూరుమండలము.

మ. రా. శ్రీ. వెలంపల్లి రామకృష్ణమ్మగారు.
,, ములుమూడి లక్ష్మీనరసింహయ్యగారు.
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు.
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె.
,, పత్తి గురుమూర్తి శ్రేష్ఠిగారు, కుల్లూరు
,, బొమ్మిశెట్టి లక్ష్మీనరసింహస్వామి శ్రేష్ఠిగారు, నెల్లూరు.

## గుంటూరుమండలము.

మ. రా. శ్రీ. అక్కెనప్రగడ లక్ష్మీనారాయణరావుగారు. బి. ఏ., బి. ఇ.
డిస్ట్రిక్టు బోర్డు ఇంజనీయర్‌గారు.
,, మారుటూరు పుండరీకాక్షుఁడుగారు, పట్టిచెరుకూరు.

## గోదావరి మండలము.

మ. రా. శ్రీ. కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము.
,, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్, జమీం దారుగారు, ఏలూరు.
,, దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు,కరణం, పెద్దపట్నము
,, బొడ్డు మల్లికార్జునరావుగారు. బాపిరాజుగారు, ఏలూరు.
,, గిరెగె మాణిక్యముగారు.
,, ఏ. యస్. స్వామిగారు.

## విశాఖపట్టణ మండలము.

మ. రా. శ్రీ. మాడుగుల వేంకటప్పారావుగారు, జమీందారులు, బొంతలకోడూరు.

## గంజాము.

మ. రా. శ్రీ. పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము.

## చెన్నపురము.

మ. రా. శ్రీ. వి. యస్. నరసింహాచార్యులుగారు. బి. ఏ., బి. యల్.
,, కట్టా. జోగయ్యగారు.
,, పి. విజయరాఘవులు శ్రేష్ఠిగారు, పెరియమెట్టు.
,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీథి.

## కర్నూలు.

మ. రా. శ్రీ, గాడిచెర్ల వెంకోబరావుగారు, అవుకు.

# విషయసూచిక

కావ్యస్మృతితీర్థ:

## శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి గ్రంథములు.

ఆంధ్రశ్రీమద్రామాయణము, నిర్వచనము, వ్యాఖ్యానములలోని భావము కూడ విడువక తెనిఁగింపఁబడినది. ఏశ్లోకమున కేపద్యమో తెలియుటకై శ్లోకసంఖ్యకూడఁ దెలుపఁబడినది. విశేషార్థములుండుతావులఁ గ్రింద వివరముగఁ వ్రాయఁబడినది గొప్పపీఠికగలదు.

3 సంపుటములుగల ప్రతి 12 0, 7 సంపుటముల ప్రతి 14 0

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| హాలాస్యమాహాత్మ్యము, స్కాందపురాణమునుండి తెనిఁగింపఁబడినది. మధురాపురిమాహాత్మ్యమును దెలుపును. మీనాక్షీసుందరేశ్వరుల విలాసచరిత్రములు డెబ్బదిరెండుకథ లిందుఁగలవు | ... | 1 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము, భండాసురుని లలితాదేవి చంపుట మొదలగు గాథలనేకము లిందున్నవి. | ... | 1 | 8 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకనాటకము | ... | 0 | 10 |
| పాండవాజ్ఞాతవాసనాటకము | ... | 0 | 12 |
| శ్రీరామవనవాసనాటకము | ... | 0 | 10 |
| సంగ్రహరామాయణము, వచనము, సులభశైలి | ... | 0 | 10 |
| సంగ్రహభారతము ,, ,, | ... | 1 | 0 |
| సంగ్రహభాగవతము ,, ,, | ... | 1 | 0 |
| హనుమద్విజయము, పద్యకావ్యము | ... | 0 | 8 |
| కడపమండలచరిత్ర | ... | 0 | 8 |
| శ్రీకృష్ణావతారతత్వము, ఇది యనేకపురాణములనుండి మనోహరగాథలు వచనరూపముగా వ్రాయఁబడినది. ప్రథమసంపుటము | | 1 | 8 |
| ద్వితీయసంపుటము | ... | 1 | 8 |
| తృతీయసంపుటము | ... | 1 | 8 |
| చతుర్థసంపుటము | ... | 1 | 8 |
| పంచమసంపుటము | ... | 1 | 8 |
| షష్ఠసంపుటము | ... | 1 | 8 |
| నూతనపంచాంగము | ... | 0 | 1 |

# ప్రకటన.

---

**వ్రతరత్నాకరము, ప్రథమభాగము.—**

ఇందు వ్రతసంకల్పము మొదలు పూజ ముగియువఱకు చేయవల సిన విధులఁదెల్పి ప్రాణప్రతిష్ఠ, కలశపూజ, గణాధిపతిపూజ,షోడ శోపచారశ్లోకములు మొదలగు వానిని తాత్పర్యముతోఁడ ముద్రిం చినారము. ఇందు వినాయకవ్రతము, వరలక్ష్మీవ్రతము, సరస్వతీ వ్రతము, అనంతవ్రతము, కేదారేశ్వరవ్రతము, గరుడపంచమీ వ్రతము అను 6 వ్రతములు గలవు. ... 0 8

**వ్రతరత్నాకరము, ద్వితీయభాగము.—**

ఇందు ఋషిపంచమీ, మథనద్వాదశీ, అమావాస్యసోమవతీ,కృష్ణా ష్టమీ, శ్రీరామనవమీ, అముక్తాభరణసప్తమీ, భక్తేశ్వర, శత వర్తి, లక్షవర్తి, త్రికార్తి,చిత్రగుప్త,క్షీరాబ్ధిశయన,సావిత్రిగౌరి, సంపద్గౌరి, సత్యనారాయణ, రథసప్తమీ, సంకటచతుర్థీ, ఏకాదశీ గురువారము, శ్రవణద్వాదశీ, శరన్నవరాత్రి, నృసింహజయంతీ మున్నగువ్రతములు గలవు. ... 1 0

**వేమనపద్యములు, తాత్పర్యసహితము.—**

ఆబాలగోపాలము తెలియునట్లు తేటతెల్లపు భాషలో తాత్పర్య ముతో మంచికాగితములమీఁద మరల ముద్రించి ప్రకటించి నారము, చక్కనికొత్తకూర్పు. ... 3 8

**వేమనపద్యములు మూలము** ... 1 12

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.



శ్రీః

# శ్రీ కృష్ణావతారతత్త్వము

## ఆటవ ప్రకరణము.

శ్లో. లీలాయతాభ్యాం రసశీతలాభ్యాం
నీలారుణాభ్యాం నయనాంబుజాభ్యాం
ఆలోకయేదద్భుతవిభ్రమాభ్యాం
బాలః కదా కారుణికః కిశోరః. ౧. ఆ. ౪౫.

బహుళచికురభారం బద్ధపింఛావతంసం
చపలచపలనేత్రం చారుబింబాధరోష్ఠమ్
మధురమృదులహాసం మంథరోదారలీలం
మృగయతి నయనం మే ముగ్ధవేషం మురారేః. ౧ ఆ. ౪౬.

మాయాతపాంథాః పథిభీమరథ్యా
దిగంబరః కోఽపి తమాలనీలః
విన్యస్తహస్తోఽపి నితంబబింబే
ధూర్తస్సమాకర్షతి చిత్తవిత్తమ్. ౨. ఆ. ౩౪.

కృష్ణేనాంబగతేన రంతు మధునా మృద్భక్షితా స్వేచ్ఛయా
తథ్యం కృష్ణక ఏవ మాహ ముసలీ మిథ్యాంబ పశ్యాననమ్
వ్యాదేహీతి విదారితే శిశుముఖే దృష్ట్వా సమస్తం జగ
న్మాతా యస్య జగామ విస్మయపదంపాయాత్మనః కేశవః. ౬॥

శ్రీకృష్ణకర్ణామృతము.

భాగవతశేఖరులారా! సత్యాన్వేషణతత్పరులారా! శ్రీకృష్ణావతారతత్త్వమున నయిదవప్రకరణమున భగవంతుని మనోహారచరిత్రమును దెలుపుకథలం బఠించి కృతార్థులరైతిరి. ప్రపంచమున బహువిధకర్మముల నొనరించిన జీవులు కలరు. వారెల్ల నొక్కయభిప్రాయము కలవారు కారు. వారెల్ల నెట్టివానిం గాని యొక్కరీతి సంభావింపఁజాలరు. ఆయాయికర్మముల ననుసరించి బుద్ధులు మాఱుచుండును. దేవతానురాగద్వేషభావములు కలుగుచుండును. వాని ననుసరించియే వారిప్రవర్తనము సాగుచుండును. సత్పదార్థమునందు దుష్పదార్థభ్రాంతి కలుగుట కిదియే కారణ మనవలయుఁ గాని వేఱొకకారణమును నిరూపింపఁజాలము. ఆచిత్తవృత్తులు భగవద్విషయమునఁగూడ నిట్లే ప్రవర్తించును. అట్టివారికి శ్రీకృష్ణునిచరిత్ర మపవిత్రమని స్ఫురించె ననుటలో విచిత్రము నాకుం గనఁబడలేదు. చంద్రిక యుష్ణముగా నుండునని భ్రాంతినొంది మూలమూలల నిమిడి యుండుజంతువులు కొన్ని కలవు. వెన్నెలసంతాపకరమనిదూషించువారు కొందఱు గలరు. అది వారికిఁ బరితాపకరమే కాదని మనమన రాదు. ఆమనస్సున కది యట్లే తోఁచు ననుట నిర్వివా

దాంశము. కావున శ్రీకృష్ణునివిషయమునఁ బెక్కుమందికి అన్యథాభావము కలుగుటలో వింతలేదు.ఆభావమును మనము మార్పఁజాలము. వారికర్మ మట్టియూహాను వారికిం గల్పించెనని మనము కర్మమును మన్నించవలసియుండునని నావిశ్వాసము.

శ్రీకృష్ణపరబ్రహ్మము గోపికావల్లభుఁడని, యపవిత్రచరిత్రుఁడని చేయెత్తి ఘోషించువారి కొకనమస్కారముచేయుట తప్ప వేఱొక్కకార్యము ఫలవంతముకాదని నాసమ్మకము శర్కర చేదగుట రసనాదోషమునఁ గాక మఱేమిటి? ఆనాలుక కాదోషము లేకుండఁజేయుసాధనము నెమకినచో బాగుండునుగాని యేల శర్కర బాగుగాలేదని యంటివని యతని నాక్షేపించిన లాభమేమి? అట్టిపని సరసమతు లొనరింపరు. కుమతు లొనరింపఁబూనుదురు. అట్లే శ్రీకృష్ణపరమాత్మ చరిత్ర ముపనిషద్వేద్యము. పురాతనసత్కర్మఫలపరిణామమునఁ గాని శ్రీకృష్ణపాదాంబుజధ్యానము కుదురదు. పరిశుద్ధమనస్సు కుదురవలయునన్న భగవత్పూజ చేసియుండవలయును. విద్య నభ్యసించినను అదికుదురదు. పాండిత్యమునకు వృత్తికిని సంబంధములేదని మూఁటికి ముమ్మాటికిఁ జెప్పఁగలను. పండితుఁడు జారుఁడైన నది యేకారణమున నని ప్రశ్నించిన సత్కర్మముల నాచరింపమి ననవలయునేగానియింకొకమాటఁ జెప్పఁజాలము. కావుననే పామరులలోఁగూడ భక్తులు పెక్కుమంది కలరని చెప్ప సాహసించితిని. పండితులలో లేరనికాదు. తక్కువమంది గలరు. ఏలన పాండిత్యము తొలుదొలుత గర్వము నాపాదిం

చును. దాన మనస్సు కలఁతనొందును. దాన సత్కార్యానుష్ఠానముఁ జెడును అద్దాన భక్తి దూరముగానుండ నెంచును. కావునఁ బండితుఁడు గర్వయుక్తుఁడు కానిచో ముక్తి కరతలామలకముగ నొందఁగలఁడు. పామరుఁడో ప్రాక్పుణ్యావశమున భక్తుఁడగును. పెద్దలసేవచేయును. ఏవిషయమును దానిర్ణయింపఁజాలమిఁ బెద్దల నడిగెదననును. కాన గర్వ మాతనిమది నెలకొనవీలుండదు. ఈ హేతువులంబట్టియే పామరులలో నధికసంఖ్యాకులు భక్తులుగల రంటిని. తఱచుగాఁ బామరులకు దృఢభక్తి కుదురును. అదియే వారికిఁ దరణోపాయమును జూపించును. దాన వారు కృతార్థు లగుదురు. కావున భక్తి కుదురనిచో భగవంతునిఁ బ్రశంసించుభాగ్యము లభింపదు ఇఁకఁ బ్రకృతము ననుసరించెదను.

గోపికలన నెవరో అయిదవప్రకరణమునఁ బఠించితిరికదా. దాన భగవన్మహిమను తేటపడఁగలదు. ఎట్టియెట్టివార లీగోపికారూపమున శ్రీహరి నారాధింపఁజాలిరో తెలియఁబడఁగలదు. "గోపికాలోలః శ్రీకృష్ణః" అనఁగా "భక్తలోలశ్శ్రీకృష్ణః" అన్న మాటగదా. భక్తులు గోపికలు. వారియం దాసక్తిగలవాఁడు భగవంతుఁడగుట స్వభావము. అదియెఱుంగక కొందఱు కృష్ణుని దూఱుదురు. ఏవేవో కారణములఁ జూపుదురు. తమదుర్వాదము నవి సమర్థింపఁజాలునని వారివిశ్వాసము. కాని యవియే వారి యజ్ఞానవిలాసమును వెల్లడించునని భక్తులభావము. భగవంతుని దూషించునంతపాప మొనరించిరి కాఁబోలునని నా

యూహ. నుతికొందఱు పండితమ్మన్యులు రాధ శ్రీకృష్ణునిభార్యయే కాదు జారిణియందురు. రామరామ! కృష్ణకృష్ణ! వారిపాప మే మనవచ్చును. రాధామహిమమును గనుఁగొనుయోగ్యత వారి కీజన్మమున లేదనుటకంటె నింకేమనవచ్చును. అట్టి దేవానాంప్రి యులకొఱకు రాధామహిమము నేయేపురాణము లెట్లెట్లు వివ రించెనో యించుక యైదవప్రకరణమున వ్రాసితిని. ఈయాఱవ ప్రకరణమునందుఁ గూడ విశేషించి వ్రాయుదును. దాన వారికిం బట్టిన పాపరూప పిశాచము తొలఁగిపోవఁగలదని నాదృఢ విశ్వాసము. ఆవిషయములఁ దెలుపుగాథలు విచిత్రములుగఁ దోఁచు పఠింతురుగదా. ఆనందసాగరకల్లోలపరంపరాడోలికల నూఁగఁగలరు. ఆయానందపారవశ్య మిట్టిదియని వర్ణింపఁజాలిన పాండిత్యము నాకులేదని సత్యముగాఁ జెప్పఁగలను. రాధాం బిక యనఁ బరదేవి, మూలప్రకృతి, అనుపురాణముల సిద్ధాంత మున అనేకకోటిబ్రహ్మాండజనని యని స్పష్టము కాఁగలదు. అట్టి పరమేశ్వరిని · గులటయని వచించుటకంటెఁ బాపముగలదా యని నేనడుగుచున్నవాఁడ. పెక్కుపురాణములలో నాదేవిం గూర్చినవిషయము లనేకములు సంసారసాగరతరణక్షమములై కనుపట్టెడిని. అవ్వానిం దలంపక తాఁబట్టినకుందేటికి మూఁడే కాళ్లని వాదించువారికి సమాధానము చెప్పఁబూనుట పనిలేనిమంగలి పిల్లితలగొఱిగె నన్నసామెతవంటిదే యగు. ఆమాట లటుండనిమ్ము. ప్రకృతము పరమేశ్వరుఁ డాదినారాయ ణమూర్తి రాధాంబికా సహవాసమును గొంతకాలము వదలఁ

బూనెను. ఆమెమనస్సు వగపాలుకాకుండునట్లు బోధించెను.. విస్తరించి యామె తత్త్వము నెఱింగించెను. దాన నామె యించుకతృప్తినొందిశతవత్సరమితవియోగముశాపకారణమున ననుభవింపక తప్పదని భావించెను. భగవంతుఁడు రాత్రులందుఁ దన చెంతనుండునట్లు వరమొసంగెను గానదానిందలంచిసంతృప్తి గాంచెను. ఈగాథయందలిరహస్యము నాలోచించిన రాధా మాధవులకు నెడఁబాటు గలుగ లేదనియు శాపమును లోకము నకుఁ దెలుపుటకై యిట్లు పన్నినపన్నాగముగాని వేఱుకాద నియుఁ దోఁపక మానదు. ఇట్లు యుక్తిపన్నుట కేమికారణమని ప్రశ్నింపవచ్చును. భగవంతునకే శాపఫల మనుభవింపక తప్పినది కాదుకదా. ఇఁక మనకెట్లు తప్పునని లోకు లకార్యము లొన రింపకుండ న్యాయరీతి నుందురని తెలుపుటయే యీయుక్తికిఁ దగినఫలమని యంద అంగీకరింపక తప్పదు. ఏశాపముగాని భగ వంతున కంటదనుట నిక్కము. ఆశాప మొసఁగుశక్తి భగవదను గ్రహమునఁ గలిగినదే. కాని వేఱొకకారణమునఁ గలుగదు. సర్వశక్తులు భగవదధీనములు. ఏశక్తిగానిపరమాత్మను బాధింపఁ జాలదనుట సిద్ధాంతము. లోకులకు సద్వృత్తినేర్పుట యెట్లు? ఒక్కయపరాధము తానో తనభార్యయో యొనరించినట్లు, దాని కాగ్రహించి యొకసజ్జనుఁడు శపించినట్లు, తత్ఫలము తాననుభవించినట్లు కనఁబఱచిన నెల్లరకుఁ గుణపాఠము చెప్పిన ట్లగునని యీశ్వరునిసంకల్పము. కావున రాధామాధవులకు వియోగము వాస్తవముగా లేదు. కల్పితము.

ఆర్యులారా! ఐదవప్రకరణమున గోపికలు పూర్వజన్మమున నెవ్వరో తెలుపఁబడినది. విశేషించి రాధామహిమము వివరింపఁబడినది. ఈయాఱవప్రకరణమున నింకను బామరులకు రాధామాధవులయం దభిప్రాయాంతరము గలుగకుండుటకై రాధామహాత్వము కొంచెము వ్రాసి యపూర్వగాథలఁ బురాణములనుండి యుదాహరించి జిజ్ఞాసువులగువారికి సంశయములఁ దొలఁగించి పిదప శ్రీమహాపురుషుని యవతారఫలమగు చరిత్రములు వ్రాయఁబడును. ఓపికమై వానిం జదువుట పాఠకులవిధి.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

అన్నస్వప్రతిజ్ఞను నెఱవేర్ప భగవంతుఁడు పూనినవిషయమే యీప్రకరణమునఁ గానఁబడును. ఇంతకుముందుఁ జేర్కొనినవిలేవా యనవలదు. కంసవధ భూభారహరణ ప్రారంభముకదా. కాఁబట్టి పెక్కుమందిని యిక్కట్టులపాలుచేయుచు నిచ్ఛానుసారము ప్రవర్తించుచు మదమున విఱ్ఱవీఁగుదుష్టభూపాలురను, వారి నాశ్రయించిన యట్టికుబుద్ధులను బొడవడఁగించుటయే శ్రీకృష్ణుఁడు చేయఁదగినకార్యములలో నుత్తమములు. కావున నట్టిమహాకార్యముల కీప్రకరణమున నారంభము కాఁగలదు. కంసుఁ డన నెవఁడో యీవఱకే చదివితిరి. తత్పరిచరులలో ననేకులు హతులు కాఁదగినవారు కలరు. వారి చరిత్రములుకూడ నింతకుముందే వ్రాయఁబడినవి. కొన్ని

వ్రాయఁబడనివి. కల్గిన వాని నందందు సమయానుసారము వ్రాసెదను. ఈవిషయములచే భూభారహరణమున కెవ్వ రెవ్వ రెట్లెట్లు తోడ్పాటు చూపినదియుఁ దెలియఁగలదు. అప్పుడు భగవన్మహిమను మనకు స్పష్టము కాఁగలదు. దాన నహంకారము నశించు. అది నశించుటచే దానిస్థానమున శాంతము నెలకొనును. దానిచే భక్తి కుదురును. దాన భగవత్కైంకర్యముచేయు నుత్సాహము కల్గును. దానిద్వారా సంసారబంధములు క్రమముగాఁ దొలఁగును. అపుడు ముక్తిమార్గము వెదుక మనస్సు ప్రయత్నించు. అత్తఱి భగవంతుఁడు పురికొలుప సద్గురువు దొరకును. తద్వారా భగవదనుగ్రహము లభించును. దాన ముక్తి చేకూరును. కావున నోపాఠకమహాశయులారా! భగవత్కథల భక్తిభావముతోఁ బఠింపవలయు. ఈ కార్యము ఎవ్వఁడేని చేయఁగలఁడా యనుశంకకుఁ జోటీయరాదు. భగవంతున కశక్యములగు కార్యము లుండవనుట నిక్కము. కావున నితరులెవ్వరును జేయలేరన్న ననవచ్చునుగాని సర్వశక్తుఁడగు పరమేశ్వరుఁ డీకార్యము చేయఁగలఁడా యనుప్రశ్నము తెలివితక్కువచేఁ జేయఁబడునదియే కాని వేఱుకాదు. అభేద్యములగుపర్వతముల నొకచిన్నవజ్రముచే భేదించుపరతత్త్వమున కింక లోకమున నసాధ్యమగు కార్య ముండదన్నవిశ్వాసము ప్రాజ్ఞులకుఁ దప్ప నితరులకుం గుదురదు. అనఁగా భగవచ్ఛక్తి యనుపమాన మన్నజ్ఞానము పామరులకు నాస్తికులకు నుండదని భావము. అట్టివా రెట్లు ప్రశ్నించినను వారి కడ్డము లేదు.

వానికి బదులుచెప్పుట కష్టముకాదు కాని వారి నంగీకరింపఁ జేయుటమాత్ర మశక్యమగుకార్యము. కావుననే నాయీ ప్రయత్న మట్టివారికిఁ దెలివిగలిగించుటకుఁగాక భగవత్కథల నెఱుంగని నావంటిమూఢమతులకుఁ బురాణము లిట్లు భగవంతునిమహిమమును దెలుపుచున్నవని తెలుపుటకేయని యెఱుంగవలయు. ఇంక నీవిషయమునుండి మరలి కథాప్రపంచమునకు వచ్చెదను. నారదముని శ్రీకృష్ణానుమతిఁ దనయిచ్చచొప్పున, బోయినపిదప నక్రూరుఁడు బలరాముని శ్రీకృష్ణుని దోడుకొని మధురానగరమునకు రా గోకులమునకుఁ బోయినకథ యిటఁ బ్రకృతాంశము. దానిని విస్తరించెదను. సావధానులరై చిత్తగింపుఁడు.

## అక్రూరుఁడు గోకులమున కరుగుట.

ఉద్ధవాదులచే ననుజ్ఞాతుఁడై యక్రూరుఁడు (దానపతిఁ రథమెక్కి పయనము సాగించెను. మార్గమున శుభశకునములఁ గనుంగొనియెను. తనకోర్కులు ఫలించునని నమ్మెను. ముందేమో తన కతిశయశుభములు గలుగనున్నవని సంభావించెను. మఱికొంతదూరముపోఁగా వామభాగమున మగనక్కయు, వాఁడునక్కయునిర్మలజలపూర్ణకుంభము, నకులచాషకము కనఁబడియెను. పతిపుత్త్రులంగూడిన సాధ్వీమణి కన్పట్టెను. ఆమె సంతోషస్వాంతయు, దివ్యాంబరాభరణధారిణియు నై యుండెను. తెల్లనిపూవులు, హారములు, ధాన్యము, ఖంజనముకానవచ్చెను. దక్షిణభాగమున మండునగ్నియు, బ్రాహ్మణుఁడు, వృషభము,

గజము, సవత్సయగుధేనువు, తెల్లగుఱ్ఱము, రాజహంసయు వేశ్యయుఁ, బుష్పమాలికయుఁ, బతాకయు, దధిపాయసములు, మణిసువర్ణరజతముక్తామణిమాణిక్యములు, మద్యమాంసచందన మాధ్వీకఘృతకృష్ణసారఫల, లాజ, సిద్ధాన్న దర్పణ, విచిత్రిత విమాన, సుదీప్తప్రతిమా, శుక్లోత్పలములు కానవచ్చెను. మఱియుఁ బంకజవనము, శంఖచిల్లము, కోరకము, మార్జారము, పర్వతము, మేఘము, మయూరము, శుకసారసములు, శంఖకోకిలవాద్యధ్వనులు తోఁచెను. విచిత్రకృష్ణనామాంకిత సంగీతము వినవచ్చెను. హరిశబ్దము, జయధ్వనులు శ్రుతిహితము లయ్యెను.

ఇట్లక్రూరుఁడు శుభశకునములం గాంచుచు శ్రీహరిని స్మరించుచుఁ బుణ్యతమంబగుబృందావనమును బ్రవేశించెను. అందుఁ దోలుదోలుత రాసమండలమును దర్శించెను. అయ్యది పరిమళసంభరితము. రంభాస్తంభాదివిరాజితము. సర్వదా నవ్యభవ్యశృంగారవస్తుసంపూరితము. అట్టి యామహత్తరసుకృత దర్శనమగు రాసమండలమును గాంచి భగవద్విహారస్థాన మిది కదా యను మహోల్లాసమునను బ్బుచు రథము సాగిపోననుమతి నొసంగెను. మఱికొంతదూరముపోఁగా నందవ్రజము దృష్టిపాత్రమయ్యెను. బృందావనము నక్రూరుఁడు దర్శించుఘట్టమున మహాకవి పోతన

"క. ముందట గనె ఘనచందన
కుందకుటజతాలసాలకురవకవటమా

కందర్ప నందిత బల గో
విందర్ వికచారుణారవిందర్ బృందన్."

అని వర్ణించెను. అట్టి బృందావనమున నొకభాగము నందు నందాదులమందిరము లున్నవని తేటపడు. అట్టి నంద వ్రజము నక్రూరుఁడు గాంచెను. ఆనందవ్రజము వైకుంఠ తుల్యము. వైకుంఠుఁ డందున్నవాఁడుకదా! అందలిమందిరములు నిరుపమానందప్రదములు. అవి భగవదాజ్ఞచే విశ్వకర్మనిర్మిం చెనుగదా. వానివైభవము వర్ణింప నలవికాదనుట కిదియొక టియే దృష్టాంతము. మనుష్యకల్పితము వర్ణింపఁదగు. భగవ దిచ్ఛాకల్పితము వర్ణనాతీతమనుట కే సందియముండును? అట్లు నందవ్రజమును బోడఁగాంచి మందమందగతి నరదము సాగు చుండ ఘంటాపథమును గాంచి పరమానందసాగరమున మునిఁగి తేలుచు నిట్లు తలంచెను.

ఔరా! నాయదృష్టము వర్ణనాతీతముకదా! శూద్రునకు వేదకీర్తనమువలె భగవద్దర్శనము శక్యమా. విషయాత్మకుల కది దుర్లభమే యగు. కాని యదియే సిద్ధాంతముకాదని నాకుం దోఁచెడిని. అధమాధముఁడనగు నాకుంగూడ నిపు డచ్యుత దర్శనము కాఁబోవుచున్నది. కాలనదియందు జలవేగమునఁ గొట్టుకొనిపోవుచున్న తృణాదిపదార్థములలో నొకానొక దానికి దరిఁ జేరు నదృష్టముకూడ నుండును. నేఁటికి నాదౌ ర్భాగ్యము నశించినది. నాజన్మము సఫలమే యైనది. యోగీశ్వ రులకు నమస్కరింప నర్హమగు శ్రీకృష్ణపాదారవిందద్వంద్వము

నకు నమస్కారముచేయుభాగ్యము నాకుఁ గలుగనున్నది. అయ్యారే! అతిఖలుఁడగుకంసుఁడు నాకు మహోపకార మొన రించెను. అతఁడు కృష్ణరాములం బిలుచుకొని రమ్మని నన్నే పంపెనుగదా. కావుననే భగవంతునిచరణసరసిజముల దర్శింపఁ బోవుచున్న వాఁడను.

అని పెక్కుభంగుల నక్రూరుఁడు తలంచుచు, భగవద్దర్శ నము కలుగునన్న మహోత్సాహమున సంతోషించుచుఁబోయి నందునిదివ్యమందిరమును దర్శించెను. ద్వారదర్శనముకాఁగా భగవద్దర్శన మైనట్లు భావించెను. ఆమందిరము పతాకాసమలం కృతమై రత్నభూషణభూషితమై, మణిమయదర్పణవిలాసములఁ దనరుచు, రత్నచిత్రవిచిత్రితమై, మంగళాస్పదమై కన్నుల పండువు చేయుచుండెను. ఆగృహావరమును గని యక్రూరుఁ డాత్మ నీగృహమునందు సకలబ్రహ్మాండనాయకుం డున్న వాఁడు. ఇదియే చిత్రము. సకలబ్రహ్మాండములు కుక్షియందుఁ గల మహాత్ముఁ డీనందుని యల్పగృహమున నిమిడియున్న వాఁడు. అభవుఁ డీమందిరమున సంభవము గాంచెను ఈగృహ మెంత భాగ్యవంతము.యశోదానందులుపూర్వజన్మమున నెంతటిపుణ్య కర్మములుచేసిరో చెప్ప నూహింప సాధ్యమా? ఎప్పుడు శ్రీ కృష్ణుని దివ్యమంగళవిగ్రహమును జూతును? అనుకొనుచుఁ బోయెను.

నందుఁ డక్రూరుని రాక విని రామకృష్ణులంగూడి గృహాం గణమున నెదుర్కొనియెను. వృషభానుప్రభృతు లానందుని

పార్శ్వముల నుండిరి*నందునిముం దాటక త్తియపోయెను జలపూర్ణకుంభము గజేంద్రముముంగలనుండఁగాఁ దెల్లని ధాన్యమును గైకొని సేవకుఁడు నడువ నీలధేనువు మధుపర్కమునుగొని పాద్యము రత్నాసనమును దీసికొని కింకరులురాఁగా సంతోషమున వినయాన్వితుఁడై నందుఁ డరిగెను. మహాభాగుఁడై వచ్చుచున్న యక్రూరునిఁ గాంచెను. పట్టరానియానందమునఁ గౌఁగిలించుకొనియె.గోపాలకు లక్రూరునిపాదములు శిరములఁ దగులఁగా నమస్కరించి తదాశీర్వచనములఁ గైకొనిరి. గుణవంతులకుఁ బరస్పరసంయోగమ త్తఱిఁ గలిగెను. నందుఁ డక్రూరున కాతిథేయసత్కారములు యథావిధి నిర్వర్తించెను. అప్పు డక్రూరుఁడు రామకృష్ణులం గాంచెను. ఈఘట్టమునఁ బోతన మహాకవి

"మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులఁ ధేనుదో
హనవాటీగతుల న్నలంకృతుల నుద్యద్బాహులం బీతనీ
లనవీనోజ్జ్వలవాసులం గుసుమమాలాధారులఁ ధీరులఁ
వనితాకాములఁగృష్ణరాములజగద్వంద్యక్రమోద్దాములఁ."

అని వ్రాసెను. ఈఘట్టమున మూలమెట్లున్నదో పరికింపుఁడు.

శ్లో. కృష్ణసందర్శనాకాంక్షీ ప్రకాశే సవితుస్సతి
దదర్శ రామం కృష్ణం చ వ్రజే గోదోహనం గతౌ
పీతనీలాంబరధరౌ శరదంబురుహేక్షణౌ. ౩౦.

---

*కృత్వా వేశ్యాం పురస్సరాం, పూర్ణకుంభం గజేంద్రం చ కృత్వా శ్రేశుక్లధాన్యకమ్. అనిమూలము.

కిశోరౌ శ్యామలశ్వేతౌ శ్రీనికేతౌ బృహద్భుజౌ
సుముఖౌ సుందరవరౌ బాలద్విరదవిక్రమౌ. ౩౧.
ధ్వజవజ్రాంకుశాంభోజైశ్చిహ్నితైరంఘ్రిభిర్వ్రజం
శోభయంతౌ మహాత్మానౌ సానుక్రోశస్మితేక్షణౌ. ౩౨.
ఉదారరుచిరక్రీడౌ స్రగ్విణౌ వనమాలినౌ
పుణ్యగంధానులిప్తాంగౌ స్నాతౌ విరజవాససౌ. ౩౩
ప్రధానపురుషావాద్యౌ జగద్ధేతూ జగత్పతీ
అవతీర్ణౌ జగత్యర్థే స్వాంశేన బలకేశవౌ. ౩౪.
దిశో వితిమిరా రాజన్ కుర్వాణౌ ప్రభయా స్వయా
యథా మరకతశ్శైలౌ రౌప్యశ్చ కనకాచితౌ. ౩౫.

౧౦. స్క. ౩౮. అధ్యా.

పైనున్న పద్యమును బరికించితిరి. క్రిందిశ్లోకములను దిలకించితిరి. ఇన్నిశ్లోకములకుఁ బైపద్యముగాక వేఱొకకందపద్యముకూడ నున్నది. దానియం దీయర్థము విశేషించి లేకున్నను "జలజాంకుశాదిరేఖలుగల" అనునర్థము కలదు. తక్కినపద్యభాగ మీయర్థము నిచ్చునది కానేకాదు. ఇన్ని శ్లోకముల సారమే యాపద్యరత్న మనుకొందము. కాని "వనితాకాములన్" అన్నవిశేషము క్రొత్తదిగఁ గనఁబడియెడిని. మూలమున నీయర్థమును ద్యోతింపఁజేయువాక్యమే లేదు. "శ్రీనికేతౌ" అనిమాత్ర మున్నది. దాని నిది యనుసరింపదనుట నిక్కము. పోనీ గంభీరార్థముగలపదమేమో యని యూహింతమన్న నదియుఁ గానరాదు. వనితాకాము లనఁగూడదా యన్నఁ

చెప్పని చెప్పఁజాలనుగాని పామరు లాక్షేపింప నవకాశ మిచ్చు చున్నదే యని పరితపించుచున్నవాఁడను. బలరామునకుంగూడ నీగ్రహాచారమే పట్టినది. పాప మాబలరాముఁడు రాసమండలమే యెఱుఁగఁడేమో! మహాభక్తుఁడగు మహాకవి కది తప్పుగాఁ దోఁపదని నేనెఱుంగుదు. కాని పామరులు మఱింత నొక్కి యాక్షేపింప నవకాశ మిచ్చునేమో యనుశంకమాత్ర మల్పబుద్ధి నన్ను వదలకున్నది. మూలమున లేనిదాని నేల చేర్పవలెనో తెలియకున్నది. ప్రాసముకొఱ కవస్థలపాలగుట యస్మదాదులకుఁగాని యట్టిసిద్ధకవితల్లజుల కుండదుగదా. భక్తుల కేవియుఁ దప్పుగాఁ దోఁపవు. భగవత్కృత్యము లన్నియుఁ బరిశుద్ధములే. సకారణములే కాని యితరు లాక్షేపింతురన్న భయ మామహాకవికి లేదేమో యనుటకన్న నింకొక్కమాట యేమి చెప్పఁగలను? ఇఁకఁ కథాభాగమును వినుఁడు

బలరాముని శ్రీకృష్ణునిం గాంచి మహానందమందెను. నందునింగూడి గృహముఁ బ్రవేశించెను. శ్రీకృష్ణపరబ్రహ్మము నాలింగనపూర్వకముగాఁ జేరఁదీసికొని యంకమున నునుచుకొనియెను. రాము నట్లే కూర్చుండఁబెట్టుకొనియెను. కపోలముల ముద్దిడుకొనియెను. పులకాంచితవిగ్రహుఁ డయ్యెను. ఆనందబాష్పసందోహనేత్రుఁడయ్యెను. "కృతార్థోఽస్మి" యనుకొనియెను. సిద్ధవాంఛితుఁ డయ్యెను. మరల నేత్రములు ఫలింప శ్రీకృష్ణునిం గాంచెను. ద్విభుజములుగలిగి శ్యామసుందరాకారము వెలయఁ బీతవస్త్రమును దాల్చి, మాలతీమాలాభూషితవక్షస్థలుండై

చందనలేపము తనర, మురళికరమునఁ గ్రాల, బ్రహ్మేశ్వరశేష ప్రముఖస్తుతులకుఁ బాత్రుఁడై, సనకాదిబ్రహ్మమునులవందన ముల నలరు పాదజలజములుగల్గి, గోపికలు నేత్రఫలముగాఁ జూచుచుండఁ బరిపూర్ణుఁడై పరాత్పరుఁడైయున్న శ్రీ హరిని క్షణకాలము చూచెను. మఱియొకక్షణమునఁ దనహృదయమున నిల్చి జతుర్భుజము లొప్ప సుస్మితము కన్పడ లక్ష్మీసరస్వతు లొప్పార వనమాల యురమున వెలయ సునందనందకుముద ప్రముఖపార్షదపరిసేవితుఁడై సిద్ధసంఘములు సేవార్థము కాచి యుండ నుండు శ్రీమన్నారాయణమూర్తిగఁ గాంచెను.*వేఱొక క్షణమున నైదుమోములు కన్పట్ట మూఁడు నేత్రములు చూప ట్టఁగా పరిశుద్ధస్ఫటికసంకాశదేహముగలిగి సర్పరాజహార ములు దాల్చి దిగంబరుఁడై పరబ్రహ్మమై భస్మమంగములఁ బూసి కొని జటాపటల మొప్పార జపమాల కరమున వ్రేల ధ్యాన నిష్ఠుఁడై యోగిధ్యేయుఁడై యున్నశంకరమూర్తినిగఁ జూచెను. ఇంక నొకక్షణమునకు నాల్గుమోములు చూపట్టఁగా బుద్ధివై భవ మొప్పారఁగా ధ్యాననిష్ఠుఁడై శ్రేష్ఠుఁడై వెలయు నలువను దర్శించెను. మఱియు నింకొక్కక్షణమున ధర్మస్వరూపునిగను, పిదప శేషస్వరూపునిగను, భాస్కరమూర్తిగను, జ్యోతిస్వరూ పునిగను, సనాతనమూర్తిగను గనుఁగొనియెను. మఱొక్కక్షణ

---

* క్షణం దదర్శ దేవం తం పంచవక్త్రం త్రిలోచనం, శుద్ధస్ఫటికసం కాశం నాగరాజవిరాజితం, దిగంబరం పరం బ్రహ్మ భస్మాంగం చ జటాయు తం, జపమాలాకరం ధ్యాననిష్ఠం శ్రేష్ఠం చ యోగినాం. అనిమూలము.

మునఁ బరమశోభాఢ్యునిగను, గోటికందర్పలావణ్యదేహునిగను, గామినీకమనీయాంగునిగను, గాముకునిగను, గామసంయుతునిగను, గామవిరహితునిగను బొడఁగనియె.

ఇట్లు ప్రతిక్షణమున విలక్షణుఁడైన కృష్ణుని శిశుమూర్తిని గనుఁగొని పరమేశ్వరుఁ డితఁడే యని భావించి వక్షస్స్థలమున నునుచుకొనియెను. ఆపిదప నందుఁ డొసంగినరత్నసింహాసనముపైఁ గూరుచుండెను. నందప్రభృతుల కక్రూరుఁడు వచ్చుట కూరుచుండుట తెలియునే కాని శ్రీకృష్ణధ్యానపరాయణుఁడై యతఁ డుండుట తెలియదు. అంతయు నొక్కక్షణకాలమున జరగెను. శ్రీకృష్ణమాయ వారినెల్ల నాచ్ఛాదించుట వారి కావృత్తాంతమంతయు నెఱుకపడకుండెను. అంత నక్రూరుఁ డాబాలుని సకలదేవతాస్వరూపునిగా భావించి వలగొని మ్రొక్కి భక్తిభరమునఁ బులకాంచితవిగ్రహుఁడై శ్రీకృష్ణపాదద్వంద్వములు శిరసున నునుచుకొని వినుతించెను. ఆస్తుతి

---

### అక్రూరకృత శ్రీకృష్ణస్తుతిః

నమః కారణరూపాయ పరమాత్మస్వరూపిణే, సర్వేషా మపి విశ్వానా మీశ్వరాయ నమోనమః. ౧. పరాయ ప్రకృతే రీశ పరాత్పరతరాయచ, నిర్గుణాయనిరీహాయనిరూపాయస్వరూపిణే ౨ సర్వదేవస్వరూపాయ సర్వదేవేశ్వరాయచ, సర్వదేవాధిదేవాయ విశ్వాదిభూతరూపిణే. ౩. అసంఖ్యేషుచ విశ్వేషు బ్రహ్మవిష్ణుశివాత్మక, స్వరూపాయాదిబీజాయ తదీశ విశ్వరూపిణే. ౪. నమో గోపాంగనేశాయ గణేశేశ్వరరూపిణే, నమస్సురగణేశాయ రాధేశాయ నమోనమః. ౫. రాధారమణరూపాయ రాధారూపధరాయచ, రాధారాధ్యాయ రాధాయాః ప్రాణాధికతరాయచ. ౬. రాధాసాధ్యాయ

సకలవేదసారము. ఉపనిషదర్థసార మన్న నదియే. త్రిమూర్తిస్వ రూపుఁడు శ్రీహరి యనియే దీనిసారము. ఆస్తుతిసార మెఱిం గిన వేదాంతశాస్త్రపఠన మనవసరమని తోఁచెడిని. సకలవేదశా స్త్రపురాణేతిహాసములసార మిదియని యంగీకరింపక తప్పదు. ఇట్టు లక్రూరుఁడు శ్రీహరిని వినుతించి భక్తిభరమున సభాస్థ లమునందే మూర్ఛిల్లెను. క్షణమునకుఁ దెలివిగలిగి పులకాంచిత విగ్రహుఁ డయ్యెను. భక్తిరసపూర్ణహృదయుఁడౌట మైమఱ చెను.

పుణ్యపురుషులారా! హరివంశమున నీఘట్టమున నక్రూర కృత శ్రీ కృష్ణస్తుతి చాల బాగున్నది. దానిని వ్రాయక మాన మనసు రాలేదు. తక్కినపురాణములయం దీస్తుతి యిప్పట్టునఁ గానరాదు. కాని వ్రాసెదను.

* అక్రూరుఁ డంత మరల శ్రీ హరి నిట్లు ధ్యానించెను. ఈ బాలరూపము శ్రీ హరిదివ్యమంగళవిగ్రహము. ఇదియే

---

రాధాధిదేవ ప్రియతమాయచ, రాధాప్రాణాధిదేవాయ విశ్వరూపాయతే నమః. ౭. వేదస్తుతాత్మ వేదజ్ఞరూపిణే వేదినే నమః, వేదాధిష్ఠాతృదేవాయ వేదబీజాయతే నమః. ౮. యస్య లోమసు విశ్వాని చాసంఖ్యానిచ నిత్యశః, మహద్విష్ణో రీశ్వరాయ విశ్వేశాయ నమోనమః. ౯. స్వయంప్రకృతిరూపా య ప్రాకృతాయ నమోనమః, ప్రకృతీశ్వరరూపాయ ప్రధానపురుషాయచ. ౧౦. ఇత్యేవం స్తవనం కృత్వా మూర్ఛామాప సభాతలే. ఇతిస్తుతిః శ్రీకృష్ణ జన్మఖండము ౭౦ అధ్యాయము.

* హరివంశాంతర్గత శ్రీకృష్ణస్తుతిః.

అయం స పుండరీకాక్షః స్సింహశార్దూలవిక్రమః, సంపూర్ణజలమే ఘాభః పర్వతప్రవరాకృతిః. ౧. మృగేష్వధర్షణీయేన సశ్రీవత్సేన

పురాణములయందు బహువారములు వర్ణితము. వేదాంతులిద్దానినే వినుతింపఁజాలక యవ్యక్తరూప మనిరి. లోకభారా

---

వక్షసా, ద్విపన్నిభసదక్షాభ్యాం భుజాభ్యాం సాధు భూషితః. ౨. మూర్తిమాన్ సరహస్యాత్మా జగతోఽగ్ర్యస్య భాజనం, గోపవేషధరో విష్ణు రుదగ్రాగ్ర్యతనూరుహః. ౩. ద్వాభ్యాం భుజాభ్యాం వృత్తాభ్యాం దీర్ఘాభ్యా ముపశోభితః, స్త్రీసహస్రోపచర్యేణ వపుషా మన్మథాధినా. ౪. పీతే వసానో వసనే సోఽయం విష్ణు స్సనాతనః, ధరణ్యాశ్రయభూతాభ్యాం చరణాభ్యా మరిందమః. ౫. త్రైలోక్యాక్రాంతిభూతాభ్యాం భువి పద్భ్యాం వ్యవస్థితః, రుచిరాగ్రకరశ్చాస్య చక్రాంకితఇవేక్షతే. ౬. ద్వితీయఉద్యతశ్చాపి గదాసంయోగ మిచ్ఛతి, అవతీర్ణో భవాయేహ ప్రథమం పదమాత్మనః, శోభతేఽద్య భువి శ్రేష్ఠ స్త్రిదశానాం ధురంధరః. ౭. అయం భవిష్యకథితో భవిష్యకుశలైర్నరైః, గోపాలో యాదవం వంశం క్షీణం విస్తారయిష్యతి. ౮. తేజసా యాదవాశ్చాస్య శతశోఽథ సహస్రశః, వంశమాపూరయిష్యంతి హ్యోఘా ఇవ మహార్ణవం. ౯. అస్యేదం శాసనే సర్వం జగత్స్థాస్యతి శాశ్వతం, నిహతామిత్రసామంతస్ఫీతం కృతయుగే తథా. ౧౦. అయమాస్థాయ వసుధాం స్థాపయిత్వా జగద్వశే, రాజ్ఞాం భవిష్యత్యుపరి నచ రాజా భవిష్యతి. ౧౧. నూనం త్రిభిః క్రమైర్జిత్వా యథానేన ప్రభుః కృతః, పురా పురందరో రాజా దేవతానాం త్రివిష్టపే. ౧౨. తథైవ వసుధాం జిత్వా జితపూర్వాం త్రిభిః క్రమైః, స్థాపయిష్యతి రాజాన ముగ్రసేనం న సంశయః. ౧౩. ప్రసృష్టవైరగాధోఽయం ప్రశ్నైశ్చ బహుభిశ్శ్రుతః, బ్రాహ్మణైర్బ్రహ్మవాదైశ్చ పురాణోఽయం హి గీయతే. ౧౪. స్పృహణీయో హి లోకస్య భవిష్యతి చ కేశవః, తథావ్యాసోత్థితా బుద్ధి ర్మానుష్యముపజీవితుం. ౧౫. అహంత్వస్యాద్య వసతిం పూజయిష్యే యథావిధి, విష్ణుత్వం మనసా చైవ పూజయిష్యామి మంత్రవత్. ౧౬. యచ్చ జ్ఞాతి పరిజ్ఞానం ప్రాదుర్భావశ్చ వై నృప, అమానుషం వేద్మ్యేనం యేచాన్యే దివ్యచక్షుషః. ౧౭. సోఽ

వతరణార్థ మాదినారాయణమూర్తి యీగోకులమున నిట్లుద యించెను. శాపకారణమున క్షీణించుచున్న యాదవవంశముల నుద్ధరింపఁబూనియే యీగోకులమున నుదయించి పరిపూర్ణవంశములం గావించుచున్నవాఁడు సాక్షాన్నారాయణమూర్తిగా నాకగపడుచున్నాఁడు. అని యిట్లు బహుభంగుల సన్నుతించి యానందపారవశ్యమున మైమఱచి యుండెను. మరల లేచి భగవంతుని దర్శించెను. ఆత్మయందు వెలుపలను గనఁబడుపరమేశ్వరుని గన్నులార దర్శించెను. శ్యామసుందరవిగ్రహమును సర్వప్రపంచమయముగాఁ గనుఁగొనియెను. ఏలొకో మూర్ఛిల్లినవాఁ డక్రూరుఁడని నందుఁడు సాదరమున రత్నసింహాసనమునఁ గూరుచుండఁజేసి కుశల మడిగెను. ఆగమనకారణమును బ్రశ్నించెను. విశేషము లేమేనిగలవా యని నొక్కి యడిగెను.

అక్రూరుఁడు పెద్దలకెల్ల నమస్కరించి పిన్నవారు నమస్కరింప దీవించి బలరామశ్రీకృష్ణులకు మనసున సహస్రవిధముల నమస్కరించి వెలుపల మర్యాద ననుసరించి యాదరించెను. కుశల మడిగెను. తనవారికుశలమును దేవకీవసుదేవుల క్షేమవార్తలను దెల్పెను. పిదప నక్రూరు నింటిలోనికిం దోడుకొనిపోయి నందుఁడు మిష్టాన్న మారగింపఁజేసెను. మరలమరలఁ గుశలమును బ్రశ్నించెను. ప్రియబంధుమర్యాదల ననుసరించి సపర్యలెల్లను గావించి యుచితజ్ఞతఁ దెల్పెను. ఆరాత్రి యెల్ల

---

హం కృష్ణేన వై రాత్రౌ సంమంత్ర్య విదితాత్మనా, సహానేన గమిష్యామి సవ్రజో యది మంస్యతే. ఇతి.

వారు సుఖనిద్ర సేయ శయనించిరి. * అత్తఱి శ్రీ హరి యక్రూరునితో సాదరముగా నిట్లు మాటలాడెను. అక్రూరా! మార్గశ్రమములకుఁ బొల్పడక సుఖముగా వచ్చితివికదా యని యడిగెను. ఈఘట్టమున మహాకవి పోతనగారిపద్యరత్నముఁను వ్రాసెదను.

మ. శుభమే నీకుఁ బ్రమోదమే సఖులకుం జుట్టాలకుఁ సేమమే
యభయంబే ప్రజకెల్ల గోత్రజుల కాత్మానందమే మామము
క్తభయుండే వసుదేవదేవకులు తత్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజనిబద్ధులై బ్రదికిరే ప్రాణానిలోపేతులై.

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో నీతోడ నేమైన నా
కెఱుఁగం జెప్పుమటంచుఁ జెప్పరుకదా యేమందురా వార్త యే
తెఱఁగుఁ లేదని డస్సిరో వలచిరో దీనత్వముం జెందిరో
వెఱతో నాతలిదండ్రు లెట్లు పడిరో విన్పింపు మక్రూరకా.

అని వ్రాసి తనపై పుణ్యమును గనఁబఱచెను.

[1] ఇట్లు నందాదులు శ్రీకృష్ణస్వామియుఁ బ్రశ్నింప విని యక్రూరుండు శ్రీ హరితో మహాత్మా! మా కెల్లరకుం

---

* ఈవిషయము శ్రీ భాగవతము ననుసరించి వ్రాయఁబడినదని యెఱుంగునది. తాత సౌమ్యాగతః కంసాత్స్వాగతం భద్రమస్తు వః, అపి స్వజ్ఞాతిబంధూనా మనమేవమనామయం. ౪. కిన్ను నః కుశలం పృచ్ఛే హ్యేధమానే కులామయే, కంసే మాతులనామ్న్యంగ స్వానాం నస్తత్ప్రజాసు వై. ౫. అహో అస్మదభూద్భూరిపిత్రోర్వృజినమార్యయోః, యద్ధేతోః పుత్రమరణం యద్ధేతోర్బంధనంతయోః. ౬. అని మూలము. 1 ఇటనుండి యున్నిపురాణములనుండి యుచితభంగి వ్రాసెదను.

గుశలంబ. దేవకీవసుదేవులకుఁ గుశలంబే. కంసాదులు భయము లేక యున్నవారని చెప్పవచ్చును. పౌరులెల్ల నారోగ్యవంతులుగ నున్నారు. ఉగ్రసేనప్రభృతులు నిశ్చింతగ నున్నవారనరాదు. వారిహృత్తాప మందలెటింగినదియే. మీకు తెలుకపడని విషయములు లేవని విశేషించి వసుదేవుఁడు వార్తలు తెలుపఁడయ్యెను. దేవదేవా! కంసుఁడు ధనుర్యాగముచేయఁబూని యున్నవాఁడు. ఆయాగంబున ననేకచిత్రకార్యములు సాగు. అందులకు మిమ్ము నిర్వురను బిలుచుకొనిరమ్మని నన్నుం బుత్తెంచెను. ఇహపరసాధనమనునమ్మకమును బూని యిట వచ్చితిని. ఉపాయనముల యథార్థముగఁగొని యాదవులెల్ల రాఁదగును. ఇదియ నా వచ్చినప్రకారము, రాజాజ్ఞయు నని యెఱిఁగించి యిష్టాగోష్ఠులఁ గొంతసేపు జరపి నిద్రించెను. బలరామ శ్రీకృష్ణులు సుఖనిద్ర చేసిరి. ప్రభాతమున మేల్కాంచి యక్రూరుఁడు బలరామకృష్ణులు మేలుకొనుటంజూచి యహర్ముఖోచిత కృత్యజాలముల నిర్వర్తించి నందాదులతో మరలఁ గంసునానతిం దెలిపెను. వారెల్ల మధురానగరమునకుఁ గానుకలం గొనిపోవ నాయత్తపడిరి. నందుఁడు, వృషభానుఁడు, సునందుఁడు, చంద్రభానుఁడు మధురకు బలరామశ్రీకృష్ణులం గూడి పోవ నిశ్చయించిరి. పంచవిధములగుపాలు మొదలగువస్తువులం గూర్చిరి. అట్టికానుకలే గోకులమునుండి కంసునకుం బంపుట యాదవుల యాచారము. మధురానగరప్రయాణము చాటించిరి. ఎల్లవా రెఱింగిరి. నందాదులంగూడి తగుపరివారము

ప్రయాణముసాగింప సంసిద్ధముగ నుండెను రథము లాయత్త ములుగాఁ జేయఁబడియెను. రామకృష్ణు లక్రూరుఁడు నొక్క రథముపైఁ గూరుచుండిపోవ నిశ్చితమయ్యెను. రాజద్వారమ ర్యాదల ననుసరించి మృదంగ మురజాదులధ్వనులు మ్రోఁగెను. పటహాపణవడక్కాదుందుభులు, నానకవాద్యము, సజ్జయు, సన్నహానియుఁ, గాంస్య, పట్ట, మర్దలములు, మండపీవాద్యము మఱియుఁ బెక్కువిధములగువాద్యములను బరివారజనులు మ్రోయించిరి. నందునియానంద మపారముగ నుండెను. గోప కులకుఁ గంసుఁ డేదురుద్దేశముతోఁ గృష్ణుని బిలుపించెనో యెఱుంగరు. కావున నందఱు మహోత్సాహమునఁ బరుగులిడ సాగిరి. ఆప్రయాణసన్నాహము వర్ణనాతీతమనుట యతిశ యోక్తి యనుట పాపమే. యశోదయు రోహిణియుఁ బుత్త్రు లచ్చటికిఁబోవుట మేలుకాదని తలంపరైరి. అందఱు శ్రీకృష్ణ మాయామోహితులు. ఈప్రయాణ మెందులకనియు నూహింప రైరి. ప్రయాణసన్నాహముల సంరంభమే కాని వేఱొకయోజ నలు వారిలో నెవ్వరికింగాని కలుగకుండెను.

* రామకృష్ణులు మధురానగరమున కక్రూరునిచేఁ దీసి కొనిపోవఁబడుచున్నవా ర్తగనువా ర్త నలుదెసల వ్యాపించెను.

---

* ఈకథాభాగము శ్రీకృష్ణజన్మమునందుఁ గానంబడియెడిని. గర్గసం హితయందు మధురాఖండము నాల్గవయధ్యాయమున "శ్రీకృష్ణుఁడు మధు రాప్రయాణముచేయఁబూని రథమెక్కుటకు ముందే రాధామందిరమున కరిగి తనవియోగమునకు మూర్ఛిల్లియుండిన రాధిక నూఱడించి యామె

గోపికలంద రాలకించిరి. మధురానగరమునకు శ్రీహరిపోయిన మననగరమున రక్షకుఁ డెవరని తలపోసిరి. చిన్ననాటనుండి శ్రీకృష్ణునియత్యద్భుతకృత్యములఁ దలంచిరి. ఆమహనీయమూర్తి దర్శనమొదవకున్న బ్రదుకు టెట్లని చింతించిరి. గోలోకము

---

యార్తి నుపదేశవాక్యములచే నాపి సుదామునిశాపకారణ మెఱింగించి స్వప్నమునఁ దనరూప మగపడుచుండఁగలదని యాజ్ఞాపించి యామె నెట్లో సమ్మతింపఁజేసి వచ్చి రథమెక్కిన ట్లగపడియెడిని. శ్రీభాగవతమునందుఁ గృష్ణప్రయాణవార్త నాలించి యాతురలై గోపిక లోపికలులేక తద్వియోగవ్యథను బరస్పరము తలపోసికొనినట్లున్నది. హరివంశమున విష్ణుపర్వమున నీ గోపికాలాపములమాటయే కనఁబడదు. బ్రహ్మపురాణమునందును గోపికలు విరహాతురలై యక్రూరుని దూషించుచు శ్రీకృష్ణాత్తమనస్కలై పరితపించినట్లు కన్పట్టెడిని. శ్రీకృష్ణజన్మఖండమునందుమాత్రము రాధాప్రేరిత గోపిక లరుదెంచి యక్రూరుని క్రూరకార్యము నాపఁబూని రథము నాపిరనియుం భగవంతుఁడు రథమును దిగి వారి నాశ్వాసించి యెట్లో యిండకుం బంపి ప్రయాణము సాగించెననియుఁ గన్పట్టెడిని. మొత్తముమీఁద గోపిక లా శ్రీహరిగమనమునకుఁ దమ యసమ్మతిఁ జూపిరని సారము. ఇంచుక భేదమున్నను గథానీతికి భేదము లివి బాధింపవు. రాధాప్రేషిత గోపిక లరుదెంచి రథము సాగనీయకుండఁ జేయుటయే సమంజసముగ నున్నదని నాయూహ. అన్నియు నుచితభంగిం గలిపి వ్రాసెదను. ఈకథాసారము వ్రాయునపుడు గోపికల భక్తిని బద్మపురాణమునుండి వ్రాసెదను. పాఠకు లీవిషయమున శ్రద్ధఁబూని పఠించి గోపికాజారుఁడు కృష్ణుఁడన్న తుచ్ఛవాదము మదినెక్కనీయకుండ నుందురుగాక యని కోరెదను. కావున నించుక శ్రద్ధమై యీయుపాఖ్యానమును బఠింపుఁడు. అపుడే నాపరిశ్రమము ఫలించును. ఇదియే నేఁగోరునది. ఇన్నియుఁ గలిపి వ్రాయునపు డించుక పునరుక్తిదోషము వ్యాపింపవచ్చును. దానిని బండితులు మన్నింతురనియుం వేఁడుచున్నాఁడను.

నుండి శ్రీకృష్ణసేవార్థ మవతరించిరిగాన వారి కాయెడఁబాటు సహింపరానిదనుటకు సందియ మించుకంతయు శంకలేదు. ప్ర యాణము చేయుచున్న వాఁడని వినినంతనే పరుగువాఱిరి. ఇట్లుం డఁగా రాధాదేవి కావృత్తాంతము మనోగోచరమయ్యెను. రాధామాధవుల కవినాభావసంబంధముకదా. కావున శాప మును బాలింప వేఱుగానున్నను బ్రతిదినము స్వప్నమున భగ వంతుఁ డామెకుఁ గనఁబడుచుండునట్లు వరమొసఁగియే యున్నాఁడు కావున రాధిక కావిషయము మనసునకుఁ దట్టెను. అక్రూరుఁడువచ్చి గోకులమునుండి దూరభూమికిం బిలుచుకొని పోవుచున్నవాఁ డన్నయూహ తోఁచెను. వెంటనే యాగ్ర హము హెచ్చెను. తానే పోవలయునని యూహించెనుగాని శ్రీహరియుపదేశించిన యాధ్యాత్మికవిషయము మది నాటియు న్నందున మాని స్వాభావికచపలభావమున గోపికలంజీరి నెచ్చె లులారా! మీ రిపుడేపోయి క్రూరుఁడయ్యు నక్రూరుఁడని పేరు పెట్టుకొని నాప్రాణనాథుని దూరదేశమునకుం గొనిపోవు నాదు ర్మతిని భంగపఱచి ప్రయాణ మాపుఁడు. నాయాజ్ఞంగొని మీ రేకార్యముచేసినను గీడురాదు. నిర్భయముగాఁబోయి యాప్ర యాణమును సాగనీయకుఁడని యుత్తరువిచ్చెను. రాధాజ్ఞ మౌళులధరించి యాగోపిక లతిక్రోధపరీతాంతరంగలై వడివడిం జనుదెంచి యరదముపై నున్న బలరామశ్రీకృష్ణులను వారి ప్రక్కనఁ గూరుచున్న యక్రూరునిం గాంచిరి. వారియాగ్ర హము మేరుభూధరసంకాశమయ్యెను. దాని నాపుకొనుశక్తి

వారికి లేకుండెను. వారియాగ్రహావేశము గుఱు తెఱింగి
శ్రీహరి వారిని వారించెనుగాని వారిహృదయరంగముల రాధా
జ్ఞయే నాట్యమాడుచుండినందున శ్రీకృష్ణహితవాక్యములు వినఁ
బడవయ్యెను. వివిధభంగుల వారక్రూరుని దెగడి యారథము
పాదాఘాతములు మొదలగువానిచేఁ జీకాకుపఱచిరి. అది
యొకయాటగా వారి కపుడు తోఁచెను. ఆకార్యమును జూచు
చున్నగోపకులు హాహాకారము లొనరించిరి. శ్రీకృష్ణమూర్తి కప
కారముచేయుటయా యని యచ్చెరువందిరి. ఇంతలోఁ గొందఱు
గోపికలు రథము నెక్కిరి. శ్రీకృష్ణుని హస్తమునుబట్టుకొని
ప్రయాణము మానుమా యని వేఁడిరి. అందు నొకగోపిక
యాయక్రూరుని గ్రూరహృదయా! నీవక్రూరుఁడ వెట్టు లైతివని
బదరెను. అంతలో మఱికొందఱు గోపికలు చేలాంచలముల
నాతనిం గట్టివైచి యీడువసాగిరి. ఒక్కర్తుక కరకంకణముల
నాతనిం బ్రహరించెను. అతని సంవ్యానము నొకతుక పట్టు
కొని యీడ్చెను. పాప మాయక్రూరునియంగమంతయు శోషి
ల్లెను. క్షతగాత్రుఁడై యిదేమిరా స్వామీ యని మ్రాన్పడి
నట్లు మిన్నకుండెను. వీరెక్కడిస్త్రీలో నాప్రాణము తీయనున్న
వారే యని భీతిల్లెను. ఆవిధము భగవంతుఁ డెఱింగి గోపికల
కుపదేశవాక్యములు వినఁబడవనియు ఫలింపవనియు నిశ్చయించి
యాయక్రూరు నూఱడించి రాధానికటమునకుఁ బోయెను.
పూర్వము హిత ముపదేశించినట్లే యుపదేశించెను. ఆధ్యాత్మిక
యోగముచేతను వినయముచేతను సాదరసల్లాపములచేతను

రాధాహృదయమును శాంతయుతముగాఁ జేసెను. ఆమెయుఁ గలంకమాని శాప మనుభవింపఁబూని భగవంతుని బ్రార్థించి గోపికలకృత్యము తనదేయని యొప్పుఁజెప్పి యూరకుండెను.

అంత నాకాశమున నొకదివ్యరథము తోఁచెను. అది మంత్రశక్తిగలది. భగవంతుఁ డధిష్ఠింపఁదగినది. విమలమణినిర్మలకాంతివిస్తారితము. వర్ణనాతీతము. విశ్వకర్మనిర్మితము. దాని నెక్కి రాధ సమ్మతింప మాతృభవనమునకు జగన్నాథుఁ డరుదెంచెను. అక్రూరు నాశ్వాసించెను. నాయందలిప్రీతియే వారి నిట్లు చేయఁ బురికొల్పెనని తెలిపెను. అక్రూరుఁడాగోపికల యాతురతకు మెచ్చుకొనెను. శ్రీకృష్ణు నెడఁబాయుట కోర్వనిభక్తి వారికిం గల్గుట యెంతపుణ్యముచేతనో యని యచ్చెరువందెను. ఆప్రయాణ మాపి సుఖభోజనముచేసి మరలఁ బయనము సాగించిరి. ఆప్రయాణకాలమున శ్రీహరిపై దేవతలు పూలవానను గురియించిరి. రాధాదేవిపర్యంకమునిండఁ బుష్పవృష్టి గురిసెను. గోపకులు కొంద ఱానందపారవశ్యమునఁ గృష్ణుని మ్రోలనాడిరి. కొందఱు సంగీతమున హరి నలరించిరి. నందుఁ గోకులమెల్ల మహోత్సాహమున వెల్లివిరిసెను.

* అత్తఱి ప్రేషల్లియం గలగోపిక లొకచోటఁ జేరి శ్రీకృష్ణుఁడు మరల నెపుడువచ్చునో అందే నిలుచునో ఎచ్చటి కేగునో యనుసంశయముల మనసులు కలఁతనొంద నాతురంపడి తమలో

* ఇటనుండి శ్రీభాగవతము బ్రహ్మపురాణము మొదలగుపురాణములనుండి వ్రాయఁబడును.

ని ట్లనుకొనసాగిరి. ఈఘట్టమున మహాకవి పోతనపద్యరత్నముల భగవంతునకుఁ గానుకపెట్టి కృతార్థుఁడయ్యెను. వానిం గొన్నింటిని వ్రాసెదను.

*ఉ. మేటిగృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితి మమ్ము చూడ నే
పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁ డైనసరోజనేత్రు ని
చ్చోట వసింపనీక యొకచోటికిఁ బో విధియించి పిన్నబి
డ్డాటలు చేసె నీదుడుకు లక్కట! భారతి కైనఁ జెప్పరే.

మూలము. అహో విధాతస్తవ న క్వచిద్దయా
సంయోజ్య మైత్ర్యా ప్రణయేన దేహినః,
తాంశ్చాకృతార్థాన్ వియునంక్ష్యపార్థకం
విచేష్టితం తేఽర్భకచేష్టితం యథా.

మైత్ర్యా=హితాచరణేన, ప్రణయేన=స్నేహేనచ. అని వ్యాఖ్య.

[1]వ. అని విధిం దూఱుచు మదనతాపాయత్తచిత్తలై.

ఉ. రక్షని చీరినంతన పురంబున కేఁగెడుఁగాని నన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరుకోలల కగ్గముచేసి పోవఁగా
ముమ్మర మైనతాపమున మ్రొగ్గుదురో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్రయాణము వల్దన రైరి చెల్ల రే.

మూలము, యస్త్వం ప్రదర్శ్యాసితకుంతలావృతం
ముకుందవక్త్రం సుకపోలమున్నతమ్,

---

* ఇట నీపద్యములు వ్రాయుట వీనికి మూల మిది యని చూపుట గోపికలభావ మేమని తెలుపుటకేగాని ప్రౌఢ్పోకకుం గాదని యెఱుంగునది.

[1] ఇది పోతన కల్పించినదియేగాని మూలము కానరాదు. ఆగ్రిమశ్లోకసారమున కిది యవతారికయేమో తోఁచుచున్నది.

శ్లో॥ తాపనోదస్మితలేశసుందరం
కరోషి పారోక్ష్య మసాధు తేకృతమ్. ౨౦

శా. అక్రూరుం డని పేరుపెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపి కొంచు నరుగం జర్చించి యేతెంచినాఁ
డక్రూరుం డట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁ డౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తనత్రోవం బో విచారింపఁడే.

మూలము. క్రూర స్త్వ మక్రూరసమాఖ్యయాత్మన
శ్ఛతుర్హి దత్తం హరసే బతాజ్ఞవత్,
యే నైకదేశే ఽఖిలసర్గసౌష్ఠవం
త్వదీయమద్రాక్ష్మవయం మధుద్విషః. ౨౧

అయం భావః.తవ సర్వం రహస్యం అస్మాభిః జ్ఞాతం అత అమర్షేణేవ కృష్ణం వియోజయన్ అస్మానందీ కరోషీతి-అని వ్యాఖ్య.

ఆర్యులారా! మచ్చునకుఁ గొలఁదిపద్యములు వ్రాసితిని. మూలార్థమును బరికింపుఁడు. పద్యార్థమును బరిశీలింపుఁడు. మూలము భక్తిని బోధించుచున్నది. పద్యములు గోపికల కామాతురతఁ దెల్పుచున్నవి. మరుకోలల కగ్గముచేసి యను మాట మూలమునకు విరుద్ధమని నాభావము. 'శోకాపనోద' అన్న మూలము తాపత్రయములఁ దొలఁగించు నన్న యర్థమును స్పష్టపఱచుచున్నది. ప్రారంభముచేయుచుఁ బోతన "మదనతాపాయత్తచిత్తలై" అని వ్రాసిరి. ప్రతిశ్లోకమునకు వారిట్లే పద్యముల వ్రాసిరి. ప్రాతీతికార్థము స్పష్టము. విశేషార్థ మిది.

(విదధాతి సర్వమితి విధాతా.) ఓబ్రహ్మదేవా! నీవు సర్వమును జేయువాఁడవు. ఏదిచేయఁబూనినను జేయఁగల వాఁడ వని భావము. సర్వశక్తులు నీ కున్నవని తాత్పర్యము. మహాత్మా! భగవంతునితోఁటిపరిచయమును మాకుం గల్గించి తివి. మాకు హితముచేయునట్లు చేసితివి. ప్రీతిని గల్పించితివి. ఇట్టి మహోపకారము మాకుం గల్గించి యిపుడు మానుండి యెడఁబాపఁబూనితివి. ఇది న్యాయము కాదు. భగవద్దర్శనము మాకు సదా కలుగఁజేయుట పాడిగాని కొలఁదికాలమున కది లేకుండఁజేయఁబూనుట క్రూరకార్యమని భావము. ఇట్లుచేయుట పిల్ల లాడుకొన్నట్లున్నది. అనఁగా శ్రద్ధతోఁ జేయనట్లు తోఁచెడి నని భావము. అనఁగా భగవద్దర్శనము మాకు నెల్లప్పుడు కలుగునట్లు కటాక్షింపుము. లేకున్న మామ నసులు కొఱఁతవడునని గోపికలప్రార్థనము. రెండవశ్లోకము గూడ విధినిగుఱించి చెప్పినదియే. అది పద్యమున స్పష్టముగఁ గానరాదు. పరమేష్ఠీ! ముకుందుని మనోహరవక్త్రమును గనఁ బఱచి తాపత్రయముల నడంచునట్టి యాపరమేశ్వరవక్త్రారవిం దమును గనఁబడకుండఁజేయుచున్న వాఁడవు. ఇది మంచిపని గాదు. అనఁగా మాకుఁ బూర్వపుణ్యఫలముగా శ్రీకృష్ణునిము ఖసరసిజమును జూచుభాగ్యమును గల్పించి యింతలో నదిలే కుండఁజేయుట దయాలక్షణము కాదని గోపికలభావము. యశోదాదికాంతలు నందాదిగోపకులు ప్రయాణము కలదని చెప్పరైరి. అక్కటా! యనునది. కొనితెచ్చినయర్థము. బ్రహ్మను

గుణించి ప్రార్థించునపు డిది విశేషముగా నర్థపుష్టిని గల్పింపఁజా
లదు. అక్రూరుఁడనుపేరు సార్థకనామము కాదు. నిశ్చయముగాఁ
గ్రూరుఁడవే. భగవంతుని మాకన్నులనుండియెడఁబాపుటన్యాయ
ము కాదని సారము. ఇదియు బ్రహ్మానుపాలంభనము చేయుశ్లో
కమే. భగవంతుని నేత్రవక్త్రములం దొకచోటనే నీసృష్టిసౌం
దర్యము గనుచున్నవారము. అట్టి మాచూపును హరించితివి.
అనఁగా మానేత్రముల నిరర్థకములుగానొనరించితివనిసారము.
భగవద్దర్శనము చేయఁజాలనివి నేత్రములు కావని గోపికలు
తలంచిరి. ఎవరినేత్రములు భగవంతుని జూడనోచునో అవియే
నేత్రములుగాని యితరులనేత్రములు నిష్ఫలములని వారితలం
పు. దీనితరువాతిశ్లోకమునందు "తేన స్వకృతాతురాబత" అని
యున్నది. తత్కృతే నైవ స్మితాదినా పరవశా అపినః అస్మాక
న సమీక్షతే-అనివ్యాఖ్య. దీనికిఁబోతనమహాకవి "వ్రేపల్లెవసించు
ముద్దియలపైఁ బడనేల తలంచు నక్కటా" యని తెలుఁగొన
ర్చిరి. ఇది పచ్చిసింగార మన్నట్లున్నది. భగవంతుని యాదృతిచే
మేము తద్గతాంతఃకరణములు గలవారమైతిమి. అని గోపికల
భావము. ఇదియే భక్తుని తాత్పర్యము. పరవశత్వమనఁగా మైమ
ఱచుట, నిశ్చలతం గాంచుట యని సారము.

ఇట్టితావులం గలపద్యములం గాంచియే శ్రీకృష్ణుఁడు
జారుఁడని యితరు లాక్షేపింతురు. అట్టి యవకాశ మీపద్యము
లిచ్చును. కాని భక్తుఁ డీపద్యములకుఁ బైయట్లే యర్థముచేసి
కొనునని నాభావము. దోషైకదృక్కు లేవిధముగా నర్థము

చేసికొన్నను మనకేమి హాని యనువాదము మంచిదియే కాని అట్టిదృఢతరభావము లేనివారి కింకొకవిధముగా నర్థమౌనేమో యని నాయల్పమతి భీతిల్లుచున్నది. ఇఁక నీవిషయమును బ్రహ్మ పురాణ మేలాగు చెప్పుచున్నదో చిత్తగింపుఁడు.

శ్రీరమ్యరథమునఁ గూరుచున్న శ్రీకృష్ణపరబ్రహ్మము ప్రయాణముచేయుసమయమున గోపికలు భక్తిభరితస్వాంతలై యానందబాష్పములు నిరంతరధారలుగాఁ బ్రవహించుచుండ నిట్టూర్పులుపుచ్చుచుఁ, దమలో చా రిట్లు చెప్పుకొనిరి. సోదరీ మణులారా! మధురానగరమునకుఁ బోయినపిదప శ్రీకృష్ణమూర్తి గోకులమునకు మరల వచ్చునా? నగరకాంత లవ్యక్తమధురముగా మాటలాడఁ దద్వాగమృతమును శ్రవణపుటములఁ గ్రోలఁగలఁడు. నగరకాంతలకుఁ బేశలవాక్సరణిఁ బాండిత్యము మెండు. మనము పల్లెయందుండువారము. మరల వినుటకు మన వాక్కు లంతమధురములుగా నుండునా? ఈగోష్ఠసర్వస్వభూతుఁడగు నీహరిని విధి తోలఁగఁదీయుచున్నవాఁడు. విధి కరుణ లేనివాఁడు. కావుననే దురాత్ముఁ డనవచ్చును. అట్టివాఁడు కనుకనే గోపికలహృదయమును వ్రక్కలించుచున్నవాఁడు. వాక్కులు భావగర్భములు. గతివిలాససంయుతిగనుండుట నాగరస్త్రీలకు స్వభావము. గ్రామమునఁ బుట్టిన యీహరి మధురానగర పురంధ్రీజనకటాక్షశృంఖలాబద్ధుఁడుగఁ జేయఁబడఁగలఁడేమో. ఎపుడు మరలవచ్చి మనయెదుటఁ దోఁచునో. సోదరీరత్నములారా! అటుచూడుఁడు. రథమెక్కి యదె హరి యరుగుచున్న

వాఁడు. హతాశుఁడగు నక్రూరుఁ డనుక్రూరునిచే వంచింపఁబడినవాఁడు. నృశంసుఁ డీయక్రూరుఁ డీబాలగోపాలునియందనురాగముల జనుల నేమి యెఱుఁగును ? మన యశోదానందసర్వస్వము హరి యాతనివెంటఁ జనుచున్నవాఁడే. గతి యేమి? ఈభగవంతుఁడు రామునింగూడి దయమాలిపోవుచున్నవాఁడు చూచితిరా. మనమెల్లఁ ద్వరపడి యీరథమును బోకయుండ నిలుపుదము. పెద్దలందఱుండ మన మేమిచేయఁజాలుదుము? అదృష్టహీనలగు మనకు గురువులుమాత్ర మేమియుపకారము చేయుదురు ? ఒక్క శ్రీహరియే కాదు. నందగోపాలకప్రభృతులుగూడఁ బ్రయాణముసాగించుచున్నవారు. ఒక్కఁడేనిందు హరిప్రయాణమున కంతరాయము గల్గింపఁ బూనువాఁడు లేఁడు. ఈరాత్రి మధురావాసులకు శుభప్రదము. అచ్చటి పురంధ్రులకు మఱింతసుదిన మిదియగు. శ్రీహరివక్త్రాంబుజము నేత్రపర్వ మొనర్పఁగలదు. మార్గమున శ్రీహరి మధురకుం బోవుచుండ నెవ్వరు వలదనువారు లేనందునఁ దృప్తిగాఁ జూచుజనులు ధన్యులుగదా. ఈభగవంతునిం గాంచి పులకాంచితమగుశరీరమును ధరించువారే పుణ్యాత్ములు. నేఁడు మధురానగరపౌరులకు గన్నులపండువు కాఁగలదు. గోవిందుని మహాత్ముని జాలసేపు చూడఁగలరు. నేఁడు దర్శనభాగ్యము లభించునని రాత్రియే పుణ్యవతులకు స్వప్నము వచ్చియుండును. నేఁడు పురవీథుల నరుగు పుండరీకాక్షు నీతనిం జూచు నారీమణులయదృష్ట మిట్టిదని యెవరు వర్ణింపఁగలరు ?

ఔరా! మనకు నీమహానిధిని గనఁబఱచి నిష్కరుణుఁడగు విరించి మననేత్రములను హరించుచున్నవాఁడు. ఏమనవచ్చును? ప్రయాణముచేయుటచే మనయనురాగమునకుఁ గొఱంతగల్గించిన ట్లెంచవచ్చును కావుననే మనకరకంకణములు జాఱుచున్నవి. అక్కటా! యీక్రూరచిత్తుఁ డగునక్రూరుఁ డశ్వములఁ ద్వరగాఁ దోలుచున్నాఁడే. అని గోపిక లార్తలు కాఁగా వారిం గాంచువారిలో నెవ్వరికేని మనసు కరఁగకుండునా?

ఇట్లు గోపికలు భక్తిపరవశత్వమునఁ గన్నులపండువుగాఁ జూచుచుండిరి. గోపకులు కొంద ఱుత్సాహమునఁ గానికలం గొని నందానుమతిం బయనమైరి. నందాదు లరదంబులెక్కి ప్రయాణంబు సాగింప నుంకించుచుండిరి. శ్రీహరియు బలరామాక్రూరులంగూడి వ్రజమును వీడువాఁడయ్యెను. వీథులెల్ల గోపికలచేతను గోపకులచేతను బాలకులచేతను గ్రిక్కిఱిసియుండెను. వ్రజ మిఁక నొక్కముహూర్తమున కరణ్యప్రాయము కాఁగల దని గోపవృద్ధులకుం దోఁచెను. రామావతారమున సరయూనదిం గ్రుంక రామచంద్రుఁడు పౌరులం గూడిపోవునప్పటిస్థితి యందగోకులమునకుం బట్టెను. చక్కఁగా నాలోకింప నింకఁ గృష్ణపరబ్రహ్మ మాగోకులమునఁ జిరకాలము నివసింపఁ బోవఁడు. ఎంతకాలము నివసించి బాలలీలల నచ్చట వారిని సంతృప్తులం గావింపఁదగునో అన్నిదినము లుండెను. ఇఁకఁ దన యవతారఫలమును ప్రదర్శింపఁబూనెను. కావున గోకులమున నుండ వీలుండదు కాని మరలవచ్చి కొలఁదిదినములుమాత్రము

నివసించును. కాని యాతరుణమున నందలకుఁ బూర్వ ముండిన యుత్సాహము మార్పు నొందియుండఁగలదు. ఈవిషయము ముందు ముందు పాఠకులకుం దెలియఁగలదు. ఇది గోకుల నివాసచరిత్రము.ఇఁక మధురానగరప్రయాణచరిత్రము వ్రాయఁ బడును. దానిం బఠించి కృతార్థులరగుఁడు.

మహానుభావులారా! అక్రూరునకు స్వప్నముతోఁచుటయు నతఁడు గోకులమునకుం బ్రయాణముచేయుటయుఁ ద్రోవలో నెన్నియో శుభనిమిత్తము లాతనికిం గనఁబడుటయు, నందుల కుప్పొంగుచు నందప్రముఖు లుండుగోకుల మనఁబడుబృందావనమున కరుగుటయు, రాసమండలమును గాంచుటయు,నందమందిరమును గాంచి పరమానందమునందుటయు, నందాదు లెదు రొక్కనుటయు, నాతిథేయసత్కారము జరపుటయు, బాలగోపాలునిం గాంచి యక్రూరుఁడు నుతించుటయు, నతనికి శ్రీహరి సకలదేవతామయుఁడుగాఁ గనఁబడుటయుఁ, దనవచ్చినకార్య మక్రూరుఁడు తెలుపుటయు, మధురానగరమునకుఁబోవ నేకగ్రీవముగా నంద అంగీకరించుటయుఁ, బ్రయాణసన్నాహము, రాధికాప్రోత్సాహమునఁ దత్పరివారగోపికాజన మరుదెంచి యక్రూరుని బ్రహరించి రథమును విఱుగఁగొట్టుటయు, భగవంతుఁడు రాధికామందిరమునకు వియద్గమనమునంబోయి యాధ్యాత్మికవిషయము లుపదేశించి శాపఫల మనుభవింపకతప్పదని నీతి నుపదేశించుటయు, దాన నాజగన్మాత తనయుత్పత్తివిధ మెఱింగి యంగీకరించుటయు, దివ్యరథము నెక్కి మరల శ్రీహరి

గోకులమున కరుదెంచుటయు, సర్వజనానుమతిఁ బయనము సాగించుటయు, నాకాలమున వ్రజమునఁగల గోపికలు భగవంతుని యెడఁబాటున కోర్వఁజాలక యొండొరులతో మాటలాడుకొనుటయు నను లోనగు విషయములఁ బఠించితిరి కదా. దీనిసారమిదియని, యీకథలు భగవంతుని యనంతపరమసామర్థ్యములు తెలుపునని మరల వ్రాయ నవసరము కన్పడదు. గోపికల సంభాషణములు శ్రీకృష్ణునియందున్న కామము చేతఁ జెప్పఁబడినవియా? లేక భక్తిభరముచేతనా యనువిషయమునంగూడ నించుక యీవలకే శ్రీభాగవతశ్లోకము లుదాహరించి పోతన మహాకవిపద్యములవ్రాసి వానియర్థము వ్రాయునపుడే వ్రాసితిని. సాధారణు లనుకొనునట్లు గోపికలెల్లఁ గామార్తిఁబొందినవారు కారని పెక్కుతావుల వ్రాసినవిషయమైనను నించుక మరలఁ బ్రమాణపురస్సరముగా వ్రాయఁదలంచితి. ఇఁకముందీగోపికావృత్తాంతమును జర్చింప విశేషావకాశము లేదు. ఈచరిత్రమే కదా శ్రీకృష్ణుఁడు జారశిఖామణి చోరాగ్రేసరుఁడని చెప్ప నవకాశమిచ్చునది. కావుననే నాలుగుముక్కలు వ్రాయ నెంచితిని. ఈ నామాటలే సిద్ధాంతములుకావు. కొంద అంగీకరింతురు కొంద అంగీకరింపరు. నామాట లననేల? ప్రతిమతసిద్ధాంతము లిట్టివే కదా. నామనసునకు విశ్వాసమును గల్గించినభావమును నేను వ్రాసెదను. వానికిం బ్రమాణములు చూపెదను. వాని కింకొక యర్థముచెప్పి యిది సిద్ధాంతము కాదనువా రుండకపోరు. వారిభావము నంగీకరింపనివారు నేనుగాక యెందఱో భూమి

నుండకపోరు. కావున నిదియే సిద్ధాంతమని చెప్ప నేదియు లేదు. నాకుఁ దోఁచినసిద్ధాంత మిదియనిమాత్రము చెప్పఁగలను. ఇఁక దానిని జిత్తగింపుఁడు,

## మహామునులు గోపికలై పుట్టుట.

* గోపికలు చాలమంది పూర్వజన్మమున మహర్షులే యని యీవఱకే పెక్కుపర్యాయములు వ్రాసియేయుంటిని. గర్గభాగవతమునుండి కొందఱ వృత్తాంతమును వ్రాసియేయుంటిని. మరల నిపుడొక్కవిషయము గుహ్యామని వ్రాయుచున్నవాఁడను. ఈవిషయము పార్వతి ప్రశ్నింప నీశ్వరుఁడు చెప్పుచున్నాఁడని పురాణకథాసంబంధము. ఏయేముని యేపేరుగల గోపికగా జన్మించెనో యీయధ్యాయమునుండి తెలియనగు.

పార్వతీ! తరువాతివృత్తాంతము నాలకింపుము. ఉగ్రతపుఁడను మానియుండెను. నియతవ్రతుఁడు. సాగ్నికుఁడు. అగ్నిభక్షకుఁడై యచ్చెరువుగొలుపు తపస్సుచేసెను. భగవన్మంత్రమును గామరాజబీజాన్వితముగ జపించెను. అది సర్వకామముల నొసంగునని యామునిభావము. కృష్ణనామమును జతుర్థ్యంతముగ నందుఁ గూర్చెను. అగ్నిపత్నీపదమును దుదిఁ

* ఈవిషయము పద్మపురాణాంతర్గత పాతాళఖండమునందలి డెబ్బదిరెండవయధ్యాయమునుండి వ్రాయఁబడినదని యెఱుఁగునది. ఈపురాణమందలి కథలు చాలవఱకు నితరపురాణములయందున్నవని యీవఱకు వ్రాసితేను. ఈవిషయ మితరపురాణములకంటె నిందు విశేషించి చెప్పఁబడినది కావున నిట వ్రాయుచున్నవాఁడను.

జేర్చెను. ఇది వర్ణవర్ణప్రభావము. ఆమంత్రాధిదేవత శ్రీకృష్ణుఁడు. శ్యామసుందరవిగ్రహుఁడై రాసోన్మత్తుఁడై రాసోత్సుకుఁడై పీతాంబరధారియై వేణుభూషితకరకమలుఁడై నవయౌవనసంపన్నుఁడై వేఱొకహస్తమునఁ బ్రాణేశ్వరి యగురాధాదేవికరమును బట్టుకొనియుండునట్లు శ్రీకృష్ణరూపమును ధ్యానించెను. చిరకాలము జపించి జపించి యాశ్యామసుందరమూర్తిని మదినిడుకొని యే దేహమును దృజించెను. "యాదృశీభావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ" యనుసూక్తి వ్యర్థము కాదుకదా. ఆముని శ్రీకృష్ణుఁడు భూలోకమున నవతరించినపుడు గోకులమున సునందుఁడనుగోపాలకునకుఁ బుత్త్రికయై జన్మించెను. సునందా యను పేరు తండ్రి యొనరించెను. ఆగోపిక వీణాపాణియై యుండునది.

సత్యతపుఁడని మునియుండెను. అతఁడు మహావ్రతుఁడు. ఎండుటాకులు భక్షించుచు శ్రీకృష్ణమంత్రమును జపించెను. రతీబీజాంతమై కామరాజబీజసంపుటితమైనమంత్ర మది దశాక్షరము. తదధిష్ఠానదేవతయగు శ్రీకృష్ణుని జిత్రవేషధరునిగా ధ్యానించెను. ఆశ్రీకృష్ణమూర్తి రమాకాంతాకంకణోజ్జ్వలదోర్వల్లీద్వితయమును బట్టుకొని నృత్యముచేయుచుండునట్లు మునిధ్యానమున నెంచెను. ఆనర్తనకాలమందు నవ్వుచు నానందతరంగముల నూఁగుచున్నయట్లు చింతించెను. వేణువును దాల్చివైజయంతీవిరాజితుఁడై యున్నట్లూహించెను. నటనసమయాయాసజనిత స్వేదాంభఃకణసంసిక్తలలాటవినతాననుఁడై హరి

యుండినట్లు ధ్యానించెను. ఇట్లు చిరకాల మాశ్యామసుందర మూర్తిని ధ్యానించి ధ్యానించి కళేబరమును ద్యజించి నంద గోకులమున హరి జన్మించినపుడు సుభద్రుఁడని గోపాలకునకుఁ గూఁతురై పుట్టెను. భద్రా నామ మాతనయకుఁ దండ్రి పెట్టెను. ఆకన్య కాలలాటమున వ్యజనచిహ్నము తోఁచుచుండెను.

హరిధాముఁడనుమహాముని యాహారమును మాని చిర కాలతపోనిరతి నుండెను. వింశతివర్ణములుగలిగి శీఘ్రసిద్ధికరం బగు శ్రీకృష్ణమంత్రమును జపించెను. అదియుఁ గామరాజబీజ ప్రధానమగు. దానిపిదప మాయాబీజము సవ్యోమముగ నుండు. అవ్వల హంసాసృగ్ద్యుతిచంద్రకబీజము లింపొందు. అవలఁ బదియక్షరములు నామచిహ్నితములై యుండు. ఆనా మము స్మరాదికమని యెఱుంగవలయు. బృందావనమున మనో హరమాధవీమండపమున నుత్తానశాయియుఁ, జారుపల్లవాస్త రణోర్ధ్వభాగస్థుండును, ముదితవల్లవీసముదయావృతుఁడును, భార్యాసమాలింగితహృదయుండునగు శ్రీకృష్ణుని ధ్యానిం చెను. చిరకాల మిట్లు ధ్యానించి ధ్యానించి దేహమును ద్యజించి మర్త్యలఁ బుట్టి మరల భగవంతు నట్లే ధ్యానించి యిట్లు చిరకాలముకాఁగా సారంగనాముఁడగు గోపాలునకుఁ బుత్త్రి కయై జన్మించెను. ఆమె శుభలక్షణోపేత. రంగవేణి యని యాకన్యకకు నామకరణము చేయఁబడినది. చిత్రకర్మనిపుణయై యాకన్యకాతిలకము తనరు. ఆమె దంతములయందు శోణబిం దువులు చిత్రింపఁబడియుండెను.

బ్రహ్మవాదియగుముని యొకఁడు గలఁడు. ఆతనిపేరు జాబాలి. అతఁడు యోగశాస్త్రవేత్త. భూమి నెల్లయెడలం దిరిగి యొకమహారణ్యమున నొకవాపిక కనంబడ దానిమనోజ్ఞత కానందించి దానిపడమటితటమునందు వటమహీరుహమూల మునందు ఘోరతపస్సు చేయు తాపసి నొకతుకం జూచెను. ఆమె యౌవనస్ఫురిత. అప్రతిమానరూపశాలిని. చంద్రకిరణములవలె మనోహారిణి. సర్వావయవసుందరి. కటితటమున వామహస్తమును చుకొని దక్షకరమున జ్ఞానముద్రిక చూపట్టఁగా నని మేష లోచనము లలర నాహారము నించుకయుఁ గొనక విహారమును మాని సునిశ్చలభావమున నుండెను. జాబాలియు నామె తపో నియతికి నచ్చెరువంది దానివిధ మెఱుంగఁగోరి చాలసంవత్స రము లుండెను. ఆవల నామె నియతినుండి లేచినంత నిట్లు ప్రశ్నించెను. సువ్రతా! అచ్చెరువును గల్పించు నీతపశ్చర్యావిధి యెట్టిది? చెప్పవలనుపడునేని వచింపుము. నావిని తపోనియతిఁ గృశించినయాపురంధ్రీమణి మెల్లఁగా నిట్లనియె. ఆర్యా! దేనిని యోగీంద్రులు పరిశీలించుచుందురో అట్టి బ్రహ్మవిద్యను నేనే. అట్టి శ్రీహరిపాదాంభోజదర్శనవాంఛచేఁ జిరకాలమునుండి తపమొనరించుచున్నదానను. ఈయడవిని జిరకాలమునుండి పురుషోత్తముని ధ్యానించుచు బ్రహ్మానందపరిపూర్ణహృదయనై తదానందతృప్తిగలిగియు శ్రీకృష్ణరతిలేనికతనహృదయము శూన్యమని తలంచి యిపు డతినిర్విణ్ణనై యీదేహమును ద్యజింపఁ బూనియున్నదానను. ఈకళేబరము నీవాపికయందు వదలఁ దలంచి యున్నదానను.

ఆమాట విని జాబాలి యత్యంతవిస్మితుఁడయ్యెను. ఆమె చరణములపైఁబడి కృష్ణోపాసనపద్ధతిం దెల్పుమా యని వేఁడెను. ఆమెయుఁ దద్విధిని దెలుపఁ దన్మంత్రజపమునకై మానససరోవరమునకుం బోయెను. అందచ్చెరువు పుట్టింపఁజాలుతప స్సొనరించెను. ఏకపాదమున నిలుచుండి సూర్యుని నిమేషరహితవిలోచనములఁ జూచుచుఁ బంచవింశతివర్ణాత్మకమంత్రమును జపించుచు నానందరూపుఁడైన శ్రీకృష్ణుని ధ్యానించుచుండెను. ఆధ్యానమున వ్రజవీథుల గతివిలాసము మెఱయ సంచరించు సస్మితాపాంగవీక్షణముల నెల్లర రంజిల్లఁజేయుచు సంమోహిని యను మురళింగొని విచిత్రవర్ణముల యామురళిని బింబోష్ఠమునఁజేర్చి కలాలాపములఁ బలికించుచు వ్రజాంగనలమానసములఁ బల్లవింపంజేయుచుఁ దనువులఁ బులకాంచితములఁగానొనరించుచు, దివ్యాంబరాభరణశోభితతనుండై దివ్యగంధములఁ బూసికొని శ్యామలాంగుఁడై ప్రభాపూర్ణుఁడై జగత్త్రయమును మోహింపఁజేయుచు నున్నట్లు శ్రీహరిని భావించుచుఁ జాలకల్పములు జరగఁగా గోకులమున దివ్యరూపమలరఁ బ్రచండాఖ్యగలగోపకునకు మహితయై జన్మించి చిత్రగంధ యనునామమున విఖ్యాతిం గాంచెను.

మఱికొందఱు మహర్షులు సతతపరిశుద్ధమనస్కులై వాయుభక్షకులై శ్రీకృష్ణమంత్రవర్యమును జపించుచుఁ దప మొనరించిరి. స్మరబీజము పిదప "కృష్ణాయ" యనుపదము తరువాత "గామార్తికలాదివ్రతశాలినే" యనునర్థముగల నవవర్ణ

ములు పిదప నగ్నిపత్నినిగార్చి పంచదశవర్ణమంత్రము నుపాసించుచు శ్రీకృష్ణదివ్యమంగళమూర్తిని మనఃపీఠముల నిలుపుకొని బహుభంగుల వినుతించుచుఁ గల్పాంతరముల దేహముల వదలి గోకులమున జన్మించిరి. వారికర్ణములయందే రత్ననిర్మిత తాటంకము లలరారుచుండును. కంఠముల రత్నహారములు, వేణిమూలముల రత్నకుసుమములు కన్పడుచుండును.

శుచిశ్రవసుఁ డనుమునియు సువర్ణుఁ డనుమానియు గలరు. వీరిరువురు కుశధ్వజుఁ డను రాజర్షి పుత్త్రులు. వేదపారగులు. వారూర్ధ్వపాదులై త్ర్యక్షరకృష్ణమంత్రమును జపించుచుఁ దప మొనరించిరి. మాయాబీజము హంసపదాద్యక్షరము పరాబీజము తన్మంత్రాంతర్గతవర్ణములు. నియతమానసులై వారు దశవర్షవయోవిరాజితశ్రీకృష్ణుని ధ్యానించుచు జప మొనరించిరి. వారు కల్పాంతమున దేహముల వదలి గోకులమునఁ బుట్టుకం గాంచిరి. సువీరుఁ డనుగోపకునకు దుహితలై రూపలావణ్యముల నలరారుచు, శుభరవము లొసఁగుసారికల హస్తములం దాల్చియుండిరి.

జటిలుఁడు, జంఘుపూతుఁడు, ఘృతాశియుఁ, గర్భుపు ననునల్వురునునులు గలరు. ఇహాముత్రఫలములఁ గోరని సుస్వాంతులు. వల్లవీరతుకుని నిశ్చలభావముల నుపాసించిరి. జలముల మునింగి భగవన్మంత్రరాజమును జపించిరి. రమాత్రయసంపుటితమై స్మరాద్యంతమై దశాక్షరనియమిత మగుమంత్రమే వారి యిష్టసిద్ధుల నొసంగినది. భగవంతుఁడు బృందావనమున విహా

రించుచు వల్లవీరత్నములంగూడి నృత్తగీతాదులచేఁ గాలమును బుచ్చుచు నీలపీతవసనసంవృతుఁడై యుండుహరిని ధ్యానించిరి. మూఁడుకల్పములు సాగఁగా దేహములవిడిచి గోకులమున జన్మించిరి. సకలభూషణభూషితాంగము లొప్ప నుండిరి. వారి కెల్ల సువర్ణకంకణములే ప్రీతిప్రదములై యుండెను.

దీర్ఘతపుఁ డనుముని ప్రాక్కల్పమున వ్యాసుఁడయ్యెను. తత్పుత్రుఁడు శుకుఁడు. ఆశుకుఁడు ప్రాజ్ఞుఁడు. భగవత్పాద ధ్యానాసక్తిచేఁ దలిదండ్రులవదలి వనమున కేగెను. మానసి కోపచారముల భగవంతుం బూజించుచు నిరాహారుఁడై గోప రూపునిగాఁ గృష్ణుని ధ్యానించెను. రమాబీజాన్వితాష్టాదశా క్షరమంత్రమును జపించెను. బంగారువృక్షముక్రింద బంగారు పీఠమునందు హైమమురళిని దాల్చి దక్షిణకరమున సువర్ణ కమలమును ధరించి విలాసముగా దానిం ద్రిప్పుచు సుస్మితము గ్రాలనున్న శ్రీకృష్ణుని ధ్యానించెను. ఆధ్యానవిశేషమునఁ బుల కాంచితవిగ్రహుఁడై హర్షాశ్రుపూర్ణనయనుఁడై "నాథా! ప్రస న్నుఁడవుగమ్ము." అని పలుమాఱులు గట్టిగా నుచ్చరించుచు దండాకారముగ భూమిపయింబడి ద్రిజగత్పతినే తలంచుచు నుండెను. భక్తిరసపూర్ణుఁడై ధరణీతలంబునంబడి మాయామో హితుఁడనగునన్ను ధ్ధరింపుమనిపలికినయా వ్యాసతనయునిశుకునిఁ గరుణచేఁ జేతులం గ్రుచ్చియెత్తి ప్రసన్నేక్షణములఁ జూచుచుఁ గరసరసిజముల మేనెల్ల స్పృశించి భగవంతుఁ డిట్లు పలికెను. శుకమునీ! నాకుఁ బ్రియురాలవయ్యెదవు. నాపత్నులయందెల్ల

ముఖ్యురాలవయ్యెదవు. నారూపమును ధ్యానించుచు నిశ్చింతగా నుండుము. గోపికలయం దిద్దఱు నాప్రియతమ లుందురు. వారు సమానవయస్సుకలిగి ఏకనియతియు నేకనిష్ఠయుఁగలిగి యేకనక్షత్రనామములఁ బిల్వఁబడుచునుందురు. అందొకర్తుక తప్తజాంబూనదవర్ణదేహయగు. వేఱొకర్తుక విద్యుత్ప్రభా దేహయగు ఒకతె నిద్రాయమాణాక్షి. ఇంకొకర్తె సౌమ్యాయతేక్షణ. ఏమనుజుఁడు నిరుపమభక్తిచే నన్నారాధింతురో వారు గోకులమున నాయవతారకాలమునఁ బుట్టుదురు. అని యానతిచ్చెను. భగవంతుని యాదృతిఁ దపఃకష్టమెల్లఁ బాయఁగా సంతోషాంబుధితరంగముల నోలలాడెను. ఆశుకముని కల్పాంతమున గోకులమున సుపనందునకుఁ గూఁతురై పుట్టెను. నీలోత్పలదళచ్ఛవిగలతనూవల్లిగలదయ్యెను. ఆగోపిక శ్రీకృష్ణుని ప్రీతికిం బాత్రురాలయ్యెను. గుంజావలి యని యాగోపికపేరు. గోపిక లనేకసంఖ్యలుగ నామెకుఁ బరిచారికలై యుందురు.

*శ్వేతకేతుపుకుమారుఁడు వేదవేదాంగపారగుఁడు సర్వమును బరిత్యజించి ఘోరతపస్సు చేయఁబూని మురారిసంసేవితపాదారవిందయు, సుధామధురవాగ్విలాసినియు, బ్రహ్మరుద్రాదులకు దుర్లభయునగు శ్రీగోవిందశక్తిని శ్రీదేవిని దృఢభక్తితో మనఃపీఠమున నిల్పి యేకాదశాక్షరమంత్రరాజమును

---

* మురారిసేవితపదాం, సుధామధురవాదినీం, గోవిందస్య ప్రియాం శక్తిం బ్రహ్మరుద్రాదిదుర్లభాం, భజంతీ మేకభావేన శ్రియమేవ మనోహరామ్. అనిమూలము.

జపించుచుఁ దష్టాంత్రార్థమును దలంచుచు రెండుకల్పములకుఁ బిదప గోకులమున జన్మించెను. ఆగోపిక భూపుత్రి యనఁబరఁగెను. శుద్ధకౌశేయమును దాల్చి మణికుండలమండితకర్ణద్వయయై యలరుచుండెను.

చంద్రప్రభుఁ డను రాజర్షి యుండెను. ఆతనికి శ్రీకృష్ణానుగ్రహమున మధురాకారముగల కుమారుఁడు గలిగెను. ఆతని పేరు చిత్రధ్వజుఁడని. ఆబాల్యము విష్ణుభక్తుఁడు. ఆరాజు చిత్రధ్వజుని పరమసౌమ్యాకారమును బుద్ధివిశేషమును జూచి సద్బ్రాహ్మణులచే నష్టాక్షరమంత్రమును జెప్పించెను. ఆమంత్రోపదేశప్రభావమున విమలజ్ఞానియుఁ బరమశాంతుఁడు నయ్యెను. ఒకనాఁడు తండ్రిచెంతకుంబోయి హర్షాశ్రువులు నిరంతరధారలుగాఁ బ్రవహించుచుండఁ బ్రార్థించి జపముచేయ నారంభించెను. విష్ణుదేవాలయమునకుంబోయి యేకాంతముగఁ గూరుచుండి యిట్లు లాలోచించెను. ఎట్లు శ్రీకృష్ణుని సేవింతును? గోపయోషిన్మనోహరు నెట్లు కనుఁగొనఁగలను? అని పలుభంగుల నాలోచించి స్వప్నమునఁ బరమవిద్యను బడసెను. ఆదేవాలయముననే శ్రీకృష్ణప్రతిమ యుండెను. స్వర్ణపీఠమున సర్వలక్షణలక్షితయై శిలామయియై యది తనరుచుండెను. ఇందీవరశ్యామాంగము వెలయ లావణ్యము చూపట్ట మనోహారిణియై త్రిభంగలలితాకారయై శిఖండిపింఛభూషితయై కాంచనకల్పిత వేణువు నధరమునఁజేర్చి ధ్వనింపఁజేయుచు సవ్యాపసవ్యపార్శ్వములఁ గాంతాద్వయము సేవించుచుఁ జామరహస్తలైయుండఁ

గన్నులపండువు చేయు నాప్రతిమను దర్శించి చిత్రధ్వజుఁడు పరమానందమున నాతనిపాదములపై శిరస్సునుంచి యట్లేయుండెను. శ్రీహరియు దక్షపార్శ్వమందున్న ప్రేయసిం గాంచి నవ్వుచు నతనితో నిట్లు పలికెను. రాజకుమారా! మదంశసంభూతురాలగు నీకాంతారూపమును ధ్యానింపుము. నాకు నీమెకు నభేదమును దలంపుము. ఆవల నీకు దివ్యరూప మలవడును. అనునంతలో నాపార్శ్వమందున్నయంగన లేచివచ్చి యారాజునం దావేశించెను. వారిద్ద ఱేకరూపమునే ధరించినట్లుండిరి. స్త్రీరూపమే యాతని కలవడియెను. భగవంతుఁడా నూతననారీతిలకమును జూచి నీవు నాసేవచేయుచు వీరందఱు నీయాజ్ఞ మెలఁగుచుండ నుండుము. విపంచికాగాననిరతవై యుండు మనియె. చిత్రకలానామమునఁ బరఁగుచు సదా నాపార్శ్వముననుండి గానముచేయుచుండు మన నామెయు నట్లొనరించెను. అంతలో స్మృతి వచ్చెను. ఆపరమానందమున బిట్టు రోదనము చేసెను. కల్పాంతమున నతఁడు దేహమును ద్యజించి వీరగుప్తుఁ డనుగోపకునకుం బుత్త్రికయై జన్మించి చిత్రకలానామముననే పిల్వఁబడుచు గానాభిరతిం దగిలి వీణాపాణియై యుండెను.

పుణ్యశ్రవసుండనుముని యొకఁడు కశ్యపగోత్రజుఁడు వేదవేదాంగవేత్తయై సర్వధర్మవిదుఁ డుండెను. ఆతనితండ్రి శివభక్తుఁడు. శతరుద్రీయమును బ్రతిదినము జపించుచుండువాఁడు. ఆతనికిఁ బార్వతీసహితముగా నీశ్వరుఁడు ప్రత్యక్షమై

చతుర్దశియం దర్ధరాత్రమున నిట్లు పలికెను. ఆర్యా! నీకుమారుఁడు శ్రీకృష్ణభక్తుఁడు కాఁగలఁడు. ఎనిమిదవసంవత్సరమున నుపనయనముచేసి దివ్యశ్రీకృష్ణమంత్రమునుపదేశింపఁజేయుము. ఏకవింశతివర్ణములు గలమంత్ర మీతనికిం దగు. విద్యాగోపాలమంత్ర మది యగును. వాక్సిద్ధిప్రదము. సాధకజిహ్వాగ్రమున లీలచేఁ దాండవమాడుచుండును. అని యామంత్రమును దెలిపి మఱియు నిట్లనియె. దశాక్షరమంత్రమునకుంగల ఋష్యాదులే దీనికిం గలవు. ధ్యానము వేఱు. అమృతసాగరమును స్మరించి దానినడుమ జ్యోతిర్మయద్వీపమును ధ్యానించి కాళిందీవేష్టితమగు బృందావనమును దలంపవలయు. సర్వర్తుకుసుమవిసరములనలరు ద్రుమములు లతలు వెలయునట్లు చింతింపవలయును. నర్తనముసలుపు మయూరనినాదముల నయ్యది మనోహరముగనున్నయట్లు, షట్పదఝంకారములు దిగంతములఁ బ్రతిధ్వనింపఁజేయునట్లు కోకిలాలాపములు శ్రుతివేయము లగునట్లూహింపవలయును. అందొకపారిజాతమహీరుహము శాఖోపశాఖలఁ దనరుచు నంబరచుంబియై యుండుననియు దానిక్రింద నిర్మలధేనుమండలమున గోపాలబాలురు వేణుహస్తులై క్రిక్కిఱిసి యుండుననియు స్మరింపవలయును. ఆమండలాంతరమున వ్రజసుందరీపరివేష్టితమనోహరమండల మొప్పుననీ, యందు గోపికలు నానోపాయనపాణులై భక్తిరసమత్తచిత్తలై కృతాంజలిపుటలై శుక్లవస్త్రములం దాల్చి శుక్లాభరణభూషితలై ప్రేమవిహ్వలస్వాంతములఁ గనుపట్టుచు నుండునట్లు ధ్యానింపవల

యును. అందు శ్రుతికన్యకలు వెలయున ట్లూహింపవలయును. వారినడుమ రత్నవేదికయందు దుకూలావృతుం డగుహరిని స్మరింపవలయును. ఆకృష్ణమూర్తి రాధాదేవీమనోహరాంకభాగమున శయనించి,చంద్రమండలముభాతిమనోహరమైస్వేదబిందుయుతము నగురాధాముఖమును గనుంగొనుచు, సర్వగుణమణియై తనరు కిశోరమూర్తిని ధ్యానింపవలయు. దశాక్షరమంత్రమునకుఁ జెప్పఁబడినపూజయే దీనికిం జేయఁదగినది. అనిఁ లికి శంకరుఁ డంతర్హితుఁడయ్యెను. ఆముని యట్లే పుత్రున కుపదేశించెను. ఆపుత్త్రుఁడు తన్మంత్రోపదేశమాత్రమున మహానంద మొంది శ్రీహరిని బెక్కువిధముల వినుతించెను. వాయుభక్షకుఁడై దారుణతపం బొనరించి గోకులమున నందసోదరు నింట జన్మించి లవంగానామమున శ్రీకృష్ణప్రీతికిం బాత్రురాలై యుండెను. ఆలవంగాహస్తమున ముఖమార్జనయంత్ర ముండును. పార్వతీ! నీప్రశ్నమునకు నుత్తరముగా శ్రీహరి ప్రాణవల్లభలం గొందఱిం బేర్కొనినాఁడ. ఇంకేమి వినవలతువని యడిగెను. పార్వతీపరమేశ్వరులు శ్రీకృష్ణాంఘ్రిధ్యానతత్పరులై యుండిరి.

ప్రాజ్ఞులారా! ఈవిషయము పద్మపురాణాంతర్గతము. శ్రీరామావతారమునందు తద్దివ్యమంగళవిగ్రహమును జూచి మునులు మోహించిరని వారికోర్కెలఁదీర్ప భవిష్యత్కృష్ణావతారమే తగునని భగవంతుఁ డాదేశించెనని యొకవార్త పరంపరాగతము కలదని చాలపర్యాయములు చెప్పియున్నవాఁడఁ గదా. ఆరీతిగా లేకున్నను దానిసారమును సార్థకముచేయ

నీకథ చాలును. మునులు గోపికలైరి. అనఁగా శ్రీకృష్ణసేవా ఫలమునందుటకే. ఆవిషయ మీకథనుండి విస్పష్టమాయెను. ఎవ్వరెవ్వరు శ్రీకృష్ణునిం బెండ్లియాడఁగోరిరో వారెల్ల భార్య లయం దంతర్భూతులుగా నుందురు. తక్కినవారెల్ల భగవత్సే వాదృష్టమును బడయఁ బుట్టినవారు. భక్తిప్రధానముగాఁ గల వారు. పాదసేవాసంపత్ఫలమును బడయఁగోరియే యవతరించిరి. కావున జారశిఖామణియని శ్రీకృష్ణుని దూఱ వీలులేదు. ఇంతి యగాక యీ పురాణమున రాధామహిమము విశేషించి కలదు. శ్రీభాగవతమున రాధాప్రస్తావము లేదు. గాన రాధయే లేదన్న యల్పమతు లీపురాణమును జదివి యేమందురో తెలియకున్నది. ఈ పురాణముకూడఁ బ్రమాణముకాదన్నచో వారివాదమును వినకుండుటయే మర్యాదకాని వేఱుగాదు. విష్ణుపురాణమునందు దీనిని రెండవపురాణముగాఁ జెప్పి యున్నారు.

బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా. అని.

కావున రాధాదేవి శ్రీకృష్ణమూర్తికిఁ బ్రాణేశ్వరి. మూలప్రకృతి యనక తప్పదు. పురాణములన్నియు నప్రమాణములైనపు డీవాద మసత్య మగును. అపుడు శ్రీభాగవతము ప్రమాణమే కాకపోవును. అట్టిమాట యనరాదుకదా. రాధా మహిమము పురాణములయందు వర్ణింపఁబడినట్లు మఱేకృష్ణ పత్నిమహిమము వర్ణింపఁబడలేదు. రుక్మిణి లక్ష్మియన్నవాదము దుర్వాదమని నే ననను. విష్ణుపత్నుల నెవ్వరిని జెప్పినపుడు వారు

లక్ష్మ్యంశసంభూతలని చెప్పినట్లగును. అది న్యాయమే. రాధకు శ్రీ దేవికి భేదము లేనట్లు పురాణములతాత్పర్యము భక్తుల భావ మట్లే కావున నెవరిని బ్రధానమన్న నపరాధము లేదు. కాని రాధాదేవి లక్ష్మీ కాదన్నవాదము దుర్వాదమని పురాణము లేక గ్రీవముగా నంగీకరించుచున్నవి. కావున నట్టి దుర్వాదముల మదిఁజొన్పక వాని వినఁ జెవులయందుఁ జోటుంచక భగవంతుని గొలిచి కృతకృత్యుల రగుఁడు. రాధాప్రస్తావమున నింకొక్కగాథ యిట వ్రాయవలయును. అది ప్రకృతకథ కను బంధము కాదు. కాని ముందు రాధాప్రస్తావమున వ్రాయ నవ కాశము లేదు. మానుదమన్న మన స్సంగీకరింపకున్నది. అది భగవన్మహిమమును బోధించునది. కావున నిట వ్రాయక తప్ప దని వ్రాయుచున్నాను.

అర్జునుఁడు రాధాలోకమును దర్శించుట.

*ఓ శ్రీకృష్ణా! శంకరాదులచేఁ దెలియఁబడనివిషయ మొకఁడు కలదు. దానిని దయచే సెలవిమ్ము. లోఁగా వ్రజ కాంతలు నాకు వల్లభలు కలరని చెప్పియుంటివి. వా రెన్ని విధములుగ నుందురు? వారిసంఖ్య యెంత? వారిపేరు లెవ్వి?

---

* ఇది పద్మపురాణాంతర్గతపాతాళఖండము డెబ్బదినాల్గవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది. ఈ గాథ కృష్ణార్జునసంవాదరూపమని యొకపార్షదుఁడు సనత్కుమారునకుఁ జెప్పఁగా దాని నతఁడు దుర్వాసునకుం దెల్పినట్టు లున్నదని యెఱుంగఁదగు. కృష్ణార్జునసంవాదముగనే యిట వ్రాయఁబడును.

వా రుందురు? త్రావు లెట్టివి? వారి వేషము లెట్లుండును? ఎవరిం గూడి నీ వేయే త్రావుల విహరింతువు? నిత్యనివాసమై మనోహరమైన దేవనము? సదా నీ కిష్టమైన స్థాన మెద్ది? అనుగ్రహించి నా కీవృత్తాంతమును సెలవిమ్మని యడిగెను.

ఇట్లర్జునుఁడు ప్రశ్నింప శ్రీ హరి పరమానందనిర్భర హృదయుండై వత్సా! యని సంబోధించి యిట్లు బోధించెను. ఏస్థానము నాకు నిష్టనివాసమో, ఎవరు నాకు వల్లభలో నెందు విహరింతునో యాచోటు మనుజుల కగోచరము. సత్యము. దానిని జెప్పినచో నీకుఁ జూడ నుత్కంఠ గలుగఁగలదు. ఆత్రావు బ్రహ్మాదుల కగమ్యమన నిఁక మనుజులమాట చెప్ప నేటికి? కావున వత్సా! ఈప్రశ్నమును మానుము. దీన నీకు లాభము కలుగదు. అన విని యర్జునుఁడు దీనుఁడై శ్రీహరిపాదారవింద ద్వంద్వమును దల స్పృశింప దండాకృతి నమస్కరించెను. లేవ కట్లే యుండెను. శ్రీకృష్ణపరబ్రహ్మ మాదరమున రెండు చేతుల నతని లేవనెత్తి పరమప్రీతిచే భక్తవత్సలుఁ డన్నానాము సార్థక మగునట్టు లిట్లు లనియెను. దానిని జెప్పినచోఁ జూడఁదలంతువు కాఁబోలును. ఏదేవినుండి ప్రపంచ ముత్పత్తిల్లెనో ఇప్పటి నేదేవియందున్నదో ఏదేవియందు లయమందఁగలదో యట్టి త్రిపురసుందరి నారాధించి యామెకు నీయిష్టము విన్నవించుకొమ్ము. ఆమె యనుమతిలేక యాపదముఁ జూప నవకాశము లేదు అని శ్రీహరి వచింప హర్షసమాకులేక్షణుఁడై పార్థుఁడు శ్రీ కృష్ణానుమతి నంది శ్రీమత్త్రిపురసుందరీపాదుకా

ద్వంద్వము సేవింపఁబోయెను. నానారత్నవిరచితసోపానములచే నతిశోభితమగుచింతామణి వేదికను గాంచెను. అందొకకల్ప వృక్షము పుష్పఫలభరితంబై కనుపట్టెను. దానిచెంత మనోజ్ఞ రత్నమందిరము నేత్రానందకర మగపడియెను. అందు రత్నమయ సింహాసనముపై బాలార్కసంకాశ కాంతి యలర సుప్రసన్నయై బ్రహ్మావిష్ణుమహేశ్వరకిరీటమణిరశ్ములచే విరాజమానపాదార విందయై యణిమాదిసిద్ధు లొప్ప సుప్రసన్నవదనయై వరదయై భక్తవత్సలయై యున్న త్రిపురసుందరిం గనుంగొనెను.

ఆ జగజ్జననిం గాంచి నే నర్జునుఁడ నని పలుకుచుఁ బలు సారులు నమస్కరించెను. భక్తిభరమున విహితాంజలిపుటుండై యొకచోట నిలువఁబడియుండెను. ఆ త్రిపురసుందరి యతనిభావ మును శ్రీహరికరుణయు సర్వజ్ఞయగుట నెఱింగి యిట్లనియెను. వత్సా! పాత్ర మెఱింగియే దాన మొనరించితివి? ఏ యజ్ఞ మున భగవంతు నారాధించితివి? ఏతపస్సుచేసి శ్రీహరిని సుప్రసన్నునిగాఁ జేసికొంటివి. భగవద్భక్తి ప్రాగ్జన్మసుకృతపరి ణతిచేఁగాని గలుగదుకదా. భగవంతుఁ డలరునట్టు లేయే సద్వ్రి తముల నాచరించితివి? ఏ భక్తునకుఁ బ్రసాదించనికరుణ నీపైఁ బ్రసరింపఁజేయ నేమిహేతువు! నీ యందు భగవంతునకుంగల కరుణ మర్త్యలోకవాసులలో నెవ్వరిపైనను గలుగలేదు. స్వర్గో కవాసులపై, మునులపై, యోగులపైఁ గలుగలేదు. ఇది సత్యము. ఇటు రమ్ము. ఈసరోవరము కులకుండ మనుపేరఁ బరఁ గును. దానిసేవింపుము. ఈ దేవి సర్వకామప్రదయగు. ఈమె

వెంటఁ బొమ్ము. ఆ సరస్సున స్నానమొనరించి వేగముగా నిచటికి రమ్ము. అని పరదేవి పలుక నర్జునుఁ డట్లే పోయి స్నానమొనరించి వచ్చెను.

ఇట్లు కులకుండసరసున స్నాతుఁడై పరిశుద్ధుఁడై వచ్చిన యర్జునునకు న్యాసము ద్రార్పణాదికృత్యములఁ జేయించి యతని దక్షిణకర్ణమునందు సద్యస్సిద్ధిప్రదాత్రియగు బాలావిద్య నుపదేశించెను. అనుష్ఠానపూజాదివిధుల నెఱింగించెను.జపము పిదపఁ గరవీరకోరకములచే హోమము చేయుపద్ధతియుఁ దెలిపెను. ఆవలఁ బరమేశ్వరి యిట్లు పలికెను. అర్జునా! ఈ పద్ధతిం బూని న న్నుపాసింపుము. ఆమీఁద నాయనుగ్రహపాత్రుఁడవు కాఁగలవు. అపుడు శ్రీకృష్ణలీలాదర్శనాధికారము గలుగును. ఈ నియమమును దొలుత భగవంతుఁడే యేర్పఱచెను. అర్జునుఁ డారీతి నాజగజ్జనని నుపాసించెను. ఉపాసనము సక్రమముగా నెఱవేర్చి మది నంబను స్మరించెను. ఆయంబ ప్రత్యక్షమై సుప్రసన్నయై వత్సా! నీవిపుఁ డర్హుఁడవైతివి. ఇఁక నీగృహాభ్యంతరమున కరుగుము. అందు రాధాపతి యుండునని యొకపరిచారికను దోడిచ్చిపంపెను. ఆమెవెంట నర్జునుఁ డాచోటికిం బోయెను. అది యోగులకే దుర్లభస్థానము. ఆస్థానము గోలోకమునకు నూర్ధ్వభాగమున నుండెను. అది శాశ్వతము. వాయుధారితము. సత్యము. సర్వసుఖావహము. అది బృందావన మనంబడును. అందు శాశ్వతమగురాసమండల మొప్పారుచుండును. పూర్ణప్రేమరసాత్మకమగు నాస్థానమును గన్నులారఁ గనియెను.

ఆలోకమును జూచుట కాభగవతియే దివ్యలోచనముల నొసఁగియుండెను. తద్దర్శనమున హర్షము పట్టరాక మూర్ఛిల్లెను. కూడనున్న భగవతీపరిచారక యతని లబ్ధసంజ్ఞుని జేసెను. ఇఁక ముందేమి చేయవలయు ననునూహ కలిగెను. అప్పుడు కూడనున్న దేవీపరిచారిక పార్థా! యీదివ్యసరోవరమున స్నానము చేయుము. దీనిం బ్రవేశించినపిదప విశేషమును జూడఁగలవు. ఈసరసునందే గోవిందుఁడు వసంతవిహారము చేయుచుండును. ఆవసంతోత్సవానందమున నలరు శ్రీకృష్ణపరబ్రహ్మమును ధ్యానించి యోగులు కృతకృత్యు లగుదురు. కావున నర్జునా! ఈ సరస్సునందు స్నానముచేసి తొలుతఁ జూపినసరస్సునకుం జని జలమును స్పృశించి పిదప నాచమించి తరువాత నిష్టకార్యమును సాధింపుము.

## అర్జునుఁడు స్త్రీయగుట.

అని యంబికాపరిచారిక తెలుప నర్జునుఁడు భక్తిభావమున నాసరస్సున స్నాన మొనరింపఁబూని విధి ననుసరించి జలముల మునిఁగెను. ఆపరిచారిక యపుడే యదృశ్య యయ్యెను. జలములనుండి యర్జునుఁడు లేచి నలుదెసలు పరికించెనుగాని యాపరిచారక కానరాదయ్యెను. తన్నుఁ జూచుకొనఁగాఁ బుటము పెట్టినబంగరురంగుగల శరీరకాంతియు, నపుడపుడువచ్చుచున్న వయస్సుగలతనూవల్లియు, శారదేందునిభాననము, నింద్రనీలమణిఖచితతాటంకయుగళము,సిందూరబిందుకిరణప్రోజ్జ్వాలాలకపట్టికయు, జితస్మరశరాసనభ్రూలతయుఁ గువలయదళశ్యామల

నయనములు, నిరుపమగండమండలములు గలిగిన నిరుపమాన వనితాకృతి కన్పట్టెను. ఈయపూర్వదేహ మెట్లువచ్చె నని యాలోచించెను. ఇది గోపికాప్రాణనాయకునిమాయ యని నిశ్చయించెను. అపు డేమిచేయవలయునో తోఁచక యూరక పాషాణప్రతిమవలె నిలుచుండెను.

అత్తరుణమున నాకాశమునుండి యొకవాక్కు వీతెంచెను. అది స్పష్టముగా వినఁబడియె "ఓసుదతీ! నీ వీత్రోవనే యాశ్రయించి పూర్వసరోవరమునకుఁ బొమ్ము. ఆసరోవరజలమును స్పృశించి యవల నీమనోరథమును సాధింపుము. వరవర్ణినీ! అందు నీచెలికత్తె లుందురు. చింతిల్లకుము. వారే నీయిష్టమును సాధింపఁగలరు" అని దైవీవాక్కు వినఁబడఁగనే పూర్వము తాఁజూచినసరోవరమున కామార్గమునుబట్టియే పోయెను. ఆసరోవరము వివిధవిహంగరవిమలనినాదబహుళము, స్ఫురత్కైరవకహ్లారకమలాది బహువిధ కుసుమవిసరమనోహరము, పద్మరాగవినిర్మితసోపానమండితము, మంజుకుంజమండపపరిభాసురము నై యుండెను. దానిం గాంచి యేమియుఁ దోఁచక ముహూర్తమాత్ర మూరకయుండెను. అంతలో నెచ్చటనుండియో క్వణత్కాంచీమంజీరనినాదము, కరకంకణనిక్వాణము, చెవులపండువుగా వినవచ్చెను. మఱొకక్షణకాలముననే నూత్నవిచిత్రయౌవనవిరాజితకాంతాకదంబము దృగ్గోచరమయ్యెను. వారియంగసౌష్ఠవ మాశ్చర్యకరము. ఆభరణవిన్యాసమపూర్వము. వారిభాషణము లశ్రుతపూర్వములు. వారిసుస్మి

తములు చిత్రములు. వారిచూపులు నవీనములు. లావణ్య మత్యద్భుతము. వారిగతివిశేష మచ్చెరువు. వారియనుగ్రహ మపూర్వము. ఆసఖిబృందమును జూచి యిదేమని మది నాలోచించెను. పాదాంగుష్ఠమున భూమిపై నేమో లిఖించుచు మోమువాల్చి యూరకుండెను.

ఈ కాంతామణిని గాంచి యాకామినీమణు లొకరి నొకరు చూచుకొనిరి. ఎవ్వతెయో మనజాతికాంత యేటికో యాలోచించుచున్నది. అని యాలోచించి కనుఁగొనఁదలంచిరి. మృదువాక్కులం బిల్చిరి. సఖి! కుశలమడుగఁ గోరితిమి. ఇచ్చటికి రమ్మాయని మాటలాడింపఁగోరిరి. వారిలో నొకతుక ప్రియముదా నామధారిణి చెంత కరుదెంచి సులలితవాక్కుల నిట్లు ప్రశ్నించెను. సఖి! నీ వెవతుకవు? ఎవ్వరిపుత్రివి? ఎవ్వరిహృదయేశ్వరివి? ఎవ్వరు నిన్నిచ్చటికిఁ బిలుచుకొనివచ్చిరి? నీవే వచ్చితివా? విచారింపనేల? ఇదంతయు విననఁగోరితిమి. ఈస్థలము పరమానందకారణము. ఇందే ప్రాణియు దుఃఖింపకుండును. నీవేల చింతించెదవు? అని యానారీమణి తన్నుఁ బ్రశ్నింప సిగ్గుచే మోమును వంచి సుస్వరమున వారిమనసులెల్ల కరఁగునట్లుగ నిట్లు పల్కెను.

నే నెవ్వతెనో ఎవరికూఁతురనో ఎవరిభార్యనో ఎం దుండి యిచ్చటికే తెంచితినో నన్నెవ్వ రిచటికిం గొనితెచ్చిరో నేనేమియు నెఱుఁగను. దేవియే యెఱుంగును. నామాటయందు మీకు విశ్వాసముకలదేని నావార్తను జెప్పెద ఆలకింపుఁడు.

ఇచ్చటికి దక్షిణపార్శ్వమున సరోవర మొండు కలదు. అందు స్నానముచేయుట కరుదెంచితిని. అం దీరూప మలవడినది. నలు దెసలు పరికించితిని. అంతలో నాకాశవాణి యొకఁడు వినఁబడి యెను. ఈత్రోవనే యాశ్రయించి పూర్వసరోవరమున కరుగుము. అందు నీసఖులు గలరు. చింతింపకుము. వారే నీయిష్టమును సంపాదింపఁగలరు" అని యావాక్కుల యర్థము. ఆమాటలు విని యీరీతిఁగనే యచ్చటికి వచ్చితిని. నాయాత్మ విషాదసంపూర్ణము. చింతాసమాకులము. వచ్చి యీజలమును స్పృశించితిని. మీకంఠశుభధ్వని నాలకించితిని. ఆవల మిమ్మెల్లఁ గాంచితి. మనోవాక్కాయముల నాయెఱింగినవిషయ మింతియే. మీ రెవ్వరు? మీతల్లిదండ్రు లెవ్వరు? ఎవ్వరిభార్యలు? అని యడిగెను. ఆప్రియముదాంబిక యిట్లు పలుకఁగా విని బదులీరీతిఁ జెప్పెను.

ప్రాణసఖి! అట్లే నీకు మేమెల్లఁ బ్రాణసఖులమైతిమి. మేమెల్ల బృందావనకలానాథవిహారదారకలము. మమ్మెల్ల నాపరమపురుషుఁడు ప్రీతిమై లాలించును. శ్రుతిగణప్రఖ్యాతి గాంచినవారము. ఇందున్నవా రెల్ల మునులు. వల్లవబాలికలము. ఉన్నదున్నట్లు వచించితిని. ఇందు రాధాపతియగు శ్రీకృష్ణమూర్తి దేహసంగతిం గనువారందఱు గలరు. ప్రియపత్నులు. శాశ్వతలు. నిత్యవిహారిణులు. అందదిగో పూర్ణరసాదేవి కనఁబడియెడిని. ఆమెచెంతనున్న గోపిక రసమంథరాఖ్యగలది. ఆవలితరుణి రసాలయ. ఈమె రసవాపిక. ఆవలి యన్నులమిన్న

యనంగసేన. తరువాతియంగన యనంగమాలిని. ఈయమ మద యంతి. ఈయమ రసవిహ్వల. ఈమె లలిత. ఈతరుణి లలితయౌవన. ఈమానిని యనంగకుసుమ. ఈమిటారి మదనమంజరి. ఈ కన్యకలావతి. ఈలలన రతికల. ఈమహిళ కామకళ. ఈవనిత కామదాయిని. ఈబాల రతిలోల. ఈబాలిక రసోత్సుక. ఈయింతి రతిసర్వస్వ. ఈస్త్రీ రతిచింతామణి. ఈవామనేత్ర నిత్యానంద. ఈబిడ నిత్యప్రేమరసప్రద. ఈపేరుకొన్నవారు శ్రీకృష్ణప్రేయసీమణులు. ఆవలనిలుచున్నవారు శ్రుతిగణఖ్యాతలు. అందుఁగొందఱ వచింతు. ఈమె యుద్గీత. ఆమె సుగీత. ఆమె కలసుర. ఆమె కలకంఠి. అల్లదిగో యాలేమ విపంచి. ఆవలితరుణి క్రమపద. తరువాతికాంత బహుహుత. ఆలలన బహుకళ. అల్ల యాబిడ కలావతి. ఆయమ క్రియావతి.

వారి తర్వాతివారు మునులు. గోపికలయినవారు. వారిలోఁ గొందఱ నాలకింపుము. మొదటివనిత ఉగ్రతప. తర్వాతియంగన బహుగుణ. ఆవలిలేమ ప్రియవ్రత. తదనంతరమున్నయాబిడ సువ్రత. ఆమీఁదనున్నపురంధ్రి సురేఖ. అవ్వలిదగునంబిక సుపర్వ. అవ్వలనున్నబాలిక బహుప్రద. ఈమె రత్నరేఖ. అల్లతన్వి మణిగ్రీవ. అనంతరపురంధ్రి సుపర్ణ. ఆమెప్రక్కననున్నకాంత అకల్ప. పిదపఁ జూడనగుతన్వంగి సుకల్ప. ఆమీఁదఁగనంబడువధువు రత్నమాలిక. అమెచెంతనుండుకృశాంగి సౌదామిని. ఆమె కామదాయిని. అల్ల కామాక్షి భోగద. పిదప నిలుచున్నసతీమణి విశ్వమత. ఆతనులత ధారిణి. ఆరమణి ధాత్రి.

ఆతలోదరి సుమేధ. ఆకమలాక్షి కాంతి. ఆకామిని యపర్ణ. ఆయతివ సుపర్ణ. అల్లపల్లవపాణి సులక్షణ. ఆమె సుదతి. ఈమె గుణవతి. ఆకోమలాంగి సౌకలిని. ఇల్లిదిగో సులోచన. ఆమె సుమనస్విని. ఆమె యశ్రుత. ఆమె సుశీల. ఆమె రతిసుఖప్ర దాయిని.

తరువాతనున్నపంక్తిఁ గనఁబడువారు మాతెగవారు. మేము గోపబాలికలము. ఓకమలాక్షీ! మాగుంపులోని కొం దఱిఁ గీర్తింతు. ఆలకింపుము. వరుసఁగాఁ గనుఁగొనుము. చం ద్రావలి, చంద్రిక, శుభ, చంద్రావతి, చంద్రరేఖ, చంద్రిక, చంద్రమాల, చంద్రప్రభ, చంద్రకళ, వర్ణావళి, వర్ణమాల, మణిమాలిక, మంత్రి, నవమంత్రి, సేఫాళిక, వర్ణప్రభ, సుప్రభ, మణిప్రభ, హారావళి, తారామాలిని, మాలతి, యూథి, వాసంతి, నవమల్లిక, సౌగంధిక, కస్తూరి, పద్మిని, కుముద్వతి, రసోల్లాస, చిత్రబృంద, ఊర్వశి, సురేఖ, స్వర్ణరేఖ, కాంచన మాల, సతసంతతిక.

ఓసుదతీ! మమ్ముఁగూడి విహరింతువుగాక. రమ్ము. పూర్వ సరస్తీరమున విధియుతముగా స్నానముచేయించి సర్వసిద్ధులం గూర్పఁజాలుమంత్ర ముపదేశించెదము. అని యాలేమం బిలుచు కొని యాసరోవరమునకుంబోయి విధియుతముగా స్నానము చేయించి నిరుపమానమంత్రము నుపదేశించిరి. విధులన్నింటిని దెలిపిరి. తప్తకాంచనగౌరాంగియు, నానాలంకారభూషితయు నాశ్చర్యరూపలావణ్యయు, సుప్రసన్నయు, వరప్రదయు నగు

దేవిని ధ్యానించుపద్ధతిని దెలిపిరి. జపము లక్షసంఖ్య చేసి కర వీరాది పుష్పములచే హోమముచేసిన ఫలించునని తెల్పిరి. ఆరీతి జపించి పూజించి ధ్యానించెను. దేవి సాక్షాత్కరించెను. ఆదేవి తేజస్సు నలుదెసల వ్యాపించుచుండెను. భక్తవత్సలయగు నాదేవి యిట్లు పలికెను. బాలికా! నాచెలికత్తియలు చెప్పినమా టలు సత్యములు. నీవు నాకుఁ బ్రియసఖివైతివి. లెమ్ము. రమ్ము. నీవాంఛితార్థ మొసఁగెద. స్త్రీరూపముననున్న యర్జునుఁ డా మాటలు విని పులకాంచితసర్వాంగియై బాష్పపూరితనేత్రయై దేవీపాదమూలములపైఁ బడియెను. ప్రియంవదతో నాదేవి యిట్లు పలికెను.

ఓసఖి! ఈతరుణిహస్తమునుబట్టుకొని యీాఱడించి నాచెంతకుం గొనిరమ్ము. నావుడుఁ బ్రియంవద యట్లే యొనరిం పఁబూని యుత్తరసరస్సునకుం గొనిపోయి విధి మీఱక స్నాన ముచేయించి సంకల్పపూర్వముగాఁ బూజచేయించి శ్రీగోకుల కలానాథమంత్రము నుపదేశించెను. గోకులనాథవ్రతమును గల్పోక్తప్రకారము చేయించెను. నీలోత్పలదళశ్యాముని నానాలంకారభూషితుని కోటికందర్పలావణ్యుని రాసరసాకు లుని శ్రీకృష్ణుని ధ్యానింపఁజేసెను. అంత రాధాదేవి యిట్లు పలికెను. ప్రియంవదా! ఈమంత్రజపము పూర్తియగువఱకు నీవు సఖీజనముంగూడి యీాకన్యకను గాపాడుము. అనిపలికి దేవి యదృశ్యురాలయ్యెను. అంత నర్జునుఁడు ప్రియంవదచెప్పి నప్రకార మష్టదళపద్మమును గోరోచనాదులచే నిర్మించి కుంకుమ

చందనంబుల నలంకరించి యం దుపాస్యదైవము నావహింపఁ జేసి పూజించెను. భగవంతుని స్మరించెను. ఆస్మరణమునఁ బ్రసన్నుఁడై శ్రీకృష్ణుఁడు రాధికతో నిట్లు పలికెను. ఓరాధా! ఆస్త్రీరూపధారిణిని బిలిపింపుము. నావిని రాధిక శారదయను సఖిం బిలిచి పిలుచుకొనిరమ్మన నామె యర్జునుని స్త్రీరూపమును బిలుచుకొనిపోయెను. అందు బృందావనమున రత్నమందిరమున సకలగోపీజనపరివృత్తుండగు శ్రీకృష్ణునిం గాంచెను. అంతలోఁ గామార్తయయ్యెను. శ్రీహరి యామెచేయిఁబట్టుకొని విహరించి శారదం గాంచి యీ క్రీడాసరోవరమున స్నానముచేయింపుము. క్రీడాశ్రాంతియడంగునన నామె యట్లే చేయించెను. నీటమునుఁగునంత నర్జునుఁ డయ్యెను.

అంతట విషణ్ణుఁడైనయర్జునుం గాంచి భగ్నమానసుఁ డయ్యెనని తలంచి కరసరోజతలమున దువ్వి యిట్లు పలికెను. అర్జునా! నీమదిలో శ్రీకృష్ణునకు నాకన్న మిత్రుఁడు లేఁడు. రహస్యజ్ఞులలో నేనే ప్రథముఁడ నన్నభావము కలదుకదా. ఏప్రశ్నముచేసితివో, ఏమనుభవించితివో యదియెవరికిం జెప్పకుము. అనిపలికి యదృశ్యుఁ డయ్యెను. అని యుపదేశించి పార్వతిం గాంచి శ్రీకృష్ణపరబ్రహ్మకు విహారస్థానము బృందావనము. రాధాదేవి హృదయేశ్వరి. ఈయాఖ్యానము సకలశుభముల నొసంగునని తెలిపెను.

మహామతులారా! పద్మపురాణోక్తగాథను వింటిరి కదా. రాధాప్రస్తావము కాన దీనిని వ్రాసితిని. పాండవజననము మాత్ర

మే లోపల వ్రాయంబడియె. కృష్ణార్జునమైత్రి తెలుపఁబడలేదు. ఇదెట్లుసరిపడునని ప్రశ్నింపకుఁడు. బృందావనప్రస్తావము ముగింపఁదలఁచి యిట రాధాప్రస్తావము వచ్చినదిగాన దాని ననుసరించినకథ యని యిట వ్రాసితిని. దీనిచే బృందావనము నిత్యవిహారస్థానమనియు శ్రీకృష్ణునకు రాధాదేవి ప్రీతిపాత్రురాలగు పత్నియనియు నీపురాణముకూడఁ దెలుపుచున్నదని తెలుపుకొనుచున్నాఁడను. రాధ యెవ్వతయో యొకపరిచారిక యను దుర్వినీతులకుఁ దెలివిగలుగఁజెప్పుటయే యీకథాఫలము. ఇందొకవిశేషము కలదు. ప్రకృతి నుపాసించి తజ్జన్యవిజ్ఞానమున భగవంతు నెఱుంగవలయు ననునదియే యిటఁ గలవిశేషము.

మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే.

గీత ౭ అ. ౧౪ శ్లో.

అన్నదానింబట్టి భగవంతు నాశ్రయించినంగాని మాయావరణము తొలఁగదు. మాయావరణము తొలఁగినఁగాని భగవంతు నాశ్రయింప వలనుపడదు. కాఁబట్టి యన్యోన్యాశ్రయదోష మిటఁ దటస్థించినది. దీనికిఁ బరిహార మేలాగనిన. తొలుదొలుతఁ బ్రకృతి నుపాసించి తల్లబ్ధజ్ఞానమున భగవంతు నెఱింగి యాపరమేశ్వరుని స్మరించుచుఁ దల్లబ్ధజ్ఞానమునఁ బ్రకృతిస్థితి నెఱింగి దాన భగవత్తత్త్వమును జక్కఁగ నెఱుంగవలయును. దీనిసార మేమన. సగుణబ్రహ్మము నుపాసించి దానఁ గల్గినవిజ్ఞానమున నిర్గుణతత్త్వ మెఱుంగవలయు ననుటయే.

తొలుత నర్జునుఁడు త్రిపురసుందరి నుపాసించెను. దాన భగవంతుఁడగు శ్రీకృష్ణుని నిత్యనివాస మెఱుంగఁజాలెను. కట్టకడపట శ్రీకృష్ణునియుపదేశము వేదసారము. నాకు దెలియనివిషయము లేదన్న యభిమానము మది నుండరాదు. ఉండినచో బడరానిపాట్లు పడవలసివచ్చును. అనునది యర్జునుం డనుభవముచే నెఱింగి బుద్ధిమంతుఁడయ్యెను. కావున నెల్లవా రును దమకుఁ దెలిసినవిషయ మత్యల్పతమమనియు దమకంటె నెక్కువగా నెఱింగినవా రనేకులుందురనియుఁ దలంచి గర్వహీనులైనఁగాని భగవద్దాస్యము లభింపదు. కాబట్టి యహంకార మును వదలినఁగాని భగవద్భక్తి ఫలింపదు. అదిగలిగి చేయు భక్తి లోకవంచనమునకుఁ బనికివచ్చినను దరణోపాయసాధనము కానేరదని యెఱుంగుటయే బుద్ధిమంతులలక్షణము. ఇంతట నీవిషయమును ముగింపవలసియుండియు నట్లుచేయక శ్రీరాధా మహిమను నుదాహరణాంతరమున మీకుఁ దెలుపందలంచి మఱొక్కచిట్టికథను వ్రాసెదను. అప్పటికైన దుర్వాదకులయ హంకారము తొలఁగదా యని యూహించెదను. దాని నవధ రింపుఁడు. దానిచే రాధాదేవి కృష్ణపరమాత్మకు మేనయత్త కాదనియు, నిత్యసన్నిధిగలహృదయేశ్వరియనియు నీమె కీమహాలక్ష్మియను రెండవపేరుగలదనియు, మూలప్రకృతియన రాధాంబయే యనియుఁ దేటపడఁగలదు నిష్పక్షపాతబుద్ధితోఁ బఠింపుఁడు.

## నారదముని రాధాలోకమున కేగి స్త్రీయగుట.

*మహాదేవా! బృందావనచరితమును బహువిధములఁ బ్రశంసించితిరి. ఏకారణమున నారదుఁడు ప్రకృతినిఁబొందెనో వినఁగోరెద నన నీశ్వరుఁ డామెప్రశ్నమును మెచ్చుకొని యిట్లు బదులుచెప్పెను. కాంతామణీ! ఒకానొకకాలమందు నేనునాశ్చర్యవృత్తాంతము నెఱుంగఁగోరితిని. శ్రీకృష్ణుఁడు తనకుఁ జెప్పినట్లు బ్రహ్మ నాకుం దెలిపెను. మఱికొంతకాలమునకు నారదుఁడు నన్నే ప్రశ్నించెను. విస్మయ ట్లమ్మహర్షికిం దెల్పఁ బూని బ్రహ్మను బిలిచి మున్ను నీవు నాకుం దెల్పిన పరమరహస్య కథ నీమునికిం దెల్పుమని యాజ్ఞాపించితిని. నామాటప్రకార మానలువ నారదమునిని దోడుకొని శ్రీకృష్ణునికడకుంబోయి యిట్లు ప్రార్థించెను. మహానుభావా! ద్వాత్రింశద్వనములగు బృందావన మెట్టిదియో వినఁగోరెద. ఆనతీయవే. అన శ్రీకృష్ణమూర్తి సుస్మితపూర్వకముగ నిట్లు వచియించెను. పితామహా! వినుము.

ఈబృందావనము నాకుఁ బ్రియమగుసౌధము. మనోమోదమును గల్గించునది. ఈవనమునందుఁ బశువులు, వృక్షములు, కీటములు, నరులు, దేవతలు మొదలగువా రెవ్వరెవ్వరు నివసించుచున్నవారో వారెల్ల నంతమందు నాచెంత కరుదెంచు

---

* ఇదియుఁ బద్మపురాణమునందలి పాతాళఖండమున డెబ్బదియేనవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడిన దని యెఱుంగునది. ఇకథయుఁ బార్వతీపరమేశ్వరసంవాదరూపమనియు గ్రహింపఁదగును.

వారు. మఱియు నిందున్న గోపికలు యోగినులు. నాపాదపద్మా రాధన ప్రీతలు. ఈవన మైదుయోజనము విశాలముగలది. దేవ తారూపము. పరమామృతవాహిని యగుసుషుమ్నానాడియే యీయమున యని నమ్ముము. ఏసుషుమ్నానాడియందు సూక్ష్మ రూపముల దేవతలు సకలభూతము లుండునో ఆసుషుమ్నయే యిట యమునారూపమున నున్నయది. నేను సర్వతః వ్యాపిం చువాఁడనే యైనను బృందావనమునందు నెక్కుడుప్రీతితో నుం దును. ఆవిర్భావతిరోభావములు (పుట్టుట గిట్టుట) వనమునకు దీనికిం గలవు. ఈవనము తేజోమయమగు నాస్థానము. చర్మ చక్షుస్సుల కది యగమ్యము. ప్రతియుగమునందు నీబృందా వనప్రభావ మతిగుహ్యము. నీవంటివారలకే యిది సులభ ముగాఁ దెలియ శక్యముకాదన నిఁకఁ దక్కంగలదేవతలమాట చెప్ప నేటికి?

అని శ్రీకృష్ణుఁడు చెప్పఁగా విని నారదముని భగవంతు నకు నమస్కరించి భూలోకమునకై మిషవనమునకుం బోయెను. శౌనకాదు లానారదమునిని బూజించి యెందుండి యిపుడు వచ్చితిరో తెలుపుఁడని ప్రార్థించిరి. నారదుఁ డాప్రశ్నమును విని మునీంద్రులారా! నేనిపుడు గోలోకమునుండి వచ్చు చున్నాఁడను. అందు శ్రీకృష్ణునిముఖపద్మమునుండి బృందావన మాహాత్మ్యమును వింటిని. మఱియు నానావిధప్రశ్నములు వేసితిని. వానికి బదులు భగవంతుఁడుచెప్ప మహాద్భుతములు వింటిని. వానినే మీరు యోగ్యులగుట వివరించెద. అన విని

శౌనకమునీంద్రుఁ డిట్లనియెను. మునిచంద్రమా! మాయందుఁ గృప యునిచి బ్రహ్మవచించినయట్లు బృందావనమహిమమును విస్తరించి వచింపుము. శ్రద్ధతో నాలకింతుము. నావిని నారదుఁ డిట్లు పలికెను.

పూర్వ మొకప్పుడుసరయూతీరమునందుమహానివరుండగు గౌతముఁడు నా కగపడియె. అతఁడు మహాదుఃఖిర్యై చింతాకులితచేతసుఁడై యుండెను. నన్నుఁ జూడఁగనే యాముని భూతలంబునఁబడి నమస్కరించి లేవకున్న వత్సా! లెమ్ము లెమ్ము. అని యాఅడిల్లఁ బలికితిని. నీమనోదుఃఖము దెలుపఁదగినదేని తెలుపుమనియు నడిగితిని. గౌతమముని లేచి యిట్లు పలికెను. నారదమునీ! ఇంతకుముందే నీవలన శ్రీకృష్ణతత్త్వము వింటిని. మధురాద్వారకానగరమాహాత్మ్యములనుగూడ వింటిని కాని బృందావనమహిమము నేల్లొకో విననోచనైతిని. దానిని వినినఁ గాని మనస్థైర్యము గలుగఁజాలదు. అన విని నే నిట్టులంటిని. శౌనకా! ఇది పరమరహస్యము. మున్ను నాకు బ్రహ్మ యీవిషయమును దెలిపెను. అత్తఱి నేను నీవలెనే ప్రశ్నించితిని. నాప్రశ్నము విని ముహూర్తము మౌన మూనియుండి యానలుమోములవేలుపు వత్సా! శ్రీ మహావిష్ణువుకడకుం బొమ్ము. ఆ దైవమే నాకుఁ బ్రభువు. నేను నీతోడనే వచ్చెదను. అనిపలికి నన్ను వెంటనిడుకొని పరమాత్మునినివాసమునకుం బోయెను. నీవు నన్నడిగినట్లే నేను దన్నడిగితి నని బ్రహ్మ హరిచెంత విన్నవించెను. భగవంతుఁ డామాటలు విని నలువా! నాయానతి

చేయి నీమునిం దోడుకొనిపోయి బదులు వచింపుము. అమృత సరస్సున స్నానముచేయ నియమింపుము. నావిని బ్రహ్మాయు నన్నట్లే చేయఁబంచెను. నే నాయమృతసరస్సున స్నానముచేసి తిని మునిఁగి లేవఁగనే యోషిద్రూపమున నాసరస్సు నవలిగ ట్టున స్త్రీరత్నములచెంత నుంటిని. సర్వలక్షణసంపన్నమై యప్పటి నాస్త్రీరూప మత్యద్భుతముగా నుండెను. నాకే విస్మయము గలిగెను. నన్నుఁగాంచి యాకాంతామణులెల్ల మరల మరలఁ బ్రశ్నింపసాగిరి. కాంతా! నీవెవ్వతుకవు? ఏల యిచ్చటికి వచ్చి తివి ? నీ చరిత్రము వినవేడుకయ్యెడిని. అని వారు ప్రశ్నింప నే నిట్లు పలికితిని. నే నిందేల ప్రవేశించితినో ఈ యోషిద్రూ పమేల నాకలవడెనో యెఱుంగఁజాలకున్నాఁడను. ఇదంతయు నాకు స్వప్నవృత్తాంతముగఁ దోఁచెడిని. ఇపుడు నేను మూఢుఁ డ నైతిని.

ఇట్లు నేను పలుకఁగా విని యందొక్కలేమ మధురవచ నముల నిట్లు బదులుచెప్పెను. అమ్మా! ఈ నగరము బృందా ఖ్యగలది. శ్రీకృష్ణచంద్రప్రియయైన దీపురము. నాపేరు సులత యని తుర్యాతీతయగు నిష్కలను. అనిపలికి యాదేవి కరుణా పూర్ణమానసయై నన్నుఁజూచి కాంతా! నాతోడ రమ్ము. ఈ కా మినులందఱు శ్రీకృష్ణపాదారవిందపరాయణలు. వీరందఱు నీరాకను గోరుచున్నవారు. అనిపలికి యాదేవి యతిప్రియం బునఁ జతుర్దశాక్షరశ్రీకృష్ణమంత్ర ముపదేశించెను. అంతలో నేను వారివలెనైతిని. ఏవిధమునఁ జూచినను వారికి నాకును

భేదము కనుపట్టదయ్యె. వారింగూడి శ్రీకృష్ణపరమాత్మ యున్న యెడ కరిగితిని. సచ్చిదానందలక్షణుఁడై సనాతనుఁడై సదాత ద్యోషిత్ప్రీతికరుండై యుండెను. నన్నుఁ గాంచినంతనే యాపరాత్పరుఁడు కాంతామణీ రమ్ము. త్వరగా రమ్ము. నన్నుం గౌఁగిలించుకొనుము. అని పిలిచెను. నే నట్లే పరాత్పరుని చెంతకుఁబోయి తత్సేవాపరాయణత్వమునఁ జాలకాల ముంటిని. శ్రీ హరి ప్రియ యగు రాధాదేవింగూడ దర్శించి సేవించితిని. ఇట్లున్న నన్నుం గాంచియొక్కనాఁడు శ్రీహరి యిట్లు పలికెను.

ఇయ్యది నా ప్రకృతి. నారదరూపధారిణియు నీమెయే అమృతసరస్సున స్నానముచేయింపుమని చెప్పినదియు నీమెయే. నీతో మాటలాడినదియు నీమెయే. వినుము. తత్త్వమును వచించెద.[1] నేనే లలితాదేవిని. రాధికయని గానము చేయఁబడువాఁడను నేనే. నేనే వాసుదేవుఁడను. నిత్యుఁడను. కామకలాత్మకుఁడను [2]యోషిత్స్వరూపుఁడను. ఇది సత్యము. సనాతనియగు యోషిన్మణిని నేనే. నారదా! లలితాంబిక యన నేనే యని నమ్ముము. పురుషరూపము ధరించియుండుతఱిఁ గృష్ణనామమున నుందును. కృష్ణునకు లలితాంబికకు భేదమే లేదు. ఇది సత్యము. సత్యము. సత్యము. ఇట్లెవ్వఁడు నాతత్త్వము నెఱుంగునో సమ

---

1 అహం చ లలితాదేవీ రాధికా యాచ గీయతే. అనిమూలము.

2 సత్యం యోషిత్స్వరూపాహం యోషిచ్చాహం సనాతనీ, అహం చ లలితాదేవీ పుంరూపా కృష్ణవిగ్రహా. ఆవయోరంతరం నాస్తి సత్యం సత్యం హి నారద. అనిమూలము.

యమును, మంత్రము నెఱుంగునో అతఁడే సమయాచారసంకే తము నెఱింగినవాఁడు. ఆతఁడు లలితాంబికవలె నాకుం బ్రియ తముఁడు.

ఇది బృందావన మనుపేరుగల నారహాస్యమందిరము. ఈ విషయమును బయలుపఱుపకుము. పశుతుల్యులకుఁ జెప్ప కుము. అని శ్రీకృష్ణమూర్తి చెప్పఁగానే రాధికాంబిక నన్ను సరోవరమునకుం గొనిపోయి స్నానము చేయుమని యాజ్ఞాపించి తాను బరమేశ్వరుచెంత కరిగెను. నేను నాసరోవరంబున మునింగి లేచినంతట యథాపూర్వముగా నారదుఁడ నైతిని. వీణియ నాహస్తమున నుండెను. గానాసక్తి యెప్పటివలెఁ దోఁచెను. నామనస్సున నొకవింత పొడకట్టఁజొచ్చెను. బ్రహ్మకు నమస్కరించి విష్ణుమూర్తిసన్నిధానమునకుంబోయి బ్రహ్మ చెప్పి నవృత్తాంతమును జెప్పక యూరకుంటిని

కావున నోమునిచంద్రా? సుగోప్యవృత్తాంతము నెఱిం గించితిని. నీవును భగవంతునిక్రీడాస్థానము చిత్కలమని తలం పుము. మాతృదోషమునుబోలె దీనిని బయలుపఱుపఁదగదు. అని నారదుఁడు గౌతమునకుఁ జెప్పినట్లు చెప్పితిని. అయోగ్యు లకుఁ జెప్పితివేని శ్రీకృష్ణునిశాపమునకు గుఱియగుదువు. అని పరమేశ్వరుఁడు పార్వతికిం దెలిపెను.

మహానుభావులారా! నారదమునివృత్తాంతమును వింటిరి గదా. ఇది తొలుదొలుత నాశ్చర్యమును గొలుపును. కాని బాగుగ యోజింప నచ్చెరువుగొలుపువిషయ మిందేదియు లేదని

తోఁచును. భగవత్తత్త్వమెఱుంగుదుమని విఱ్ఱవీఁగువారలకు బుద్ధితెలుపుట కీకథ వ్యాసమహర్షి వ్రాసెను. ప్రకృతి చిత్రమే ప్రపంచము. తదారాధనవిహీనులకు భగవత్తత్త్వ మెఱుంగ శక్యమేకాదని నారదునకు శ్రీహరి తెలిపెను. రాధకంటె రుక్మిణి గొప్పదనుదుర్వాదముచేయువారల కిది కంఠపాశము. భగవంతుఁడే.

శ్లో. సత్యం యోషిత్స్వరూపాహం యోషిచ్ఛాహం సనాతనీ,
అహం చ లలితాదేవీ పుంరూపా కృష్ణవిగ్రహా.

అని నారదున కుపదేశించెను. ప్రకృతిని నిశ్చయముగా నేనే. సనాతనియగు యోషిత్స్వరూపమును దాల్తుననఁగా నర్థ మేమి? ప్రకృతి సనాతని. సృష్టిచేయఁదగు సమయమున నేనే స్త్రీస్వరూపమును దాల్తును. లలితాంబ యనుపేరఁబరఁగువాఁడను నేనే. అనఁగా లలితయన్నను రాధయన్నను నొక్కశక్తి యేకాని భేదములేదు. పురుషరూపమున నాప్రకృతియే శ్రీకృష్ణుఁ డనఁబరఁగుననికదా దీనిభావము. అనఁగా రూపనామ క్రియావంత మగునది యెల్లఁ బ్రకృతిస్వరూపమే. భగవంతుఁడు నామరూపక్రియాశూన్యుఁడు. ఇచ్ఛామాత్రమునఁ బ్రకృతి యుదయించి సృజించును. ఈప్రకృతి తత్సన్నిధిబలముననే లోకముల నిర్మించును. లేకయున్న నశించును. అనఁగా భగవదిచ్ఛయే ప్రకృతి యని తేలెను. దానిని దూషించుట యనఁగా భగవంతుని దూషించుటయే. శ్రీకృష్ణా యని పిలిచిన నాపేరు సగుణబ్రహ్మమునకేకదా గలుగును. సగుణమనఁగాఁ బ్రకృతివిశిష్ట

మని యర్థముకదా. సకలబ్రహ్మాండములు ప్రకృత్యధీనములు. ఆప్రకృతి భగవదధీనమున నుండును. ప్రకృతి పురుషులను వేఱు చేయఁబూనుట సూర్యునినుండి యెండను వేఱుచేయఁబూని నట్లే. కావున భగవదనుగ్రహమునకుఁ బాత్రులు కావలయు నన్నచో దేవతాదూషణముచేయరాదని యీకథ మనకుఁ దెలుపుచున్నది.

రాధాదేవి యన నెవ్వతుకయో పురాణము లెట్లు తెలి పినవో కనుఁగొనుఁడు. మూలప్రకృతి యని భగవంతుఁడే తెల్పెను. ఇపుడైన రుక్మిణి లక్ష్మి. రాధ యుంపుడుకత్తియ. అనుదుర్వాదమును వదలుఁడు. పరమేశ్వరియగు రాధను దూషిం చుట యనఁగా భగవంతుని దూషించినట్లే. కాఁబట్టి యిట్టి యసంగతప్రసంగములఁ జేయక భగవతి యగురాధను బూజించి శ్రీకృష్ణసేవాపాత్రుల రగుఁడు. ఇంతకంటెఁ బెంచి వ్రాయఁ బూనక వదలెదను. ఇఁకఁ బ్రకృతకథాభాగమునకు వచ్చెదను. అక్రూరుఁడు శ్రీకృష్ణబలరాములు మధురానగరప్రయాణము చేయుచుండువిషయమును వ్రాసి తదనుబంధముగా రాధా వృత్తాంతమును వ్రాయుచు దాని కనుబంధములగు నర్జుననారద చరిత్రములను వ్రాసితిని. మరల రాధావృత్తాంతమును వ్రాయుటకుఁ జాలకాల మంతరము గలుగును. రాధామాధ వులకు శతసంవత్సరవియోగము కలుగవలసినట్లు శాపము కలదు కదా. దానిఫలము రాధాదేవికూడ ననుభవింపవలసినదే కాని తప్పించుకొన వలనుపడదని కర్మసిద్ధాంతము. భగవదాజ్ఞయే

కర్మసిద్ధాంతము. దానిని భగవంతుఁడుకూడ మీఱఁడు. మీఱఁజాలఁడని కాదు. లోకశిక్షార్థమే దానిని మీఱఁడని గ్రహింపవలయు. రాధాదేవియు నట్లే శాపము ననుభవించును. వారనుభవించుటయే లోకమున కుపదేశించునట్టిది. అదియే స్మృతి. అదియే శ్రుతి. వారిచరిత్రమునకన్న నెక్కుడుప్రమాణము వేఱొకటి కానరాదు. కావున నాశాప మనుభవింప రాధ శ్రీకృష్ణు నెడఁబాసి నూఱువత్సరము లుండును. కావున నాకథ మరలఁ జాలకథల వెనుకఁగాని ప్రస్తావింప వీలులేదు. కావున శ్రీరాధాపరాంబికకు వందనశతము లర్పించి శ్రీకృష్ణపరమాత్మ లోకరక్షణ మేయేచందముల నొనరించెనో భూభారము నేయే పద్ధతుల నడంచెనో వ్రాయఁబూనెదను. మహాత్ములారా! ఇఁకఁ గథ నాలకింపుఁడు. ఈఘట్టమున భక్తవర్యుఁడు లీలాశుకముని రచించిన శ్రీకృష్ణధ్యానశ్లోకమును బఠించి యావల గథ వినుఁడు.

శ్లో. పరామృశ్యం దూరే పరిషది మునీనాం వ్రజవధూ
దృశాం దృశ్యం శశ్వత్త్రిభువనమనోహారి వపుషమ్,
అనామృశ్యం వాచామనిదముదయానామపి కదా
దరీదృశ్యే దేవం దరదళితనీలోత్పలనిభమ్. ౧ ఆ. ౪౫.

మధురానగరమునకు నక్రూరుంగూడి రామకృష్ణులు ప్రయాణముచేయుట.

* ఇట్లు లక్రూరుఁడు రామకృష్ణులంగూడి దివ్యస్యందన

---

* ఇది బ్రహ్మపురాణము ౧౯౪ అధ్యాయమునుండియు, శ్రీకృష్ణజన్మ

ముపై నెక్కెను. గోపికలు గోపకులు బంధువులు లోనగు వారెల్లఁ బరమానందమునఁ గన్నుల నానందబాష్పములు ప్రవహింపఁ జూచుచు వారియెడఁబాటు నోర్వఁజాలక యుండిరి. బంధువులు యశోదాప్రభృతిజనులు శుభగమనమున కంతరాయమని విచారము నడంచుకొని చూచుచుండిరి. క్రీడాసఖులగుగోపకులు పునర్దర్శన మెపుడగునో యని యడుగ వెఱచి దృష్టుల నాగోపాలమూర్తియాకృతిని గఱవుదీఱఁ జూచుచుండిరి. పయనము సాగించినప్పుడు దేవతలు భూభారహరణలీలామానుషరూపా! పరమేశ్వరా! యని వినుతించుచుఁ బూలవానఁ గురియించిరి. దుందుభుల మ్రోయించిరి. అచ్చరలు నాట్యమాడిరి. గంధర్వులు పాడిరి. మహర్షులు ధ్యానించిరి. లోకములకు మంగళమగుఁగాక యని యాశీర్వదించుచు సాధువులానందపరవశులైరి.

అత్తఱి మందగమనమున నరదము సాగెను. అప్పటి గోకులమునఁ బెల్లులేఁగినవికారము వచింప నలవిగాదు. ఎవ్వరికిఁగాని దేహములపై స్మృతిలేకుండెను. ఏపనిచేయవలయునో

---

ఖండము ౭౨ వ యధ్యాయమునుండియు, శ్రీభాగవతము ౩౯, ౪౦ వ యధ్యాయములనుండియు, విష్ణుపురాణము పంచమాంశము ౧౮ వ యధ్యాయమునుండియు, గర్గసంహిత మధురాఖండము ౪ వ యధ్యాయమునుండియు, హరివంశము విష్ణుపర్వము ౨౬ వ యధ్యాయమునుండియు వ్రాయఁబడును. సర్వసామాన్యవిషయము కాక విశేషము లాయాపురాణములనుండి గ్రహించి వ్రాయఁబడును.

ఇపుడేమిచేయుచున్నారో వారే యెఱుఁగఁజాలక యుండిరి. రథము పదియడుగులు నడువఁగనే గోపిక లార్తినొందుచుఁ జూడసాగిరి. అక్రూరుఁ డావృత్తాంతమెల్ల నెఱింగి రథము నించుకవడిగా నడపఁబూనెను. నాలుగువీథులుదాఁటిస్యందనము గోకులమును మీఱెను. చూచుచున్న గోపికలకు రథము కనఁబడక కేతువు కనఁబడెను. మఱియొకక్షణమునకు రథపరాగము దృగ్గోచరమయ్యెను. అప్పటిగోపికలయాతురము వర్ణింప శక్యము కాదు. శ్రీభాగవతమునం దీఘట్టమున.

శ్లో. యావదాలక్ష్యతే కేతుస్తావద్రేణూరథస్యచ,
అనుప్రస్థాపితాత్మానోలేఖ్యానీవోపలక్షితాః. ౩౬.
తానిరాశా నివవృతుర్గోవింద వినివర్తనే,
అహానినిన్యుర్గాయంత్యోవిశోకాః ప్రియచేష్టితమ్. ౩౭

అనివ్రాయఁబడినది. ఈవిషయముననే మహాకవి పోతన తనచమత్కృతిం జూపఁగోరి

చ. అదె చనుచున్నవాఁడు ప్రియుఁడల్లదె తేరదె వైజయంతియ
ల్లదె రథఘోటకాంఘ్రిరజమాదెస మార్గముఁజూడుఁడంచు లో,
నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖులై గములై
వ్రజాంగనల్, గదలక నిల్చి చూచి రటు కన్నుల కబ్బిన యంతదూరమున్.

అనివ్రాసెను. రెండవశ్లోకమునకుఁ బద్యము వ్రాయక వదలుట గోపికల యార్తినింకనువివరింప నిష్టములేక కాఁబోలు నని తోఁచెడిని. గోపికలతహతహపాటు కవివర్యుఁ డెంతచక్కఁ

గాఁ దెలిపెనో పరికింపుఁడు. ఒక్కొక్కమాటయుఁ బట్టరాని తమకము వారికుండినచందమున వెడలఁగ్రక్కుచున్నది. అట్టి గోపికలు మహర్షులంబోలె భగవద్దాస్యమును గోరినవారలే యనిచెప్పుట న్యాయముకాని కామబాణప్రపీడితలై చూచిరని చెప్పుట భావ్యముగాదు. మూలమునందు,

అహాని నిస్యూర్గాయంత్యో విశోకాః ప్రియచేష్టితమ్.

అని చెప్పఁబడినది. విరహాతురలగుకాంతలకు గానము చేయుశక్తి కలుగుననుట పరిహాసాస్పదముగ నుండును. మఱెంత పరితాపము హెచ్చె మన్మథావస్థలలోఁ బదియవదగుమృతి గలుగవలయునేకాని వేఱుగాదు. ఇపుడు భగవంతుఁ డదృశ్యుఁడుకాఁగా నామహాత్మునిదివ్యమంగళవిగ్రహము గోపికల మనస్సునఁబొడకట్టెను. ఆపరమేశ్వరుచర్యలు స్మృతి గోచరముల య్యెను. కాఁగా వానింబొగడసాగిరి. మహానందమునను భవించిరి. శోకము దూరమయ్యెను. కావున సంతోషమునఁ గాలము పుచ్చిరి. ఇదియే నాకామాతురలగువనితలకృత్యములు? ఎంత బుద్ధిహీనుఁడయిన నివి యట్టివే యని యంగీకరించునా. కాఁబట్టి గోపికలేకాంతసేవాపరాయణలు. భగవత్పాదారవిందసమర్పితస్వాంతద్విరేఫలు. కావుననే భగవత్కటాక్షపాత్రతం గాంచఁగల్గిరి. ఇఁకఁ గథకు మరలుదము.

## యమునాజలంబుల శ్రీకృష్ణబలరాము లక్రూరునకుఁ గనఁబడుట.

అక్రూరుఁడు రథము వడివడిం బఱపెను. గోకులము వెనుకఁ జిక్కసాగఁగా యమునానది దూరముగనుండునది

సమీపింపసాగెను. మధ్యాహ్నసమయమగుట నానదీకూలము సుఖధామముగ నుండెను. దానితీరము సకలవిధచ్ఛాయాకుసుమ ఫలమహీరుహామండితము. అందుఁ గూరుచుండిన సంసారతాపము లంటవనుట నిక్కము. శుకపికాదిమనోహరపతత్రిరవము లు చెవులపండువు చేయును. యమునానదీతరంగరంగత్పవమాన బాలకుఁడు మేనసోఁకినంతనే యెట్టి కష్టములైనఁ దొలఁగునన నిఁకఁ గష్టము లెక్కడివి? అంతియగాక యందు శ్రీహరిచరణ సరసిజముల విన్యాసముగలదు. ఆభాగ్య మితరనదీకూలముల యందు లభింపదు. కావుననే యాతీరము భగవద్భక్తుల కేకాంత సేవాస్థానమయ్యెను. దానిచెంతనేకదా బృందావన మలరారు నని వింటిరి. ఇన్ని సద్గుణములు గలవు గనుకనే యది ప్రఖ్యాతిం గాంచెను. వీరిరథ మచ్చటికింబోవునప్పటికిమధ్యాహ్నమయ్యెను. భగవత్కరుణకుఁ బాత్రుండు కావలసినయదృష్ట మక్రూరునకుం గల్గినది. భగవదిచ్ఛయు నట్టిదియే

నదీదర్శనము కాఁగానే యక్రూరుఁడు శ్రీహరిబలదేవులఁ గాంచి కుమారరత్నములారా! మాధ్యాహ్నికకృత్యములు తీర్చివచ్చెద అంతదనుక నిందుండుఁడు. ఈకాళిందీజలముల మునిఁగి భగవత్ప్రార్థన మొనరించెదను. నావచ్చునంతకు నిట నిల్వుఁడు. అని ప్రార్థింప శ్రీకృష్ణబలరాము లట్లే యొనరించి రమ్మనిరి. వారినుండి యనుమతినిగొని యాదానపతి రథంబు నొకశీతలతరుచ్ఛాయనిలిపి కాళిందిని దర్శించి జలంబుల దిగి నిమజ్జన మాచరించెను. విధిమీఱక స్నానమాచరించి నియతుఁ

డై బుద్ధి నేకాగ్రస్థాయినిగా నొనరించెను. మనమునఁ బర బ్రహ్మమును ధ్యానించెను. ఇట్లు యమునాజలములఁ బ్రవేశించి పరబ్రహ్మమును ధ్యానింపఁగనే సహస్రఫణామాలాలంకృతుఁ డగుబలరాముఁ డగపడియెను. కుందమాలాలంకృతగ్రీవుఁడై, వికసిత పద్మపత్రాయతేక్షణుఁడై వాసుకిప్రముఖసకలభుజంగ బాలకపరివృతుఁడై, మహత్తరభుజగరాజసంసేవ్యమానుఁడై, పరిమళమిళితవనమాలావిభూషితుఁడై నీలాంబరమును దాల్చి, మనోహరదేహమున నొప్పారుచు, మణిమయకుండలంబులఁ దాల్చి యమునాజలముల నాబలభద్రుఁడు దృగ్గోచరుఁ డయ్యెను.

ఆయనంతుని యుత్సంగమునందు ఘనశ్యాముఁడై ఎఱ్ఱని రేఖలుగల నయనములు వెలయఁ జతుర్భుజములు గలిగి దేహ మున్నతముగ నొప్పారఁ జక్రాదిదివ్యాయుధముల ధరించి పీతాంబరధారియై విచిత్రహారములు వక్షమున వ్రేలాడఁగా నింద్రచాపములు మెఱుపుతీఁగెలు గలిగినమేఘమా యని యూహింప నవకాశమిచ్చుచు, శ్రీవత్సచిహ్నము వక్షమున మనోహరముగాఁ గన్పడఁ, గేయూరములు కిరీటము నవరత్న ములకాంతుల నీనుచుండఁగా నొప్పుపుండరీకావతంసకుని శ్రీకృష్ణుని దర్శించెను. సనకసనందనసనత్కుమారసనత్సుజా తులు సిద్ధులు యోగులు నిష్కల్మషస్వాంతముల నాపరాత్ప రుని ధ్యానించుచుండిరి. వారెల్ల నందేయుండి నాసికాగ్రమున దృష్టులనిలిపి యుండిరి. ఇట్లు కనఁబడినవారిని బలకృష్ణులఁగా

భావించి యక్రూరుఁడు విస్మితుఁడై మదిలో రథముపైనున్న వీరెట్లు జలములఁజొచ్చి నాకుఁ గనఁబడిరి? అని మాటాడఁ బూనఁగా శ్రీకృష్ణుఁడు వాక్కును స్తంభించెను. ఈఘట్టమున మూలానుసారముగా మనోహరముగానున్న పోతనపద్యముల నిం దుదాహరింప బుద్ధిపొడమెడిని.

ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁడాజలమందుఁ గాంచెస
ద్భాషు సహస్రమస్తకవిభాసితభూషు నహీశు భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీరచమూవిజిగీషు నిత్యసం
తోషు నరోషు నిర్దళితదోషు ననేకవిశేషు శేషునిన్.

సీ. ఆభోగిభోగపర్యంకమధ్యంబున
వలనొప్పు పచ్చనివలువవాని
మేఘంబుపైనున్న మెఱుఁగుచందంబున
నురమున శ్రీదేవి యొప్పువాని
ముసరు తేఁటులు విప్పముఖచతుష్కముగల
తనయుఁ డాడెడిబొడ్డుఁ దమ్మివాని
గదలిన బహుపదక్రమవిశేషంబుల
రవము చూపెడి నూపురములవాని

ఆ. జలజగర్భరుద్రసనకసనందన
సద్విజామరప్రశస్యమాన
చరితుఁడైనవాని సౌందర్యఖని యైన
వాని నొక్కపురుషవర్యుఁ గాంచె.

అని వ్రాసి భక్తిరసమును వెదఁజల్లెను.

ఇట్లు జలములమునింగిన యక్రూరునకు ధ్యాననిష్ఠ యందు బలరామశ్రీకృష్ణులు దర్శన మిచ్చిరి. అక్రూరుఁ డచ్చె రువంది జలములనుండి వెడలి రథము దాపునకు వచ్చెను. ఆస్యం దనముపై నధివసించి వేడుకమై మాటలాడుచున్న యన్నద మ్ములం గన్నులారఁ గాంచెను. ధ్యానమునఁదోఁచిన దివ్యమూ ర్తులంగాక మానవాకారములనే వారిద్దఱు యథాపూర్వము గనే తోఁచిరి వారినిం జక్కఁగాఁ బరికించి మరల నదికింబోయి జలంబుల మునింగి ధ్యానించెను. అపర బ్రహ్మధ్యాననిష్ఠయం దారామకేశవులు మున్నగపడినచందంబున దివ్యరూపముల దర్శన మొసంగిరి. గంధర్వులు, కిన్నరకింపురుషులు, సిద్ధవిద్యాధ రులు గరుడోరగులు శ్రీపరాత్పరరూపద్వయమును గొనియా డుచుండిరి. అక్రూరుఁ డావిధ మెఱింగి తత్త్వమారసి యెఱింగి సర్వవిజ్ఞానమయుండైన యచ్యుతుని నీశ్వరు నిట్లు వినుతించెను

* జ్ఞానస్వరూపుఁడవగు నీకు నమస్కారము. నీమహిమ మెఱుంగరానిది. నీవు సర్వవ్యాపివి. అనేకరూపముల నలరారు వాఁడవు. కాని యేకరూపుఁడవే ఇట్టి నీకు వందనములు. శ్రీ

---

* బ్రహ్మపురాణాంతర్గతాక్రూరకృతకృష్ణస్తుతిః.

చిన్మాత్రరూపిణేఽచింత్యమహిమ్నే పరమాత్మనే, వ్యాపినేనైకరూపైక స్వరూపాయ నమోనమః. ౧. శబ్దరూపాయ తేఽచింత్య హవిర్భూతాయ తే నమః, నమో విజ్ఞానరూపాయ పరాయ ప్రకృతేః ప్రభోః. ౨. భూతాత్మా చేంద్రియాత్మాచ ప్రధానాత్మ తథా భవాన్, ఆత్మాచ:పరమాత్మాచ త్వమేకః పంచధాస్థితః. 3. ప్రసీద సర్వధర్మాత్మన్ క్షరాక్షరమహేశ్వర, బ్రహ్మావిష్ణుశివా ద్యాభిః కల్పనాభిరుదీరితః. ౪. అనాఖ్యేయస్వరూపాత్మన్ననాఖ్యేయప్ర

కృష్ణా! ప్రకృతికంటెఁ బరుఁడవు. జ్ఞానరూపుఁడవు సకలభూతాత్మ కారుఁడవు. సకలేంద్రియస్వరూపుఁడవు. ప్రధానాత్మవు. ఆత్మ

---

యోజన,ఆనాఖ్యేయాభిధాన త్వాంనతో౽స్మి పరమేశ్వరమ్. ౫. న యత్ర నాథ విద్యంతే నామజాత్యాదికల్పనాః, తద్బ్రహ్మపరమం నిత్య మవికారి భవానజః. ౬. న కల్పనామృతే౽ర్థస్య సర్వస్యాధిగమో యతః, తతః కృష్ణాచ్యుతానంతవిష్ణుసంజ్ఞాభి రీడ్యసే. ౭. సర్వాత్మం స్త్వమజవికల్పనాభిరేతై ర్దేవా స్త్వం జగదఖిలం త్వమేవ విశ్వం, విశ్వాత్మం స్త్వమతివికారభేదహీనః సర్వస్మిన్నహి భవతో౽స్తి కించిదన్యత్. ౮. త్వం బ్రహ్మా పశుపతి రర్యమా విధాతా త్వం ధాతా త్రిదశపతిస్సమీరణో౽గ్నిః, తోయేశో ధనపతి రంతకస్త్వమేకో భిన్నాత్మా జగదపి పాతి శక్తిభేదైః. ౯. విశ్వం భవాన్ సృజతి హంతి గభస్తిరూపో విశ్వం చ తే గుణమయో౽య మజప్రపంచః, రూపం పరం సదితి వాచకమక్షరం యత్ జ్ఞానాత్మనే సదసతే ప్రణతో౽స్మి తస్మై. ౧౦. ఓం నమో వాసుదేవాయ నమ స్సంకర్షణాయ చ, ప్రద్యుమ్నాయ నమస్తుభ్య మనిరుద్ధాయ తే నమః. ౧౧. ఇతి

శ్రీభాగవతాంతర్గతాక్రూరకృతకృష్ణస్తుతిః.

నతో౽స్మ్యహం త్వాఖిలహేతుహేతుం నారాయణం పూరుష మాద్య మవ్యయం, యన్నాభిజాతా దరవిందకోశాద్బ్రహ్మావిరాసీద్యత ఏష లోకః. ౧. భూస్తోయ మగ్నిః పవనః ఖ మాదిర్మహానజాది ర్మన ఇంద్రియాణి, సర్వేంద్రియార్థావిబుధాశ్చసర్వే యే హేతవస్తే జగతో౽ంగభూతాః. ౨. నైతే స్వరూపం విదురాత్మనస్తే అజాదయో నాత్మతయా గృహీతాః, అజో౽నుబద్ధ స్సగుణై రజాయా గుణాత్పరం వేద న తే స్వరూపం. ౩. త్వాం యోగినో యజంత్యద్ధామహాపురుష మీశ్వరం, సాధ్యాత్మం సాధిభూతం చ సాధిదైవం చ సాధవః. ౪. త్రయ్యా చ విద్యయా కేచిత్త్వాం వై వైతానికాద్విజాః, యజంతే వివిధైర్యజ్ఞైర్నానారూపామరాఖ్యయా. ౫.

యని పరమాత్మ యని చెప్పఁబడువాఁడవు. ఇట్టి నీకుఁ జేమోడ్పులు. మహానుభావా! శ్రీకృష్ణా! ప్రసన్నుఁడవగుము. బ్రహ్మరుద్రాది

---

ఏకే త్వాఖిలకర్మాణి సన్న్యస్యోపశమం గతాః, జ్ఞానినో జ్ఞానయజ్ఞేన యజంతి జ్ఞానవిగ్రహం ౬. అన్యే చ సంస్కృతాత్మానో విధినాభిహితేన తే, యజంతి త్వన్మయాస్త్వాం వై బహుమూర్త్యేకమూర్తికం. ౭. త్వామేవాన్యే శివోక్తేన మార్గేణ శివరూపిణం, బహ్వాచార్యవిభేదేన భగవన్ సముపాసతే. ౮. సర్వఏవ యజంతి త్వాం సర్వదేవమయేశ్వరం, యే నానాదేవతాభక్తా యద్యప్యన్యధియః ప్రభో. ౯. యేనాద్రిప్రభవా నద్యః పర్జన్యాపూరితా విభో, విశంతి సర్వత స్సింధుం తద్వత్త్వాం గతయోంతతః. ౧౦. సత్త్వం రజ స్తమ ఇతి భవతః ప్రకృతేర్గుణాః, తేషు హి ప్రాకృతాః ప్రోతా ఆబ్రహ్మస్థావరాదయః. ౧౧. తుభ్యం నమస్తేత్వవిషక్తదృష్టయే సర్వాత్మనే సర్వధియాం చ సాక్షిణే, గుణప్రవాహోఽయ మవిద్యయా కృతః ప్రవర్తతే దేవనృతిర్యగాత్మసు. ౧౨. అగ్నిర్ముఖం తేఽవని రంఘ్రిరీక్షణం సూర్యో నభో నాభి రథో దిశ శ్శ్రుతిః, ద్యౌః కం సురేంద్రాసవబాహవోఽర్ణవాః కుక్షిర్మరుత్ప్రాణబలం ప్రకల్పితమ్. ౧౩. రోమాణి వృక్షౌషధయః శిరోరుహా మేఘాః పరస్యాస్థినఖాని తేఽద్రయః, నిమేషణం రాత్ర్యహనీ ప్రజాపతిర్మేఢ్రస్తు వృష్టిస్తవ వీర్యమిష్యతే. ౧౪. త్వయ్యవ్యయాత్మన్ పురుషే ప్రకల్పితా లోకా స్సపాలా బహుజీవసంకులాః, యథా జలే సంజిహతే జలౌకసోఽప్యుదుంబరే వా మశకా మనోమయే. ౧౫. యాని యానీహ రూపాణి క్రీడార్థం త్వం బిభర్షి హి, తైరామృష్టశుచో లోకా ముదా గాయంతి తే యశః. ౧౬. నమః కారణమత్స్యాయ ప్రళయాబ్ధిచరాయ చ, హయశీర్ష్ణే నమస్తుభ్యం మధుకైటభమృత్యవే. ౧౭. అకూపారాయ మహతే నమో మందరధారిణే, క్షిత్యుద్ధారవిహారాయ నమ స్సూకరమూర్తయే. ౧౮. నమస్తేఽద్భుతసింహాయ సాధులోకభయాపహ, వామనాయ నమస్తుభ్యం క్రాంతత్రిభువ

భేదములఁ జెప్పఁబడుచుండును. నిన్నుఁ గనుఁగొనఁజాలను. నిన్నుఁ బొగడఁదరంబుగాదు. నీ వొనరించు కార్యప్రయోజన

---

నాయ చ. ౧౯. నమో భృగూణాం పతయే దృప్తక్షత్రవనచ్ఛిదే, నమస్తే రఘువర్యాయ రావణాంతకరాయ చ. ౨౦. నమస్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయ చ, ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్వతాం పతయే నమః. ౨౧. నమశ్శుద్ధాయ బుద్ధాయ దైత్యదానవమోహినే, మ్లేచ్ఛప్రాయక్షత్రహంత్రే నమస్తే కల్కిరూపిణే. ౨౨. భగవన్ సర్వలోకోఽయం మోహితస్తవ మాయయా, అహం మమేత్యసద్గ్రాహో భ్రామ్యతే కర్మవర్త్మసు. ౨౩. అహం చాత్మాత్మజాగారదారార్థస్వజనాదిషు, భ్రమామి స్వప్నకల్పేషు మూఢస్సత్యధియా విభో. ౨౪. అనిత్యానాత్మదుఃఖేషు విపర్యాసమతిర్హ్యహం, ద్వంద్వారామస్తమోవిష్టో న జానే త్వాత్మనః ప్రియమ్. ౨౫. యథా బుధో జల జలం హిత్వా ప్రతిచ్ఛన్నం తదుద్భవైః, అభ్యేతి మృగతృష్ణాం వై హిత్వాహం త్వా పరాఙ్ముఖః. ౨౬. నోత్సహేఽహం కృపణధీః కామకర్మహతం మనః, రోద్ధుం ప్రమాదిభి స్సాక్షైః క్రియమాణమితస్తతః. ౨౭. సోఽహం తవాంఘ్ర్యుపగతోఽస్మ్యసతాం దురాపం తచ్చాప్యహం భవదనుగ్రహ ఈశ మన్యే, పుంసో భవేద్యర్హి సంసరణాపవర్గ స్త్వయ్యబ్జనాభ సదుపాసనయా మతి స్స్యాత్. ౨౮. నమో విజ్ఞానమాత్రాయ సర్వప్రత్యయహేతవే, పురుషేష ప్రధానాయ బ్రహ్మణేఽనంతశక్తయే. ౨౯. నమస్తే వాసుదేవాయ సర్వభూతక్షయాయ చ, హృషేకేశ నమస్తుభ్యం ప్రపన్నం పాహి మాం విభో. ౩౦. ఇతి

బ్రహ్మపురాణస్తుతియే విష్ణుపురాణమునందును గలదు. కాన మానితిని.

## గర్గసంహితోక్త శ్రీకృష్ణస్తవః.

నమశ్శ్రీకృష్ణచంద్రాయ పరిపూర్ణతమాయ చ, అసంఖ్యాండాధిపతయే గోలోకపతయే నమః. ౧ శ్రీరాధాపతయే తుభ్యం వ్రజాధీశాయ తే నమః,

మిట్టిదని యూహింప శక్యముకాదు. నీనామములం బలుక శక్యముగాదు. కావున నోపరమేశ్వరా! నీకు మ్రొక్కువాఁడను. శ్రీనాథా! నీయందు నామజాత్యాదికల్పన లొనరింప సాధ్యము కాదు. అట్టిబ్రహ్మము నీవు, నిర్వికారుఁడవు, అజుఁడవు, కృష్ణుఁడని, అచ్యుతుఁడని, విష్ణువనిమఱియు నీమొదలగుననేకనామములఁ బొగడఁబడుచుందువు. నీతత్త్వ మిది యని యెఱుంగ బ్రహ్మరుద్రాదులకైన శక్యముకాదన నిఁక నావంటివానికి సాధ్యమగునా? ప్రపంచమే నీస్వరూపము. పరమేష్ఠివి నీవే. పశుపతివి నీవే. యముఁడవు నీవే. ఇంద్రాదులు నీవే. నీవు కాని దీలోకమున నేదియులేదు. సర్వబ్రహ్మాండములు నీస్వరూపములే. నీవు లేనితా వీబ్రహ్మాండముల నేయణువుకూడ లేదు. పరమేశ్వరా! వాసుదేవా! నీకునతులొనరింతు. నాయజ్ఞానమును క్షమింపుము. నన్నుఁ బ్రసన్నదృష్టిం బరికింపుము. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధనామములఁ బొగడఁబడుచుందువు. చతుర్వ్యూహరూపునిగా నిన్నే భక్తులు ధ్యానింతురు. సకలవేదాంగములు నీమహిమమున లేశమునుగూడ వచింపఁజాలకున్నవి. ఇఁక నే నేమని వినుతింతు. నీపాదారవిందములకు వందనబృందము లర్పింతు. నన్నుద్ధరింపుము. నాయజ్ఞానమును దొలఁగిం

---

నమ శ్శ్రీనందపుత్రాయ యశోదానందనాయ చ. ౨. దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే; యదూత్తమ జగన్నాథ పాహి మాం పురుషోత్తమ. ౩. వాణీ సదా తే గుణవర్ణనే స్యాత్కర్ణౌ కథాయాం మమ దోశ్చ కర్మణి, మన స్సదా త్వచ్చరణారవిందయో ర్దృశౌ స్ఫురద్ధామవిశేషదర్శనే. ౪. ఇతి.

పుము. అని బహుప్రకారంబుల వినుతించి కరములు జోడించి భక్తియుక్తుండై యాశ్రీకృష్ణపరబ్రహ్మమును ధ్యానించెను.

ఇట్లు ధ్యానించి వినుతించి మనఃకల్పితపుష్పాదులచేం బూజించెను. అత్తఱి నాతనిమనస్సు విషయాంతరముల వదలి తదేకాగ్రతం గాంచెను. పరబ్రహ్మమునందు విలీనమై యాతని మనస్సు చాలసేపటికి మరలెను. అక్రూరుండత్తరుణమునం దనను గృతకృత్యునిగా భావించెను. జలములనుండి లేచి మహా నందమున మేను గగుర్పాటొందంగా వేగముగా భగవంతుని దర్శింప నరదముకడకుం బోయెను యథాపూర్వముగా నర దముమీందం గూరుచుండి మాటలాడుచున్న యాసోదరులం గాంచెను. విస్మయంబునంగన్ను లొకవిధముగం గానంబడుచుండ మహానంద మనుభవించుమానసమునను న్న యక్రూరుం గాంచి శ్రీహరి మందహాసము మోముతామరయందుం జిందులాడ నోయక్రూరా ! యమునాజలముల నేమే నాశ్చర్యమును గనుం గొంటివా? విస్మయోత్ఫుల్లములగు నీనేత్రము లాయూహను గల్గంజేయుచున్నవి. ఇంత తడవు చేసితివేల ? యమునాజలము మిక్కిలి చెంతనేయున్నదికదా. ఇంతతడవు చేయుట కేదో యొక హేతు వుండవలయును. నావిని యక్రూరుండు కరయుగము జోడించి మహాత్మా ! యమునాజలములలోపల నే నేయాశ్చ ర్యముగాంచితినో యావస్తువే యిట దేహముదాల్చి కనంబడు చున్నది. నాయెదుటనే నిల్చియున్నది. ఈప్రపంచమెల్ల నేపరా త్పరుని యాశ్చర్యరూపమో యట్టి బ్రహ్మాండనాయకునితోటి,

సాంగత్యము నా కిత్తఱిం గల్గినది. కృతకృత్యుఁడను. మహాను భావా! నీవిలాసము లెఱుంగ నాకుఁ దరంబగునే. హరిహర బ్రహ్మాదు లెఱుంగఁజాలరన నిఁక నేనెంతవాఁడను? ఇత్తఱి నే ననుభవించినయానంద మీావల కెవ్వరు ననుభవించియుండరని నావిశ్వాసము. సకలలోకాధిపతీ! ఇఁకఁ బయనము చేయుదుమా. మధురానగరము తమరాకకై వేచియున్నది. అందలిభక్తులు త్వద్దర్శనసుఖ మనుభవింప నున్నవారు. అనిన శ్రీహరియు బల రాముఁడు నట్లే యనిరి.

మహాశయులారా! అక్రూరచరితమున నొక్కగొప్పవిశే షము పొడకట్టెడిని. యమునాతరంగిణిలోఁ గ్రుంకినయక్రూరు నకు శ్రీకృష్ణమూర్తి శేషశాయిగా దర్శనమిచ్చెను అది చిత్ర మని భావించి యతఁడు జలములనుండి లేచి రథమువై పుచూ డఁగా నం దిర్వు రన్నదమ్ములుండిరి. తాను నదికిఁ బోవకమును పున్నట్లే సంతోషమున మాటలాడుచుండిరి. మరల నక్రూరుఁడు జలంబుల మునింగి పరబ్రహ్మమును ధ్యానింప నాశ్రీకృష్ణమూ ర్తియే శేషశయనుఁడై పొడకట్టెను. అంతకుముందే పరమాత్మ గోకులమున నవతరించెనని యక్రూరుఁడు తెలిసికొనియే కంసుని పంపు చేయఁబూనెను. ఆప్రయాణకాలమున నతనియుత్సాహ మునకుఁ బరిమితి లేకుండెను. గోకులమున కరిగి నందుని మందిరమున సుందరాంగమున నలరారు బృందావనక్రీడాలో లునిఁ గాంచి పరబ్రహ్మముగనే వినుతించెను. ఈవిషయముల నాలోచించినచో నక్రూరుఁ డంతకుమున్నే శ్రీకృష్ణునిఁ బరబ్ర

ష్ణామునగా నెఱింగియే యుండెనని స్పష్టమగును. అట్టి యక్రూరు నకు మరల దర్శన మీయనేల యనుప్రశ్నము రాకమానదు. ఈ ప్రశ్నమునకు బదులు చెప్పుటయు నింతగా కష్టముగాదు. ఎట్లన,

లోకమం దేవారికిఁగాని యొకరుచెప్పినమాటయందుఁగాని శాస్త్రమునందుఁగాని విశ్వాసము కుదురును. ఆవిశ్వాసము చాలకాలము నిలువదు. అది ప్రత్యక్షప్రమాణమున దృఢపడవలయును. అటులైన ఆవిశ్వాసము నశింపదు. అట్టిప్రత్యయమును గల్పించుట భక్తులను బావనమతులం జేయుటయు భగవంతునికార్యము. ఆపనినే శ్రీకృష్ణుఁ డిపు డొనరించెను. అక్రూరుఁడు రామకృష్ణుల నరదమున నిలిపి తాను యమునా జలములఁ గ్రుంకి వచ్చెదననిపోయి జలంబుల మునింగి పరబ్రహ్మము ధ్యానించెను. ఆకాలమున నక్రూరునిచిత్తమున శ్రీకృష్ణుఁడే పరబ్రహ్మమన్న దృఢవిశ్వాసము లేదని పొడకట్టును. పరమేశ్వరాంశము శ్రీకృష్ణుఁ డన్న భావము కలిగియుండవచ్చును. అందును రామకృష్ణుఁ లొక్కటియన్న ప్రత్యయ మాతనికి లేదనియుఁ దోఁచును. ఇట్టి వెన్నియో శంకలుండును. అట్టిశంకలఁ దొలఁగించి యక్రూరుని బావనమతి నొనరించి కృతార్థునిఁ జేయవలయునని భగవంతుఁ డూహించెను. కాఁబట్టియే ఆధ్యానమునందుఁ దనసర్వవ్యాపకత్వమును గనఁబఱచెను. రామునకుఁ దనకు నవినాభావసంబంధమని తేటపఱచెను. అనంతునితోడ పైఁ దానుగూరుచున్నయట్లు తాను సాక్షాన్నారాయణమూర్తియై

నట్లు ధ్యానించుచున్న యతని యాత్మయందుఁ బొడసూపెను. అక్రూరుఁ డారూపమునుగాంచి యచ్చెరువందెను. రథముపై నెవ్వరున్నవారని చూచెను. యథాపూర్వముగ సోదరులుండిరి. మరల నీటమునింగి ధ్యానించెను. యథాపూర్వముగా ననంతుని యుత్సంగముననున్న శ్రీహరియే యందుఁ బొడకట్టెను. అప్ప టికి నాతనిబుద్ధియం దొకవిశ్వాసముదయించి దృఢపడియె. వీరిద్ద ఱొక్కతత్త్వమే. ధ్యానగమ్యతత్త్వ మిదియే. నామదిఁగలశం కలఁ బాపఁగోరి భగవంతుఁ డిట్లొనర్చెను ప్రత్యక్షముగఁ జూచుచు వేఱొకరూపము నేల ధ్యానించెద వని సర్వేశ్వరుఁ డీరూపమున దర్శనమిచ్చెను. దాన సకలసంశయములు తొలఁగి పరమేశ్వరతత్త్వ మిదియే. రెండురూపముల బరిణమించినది అని నిశ్చయించుకొనియెను. భక్తులకుఁ గల్గుసందేహముల నీరీతిగనే శ్రీకృష్ణుఁడు నిర్మూలించునని యెఱుంగుట మంచిది. ఇట్లు ప్రత్య క్ష ప్రమాణమున శ్రీహరి యక్రూరునిశంకల నున్మూలింపఁజేయ కున్న నాశంకలు తొలఁగవు. అవి తొలఁగకున్న మనస్సు నిశ్చ లమై యలరారదు. అట్లుగాకున్న నేకార్యము దానిసాయ మునఁజేయ వలనుపడదు.

జలములవెడలి యక్రూరుఁ డరదమున నున్నరామ కృష్ణులం జూడఁగా శ్రీహరి యతనిఁ బరీక్షింపఁగోరి పర మేశ్వరుఁడు,

"కింతే దృష్ట మిహాద్భుతం
భూమౌవా వియతి వా తోయే తథాత్వా లక్షయామహే."

అని ప్రశ్నించెను. అక్రూరుఁడు భక్తినమ్రాత్మకంధరుఁడై,

శ్లో. అద్భుతానీహ యావంతి భూమౌ వియతివా జవే
త్వయి విశ్వాత్మకే తాని కిం మే దృష్టం విపశ్యతః.

అని బదులుచెప్పెను. వీనికిఁ బోతనమహాకవి,

క. నీలోన లేనిచోద్యము
లేలోకమునందుఁ జెప్ప రీశ్వర నీటన్
నేలన్ నింగిని నున్నవె
నీలోఁ జోద్యంబు లెల్ల నెగడె మహాత్మా.

అని వ్రాసెను.

ఇట్లు తనభక్తుఁ డక్రూరుఁడు బదులుచెప్పఁగనే హరి పరమానందభరితుఁడయ్యెను. ఏలన, తనసేవకుఁడు గ్రహింపఁదగినవిషయ మేదో యది కనుఁగొనువఱకు భగవంతుఁ డుపదేశించుచుండు. అది కనుఁగొన్నపిదప నాతనిఁ గాంచి హర్షించుచుండు. ఇదియే పరమేశ్వరుఁడొనరించుకృత్యము.సకలబ్రహ్మాండనాయకునిగా సర్వవ్యాపకునిగాసర్వభూతమయునిగాఁ దన్నెఱుంగుటయే భక్తునిలక్షణము. అది యక్రూరునివిషయమున నెఱవేఱెను. అదియే పరమానందము. ఈవిషయమే భగవద్గీతలయందు.

శ్లో. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వమాస్థితః,
సర్వథా వ_ర్తమానోఽపి సయోగీ మయి వ_ర్తతే. 3౧
౬ అధ్యాయము.

నప్రణశ్యామి నపరోక్షతాం గమిష్యామి. అనిశంకరభాష్యము.

ఏభ_క్తుఁడు నన్ను సర్వస్థలములయందుఁ జూచునో సర్వము నాయందుఁ జూచునో అతనికి నేను దూరమున నుండను. అతఁడు నాకును దూరమున నుండఁడు. సర్వభూతములయందున్న నన్ను నేకత్వమున భజించునో ఆభ_క్తుఁడు యోగియు జ్ఞానియు నగునుగానఁ గర్మత్యాగముచేసినను నాయందే యుండును. అనఁగా యోగనిరతుఁడు జ్ఞాననిరతుఁడు నగువాఁడుబాహ్యకర్మముల వదలినను నాప్రీతికిఁ బాత్రుఁడై నాయందేయుండునని భగవంతుఁడే యుపదేశించినట్లు కనుపట్టు.

దీనిసారమేమి? ఏభ_క్తుఁడు పరమేశ్వరు నొక్కలోకమున నొక్కసుందరమందిరమున నున్నవానిగా భావించునో ఆతనిభ_క్తి స్వల్పఫలప్రదము. విశాలభావ మదికాదు. ధ్యానముకొఱ కొక్కరూపమును గల్పించుకొనవలదా? యన్న నది తొలుదొలుతఁ జేయఁదగుపనియేకాని సదా యట్లే యలవాటు చేయరాదు. చేసిన నక్షరాభ్యాసప్రారంభము నాఁటిస్థితియే యుండును. క్రమక్రమమున భగవంతుని సర్వభూతములయందుండువానిగా భావించు భ_క్తునిభావము విశాలముగాన నాభ_క్తుఁడు పరమేశ్వరుకరుణకుఁబాత్రుఁడై ము_క్తుఁడగు. అనఁగా నదియే. భగవ_త్తత్వ మెఱుంగుమార్గము. సమదర్శనుఁడు

కానిచో ముక్తికిఁ దూరుఁడగును. ఏకత్వమునఁ జూడఁజాలని ధ్యాన మల్పఫలప్రదము. ఇట్లు సర్వజంతువులయందు నున్న వానిగా సర్వేశ్వరుని గాంచఁదగునని శాస్త్రములు ఘోషించుచుండఁగా నిఁక దేవతలయందే భేదముకలదనువానికి భక్తి యెట్లు కుదిరియుండునో వర్ణింప శక్యముగాకుండును. వారికిదియే తొలిజన్మమని చెప్పుటకన్న నింకొక్కమాట చెప్పఁజాలకున్నాఁడను. ఈభక్తియే మతద్వేషముల కాస్పదమని నాతలంపు. సర్వభూతములు భగవత్పరిణామము లన్న విశ్వాసము మదికి లేనిచో నిఁకఁ దద్భక్తి యెట్టిదనవచ్చునో చెప్పఁజాలకున్నాఁడను. ఈకథ యట్టివారి కుపదేశింపఁబూనియున్నది. భగవద్వాక్యమును ఆదరించిరైన భేదబుద్ధిని వదలుట న్యాయమను నీ యొక్కమాటను వ్రాసి కథవైపు మరలెదను. *

అక్రూరుఁడు మధురానగరమున కభిముఖముగా రథమును ద్రిప్పెను. వడివడిగ నశ్వములఁ బురికొల్పెను. భగవంతునిరథము నీడ్చుభాగ్యముగల యాయుత్తమాశ్వములు పవనగతిం బరువెత్తెను. మధురానగరము దృగ్గోచరమయ్యెను. అక్రూరుఁడు శ్రీకృష్ణా! అదె మధురానగరము. ఈజన్మమునకుఁ దొలుత నీ కీపురమే తావిచ్చినది. ఇందే మీతలిదండ్రులమని చెప్పుకొనుభాగ్యముగల దేవకీవసుదేవు లున్నవారు. నీరాకకై

* ఇంతదనుకఁగలకథ శ్రీకృష్ణజన్మఖండమునఁ గాన్పింపదు. ఇఁకమీఁదటికథ దీనిని బ్రధానముచేసికొని తక్కినపురాణవిశేషములం గల్పుచు వ్రాసెదను.

పౌరులు వేచియున్నవారు. మహాత్మా! నను గృతకృత్యుం జేసితివి. ఇఁకఁ బౌరులఁ గృతార్థులను జేయవలయు అని ప్రార్థించెను. ఇంతలో మధురానగరప్రాంతభూమి చక్షుర్గోచరమయ్యెను. అందు జను లౌత్సుక్యతావునఁ గొందఱు కొందఱుగా నిలిచి పరాత్పరునిజూడ నాసించియుండిరి. నందాదులు ముందే యరిగి పురసమీపమున నున్నయుద్యానమున నక్రూరాదుల రాకకై కాచియుండిరి. మార్గమున నరుదెంచు శ్రీకృష్ణునిఁ గన్నుదమ్ము లలరఁ గాంచి జనులు సంతోషార్ణవ నిమగ్నులైరి. వసుదేవసుతుఁ డీమహాత్ముఁడేనా యని యొకరినొకరుగాఁ బ్రశ్నించుచుఁ దమిపోవునట్లు చూచుచుండిరి. అంతట నక్రూరచోదితాశ్వములు స్యందనమును నందాదియదువృద్ధు లున్నయుపవనముకడకుఁ జేర్చెను. కృష్ణాగమనమును గాంచి నందాదు లానందించిరి. అందుఁ గూడియున్న పౌరబృందముల యానందమునకుఁ బరిమితియే లేదు. ఆభూమిభాగము నాతరుణమున వారెల్ల భూలోకస్వర్గమని వినుతించిరి. తమవంటిపుణ్యాత్మకులు లేరని గర్వించిరి.

శ్రీకృష్ణుం డక్రూరుం గాంచి దానపతీ! యని కరము కరమునఁ బెనచి నీ వీరథముంగొని ముందుగాఁ జనుము. మేమిందుండి ప్రాతఃకాలమున నగరమును దర్శింతుము. అనుటయు నక్రూరుండు మోము వెలవెలఁబాఱ మిమ్ము వదలి నేను మధురానగరమును బ్రవేశింపఁజాలను. పరమేశ్వరా! నాథా! భక్తవత్సలుఁడవగు నీవు నన్ను వదలఁదగదు. నాయింటికి రండు. నా

గేహమును బవిత్రముగాఁజేయుము. విశ్వాయన్నను గోపాలకు లనుగూడి మిత్రులు బంధువు లనుసరించిరాఁగా నామందిర మును బ్రవేశించి నీపాదారవిందరజఃకణములఁ బరిశుద్ధము చేయుము. * గృహస్థులమగు మేము కోరఁదగిన దిదియేకదా! నీపాదరజస్సునే పితరులు దేవతలు నగ్నులు వాంఛింతురు. నీ

---

*ఈఘట్టమున శ్రీభాగవతమునకుఁ దెనుఁగుభాగవతమునకును సంబంధమే కానరాదు. బలిచక్రవర్తివిషయమే తెలుఁగున లేదు. భక్తి రసవంతములైయున్నశ్లోకముల వదలుటకుం గలకారణ మరయఁజాలకున్నాఁడను. కొలఁదిశ్లోకముల నిటఁ జూపుచున్నవాఁడ.

శ్లో॥ పునీహి పాదరజసా గృహాన్ నో గృహమేధినామ్
యచ్ఛౌచే నానుతృప్యంతి పితరస్సాగ్నయస్సురాః. ౧౩.
అవనిజ్యాంఘ్రియుగళ మాసీచ్ఛ్లోక్యో బలిర్మహాన్
ఐశ్వర్య మతులం లేభే గతిం చైకాంతినాం తు యా. ౧౪.
ఆపస్తేంఽఘ్ర్యవనేజన్యస్త్రీన్ లోకాన్ శుచయోఽపునన్,
శిరసా దత్తయాశ్శర్వ స్స్వర్యాతాస్సగరాత్మజాః. ౧౫.
దేవదేవ జగన్నాథ పుణ్యశ్రవణకీర్తన
యదూత్తమోత్తమశ్లోక నారాయణ నమోఽస్తుతే. ౧౬.

అను నీశ్లోకములకుఁ బద్యములు గానరావు. ఇవి నిస్సారములా కావు. సారవత్తమములు. వీనివదలిపెట్టుటకుం గలకారణ మేమియో యని సంశయాత్ముఁడ నగుచు వీనిసారమే కాఁబోలు "వ. అని మఱియుం బ్రార్థించిన వారి యిట్లనియె." అనువచనమని తృప్తినొందుచున్నాఁడను మహాకవిభావమే మో యెఱుంగ శక్యముకాదు కదా. బహుశః వారు పఠించియున్నపుస్తకమునం దీశ్లోకములు లేకుండెనేమో యని చెప్పుట సరసమనుట యిప్పటికి సరిపడును. లేకయున్న మహాకవి వదలియుండఁడు.

పాదాబ్జములను దల ధరించి పరమపవిత్రకీర్తిధురంధరుఁడై బలి చక్రవర్తి సాటిలేనియైశ్వర్యమును బొందుటయేగాక యేకాంతి కగతి నొందెను. నీపాదప్రక్షాళనోదకములు ముల్లోకములఁ బావనములుచేసినవి. ఆజలములనే శంకరుఁడు తలధరించెను. ఆయుదకములస్పర్శముచేతనే సగరాత్మజులు స్వర్గమునకుఁ బోయిరి. కావున నోపురుషోత్తమా! నాపై దయయునుపుము. నన్ను రక్షింపుము. కృపాసింధూ! దీనబంధూ! పుణ్యశ్రవణకీర్తనా! వాసుదేవా! నీ కిదె నమస్కారము. అని వినుతింప శ్రీకృష్ణుఁడు చిఱునవ్వునఁ దనయపారకరుణను దెలుపుచు నోయక్రూరా! నేను బలరాముం గూడి యదుచక్రద్రోహి యగు కంసుని వధించి నీయింటికి వచ్చెదను. నీమనస్సంతోషమును గల్గించెద. అనుటయు నక్రూరుఁడు విమనస్కుఁడై శ్రీకృష్ణునను మతిం గైకొని మధురానగరంబుం బ్రవేశించి కంసుని దర్శించి తనపోయివచ్చినవిధ మెఱింగించి యింటికిం జనియెను.

## శ్రీమధురానగరప్రవేశము.

అక్రూరుఁడు పోయినవెనుక శ్రీకృష్ణుఁడు బలరాముం గూడి యదుగణంబులు రాఁగా మధురానగరముచెంత కేగెను. ఆనగరము సురపురవరమును దిరస్కరించినది. కాంతిమంత మగు లోకమువంటి దనఁదగియుండును. చూచినవారు దానిసొబగును మెచ్చుకొనకపోరు. మందిరము లిందుమణివిరచితములే కాని యందొక్కఁడైనఁ జూడ ననర్హముకానరాదు. విశ్వకర్మ సృజించెనుగాన దానిసొబగు అనన్యయాలంకారము బోలియుం

డును. ప్రతియింటిపై నమూల్యరత్నకలశము లమర్పఁబడియుం డును. అవ్వి నిరుపమప్రకాశములు. రాజమార్గము లతివిశాల ములు. జనసంబాధారహితము లగున ట్లమర్పఁబడియుండును. విపణివీథులు రాజాజ్ఞచే మిగుల సొంపుగ నమర్పఁబడియుం డును. కొన్ని చంద్రాకారములు. మఱికొన్ని చంద్రకాంతమణి సారవిలసితములు.ఇంకనుగొన్ని మణిగణనిర్మితములు. మఱియుఁ గొన్ని విచిత్రవస్తు ప్రతతివిస్తృతములు. ఆయంగడులయందు వణిజులు మనోహరాకారములఁ గూరుచుండియుండురు. సురు చిరపదార్థములే యం దమర్పఁబడియుండును. ఆపురమున నం దందు సరోవరములు వెలయుచుండు. నిర్మలోదకము లందుఁ గనుపట్టు. వానియం దరవిందములు వెల్లివిరియుచుండును. ఆస రస్సులసోపానములు విమలేందుపాదవినిర్మితములు. అందందుఁ బ్రతిమ లమర్పఁబడియునుండు. ఇంకను వర్ణనార్హములగు సకలపరికరములుండున ట్లానగరోత్తమము నిర్మింపఁబడినది. కావుననే పరాత్పరుం డం దుదయించెను. ఆపుణ్యమాకాలమున వేఱొకనగరమునకు లభించునా?

ఆనగరమున శ్రీకృష్ణునియాగమనము విన్నతోడనే నారీ మణులు సౌధోపరిభాగముల నిలువంబడిరి. వారియలంకార వస్తువులు రత్నసారవినిర్మితములు. వారియంద మింత యనరాదు. రత్నాలంకారాలంకృత గానియువతీరత్న మాగుంపులో లేద నియే చెప్పవలయును. వారెల్లఁ బద్మినీజాతికాంతలు. సుస్థిర యౌవనవతులు. వారి కప్పుడు నిమేషములు లేవు. ఆచూపులు

పరమేశ్వరసందర్శనాతురతను జూపుచుండెను. అక్షతలు లాజలు పరిమళశుభకుసుమములు వారిచేతులలో నుండెను. ఊర్ధ్వవదనలై యపుడుండిరి. శ్రీకృష్ణమూర్తిసందర్శన మెపుడో యన్న వాంఛ వారిమది నున్నట్లు వారిస్థితియే చెప్పక చెప్పుచుండెను. క్షణమున కొక్కమాఱు భ్రూభంగవిలాసములఁ గనఁబఱచుచుఁ జంచలనయనముల వారరుదుగఁ జూడఁబడుచుండిరి. ఒక్కొక్కతఱి వారిమనస్సులు వారియధీనమున లేకుండెను. వారియవయవములు శాస్త్రప్రకార మమరియుండెను. రోమరాజి మనోహరము. ఎపుడెపుడు శ్రీహరిని దర్శించి నేసలు చల్లి సంతసింపఁజేయుదుమా యనునూహలు వారిఁ బురికొల్పుచుండెను.

వీథులయందు రత్నమయయానములు గుంపుగా నమరియుండెను. అవి పలుభంగుల రంగుల రంగారుచుండెను. నానాప్రకారసంపద లానగరమున నిలిచినట్లే యుండెను. ఆపురవరము నలుదెసల నుద్యానములు పెంపఁబడచుండెను. అందు నిరంతర పుష్పవిరాజిత లతావితానవిశేషము లుండెను. సర్వదా వసంతర్తువే యాతోఁటల నివసించెనని చెప్పఁదగినట్లుండెను. ఆపుష్పములు మకరందసరోవరములు. అందు ఝుంకారముల వెలయుచు మధుపములు తిరుగుచు మధువు లానుచుండును. ఇట్టి లానగరతల్లజంబు చూచువారలకు నుల్లాసంబుఁ బుట్టించుచుండును.

మఱియు నామధురానగరంబుచుట్టును ప్రాకారములు

శత్రుజనదుర్గంబులై యెట్టిగట్టిప్రయత్నములచేనైన భేదింపసాధ్యము కాకయుండును. వానిని వీరభటులు కాచుచుందురు. సకలాస్త్రశస్త్రము లందం దమర్పఁబడియుండు. ఆభటులెల్ల శస్త్రాస్త్రవిద్యానిష్ణాతలు. అట్టాలకము లాప్రాసాదపంక్తుల లెక్కకుమిఁచియుండు. ఇట్టులుండియు నాప్రాకారముల వరుసచూడ నందముగాఁ గనుపట్టుచుండు. భగవంతుఁ డీనగరమున మానవతనువును దాల్చియుండఁగలఁడని యెఱింగియే విశ్వకర్మ మున్నే విచిత్రరీతుల నాప్రాకారాదుల నిర్మించెను ఇట్లు సర్వవిషయముల మెచ్చఁదగియున్న యానగరతల్లజమును గనులలోచనుఁడు కాంచి హర్షించెను. అంతకన్న నదృష్టమన నేది? భగవంతున కానందమును గల్గించినపదార్థమే సత్పదార్థము. అదియే సర్వజనశ్లాఘాపాత్రము. దానినినిఃంచిన యదృష్టముగల వస్తువులే ప్రపంచమున లేదని యెన్నఁదగియున్నయది.

ఇట్లు మధ్యాహ్నముమీఱఁగాఁ బంకజాక్షుఁడు శ్రీకృష్ణపరమాత్మ బలరామునింగూడి తమవారి నెడనెడ రానియోగించి నగరమును బ్రవేశించెను. భగవద్దర్శనమును గోరువారందఱు కన్నులారఁ గాంచసాగిరి. పురంధ్రీలలామలు పూలఁజల్లి కృతకృత్యలైరి. అందుఁ గొందఱు నిర్నిమేషలోచనలై చూచి యానందబాష్పములు చూపున కడ్డము కల్గింప దూషించుకొనసాగిరి. గవాక్షముల దాఁటి శ్రీహరిపోఁగాఁ జూడఁదగినయవకాశము లేకపోయెనే యని కొంద ఱిందువదనలు పరితపించిరి. చక్షుఃఫలమన నీదివ్యమంగళాకారమేకదా యని

కొందఱు మందయానలు ప్రమోదించిరి గోకులమున నివసించు నారీమణు లెంతపుణ్యముచేసిరో కదా యని మఱికొందఱు సుందరులు సంతుష్టస్వాంతలైరి. మహామునిహృదయపంకజమున నుండునీపాదము లీకఠినభూభాగమున నెంతశ్రమపడుచున్నవో కదా యని కొందఱు భామినులు చింతిల్లిరి. నేఁటి కీనగరము కృతార్థతం గాంచెనని యెల్లవారు సంతసించిరి. ఈ ఘట్టమున మహాకవిపోతన,

ఉ. నందతపఃఫలంబు సుగుణంబులపుంజము గోపకామినీ [మఁల్
బృందమునోముపంట సిరివిందు దయాంబుధి యోగిబృంద
డెందములందుఁ గోరెడికడిందినిధానము చేరవచ్చెనో
సుందరులార రండు చని చూతము కన్నులకోర్కిదీఱఁగన్.

సీ. వీఁడచే రక్కసి విగతజీవఁగఁ జన్నుఁ
బాలు ద్రావిన మేటిబాలకుండు
వీఁడచే నందుని వెలఁదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు
వీఁడచే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁడచే యలయించి ప్రేతలమానంబు
చూఱ లాడినలోకసుందరుండు.

తే. వీఁడు లేకున్నపుర మటవీస్థలంబు
వీనిఁబొందనిజన్మంబు విగతఫలము

వీనిఁ బలుకనివచనంబు విహగరుతము
వీనిఁ జూడనిచూడ్కులు వృథలు వృథలు.

మ. చెలియా గోపిక లీకుమారతిలకున్ జింతించుచుం బాడుచున్
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షించుచున్ హ
స్తగా, మలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొం
దఁగాఁ,దొలిజన్మంబున నేమినోచిరొ కదే దుర్గప్రదేశంబులన్.

అని శ్రీకృష్ణుని వర్ణించి కృతకృత్యుఁ డాయెను.

శ్లో. ఊచుః పౌరా అహో గోప్య స్తపః కి మచరన్మహత్,
యా హ్యేతా వనుపశ్యంతి నరలోకమహోత్సవౌ.

అనునదియే పైపద్యములకు మూలము. పద్యమున నొక కాంత వేఱొకయువతితోఁ జెప్పినట్లు కనుపట్టు. మూలమున నీ యర్థము కానరాదు గాని దీనిలో సహస్రాంశము కనఁబడియెడిని. ఈపద్యమున కిట్లర్థము గ్రహింపఁదగు గోలోకమునుండి భగవత్సేవార్థము గోకులమున జన్మించిన కాంతలు బాలరూపమున నొప్పారు నీపరమేశ్వరునిఁ దలంచుచు, గుణగణముల గేయములుగాఁ బాడుచుఁ బరస్పర మీపరంధాముని తత్త్వ మిట్టిదని చర్చించుకొనుచు నీమనోహరాకారుని స్పృశించుచు, మనకంటె నదృష్టవంతులుగలరా యని నవ్వుచు, నిరవధికప్రేమమున నా పూజఁగైకొనుము,నాహృదయపీఠమున నిల్వుము, నాకుదర్శన మిచ్చుచుండుమని చేయిపట్టిలాగుచు నఱచేతిలోని యుసిరికకాయఁబోలి విహారవస్తువుగా ననఁగా నంతసులభునిగాఁ జేసి సదా పమ్మోదమున నోలలాడుచుందురు. చెలీ! వీరు తొలిజన్మమున

నేమినోములు నోచిరోకదా. మహారణ్యముల నివసించి యెట్టి తపస్సుచేసిరోకదా.

ఈయర్థము గ్రహింపఁబడకపోయిన భగవన్మహిమమును దగ్గించినట్లే యగు. వనితలు భగవంతు ననురాగమునఁ బూజింతురు. మహామునులు ధ్యానమున నర్చింతురు. రెండును సమానములేగాని యొకటి హెచ్చు వేఱొకటితక్కువ యనుభేదము లేదు. పూర్వజన్మమున గొప్పపుణ్యము చేసియుండకపోయిన నీజన్మమున నిట్టి యుత్కృష్టభాగ్యము లభింపదనుట సిద్ధాంతము. దీనిచేఁబునర్జననముకలదని స్పష్టమగు.ఇందు మఱియొకవిశేషము కలదు. దుర్గప్రదేశంబున నేమినోచిరో యని కనుపట్టుఁగదా. తపమునకు నిర్మనుష్యప్రదేశము ప్రధానము.కాననే "ఏక స్తపః" అనున్యాయముగలదు.మృగగణాకీర్ణములై మనుష్యసంచారము లేనితావులు తపమున కర్హములు. ఏలయని ప్రశ్నము. భయంకరమృగములయందుఁ గోపముగలుగుట వాని నశింపఁజేయుట శక్తిలేనిచో వానినాశమునుగోరుట లోకస్వభావము. తపోనిరతిగలవాని కట్టిభావము లుండరాదు. ఉండినచో నాతపము సఫలముకాదు. అరణ్యముల నివసించి క్షుత్పిపాసలకోర్చి యదృచ్ఛాహారమునఁ దృప్తినొంది భూశయనమున కలవాటుపడి ప్రాణాపాయమును గల్పించు మృగములయందుఁగూడఁ బ్రేమము గలిగి సర్వభూతాంతర్యామి యగుపరమేశ్వరుని వానియందును జూచుచు సర్వసముఁడై వర్తించునట్టి యలవాటుగలిగినఁగాని జ్ఞాని కాఁజాలఁడు. అట్టియుత్కృష్టజ్ఞానము గలిగినఁగాని

భగవత్కటాక్షముగలుగదు. అదిలభించినఁగాని ముక్తిదొరకదు. తపఃఫలమన ముక్తియేకదా. కావున దుర్గమ ప్రదేశములు తపోయోగ్యములయ్యె. ఏమహాముని తపశ్శక్తి క్రూరజంతువులు సాధుజంతువులగునో పరస్పరద్వేషము మాని హస్తిమృగేంద్రములు తోఁడబుట్టువులువలె నుండునో యట్టి యాశ్రమమే తపోయోగ్యము, ఆమహర్షి యేసమదర్శనుఁడు భగవంతుఁడాతనిఁబ్రేమించిన ట్లితరులఁ బ్రేమింపఁడు. కావునఁ దపఃపరీక్ష యిదియే. ఇదియే యీపట్టున గ్రహింపఁదగినవిషయము. ఇఁకఁ గథను వినుఁడు.

మధురానగరమును శ్రీకృష్ణబలరాములు ప్రవేశింపఁగనే నగరలక్ష్మి భగవంతు నారాధించెను. ఆపూజకుఁ బతివ్రతలనయనములు, హృదయములు పుష్పములు. వారియానందము నైవేద్యము. వారియాదరణమే వినుతి. సకలోపచారములు వారి మంచివాంఛలే. ఇట్టిపూజ యింకొకటిగలదా యన్న లేదనక తప్పదు. సద్భావమున భగవంతు నారాధించుటయే ప్రధానము కాని పుష్పములు నైవేద్యములు ప్రధానములుకావు. భక్తిలేనిచో నవి నిష్ఫలములు. కాఁబట్టియే,

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః."

అన్నగీతోక్తి కలిగెను. "ప్రయతాత్మనః శుద్ధబుద్ధేః" అని భాష్యము. ఏకోరికలు కోరనిబుద్ధియే పరిశుద్ధబుద్ధి. అదిగలిగిననే భక్తిపరిపూర్ణమగును. అట్టివానినే భగవంతుఁడు ప్రేమించును.

తనలోఁ గలిపికొనును. కావున జితేంద్రియుఁడై నిష్కామభక్తి గలిగి సర్వభూతదయాపరుఁడై సర్వము భగవన్మయముగాఁ జూచుచు నుండువాఁడే భగవద్భక్తుఁడు. ఇట్టిజ్ఞానముకలుగుటకుఁ దపస్సు ప్రధానము. దానికిఁ దగినభాగములు దుర్గమారణ్యాదు లని తెలిసినది. ఆర్యులార! వింటిరా ముక్తిమార్గ మెంత కష్టదాయకమో "కష్టీఫలీ" యని మీ రెఱుఁగుదురుకదా.

ఇట్లు కృష్ణబలరాముల దర్శించి జనులు మహానందమున నోలలాడిరి. మథురానగరమున రాజమార్గమున భగవంతుఁడు కొలఁదిపాదములు భూతలమును బవిత్రముచేయనిడుచుఁ బయనము సాగించుచుండెను. చూచువారందఱు కృతకృత్యులమైతిమని భావించిరి. ఒక్కరికైనను దద్దివ్యదర్శనఁ దృప్తికలుగకుండెను. సాధువులందఱు పరమేశ్వరునిలీలామానుష దేహమును గాంచి,

శ్లో. హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే
హేకంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ
హేరామానుజ హేజగత్త్రయగురో హే పుండరీకాక్ష
మాం, హేగోపీజననాథ పాలయ పరం జానామి న
త్వాం వినా. ౧౦౮. శ్రీకృష్ణకర్ణామృతము-౨ ఆ.

అని వినుతించి ధ్యానింపసాగిరి. ఆనాఁటి మథురానగరవాసులయానందసాగరవశ్యమునకు మేర లేకుండెను * ఎల్లెడల-

శ్రీకృష్ణజన్మఖండమునఁ దోలుత మథురానగరమునఁ గుబ్జ కనఁబడఁగా జానికి ముక్తిని బ్రసాదించినట్లున్నది. శ్రీభాగవతబ్రహ్మవిష్ణుపురాణముల

శ్రీకృష్ణధ్యానమే. ఎల్లతావుల భగవద్గుణవర్ణనమే. ఎల్లకడల శ్రీగోవిందచరణారవిందసందర్శనకుతూహలమే. ఎల్లహర్మ్యములందు శ్రీకృష్ణదివ్యనామసంకీర్తనమే. ఇట్లుల్లసిల్లుపురతల్లజమునందు శ్రీకృష్ణమూర్తి విహరింపసాగెను. బలరాముఁడును మనోహరముగాఁ గేళిసల్పునట్లు నడచుచుండెను. మనోహరాకారముల సుస్మితాననముల జలరుహాక్షులనొప్పారు నాయిద్దఱు సోదరులు మందమంద గమనంబుల రాజమార్గమున నడువసాగిరి.

## రజకముక్తిప్రదానము.

ఇంతలో నొకరజకుఁడు నగరద్వారమునుండి వచ్చుచుండెను. వాఁడే కంసునకు వస్త్రముల నుదికియిచ్చువాఁడు. వస్త్రములఁ జిత్రవర్ణములుగాఁ జేయుటయం దాతనికి శక్తిగలదు. కాననే యతఁడు కంసునిమనస్తుష్టికిఁ బాత్రుఁడాయెను. దానన తఁడు గర్వించె ననుట యొకచిత్రవార్త కాదు. వాఁడెవ్వనినే లెక్కసేయఁడు. రాజగృహప్రవేశముగలవారందఱిని గర్వరూపభుజగము కఱచుచునే యుండును. దాన వారికిఁ బరవశత్వము గలుగుచుండును. ఆమత్తున వారితరులఁ దృణీకరింతురు. రాజగృహప్రవేశము గల్గింపక యడ్డుపెట్టుదురు. వారు తమ రశ్వత్థామలవలెఁ జిరకాలజీవులని భావింతురు కాఁబోలు. ఈదురభ్యాసము పూర్వకాలమునందును గలదు. ఇప్పటికిని సనాత

---

యందు హరివంశగర్గసంహితలయందు రజకవధము ముందొనరించి నట్లున్నది. కాన నేదిముందు వ్రాసిన నొక్కటియే. అటుతాట దోలుదోలుత రజకవధాదులు వ్రాసెదను.

నాచారములలో క్షీణింపని యాచార మిది యొక్కటియే ఏలాటిమార్పులు లేక యీదురాచారపిశాచిక యాడుచున్నది. దానిని జాలమంది యాదరించుచున్నారు. కాఁబట్టి చ్యుతి గాంచకున్నది. ఈఘట్టమున శ్రీభాగవతమునందు.

రజకం కం చిదాయాంతం రంగకారంగదాగ్రజః,
దృష్ట్వాయాచత వాసాంసి ధౌతాన్యత్యుత్తమాని చ.

అని కనుపట్టెడిని.

వస్త్రాణాం రాగమపి కుర్వన్ రంగకారః. అని వ్యాఖ్య.

భ్రమమాణౌ తు తౌ దృష్ట్వా రజకం రంగకారకమ్.

అని బ్రహ్మపురాణము.

తతోదదర్శ రజకం బిభ్రంతం వస్త్రపుంజకం.
అహంకృతిబలిష్ఠంచ సతతం యౌవనోద్ధతమ్.

అని శ్రీకృష్ణజన్మఖండము.

ఆరజకుఁడు నిర్భరయౌవనోద్ధతుఁడు. వస్త్రములఁ గంసున కీయఁబోవువాఁడు. వానిం గాంచి శ్రీకృష్ణమూర్తి రజకా! మాకు నిర్వురకు నుచితములగు నంబరంబు లొసంగుము. మే మందులకుఁ బాత్రులము. ఈవస్త్రదానమున నీకుఁ బరమశ్రేయము కలుగఁగలదు. సంశయములేదు. అని యాచింప గర్వించినవాఁడు కావున నారజకుఁడు పరిపూర్ణుఁడు పరాత్పరుఁడు నిర్వికారుఁడు లీలామానుషవిగ్రహుఁడు నగు శ్రీకృష్ణుఁడు యాచించువాఁడని తెలియక కోపావిష్టమతియై యాక్షేపో

క్తులఁ బల్కుసాగెను. పూర్వసుకృతము వానికిం గలదు గాని యది మూఢతఁ జేసినది. కాఁబట్టి నిర్మలజ్ఞానము నీఁజాలకపోయెను. భగవద్దర్శనభాగ్యము లభించినను సత్కరించుభాగ్యము మాత్రము వానికిఁ గల్గలేదు.

మీరు పర్వతములయందు నడవులయందుఁ జరించువారు. సదా మీ రందే యుండువారు. మీ రిట్టివస్త్రములఁ గట్టియుంటిరా. ఇవి రాజార్హములు. రాజద్రవ్యముల యాచింపఁదగదు. ఇంతమాత్ర మెఱుఁగరా. మీ కిది కట్ట నర్హములగునే. మూర్ఖులారా! ఇఁక మాటాడక పొండు. జీవింపఁదలంచితిరే నిట్లు ప్రార్థింపకుఁడు. రాజకులజనితులు మీవంటియవివేకులను గట్టివేయింతురు. కొట్టింతురు. సర్వస్వమును గైకొన భటుల కాజ్ఞాపింతురు. దుష్టుల నిట్లు లోనరించుట వారియాచారము. కాన మీరు నిట్టి యవివేకపుఁబల్కులు పల్కక యూరక పొండు జాగ్రత్త! ఇంకొక్కపర్యాయ మిట్లు మాటలాడిన మీ ప్రాణములు దక్కవుసుఁడీ అని *మఱియు నిట్లు పలికెను. నీవు గోపాలకుఁడవు. గోపజనులు నిన్నుఁ బెద్దసేయుదురు అంతియగాక నీవు గోపకన్యాలోలుఁడవు. అంతమాత్రమేగాక తద్విషయలంపటుఁడవు. నీవు విహరించుతావు అరాజకమగు బృందారణ్యము. కావున నీకు యుక్తాయుక్తపరిజ్ఞానము తక్కువ. దాననే యిట్లు యాచించితివి. మా రాజేంద్రుఁ డీపుర

*ఇటనుండి శ్రీకృష్ణజన్మఖండమునుండి వ్రాయఁబడును. ముఖ్యవిషయముందుఁగలదు.

మునసే యున్నవాఁడు. దుష్టశిక్షకుఁడు. ఆలస్యముచేయక దురాత్మకుల దండించును. కాఁబట్టి నీ పూరకపోమ్ము.

అనుమాటలు విని వానియజ్ఞానాంధకారమును దలంచి నవ్వెను. బలదేవుఁడు నక్లే నవ్వెను. కృష్ణానుచరు లగుగోపా లకులు పరిహసించిరి. అంత శ్రీకృష్ణపరమాత్మ యాతనిపుణ్యము ఫలించెనని యెంచెంగెను. ఆలస్యముచేయఁగూడదని భావించెను. గోలోకమున నీతనికి నుండఁదగుస్థల ముండు నెంచెంగెను. ముక్తి ననుగ్రహించి వాని నీలోకదుఃఖమునుండి పాపనిర్భయించెను. కరతలప్రహారమును శిరమున కర్పించెను. దానవాఁడు విగతజీవుఁడయ్యెను. అతని ముడియలో నున్నవస్త్రములఁ దానును బలరాముఁడు ధరించిరి. మిగిలినవి సహాచరులగుగోపకుల కీయ వారు ధరించిరి. శ్రీహరిరాములు వస్త్రముల ధరింపఁగనే గోలోకమునుండి దివ్యవిమాన మరుదెంచెను. దానిపై నారజకదేహాంతర్యాతజీవుఁడు నిజరూపమునఁ గూరుచుండెను. పార్షదు లాతని గౌరవించిరి. దేహ మావిమానస్పర్శమున దివ్యతమ మయ్యెను. నవయౌవన మలరారసాగెను. పీతవస్త్రము లాతనితనువున విలసిల్లెను. పీతాంబరుఁడై సస్మితవదనుఁ డగునాశ్యామసుందరుని ధ్యానించుచు నతఁడు గోలోకమున కరిగెను. అందుఁ బార్షదులలోఁ దా నొక్కఁడుగ నుండెను. శ్రీకృష్ణమూర్తి యెప్పు డరుదెంచునో యనునూహ యాతనికింగల్గెను. తదారాధనమున నాసక్తి యతనికిఁ బ్రతిక్షణము ప్రబలుచుండెను.

ఆర్యమహాశయులారా! మధురాప్రవేశము కాఁగానే రజకవధ మనుతొలిమంగళమును భగవంతుఁడు కొనసాగించెను. ఆవృత్తాంతమును బఠించితిరి. ఇం దొక్కవిశేషలేశము గలదు. రజకుని శ్రీకృష్ణుఁ డఱచేత శిరమునఁ బ్రహరించెను. దాన నాతఁ డీల్గెను. ఇది యన్నిపురాణములయం దేకరీతిగాఁ జెప్పఁబడినది. గోలోకగమనముమాత్రము శ్రీకృష్ణజన్మఖండమున నే కనుపట్టెడు. దీనిసారమును బరికింపుఁడు. భగవంతుఁడు కరతలమును శిరమున నునిచెను. గురువు శిష్యునకు నఱచేయి శిరమున నునిచి యుపదేశించును. హస్తమస్తకసంయోగమని యుపదేశమునకుఁ బేరుగలదు. ఇది క్రొత్తవిషయముకాదు. సర్వజనవిదితవిషయమే. శ్రీకృష్ణుఁడు కరతలమును శిరమున (బ్రహ్మరంధ్రస్థానమున)నునుపఁగనే యందున్న పరమకళ తత్స్పర్శమాత్రమున నిర్మలమై లేచెను. ఆస్థలమునకు సహస్రారమని పేరు. అందు భగవతి భగవంతుం గూడియుండును. ఆస్థలమును భగవంతుఁడే కరతలమున స్పృశించెను. ఇఁక నిందుండ నవసరము లేదని హెచ్చరించెను. అందున్నదియు నీస్పృశించినదియు నొక్కభగవంతుఁడే. ప్రకృతివిశిష్టుఁ డందుండి లేచెను. స్వస్థానమును జేరెను. ఈవిషయము శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు సౌందర్యలహరియందు విశదీకరించిరి.

శ్లో. మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహాం
స్థితం స్వాధిష్ఠానే హృదిమరుతమాకాశముపరి
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వాకులపథం

సహస్రారే పద్మే సహరహసి పత్యా విహరసి. ౯౯

దీనిసార మిది. మూలాధార స్వాధిష్ఠానమణిపూరకానాహతవిశుద్ధాజ్ఞాత్మకములు షట్చ్రక్రములని సిద్ధాంతము. ఇవి పృథివ్యగ్నిజలపవనాకాశమనస్తత్వాత్మకములు. ఇవి యాచ్ఛక్రములయందుఁ దన్మాత్రభావముల నుండును. తన్మాత్రలనఁగా గంధరూపస్పర్శరసశబ్దాత్మికలు. ఆజ్ఞానచక్రముననుండు మనస్తత్వముచేతఁ బదునొకం డింద్రియములు గ్రహింపఁబడినవి. ఇవియే యేకవింశతితత్త్వములు. మూలప్రకృతి సహస్రారపద్మపత్రమునందు నేకాంతమున నాథుండగు విరాట్పురుషుంగూడి విహరించుచుండును. దీనిచే నాల్గుతత్వములు సూచింపఁబడును. అవి మాయాశుద్ధవిద్యామహేశ్వర సదాశివాత్మకము లగు తత్వములు నాలుగని భావము. వీనింగలిసి యిరువదైదుతత్వము లయ్యెను. ఇవి మాయాపర్యంతములు. ప్రాకృతము లివి యగును. మాయ భగవంతుంగూడి జీవభావమును బొందించును. ఆజీవుఁడు ప్రాకృతుఁడే. శుద్ధవిద్య సదాశివునిం గలిసి సాదాఖ్యకళ యనం బ్రసిద్ధిం గాంచును. కావున నామూల ప్రకృతి భగవతి యనంబడు. ఆభగవతి చతుర్వింశతితత్వముల దాఁటి సదాశివనామక పంచవింశతత్త్వముతోఁగూడి విహరించుచు షడ్వింశతితత్త్వమనం బ్రసిద్ధయై పరమాత్మ యని కీర్తింపంబడును.

శ్రుతి. పంచవింశ ఆత్మా భవతి.

అని కనుపట్టును.

ఇట్లు కావున శ్రీకృష్ణుఁడు రజకుని సహస్రారకమల స్థితుం డగుశుద్ధవిద్యానామకస్వచ్ఛమాయం గలిసియున్న తనయ పరరూపమును గరతలస్పర్శమున హెచ్చరించెను. దాన నా రజకునకు ముక్తి లభించెను. ఇదియే యీకథాసారము. ఇట్లు గ్రహింపక శ్రీహరి రజకుం జంపె నన్నచో నా శ్రీకృష్ణచరిత్ర మునకు నపకీర్తియేగాని వేఱుగాదు. అంతమాత్రమే కాదు. రజకుఁడు లోకదృష్టింబట్టి యాలోచింపఁ గంసుని సేవకుఁడు. రాజాజ్ఞంబూని చేయఁదగువాఁడు. రాజయోగ్యవస్త్రములం గొనిపోవుచుండఁ గృష్ణుండడిగెను. వాఁ డాగ్రహించెను. అదియు న్యాయమే వాఁ డెంతమాట చెప్పఁదగునో యంత మాత్రమే చెప్పెను. వానిని జంపుట యకార్యమని తోఁపక పోదు. శ్రీహరి యధర్మకార్యమును జేయుచనుట మహాపాప కార్యము. కావున దీనితత్త్వ మేమని యాలోచింపక తప్పదు. మధురానగరమునఁ దనచే ముక్తినొందఁదగువారి కాముక్తిఫల మును బ్రసాదించుటకే భగవంతుఁ డచటి కరిగెను. ఎవ్వ రెవ్వరి కెప్పు డెప్పుడు ముక్తి నీయవలయునో ఆవిషయమును భగవంతుఁ డెఱుంగును. కావుననే యజుచేత శిరమును స్పృశిం చెను. ఈయర్థమున కాధారము లేకపోలేదు.

రజకస్య వచశ్శ్రుత్వా జహాస మధుసూదనః.

అని శ్రీకృష్ణజన్మఖండము.

జహార మస్తకం సద్యః కరాగ్రేణైవ లీలయా.

అని గర్గసంహిత.

రజకుని యాక్షేపవాక్యముల విని శ్రీహరి నవ్వుచు నఱచేత శిరమునఁ గొట్టెను. దాన నతఁడు గతజీవుఁ డయ్యెను. ముష్టిప్రహారము సులభముగాఁ బ్రాణముతీయున దుండ నఱచేతఁ జఱచుట యేల యనియు నూహింపుఁడు విలాసముచేతను, చిఱునవ్వుచేతను ఒప్పి భగవంతుఁడు వధించె ననఁగా భావమే మనియు నూహింపుఁడు. క్షుద్రసేవకుని విరహితాయుధుని వస్త్రవాహకునిం జంపినఁ గీర్తి యని యెంచియుండునా యనియుఁ దలపోయుఁడు. సారము తేలును. ఇచ్చోట మహాకవి పద్యము వ్రాయుచు,

క. ఘోరకరాగ్రతలంబున
ధీరుఁడు కృష్ణుండు శిరము తెగిపడఁ గొట్టెం
బౌరులగుండెలు వగులఁగ
వీరోద్రేకిఁ మదావివేకిం జాకిఁ.

అని వ్రాసిరి. ఇం దుపయోగించిన పదములన్నియుఁ బద్యము కొఱకై చేర్పఁబడిన ట్లున్నవికాని వేఱుగా నూహింప శక్యముగాదు. ఘోరకరాగ్రతలంబున ననుచోట ఘోరశబ్దప్రయోగమసంగతమని నాభావము. యుద్ధకాలమున నట్లు చెప్పవలదా యని ప్రశ్నింపవచ్చును. కాని యీపద్యమునఁ బ్రాసమునకై చేర్చినపదములే యివియని స్పష్టమగు. లేకున్న "పౌరులగుండెలు పగులఁగ" అని మూలవిరుద్ధముగాఁ బదములఁ జేర్ప నేల? ప్రాసరక్షణార్థమే. ఇచట శ్రీకృష్ణుఁడు భక్తరక్షణార్థము, పోతన ప్రాసరక్షణార్థము పాటుపడి రనుట సరసమనక

తప్పదని నాయాశయము. "వీరోద్రేకి" అనునది పై భావమును దృఢపఱచుచున్నది. ఇంతట నీవిషయమును వదలి విషయాంతరమునకుఁ గడంగ లేఖినిం బురికొల్పెదను.

ఇట్లు రజకునకు దేహవిముక్తిద్వారా పరలోకమును బ్రసాదించి కృష్ణమూర్తి యన్నయు గోపకులు వెంటరాఁ బయనము సాగించెను. అంత వాయకుం డను నొకతంతువాయకుల జుఁడు రామకృష్ణులం గాంచి సంతసంబునఁ జేరవచ్చి మృదులాంబరంబుల భూషణంబుల వారిమేనుల నలంకరించెను. ఆతనిచే నలంకరింపఁబడి రామకృష్ణులు సూర్యచంద్రులవలెఁ బ్రకాశించిరి. వాఁ డట్లవ్యాజభక్తి నలంకరింపఁగా నాతనిం గరుణించి తనసారూప్యము నొసంగెను. ఈలోకంబున నుండునంతదాఁక శాశ్వతలక్ష్మి నొసంగెను. యశస్సు నిర్మలమై తగునట్లు వరము నొసంగెను. *ఇట్లు వాయకు ననుగ్రహించి మఱికొంత దూరముపోవ విష్ణుభక్తి ప్రపూర్ణుఁడై కువిందుఁడని పిల్వఁబడుచు గతధనుండై భగవదాగమనమును బ్రతీక్షించి యుండు నొకసజ్జనుఁడు నందాదులంగూడి సానందుఁడై యున్న శ్రీహరిని దర్శించి పూజించెను. తదారాధనతత్పరుఁడై హరి వానిపూజల నంగీకరించి యతనిస్వదాస్యము ననుగ్రహించెను. అది బ్రహ్మాదులకే దుర్లభము. అట్టిస్వదాస్యము నాతని నిర్మలాంతః

* ఈవాయకునిచరిత్రము భాగవతమునందే కనుపట్టెడిని. బ్రహ్మపురాణములయందుఁ గానరాదు. శ్రీకృష్ణజన్మఖండమునఁ గువిందునకు ముక్తినొసంగి నట్లున్నది. వాఁడేఁ వీఁడని తలంప వలనుపడదు.

కరణమునకు మెచ్చి యొసంగెను. ఇట్లు కువిందు నలరించి మఱి కొంచెందూరము గడచిరి.

## మాలాకారునిపూజ లంగీకరించుట.

అం దొక్కమాలాకారుఁ డుండెను. ఆతఁడు కంసునకుఁ దత్కుటుంబమునకుఁ బ్రతిదినము పుష్పహారముల విచిత్రభంగి నమరించి యొసంగుచుండును. ఆతఁడు హరిభక్తిపరాయణుఁడు. నిర్మలస్వాంతుఁడునగు. కావున సోదరుంగూడి శ్రీహరి వానియింటికిం బోయెను. పరమేశ్వరుని జూడఁగనే యాతఁ డులికిపడి లేచి హరిపాదారవిందములు తలసోఁక నమస్కరించి పాద్యమిచ్చి యర్ఘ్యాదిపూజావిధులఁ బూజించి పరిమళచందనముపూసి దివ్యమాల్యములఁ గైచేసి కుడువంబెట్టి తాంబూలం బొసంగి మహాత్మా! నాజన్మము సార్థకమయ్యెను. నావంశము పరమపవిత్రమయ్యెను. మద్గృహదేవతలు పితరులు సంతుష్టులైరి. తమ రరుదెంచుటంజేసి నాకు సమస్త సుఖములు చేకూరెను. ప్రపంచకారణులరగు మీరు విజయంచేయుట కంటె నెక్కుడు శుభంబు గలదే. ప్రపంచక్షేమార్థ మీరూపమున నవతరించితిరి. మీరిరువురు జగదాత్మకులు. మీకుఁ బక్షపాత మనునది లేదు. సర్వసములు. సజ్జనమిత్రులరు. సర్వభూతసమబుద్ధులు. సేవించువారి నాదరింతురు. ఓజగదేకప్రభులారా! ఈకింకరుఁ డేమిచేయవలయునో దాని నాజ్ఞాపింపుఁడు. తమ రాజ్ఞాపించుటయే నాయం దనుగ్రహముంచుట యని తలంతు.

అని పెక్కుభంగుల నభ్యర్థించి యాసుదాముఁ డను

మాలాకారుఁడు పరమప్రీతుఁడై పరిమళసురుచిరపుష్పముల నేకరించి మాలికలుగా వాని నలరించి సమర్పించెను. రామకృష్ణులు వాని ధరించిరి. భక్తియుక్తుఁడై వాఁడిచ్చిన యాకుసుమదామములకుఁ దృప్తినందిరి. వరదులు గాన వరము లొసంగనెంచి యిష్టమేదియో తెలుపుమనిరి. ఈఘట్టమున శ్రీభాగవతమున

సోఽపి వవ్రేఽచలాం భక్తిం తస్మిన్నేవాఖిలాత్మని,
తద్భక్తేషు చ సౌహార్దం భూతేషు చ పరాం దయామ్.

అని కనుపట్టెడిని. దీనికి పోతన,

క. నీపాదకమలసేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమునుని తాం
తాపారభూతదయయును, దాపసమందార నాకు దయ చేయఁగదే.

అని వ్రాసిరి. అమృతస్రవంతి యనఁబరఁగు నీపద్యమమూల్యమనవలయుఁగాని యింకేమన వలనుపడదు. అతఁడు కోరినవరము లనుపమానములు. భక్తిరసపూర్ణములు శ్రీహరియు సంతోషమున వాని నొసంగెను.

భక్తజనులారా! ఈపట్టున నొక్కమాట చెప్పఁదలంచితి. మాననయితిగాదు. మాలాకారు నింటికింబోయెనని భాగవతమునందును. మాల్యములఁ గొని రాజమందిరమున కరుగుచున్న మాలాకారుం గాంచెనని పురాణాంతరమునందును గన్పట్టు. తక్కినపురాణాదు లీ రెండుమార్గములకు సహాయము చేయును. ఏది యెట్లున్నను దీనినుండి గ్రహింపఁదగువిషయమొక్కటియే కనుపట్టు. భగవంతుఁడు మానవునిచిత్తశుద్ధిని బరీక్షించుఁగాని భాగ్యాదులం బరీక్షింపఁడు. ఇదియొక్కటియే

యీకథ మనకు బోధించువిషయము పదార్థముల నధికముగాఁ గూర్చి చేయుపూజకంటె నిర్మలభక్తియుక్తిం జేయుపూజ స్వల్ప పరికరయుతమైనను నిరుపమానమని చెప్ప నొప్పును. కావుననే భగవంతుఁడు భగవద్గీతలయందు.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః. ౧
యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్. ౨
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. 3
యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౪
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. ౫
అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. ౬
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్త స్స మే ప్రియః. ౭

భక్తియోగము.

ఈభగవద్వాక్యంబులఁ దలంపుఁడు. సర్వత్రవ్యాపించి యక్షరుఁడ నగు సర్వభూతాంతర్యామిగ ధ్యానింపుమని బోధించుచున్నవి. తమరు చేయుసకలసత్కర్మముల నాయందర్పించి

యనన్యయోగమున నన్ను ధ్యానించినవారిం గృతకృత్యులను జేసెదనని భగవదభిప్రాయ మనుట స్పష్టము. నాయం దెవ్వరు చిత్తము నర్పింతురో వారికిఁ ద్వరగా దర్శన మిచ్చెదననుట యిటఁ గలసారము. యోగాభ్యాసముచేయ శక్యముకానిచో నాసేవచేయు మనుటయే యిటఁ గనంబడునీతి. అట్టిభక్తుఁడు నాకుఁ బ్రియుఁడని భావము.

ఈపై వాక్యములను నియమమునఁ బఠింపుఁడు. మాలాకారుఁ డిందు నేవాక్యమున కుదాహరణభూతుఁ డగునని యూహింపుఁడు "మత్కర్మపరమో భవ" అన్నమాట కుదాహృతిభూతుఁ డని తేలును. భక్తియుక్తుఁడై తనకుండినపదార్థములలోఁ బ్రధానములు పుష్పములే కాన వాని నర్పించెను. భగవంతుఁడు పరమానందభరితుఁడయ్యెను. ఇందుఁ గల పదార్థము లమూల్యములు కావు. భక్తి యమూల్యము. దాననే భగవంతుఁడు తృప్తుఁడయ్యెను. ఆతఁడు కోరినకోరిక లెట్టివి? భగవత్పాదసేవ. పాదసేవకులతోటిమైత్రి. సర్వభూతదయ కలుగవలయునని కోరెను. ఒకొక్కటియు నిందు ముక్తినొసంగఁజాలును. ఈవరములు దుర్లభములు పునరావృత్తి లేకుండఁజేయునవి. ఇట్టివరముల నామాలాకారుఁడు పూలహారము లర్పించి పడసెను. ఎట్టిరత్నహారము లర్పించిన నివి పడయరానివి. కావున భక్తియుక్తులై భగవంతు నారాధించుట ప్రధానము కాని పదార్థము లెన్నియెన్ని దుష్టప్రకారములనో సేకరించి వాని నర్పించిన పూజ నిష్ఫలమనుటకన్న వేఱొక్కమాటవచింప

వలనుపడదు. భక్తిసులభుఁడు భగవంతుఁడు. ద్రవ్యసులభులు మానవులు. మానవుల నలరించినట్లు భగవంతు నలరింపఁబూనుట వ్యర్థప్రయత్నము. ఉపవాసములుండుట పిండివంట లెక్కువ గాఁజేసి నైవేద్యము నిచ్చుట భక్తిప్రధానమైనచో ఫలప్రదములే. అదిలేకున్న నింత కంటెఁ దెలివితక్కువప్రయత్నము కలుగఁబోదు. కాన నిర్మలభక్తి శ్రీహరి నారాధింపుఁడు. సదా భగవన్నామమును స్మరింపుఁడు. ఇఁకఁ గథ వినుఁడు.

## కుబ్జావరప్రదానము.

రాజమార్గమున గోపాలకులం గూడి రాజయోగ్యవస్త్రముల ధరించి సురుచిరపుష్పమాలికాలంకృతుఁడై యన్నయుఁ దోడరాఁగా రాజమార్గమున సుందరగమనమునఁ జనుచుండెను. * రాజమార్గమున శ్రీహరి పోవుచుండఁగా నొంకస్త్రీరూపము

*కుబ్జాచరిత్రమున శ్రీకృష్ణజన్మఖండమునకు దక్షిణపురాణములకు సంబంధము కానరాకున్నది. కుబ్జను వృద్ధనారినిగా బ్రహ్మవైవర్తపురాణము చెప్పెడిని. దక్షిణపురాణములు యువతి యని సుందరాంగియని చెప్పుచున్నవి. దానితాత్పర్య మేమియని చర్చించి ముందు వ్రాసెదను.

దదర్శ పథి కుబ్జాం తాం వృద్ధామతిజరాతురాం
యాంతీం దండసహాయేన చాతినమ్రాం నమద్వలీం
దుషితాం వికృతాకారాం బిభ్రతీం చందనద్రవమ్. బ్రహ్మవైవర్తము.

అథవ్రజన్ రాజపథేన మాధవ స్త్రియం గృహీతాంగవిలేపభాజనాం,
విలోక్య కుబ్జాం యువతిం వరాననాం పప్రచ్ఛయాంతీం ప్రహసన్ రసప్రదః.
శ్రీభాగవతము.

కుబ్జాం దదృశతుర్భ్యాయస్సానులేపనభాజనాం

గ్గోచరమయ్యెను. ఆకాంత యంగవిలేపనభాజనమును గొని వృచుండెను. అమెవయస్సున విబ్బవీఁగునదియే. ముఖలావణ్యము మనోహరముగా నుండెను. కాని కుబ్జయని యామెరు. ఆమెదేహము మూఁడువక్రములుగలదిగా నుండును. ఁబట్టి యామెసౌందర్యము చూచువారలకు విసుగుకల్గించుచియుండెను. ఆకుబ్జ విలేపనవస్తువులుగలపాత్రమునుబట్టుకొని రాజగృహమున కేగుచుండెను. ఆమెనుగాంచి శ్రీకృష్ణపరబ్రహ్మము శాపవిముక్తికాలము సమీపించినది. ఈమెదేహదోషమును దొలఁగించి నాసేవాభాగ్యమును బ్రసాదించెద. ఈమెపూర్వజన్మమున రామచంద్రరూపముననున్న నాసౌందర్యమునకు మోహపరవశురాలయ్యెను. ఆయవతారమున నీమెతో సరసముగ మాటలాడుటయుఁ దగదు. కాననే యూరక పంపవలసి

తామాహ కృష్ణః కుబ్జేతి కస్యేదమనులేపనం
నయస్వంబుజపత్రాక్షి క్షిప్రమాఖ్యాతుమర్హసి.

హరివంశవిష్ణుపర్వము.

యాంతీం స్త్రియం పద్మనేత్రాం పాటీరాలేపభాజనం
బిభ్రతీం యువతీం కుబ్జాం పథి పప్రచ్ఛ మాధవః. గర్గసంహిత.

దదర్శ కుబ్జా మాయాంతీం నవయౌవనగోచరాం,
తామాహ లలితం కృష్ణః కస్యేద మనులేపనమ్. బ్రహ్మపురాణము.

ఈశ్లోకమే విష్ణుపురాణమునందున్నది. బ్రహ్మపురాణమునకు విష్ణుపురాణము పుత్రిక యని చాలతావుల వ్రాసియే యున్నవాఁడను.

ఇట్లు పురాణములు పెక్కులొక్కమార్గమునను బ్రహ్మవైవర్తమొక్కఁడొక్కవిధముగను జెప్పుచుండుట కేదియో హేతు వుండవలయుఁ

వచ్చెను. ఆదురూహకు ఫలముగా విరూపతఁ గల్పించితిని. ఈజన్మమున నాదర్శనమున నీమె సుందరాంగి కావలయును. కన్నులార నన్నుఁ గాంచవలయు. దాన నీమెకు నాదాస్యసుఖమును బ్రసాదించెద. అని యూహించి యామెచెంతకుఁ జని యో వరారోహా! నీవెవతవు? ఈయంగలేపనవస్తువు లెవ్వరికొఱకుఁ గొనిపోవుచున్నదానవు? వదలక యున్నదున్నట్లు చెప్పుము. మాయిరువుర కీయంగవిలేపనముల నిమ్ము. ఇవి యత్యుత్తమములు కదా. దాన నీకు నుత్తమశ్రేయస్సు శీఘ్రకాలముననే కలుగఁగలదు. ఇప్పట్టున శ్రీభాగవతమునకుఁ దెనుఁగునకు సంబంధము కానరాకపోవున ట్లగపడును.

---

గదా. ఇందేదియుం నసత్యము చెప్పనదిలేదని నామతము. రీతిభేదములవలన నీతిభేదము కాదు. కావున నీకథ భాగవతము ననుసరించి వ్రాసి పిదప శ్రీకృష్ణఖండమునఁగల మార్పును గుఱించి తెల్పెదను. ఈకుబ్జ యెవ్వరో యీవఱకే చదివియుందురు. ఈగ్రంథమున నైదవప్రకరణమున శూర్పణఖయే కుబ్జగాఁ బుట్టినదని వ్రాసియుంటినికదా. అది యిపుడు మరల జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నవాఁడను. శూర్పణఖకు రామావతారమున గర్వభంగముకొఱకుఁ గల్పించిన విరూపత నీయవతారమున భగవంతుఁడు మార్పఁబూనెను. ఆమెకుఁ దనవలనఁ జెడుగుగల్గె నన్నయూహ యుండరాదు. అప్పటికీడు మహానందహేతువుగా జేయనెంచెను. కావుననే శ్రీకృష్ణమూర్తి యాత్రివక్రను బిలిచి మాటలాడెను. పురాణములభేదమునఁ గథ కించుకభేదము గలిగినట్లు తోఁచినను నీతి కించుకయుం భేదములేదనియుఁ గుబ్జ ముసలి యను శ్రీకృష్ణజన్మఖండోక్తమున విశేషాంశములు కనఁబడునని తెలియఁదగు. కథాసారమును బఠించునపుడు విమర్శించెదను.

మూ. కా త్వం వరోర్వేతదిహానులేపనం
కస్యాంగనేవా కథయస్వ సాధు నః,
దేహ్యావయోరంగవిలేపముత్తమం
శ్రేయ స్తత స్తే నచిరాద్భవిష్యతి.

అని మాత్రమే యుండెడు. మహాకవిపద్యము,

ఉ. చక్కనివాఁడ వౌదు సరసంబుల నొంపకు మెల్లవారికిం
జక్కఁదనంబు లెక్కఁడివి చారుశరీర త్రివక్ర యండ్రు నే,
నిక్కము కంసుదాసిని వినిర్మలలేపనవిద్యదాన నా,
మిక్కిలి రాజు మెచ్చుఁదగ మీరు విలేపనముల్ ధరింపరే.

ఇందుఁ దొలిపాదము కల్పితముగాఁ దోఁచును. కాని వ్యాఖ్యానాభిప్రాయమును గైకొని పద్యము వ్రాయఁబడినది. పూర్వశ్లోకమున "అంగనేవరోరు"అనుపదములుగలవు.వానికి వ్యాఖ్యాత "హే అంగనే వరోరు ఇతి సోపహాసం సంబోధ్య పృచ్ఛతి" అని వ్రాసెను. ఆవిషయ మెఱింగి మహాకవి పద్యమున నాయర్థమునే కూర్చెను.అట్లు వ్రాయకున్నఁబద్యము నీరసమగును.వ్యాఖ్యానకర్తభావము వేఱుగ నుండవచ్చునన్నదుదూహ యిట సాగదని నాభావము. ఏపదమున నెట్టిస్వారస్యముగలదో దానినెఱింగియే వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఆభావము మూలకర్తది కాకపోవచ్చునన్నది దుర్భావము. అది యెఱింగి వ్రాసినదే వ్రాఁత. ఇఁకఁ దరువాతివృత్తాంతము నాలకింపుఁడు.

శ్రీకృష్ణమూర్తి మాటల నాలకించి యాకుబ్జ యిట్లు బదులుపల్కెను. సుందరాకారా! నేను గంసుదాసిని. అనులేపకృత్య

మున మెప్పువడసినదానను. నన్నుఁ ద్రివక్రయని యందఱు పిలుతురు. నానిర్మించిన యీయంగలేపనము భోజకులోద్ధారకుఁ డగు కంసున కతిప్రియముగా నుండును. ఇట్టియీవస్తువులను మీరుతప్ప ధరింపఁదగినవా రెవ్వరు కలరు? అనిపలికి యాకుబ్జ ఆసోదరులరూపములకు, సౌకుమార్యమునకు,రసికత్వమునకు, సుస్మితములకు, భాషణములకు, వీక్షణములకు లొంగిపోయెను. మనస్సుపరవశముకాఁగా రాజార్హములే యని కొనిపోవు నాసురుచిరవస్తువుల నాసోదరులకుఁ బ్రీతిమై నొసంగెను. ఈవస్తువుల ధరింపఁదగినవారు వీరేకాని యింకొక్కరు లేరనియు నూహించెను.

ఆసోదరు లిరువురు నాయంగవిలేపనముల నంగీకరించిరి. అవి తమదేహచ్ఛాయలంబోలక పీతాదివర్ణములు గలవిగా నుండునవి. వాని నాదృతి నలందిరి. అపూతచేఁ గ్రొత్తకాంతులు గలవారలైరి. వారిదేహముల సోఁకి యావస్తువులు పవిత్రములయ్యెను. కుబ్జానేత్రకమలములు వికసిల్లెను. అంత శ్రీకృష్ణమూర్తి కరుణాతరంగితాంతరంగుఁడయ్యెను. ఆమెదేహమునకుఁ గలదోషమును దీర్ప నెంచెను. భగవదుద్దేశము సార్థకముకాకపోవదుకదా. కుబ్జను జక్కఁగా వీక్షించెను. మూఁడు వంకరలు దిలకించెను. వానిని జక్కనొత్తినచో నామె లోకమున నాకాలమున సుందరాంగియనం జెల్లునని దలంచెను. తన దర్శనఫల మామెకుఁ గల్గింప నిశ్చయించెను. వెంటనే ఆకుబ్జ పాదములఁ దనపాదారవిందముల నునిచెను. గడ్డముక్రిందఁ దనయంగుళద్వయ మునిచి చక్కనెత్తెను. పాదసరోజస్పర్శము

దృగ్గోచరమయ్యెను. ఆకాంత యంగవిలేపనభాజనమును గొని పోవుచుండెను. ఆమెవయస్సున విణ్ణివీఁగునదియే. ముఖలావణ్యము మనోహరముగా నుండెను. కాని కుబ్జయని యామె పేరు. ఆమెదేహము మూఁడువక్రములుగలదిగా నుండును. కాఁబట్టి యామెసౌందర్యము చూచువారలకు విసుగుకల్గించునదియాయెను. ఆకుబ్జ విలేపనవస్తువులుగలపాత్రమునుబట్టుకొని రాజగృహమున కేగుచుండెను. ఆమెనుగాంచి శ్రీకృష్ణపరబ్రహ్మము శాపవిముక్తికాలము సమీపించినది. ఈమెదేహదోషమును దొలఁగించి నాసేవాభాగ్యమును బ్రసాదించెద. ఈమె తొలిజన్మమున రామచంద్రరూపముననున్న నాసౌందర్యమునకు మోహపరవశురాలయ్యెను. ఆయవతారమున నీమెతో సరసముగ మాటలాడుటయుఁ దగదు. కాననే యూరక పంపవలసి

---

తామాహ కృష్ణః కుబ్జేతి కస్యేదమనులేపనం
నయస్యంబుజపత్రాక్షి క్షిప్రమాఖ్యాతుమర్హసి.

హరివంశవిష్ణుపర్వము.

యాంతీం స్త్రియం పద్మనేత్రాం పాటీరాలేపభాజనం
బిభ్రతీం యువతీం కుబ్జాం పథి పప్రచ్ఛ మాధవః. గర్గసంహిత.

దదర్శ కుబ్జా మాయాంతీం నవయౌవనగోచరాం,
తామాహ లలితం కృష్ణః కస్యేద మనులేపనమ్. బ్రహ్మపురాణము.

ఈశ్లోకమే విష్ణుపురాణమునందున్నది. బ్రహ్మపురాణమునకు విష్ణుపురాణము పుత్రిక యని చాలతావుల వ్రాసియే యున్నవాఁడను.

ఇట్లు పురాణములు పెక్కు లొక్కమార్గమునను బ్రహ్మవైవర్త మొక్కఁ డొక్కవిధముగను జెప్పుచుండుట కేదియో హేతు వుండవలయుఁ

వచ్చెను. ఆదురూహకు ఫలముగా విరూపతఁ గల్పించితిని. ఈజన్మమున నాదర్శనమున నీమె సుందరాంగి కావలయును. కన్నులార నన్నుఁ గాంచవలయు. దాన నీమెకు నాదాస్యసుఖమును బ్రసాదించెద. అని యూహించి యామెచెంతకుఁ జని యో వరారోహా! నీవెవతవు? ఈయంగలేపనవస్తువు లెవ్వరికొఱకుఁ గొనిపోవుచున్నదానవు? వదలక యున్నదున్నట్లు చెప్పుము. మాయిరువుర కీయంగవిలేపనముల నిమ్ము. ఇవి యత్యుత్తమములు కదా. దాన నీకు నుత్తమశ్రేయస్సు శీఘ్రకాలముననే కలుగఁగలదు. ఇప్పట్టున శ్రీభాగవతమునకుఁ దెనుఁగునకు సంబంధము కానరాకపోవున ట్లగపడును.

---

గదా. ఇం దేదియుఁ నసత్యము చెప్పనదిలేదని నామతము. రీతిభేదములవలన నీతిభేదము కాదు. కావున నీకథ భాగవతము ననుసరించి వ్రాసి పిదప శ్రీకృష్ణఖండమునఁగల మార్పును గుఱించి తెల్పెదను. ఈకుబ్జ యెవ్వరో యీవఱకే చదివియుందురు. ఈగ్రంథమున నైదవప్రకరణమున శూర్పణఖయే కుబ్జగాఁ బుట్టినదని వ్రాసియుంటినికదా. అది యిపుడు మరల జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నవాఁడను. శూర్పణఖకు రామావతారమున గర్వభంగముకొఱకుఁ గల్పించిన విరూపత నీయవతారమున భగవంతుఁడు మార్పఁబూనెను. ఆమెకుఁ దనవలనఁ జెడుగుగల్గె నన్నయూహ యుండరాదు. అప్పటికీడు మహానందహేతువుగా జేయనెంచెను. కావుననే శ్రీకృష్ణమూర్తి యాత్రివక్రను బిలిచి మాటలాడెను. పురాణములభేదమునఁ గథ కించుకభేదము గలిగినట్లు తోఁచినను నీతి కించుకయుఁ భేదములేదనియుఁ గుబ్జ ముసలి యను శ్రీకృష్ణజన్మఖండోక్తమున విశేషాంశములు కనఁబడునని తెలియఁదగు. కథాసారమును బఠించునపుడు విమర్శించెదను.

మూ. కా త్వం వరోర్వేతదిహానులేపనం
కస్యాంగనేవా కథయస్వ సాధు నః,
దేహ్యావయోరంగవిలేపముత్తమం
శ్రేయ స్తత స్తే నచిరాద్భవిష్యతి.

అని మాత్రమే యుండెడు. మహాకవిపద్యము,

ఉ. చక్కనివాఁడ వౌదు సరసంబుల నొంపకు మెల్లవారికిం
జక్కఁదనంబు లెక్కడివి చారుశరీర త్రివక్ర యండ్రు నే,
నిక్కము కంసుదాసిని వినిర్మలలేపనవిద్యదాన నా,
మిక్కిలి రాజు మెచ్చుఁదగ మీరు విలేపనముల్ ధరింపరే.

ఇందుఁ దొలిపాదము కల్పితముగాఁ దోఁచును. కాని వ్యాఖ్యా నాభిప్రాయమును గైకొని పద్యము వ్రాయఁబడినది. పూర్వశ్లోక మున "అంగనేవరోరు" అనుపదములుగలవు. వానికి వ్యాఖ్యాత "హే అంగనే వరోరు ఇతి సోపహాసం సంబోధ్య పృచ్ఛతి" అని వ్రాసెను. ఆవిషయ మెఱింగి మహాకవి పద్యమున నాయర్థమునే కూర్చెను. అట్లు వ్రాయకున్నఁబద్యము నీరసమగును. వ్యాఖ్యాన కర్తభావము వేఱుగ నుండవచ్చునన్నదురూహ యిట సాగదని నాభావము. ఏపదమున నెట్టిస్వారస్యముగలదో దానినెఱింగియే వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఆభావము మూలకర్తది కాకపోవచ్చు నన్నది దుర్భావము. అది యెఱింగి వ్రాసినదే వ్రాఁత. ఇఁకఁ దరు వాతివృత్తాంతము నాలకింపుఁడు.

శ్రీకృష్ణమూర్తి మాటల నాలకించి యాకుబ్జ యిట్లు బదు లుపల్కెను. సుందరాకారా! నేను గంసుదాసిని. అనులేపకృత్య

మున మెప్పువడసినదానను. నన్నుఁ ద్రివక్రయని యందఱు పిలుతురు. నానిర్మించిన యీయంగలేపనము భోజకులోద్ధారకుఁ డగు కంసున కతిప్రియముగా నుండును. ఇట్టియీవస్తువులను మీరుతప్ప ధరింపఁదగినవా రెవ్వరు కలరు? అనిపలికి యాకుబ్జ ఆసోదరులరూపములకు, సౌకుమార్యమునకు,రసికత్వమునకు, సుస్మితములకు, భాషణములకు, వీక్షణములకు లొంగిపోయెను. మనస్సుపరవశముకాఁగా రాజార్హములే యని కొనిపోవు నాసురుచిరవస్తువుల నాసోదరులకుఁ బ్రీతిమై నొసంగెను. ఈవస్తువుల ధరింపఁదగినవారు వీరేకాని యింకొక్కరు లేరనియు నూహించెను.

ఆసోదరు లిర్వురు నాయంగవిలేపనముల నంగీకరించిరి. అవి తమదేహచ్ఛాయలంబోలక పీతాదివర్ణములు గలవిగా నుండునవి. వాని నాదృతి నలందిరి. అపూతచేఁ గ్రొత్తకాంతులు గలవారలైరి. వారిదేహముల సోఁకి యావస్తువులు పవిత్రములయ్యెను. కుబ్జానేత్రకమలములు వికసిల్లెను. అంత శ్రీకృష్ణమూర్తి కరుణాతరంగితాంతరంగుఁడయ్యెను. ఆమెదేహమునకుఁ గలదోషమును దీర్ప నెంచెను. భగవదుద్దేశము సార్థకముకాకపోవదుకదా. కుబ్జను జక్కఁగా వీక్షించెను. మూఁడు వంకరలు దిలకించెను. వానిని జక్కనొత్తినచో నామె లోకమున నాకాలమున సుందరాంగియనం జెల్లునని దలంచెను. తన దర్శనఫల మామెకుఁ గల్గింప నిశ్చయించెను. వెంటనే ఆకుబ్జ పాదములఁ దనపాదారవిందముల నునిచెను. గడ్డముక్రిందఁ దనయంగుళద్వయ మునిచి చక్కనెత్తెను. పాదసరోజస్పర్శము

చేతను హస్తస్పర్శముచేతను ఆమె సకలదోషములు పోయెను. ఇఁక దేహదోషమన నెంత ? వెంటనే యామెవంకరలు మూఁడు చక్కనయ్యెను. కందులేని శరీరమయ్యెను. మన్మథబాణమో యన నాతన్వంగి రాజిల్లెను. చూడఁదరముగాకున్న యా యంగన త్రిలోకసుందరియో యనఁదగియుండెను. భగవత్సంస్పర్శమునఁ బ్రమదోత్తమయాయెను. శ్రోణియుఁ బయోధరములు లోనగునవయవములు పృథుతం గాంచి విలసిల్లెను.

ఇట్లు రూపగుణౌదార్యయగు నాకుబ్జ కృష్ణమూర్తిం జక్కఁజూచి చిఱునవ్వున మోము ప్రకాశింపఁగా నతనియుత్తరీయాంచలమును బట్టుకొని లోకనాథా ! మహాత్మా ! నాయింటికి రమ్ము. నాగృహమును బావనము సేయుము. నిన్ను వదల సుత్సహింపను. నిన్ను గాంచిన నామనంబు వేఱువిధముగా మార్పు నొందినది. పురుషోత్తమా ! ప్రసన్నుఁడవగుమా అని ప్రార్థించెను. అను నాయంగనామణి ప్రార్థనముల నాలకించి రాముని మోము గాంచి కుబ్జతోఁ దనతోడివారెల్ల వినుచుండ నవ్వుచు నేనువచ్చెదను. నాసాధింపఁబూనినపని నిర్వహించి పిదప వచ్చెద. అకృతదారులగు మాబోఁటి ప్రవాసులకు నీవు ఆశ్రయురాలవు కదా! అనిపలికి యామెను వదలి పయనము సాగించెను. ఈఘట్టమున శ్రీభాగవతమునందు,

ఏష్యామి తే గృహం సుభ్రు పుంసా మాధివికర్శనం,
సాధితార్థోఽగృహాణాం నః పాంథానాం త్వం పరాయణమ్.

అని కనుపట్టెడిని.

"ఆధివికర్శనం మనః పీడాశమనం.కంసవధేనసాధితః అర్థః సుహృదాం ప్రయోజనం యేన సః అగృహాణాం అకృతదారాణాం పాంథానాం ప్రవాసినాం పరం అయనం ఆశ్రయ స్త్వమ్." అని వ్యాఖ్య.

దీనికి మహాకవి,

క. కామినితిగిచినఁ గృష్ణుఁడు
రాముని వీక్షించి నగుచు రాజానన మ
త్కామితముఁ దీర్చి పిదపఁ
నీమందిరమునకు వత్తు నేఁ డలుగకుమీ.

అని వ్రాసిరి. మూలముం జూడుఁడు. పద్యమును బఠింపుఁడు. మూలమునఁ గలయర్థవిశేష మిం దిసుమంతయుఁ గానరాదు. అంతియగాక నేఁడు రాజాలను. నావచ్చినపనినిదీర్చిమరల వచ్చెద. ఆగ్రహింపుపకుమీ. అని ప్రార్థించిన ట్లగపడియెడిని. దీనిచే నామెకు నాగ్రహము కలుగునేమో యని సంశయించి వేఁడినట్లుగూడ భావము తెలుచున్నది. ఏలొకో యిట్ల వ్రాసిరని విచారించుచున్నాఁడను. మూలార్థమునఁ గలవిశేషమును వినుఁడు. సుభ్రు సుందరములగు కనుబొమలుగల కాంతామణీ! అనఁగా నేత్రసౌందర్యముగలదానవు. కావుననే నేత్రఫలమగు నాదర్శనము చేయఁగల్గితివనిభావము.పుంసాం=పురుషులకు,ఆధివికర్శనం=మనోదుఃఖమునుబోఁగొట్టునట్టి, తే=నీయొక్క, గృహం=గృహమునుగూర్చి, ఏష్యామి=వత్తును. ఓపురంధ్రీ!పురుషులమనఃక్లేశమును దొలఁగించు నీగృహమునుగూర్చి నేనే వచ్చెదనని

యర్థము. అనఁగాఁ బరమభక్తురాలవగు నీవు నివసించునిల్లు మందబుద్ధు లగుమానవులకుఁగల మనః పీడను దొలఁగించునది. మనఃపీడానిర్వాపకము భక్తులయావాసము. అట్టిది కావున నేనే వచ్చెదని శ్రీహరిభావము. వయస్సున విఱ్ఱవీఁగుకాముకులమనఃకష్టమును దొలఁగించు నీయింటికి వచ్చెదనని యర్థముచెప్పుటకంటె నవివేకము వేఱుగానుండఁ బోదని సాధుమతులు గ్రహింపకపోరు. సాధితార్థస్సన్=సాధింపఁబడినప్రయోజనముకలవాఁడై సజ్జనులయొక్క కార్యము అనఁగా దుష్టనిగ్రహము. ఇటఁ గంసవధము. చాణూరముష్టికాదులవధము నని భావము. ఆపనుల నెఱవేర్చి. వ్యాఖ్యలో సుహృదాం అనిపదముచేర్చిరి. ఏలయన, భగవంతుఁడు సర్వసముఁడు. ఎవ్వరియందుఁగాని పక్షపాతములేదు. సాక్షిమాత్రుఁడుకదా. అట్టి శ్రీకృష్ణుఁడు కంసుని జంపుటయేల! లోకపరిపాలనార్థమైయవతరించి భక్తులరక్షించి పాపమతులఁ జంపుట కృత్యముగాన సజ్జనులకొఱకై దురాత్ముఁడగుకంసుని బొలియించునని గ్రహింపందగు. ఈకార్యముచే నిర్లిప్తుఁడగు భగవంతునియందుఁ బక్షపాతముకనఁబడలేదాయనునది ప్రశ్నము కాదు. అనఁగాఁ బ్రశ్నింపరాదు. ఏలన దురాత్ములకుంగూడ ముక్తినొసంగుటయే భగవంతునియూహ. అదెట్లు ఘటిల్లును. వధించి వారికి ముక్తినొసంగును. మొత్తముమీఁద సజ్జనులయందును దుర్జనులయందునుగృపసమానమే పరమేశ్వరునకుంగలదనిసారము. అగృహాణాం=వివాహముచేసికొననివారలకు గృహమనఁగా భార్యయేయనిభావము. గృహస్థువనఁగా భార్యతోఁగూడియుండువాఁ

డనిసారము. ఇంటిలోనుండువాఁడనఁగా నందఁడు కావచ్చును. పాంథానామ్. అతిథులకని భావము. అతిథి యనఁగా మఱుదినము నివసింపనివాఁడని స్మృతిహితార్థము. అనఁగాఁ దీర్థయాత్రాదులనిమిత్తమై తిరుగుచుండు వ్రతనియతులకని దీనిసారము. వివాహముచేసికొనక కార్యార్థమై పరదేశమునకువచ్చిన నః=మాకు, త్వమ్=నీవు, పరాయణమ్=పరమ్, అయనమ్=యోగ్యమగు నాశ్రయమవు. అని దీని యర్థము.

నేత్రఫలముగా యోగ్యజనులఁ గాంచు నోకుబ్జా! సజ్జనుల కెల్ల మనఃపీడను బోఁగొట్టఁజాలు నీయింటికి సజ్జనుల కార్యమును సాధించి పిదప వచ్చెదను బ్రహ్మచారుల మై పరదేశమునకువచ్చియున్న మాబోంట్లకు నీవుకదా పరమాశ్రయభూతురాలవు. అని పైశ్లోకభావము. దీనియందు విరుద్ధమగుభావమే లేదు. కాముకుఁడై శ్రీకృష్ణుఁడుమాటలాడుజాడలు పొడకట్ట లేదు. కావునఁ బోతనపద్యము దీనియర్థమును బోషించునది కాదు. "నేఁడలుగకుమీ" అనునది విపరీతమగుభావమును దోఁపింపఁజేయుచున్నది.

ఇది భాగవతాదిగ్రంథముల ననుసరించి వ్రాయఁబడిన కథ. ఇంక శ్రీకృష్ణజన్మఖండము ననుసరించి సంగ్రహముగఁ గథనువ్రాసి యందలినీతని దెలిపెద. కుబ్జ మార్గమునఁ బోవుచుండెను. ఆమె జరాతురయు దండసహాయమునఁ బోవునదియు వంగిననడుముకలదియు వికృతాకారముగలదియునై చందనద్రవముగలపాత్రమును జేతఁబట్టుకొని పోవుచుండెను. ఆమె

చేత నున్న చందనము కస్తూరీకుంకుమపత్త్రాదిసంయుతము. పరిమళపరికరపరిభూషితము. కాననే మకరందమువలెఁ గన్పట్టుచుండెను. ఆసువాసనలు నలుదెసల వ్యాపించుచుండెను. అట్టి యాకుబ్జ మరలి శ్రీకాంతుని శాంతచిత్తుని జగదీశ్వరుం గాంచి చిఱునవ్వునవ్వి శ్రీనికేతనా! శ్రీనాథా యని పలుకుచు భక్తిభరితస్వాంతయై తలవోఁక నమస్కరించెను. కరయుగము జోడించి మహానుభావా! యీచందనమును బరిగ్రహింపుమా యని ప్రార్థించెను. శ్యామసుందరా! ఈచందనపంకము నీమేన నలంది నన్నుఁ బ్రసన్నదృష్టిం బరికింపుమా యని వేఁడెను. స్వర్ణపాత్రమును గనఁబఱచి యిదె గ్రహింపుమా యని యభ్యర్థించెను అంతలో మరలఁ బ్రదక్షిణమొనర్చి నమస్కరించెను. పరమేశ్వరుఁ డామెను సాదరావలోకనములఁ గాంచెను. అంతమాత్ర నాకుబ్జ శ్రీనాథప్రసాదపాత్రురాలయ్యెను. వెంటనే లక్ష్మివలె సుందరానవద్యాంగియు నయ్యెను. యౌవన మలరారెను. అగ్నివలె నిర్మలురాలయ్యెను. ఆమెకట్టినపట్టము నవాకారమును గాంచెను. రత్నభూషణము లామె యంగమున శృంగారించినట్టులుండెను. పండ్రెండువత్సరముల యీడుగల బాలికవలెఁ గనఁబడియెను. ధన్యురాలయ్యెనని వేఱుగఁ జెప్పవలయునా. ఆమెదేహచ్ఛాయ పుటముపెట్టినబంగారువలె నుండెను. రత్నసారహారములు వక్షమున నలరారసాగెను. రత్నమంజీరములు చరణములఁ గ్రాలెను. కబరీభారము చూచువారల కనుపండువుగా నుండెను. మాలతీమాల్యములు జడముడి

కడుఁగ్రాలెను. రత్నదర్పణ మామెకరమునఁ గనఁబడెను. కటాక్షవీక్షణముల నాశ్యామసుందరుం దిలకించెను.

శ్రీహరియు నామె నాశ్వాసించెను. ఆయాశ్వాసమామెకు మనస్తుష్టి నొసంగఁజాలెను. మహాలక్ష్మి తనగేహమున కరుగున ట్లాతరుణి తనయింటికిం బోయెను. కుబ్జ తనత్రివక్రములుపోయి సుందరాకార మలవడ నింటికిం బోవునప్పటి కామె గృహము రాజయోగ్యమందిరమయ్యెను. రత్నమయశయ్యయం దమర్పఁబడియుండెను రత్నప్రదీపరాజి యందుఁజూడఁబడియెను. రత్ననిర్మితభూరితరదర్పణము లందు వ్రేలాడుచుండెను శ్వేతచామరయుగళము సిందూరవస్త్రము తాంబూలమునుబట్టుకొని దాసీనికరముండెను. పరిచారకు లెందఱో సేవార్థము వేచి యుండిరి. ఆమందిరమును గాంచి యాతన్వి యచ్చెరువంది యిది శ్రీకృష్ణసేవాప్రసాదఫలమని భావించి మిష్టాన్నమును దిని దాసీజనపరిసేవితయై శయనించెను. కుంకుమకస్తూరీసమన్విత తాంబూలమును, దివ్యపరిమళచందనమును దనతల్పమున నునిచి శ్రీహరి యెపుడువచ్చునో యని ధ్యానించుచుండెను. భగవంతున కాహారము మొదలగుసకలోపచారములుచేయ నామె సిద్ధముగ నుండెను. *కర్మముచేతను వాక్కుచేతను మనస్సుచేతను శ్రీహరిపాదారవిందద్వంద్వమును ధ్యానించుచుండెను.

---

* కర్మణా మనసా వాచా చింతయంతీ హరేః పదమ్, హరేరాగమనం చాపి ముఖచంద్రం మనోహరమ్, జగత్కృష్ణమయం శశ్వత్పశ్యంతీ కాముకీ మునే. అని మూలము.

హరి యెపుడువచ్చునా యనియు మనోహరహరిముఖశీతాంశు నెపుడు దర్శింతునా యనియుఁ దలంచెను. జగమంతయు శ్రీకృష్ణమయముగా ధ్యానించుచుఁ గాంచుచుఁ గాముకియే యయ్యెను. కోటికందర్పలావణ్యముగలిగి కామసక్తుఁడై తనరు శ్రీహరిని దర్శింప నువ్విళ్లూరుచుండెను.

మహనీయులారా! కుబ్జాచరిత్రమును బెక్కుపురాణములనుండి పఠించితిరి. ఇందుఁగలవిశేషముల నవధరింపుఁడు. శ్రీకృష్ణజన్మఖండమున నుండునీకథకుఁ దదితరపురాణవర్ణితమగు నీయితిహాసమునకుఁ జాలభేదము గలదు. కాని నీతియొక్కవిధమనియే నాతలంపు. ఎట్లన,

యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.

(భగవద్గీత. ౪ అ. ౧౧ శ్లో)

యే యథా యేన ప్రకారేణ యేన ప్రయోజనేన యత్ఫలార్థితయా మాం ప్రపద్యంతే తాం స్తథైవ తత్ఫలదానేన భజామి అనుగృహ్ణామి అహ మిత్యేతత్. తేషాం మోక్షం ప్రత్యనర్థిత్వాత్. న హ్యేకస్య ముముక్షుత్వం ఫలార్థిత్వం చ యుగపత్సంభవతి. అతో యే ఫలార్థినః తాన్ తత్ఫలదానేన, యే యథోక్తకారిణ స్త్వఫలార్థినో ముముక్షవశ్చ తాన్ జ్ఞానప్రదానేన, యే జ్ఞానిన స్సన్న్యాసినో ముముక్షవశ్చ తాన్ మోక్షప్రదానేన, తథా ఆర్తాన్ ఆర్తిహరణేన, ఇత్యేవం యథా ప్రపద్యంతే యే తాం స్తథైవ భజామీత్యర్థః. "తం యథా యథో

పాసతే త మేవ ఫలం లభతే" ఇతిశ్రుతేః. న పునః రాగద్వేష నిమిత్తం మోహానిమిత్తం వా కంచిద్భజామి. సర్వథాపి సర్వా వస్థస్య మమేశ్వరస్య వర్త్మ మార్గ మనువర్తంతే మనుష్యాః యత్ఫలార్థితయా యస్మిన్ కర్మణి అధికృతాః యే ప్రవర్తంతే మనుష్యా అత్ర దిచ్యంతే. హే పార్థ. సర్వశః సర్వప్రకారైః. అని శంకరభాష్యము.

ఎవ్వరెవ్వ రేయేఫలములనుగోరి నన్ను సేవింతురో వారి నాయాఫలముల చేతఁ గాపాడెదను. అందఱు మను ష్యులు సర్వప్రకారములచేత (కర్మాధికారులు) నామార్గము నే యనుసరించుచున్నారు. అని దీని సంగ్రహార్థము. అనఁగా నేభ క్తుఁడేకోరికనుగోరి నన్ను సేవించునో వాని కావాంఛితము ననుగ్రహించి కాపాడెదను. కావున నెల్లమనుష్యులు నామా ర్గము ననుసరించుచున్నవారని భావము. దీని నెట్లు గ్రహింపఁ దగునో పరికింపుఁడు. ఏవాంఛితమునుగోరినను ఆకోర్కి నొసంగి కాపాడునని గ్రహింపరాదు. అది సన్మార్గము కాదు. ఒకఁడు చోరవృత్తినిగోరిదానియందునాకేలాటిబాధలులేకుండఁ గాపాడుమా యని ప్రార్థించిన. వాని కాపరమేశ్వరుఁ డావాం ఛితమును సఫలముచేసి మేటిదొంగగాఁజేయునని గ్రహించుట పాపులలక్షణము. ఐహికాముష్మికఫలములలోనేఫలమునుగోరి సర్వేశ్వరు నాశ్రయించినను వాని ననుగ్రహించును. ఎట్లు? దుష్కాంక్షలుగోరి శ్రీహరి నారాధించినచో భగవంతుఁ డాత నిసేవ నంగీకరించి వాని కాదుష్కాంక్షలు గలుగకయుండఁజేసి

రక్షించును. శ్రీహరిసేవకు ఫలమనినిదియే. దుష్కాంక్షలు గోరు వాఁడు పాపాత్ముఁడేయైనను హరిసేవ చేయఁదగుననుబుద్ధిగలవాఁ డగుట పుణ్యవిశేషమును జేసియుండువాఁడు గావున దానికి ఫలముగా హరిని సేవింపఁదగు ననుబుద్ధి పొడమును. హరిసేవ చేయును. దానికి ఫలమేమి? దుష్కాంక్షలు నశించుటయు, భగ వదారాధనమున నభీష్టము వృద్ధియగుటయు ననునివి లభించు టయే సేవాఫలము. కాన నన్నెవ్వారెవ్వ రేయేకోరికల గోరి సేవించినను వారి ననుగ్రహింతుననఁగాఁ గాపాడుదునని భావము. దుర్గుణములఁ దొలఁగించి సద్గుణము లలవడఁజేసి సత్కార్యాసక్తిని బుట్టించి భక్తునిగా మార్చి జ్ఞానియగునట్లుచేసి ముక్తినొసంగుటయే భగవత్ప్రతిజ్ఞ. కావున హరిశపథము తన్నాశ్రయించినవారినందఱను గాపాడుటయే యని యెఱుంగు నది. ఇదియే భాష్యాభిప్రాయము. ప్రకృతవిషయమున దీని నన్వయింతము.

కుబ్జ కుటిలత్రయవిశిష్టశరీరముగలదాసి. అది కంసునకు సుగంధమును సిద్ధపఱచి తీసికొనిపోవునది. నాఁడు తనపూర్వని యమముప్రకారము సురభిచందనమునుంచిన స్వర్ణపాత్రమును గైకొని పోవుచుండెను. తొలిజన్మమున నీకుబ్జ శూర్పణఖ యను మాటనుమాత్రము మఱువకుఁడు. కామవశంగతాత్మయై శ్రీరాముని గవయ నుంకించెను. సీత యందగత్తియ కాన నామెం జంపినఁ దన్నువరించునన్న కుబుద్ధినిగూడ నంగీకరించెను. దానికిఁ బ్రాయశ్చిత్తముగా శ్రీరామచంద్రమూర్తి ముక్కు సెవులు

ఛేదింపుమని లక్ష్మణున కాజ్ఞయిచ్చెను. అతఁ డట్లొనరించి సత్క రించియే పంపెను. యుక్తాయుక్తపరిజ్ఞానములేకున్న దుష్ఫల మప్పుడే యనుభవింపఁదగు నన్నప్రాచీనసూ్క్తికి నిది యుదాహరణమగు. కాని భగవదుద్దేశ మట్టిదికాదు.

సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.
గీత ౯ అ. ౨౯ శ్లో.

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితోహి సః. ౩౦ శ్లో.

అని భగవంతుఁడు ప్రతినపట్టినవాఁడు. దానికి మార్పు రాదు. కావున శూర్పణఖ దురూహ కలదియే యైనను దానికి ఫలముగా శ్రుతి నాసికాచ్ఛేదనరూపప్రాయశ్చిత్తమును బ్రసాదించెను. ఇఁక దాని నెట్లు కాపాడఁ దగును. అపుడే కాపాడఁబూన లేదు ఏల? ఆమెద్వారా రావణాదులు ఖరదూషణాదులు శాశ్వతసుఖము నొందఁదగువారు కలరు. ఆపనియుఁ గావలసినదియే. కావున నపుడూరకుండెను. ఆమెవలనఁ గావలసినకృత్యము లన్నియుఁ దీఱెను. ఇఁక నామె మదిఁగలవాంఛను దీర్పక మానరయితిగాదు. కావున భవిష్యత్కృష్ణావతారమునఁ దీర్పనెంచెను. ఎవరినిగామింపఁదగునో యెవరిని గామింపరాదో యనువిచారము చేయనికతన నామె త్రివక్రగాఁ బుట్టెను. దానఁ గుబ్జయయ్యెను. ఆమెరూపమును గాంచి యెల్లరు నీసడించుచుండిరి. కాని భగవద్దర్శనముచేసిన పుణ్యా మామెకుఁ బూర్వజన్మమునఁ గలదు.

ఆపుణ్యమువలన నీమె చమత్కారముగ గంధమును సిద్ధపఱచు శక్తిగలదియై రాజు మన్ననఁగాంచఁగలభాగ్యము కలదయ్యెను. కొంతకాల మీలాగు గడువ శ్రీహరియేవచ్చి దర్శనమిచ్చెను. కుబ్జ కంసునింటికిఁ జందనపాత్రమును బట్టుకొనిపోవుచుండఁ గాంచి తానే యామెచెంతకుబోయి నవ్వుచు మాటలాడెను. ఈఘట్టమున,

విలోక్య కుబ్జాం యువతీం వరాననాం
పప్రచ్ఛ యాంతీం ప్రహసః రసప్రదః.

అని శ్రీభాగవతమున నున్నది. ప్రహసః నవ్వుచు నను దాని నాధారముగఁ జేసికొని శ్రీహరి పరిహాసముగా మాట లాడెనని యర్థము చెప్పుదురు. భగవంతుఁడు కురూపమును గాంచి నవ్వె ననుటకన్నఁ దెలివితక్కువ వేఱొండు కానరాదు. కర్మస్వరూపుఁడగు సర్వేశ్వరుఁడే కర్మఫలము ననుభవించుచు న్నవారిం గాంచి పరిహాసముచేసినచో నిఁక నాతని సర్వేశ్వరత్వ ము గాల్పనే. ఆభావము పొరపాటు. ప్రహసః అనఁగా నర్థమే మని యడుగవచ్చును. కుబ్జను గాంచఁగనే కృష్ణమూర్తి నవ్వెను. ఏల? రామావతారమున నన్నుఁజూచి మోహించితివి. పెండ్లియాడఁదలంచితివి. నాలక్ష్మిని జంపఁబూనితివి. ఎంతవెఱ్ఱి దానవు? ఆశక్తి నీకుఁగలదా. మోహింపఁదగనివారిని గాంచి మోహించినందులకు ఫలముగా నీ కీకురూపము లభించినది. ఆదుష్ఫలము ననుభవించుచున్నదానవు. అయిన భయంపడ కుము. నాదర్శనము వృథకాదు. నేఁజేయించిన శిక్షయు నాగామి

శుభఫలముల నీయక యూరకపోరాదు. ఆశిక్ష యప్పుడు నీకుఁ గష్టముగాఁ దోఁచెను. ఇపుడు నాయనుగ్రహపాత్రురాల వైతివి. ధన్యురాలవయ్యెదు. అని యాదీనురాలియందుఁగల వాత్సల్యమున నవ్వెను. ఆనవ్వునకుఁ బ్రతిఫల మప్పుడే కల్గించెను. భగవత్కరుణ యిట్టిదని వర్ణింప నలవికానిది. భక్తియే ప్రధానము.అదికలిగిన నాకరుణలభించును.సర్వకర్మములు భగవదర్పణముచేయుటయే యది పొందఁదగుమార్గము.

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతానియాంతిభూతేజ్యా యాంతి మద్యాజినోఽపిమామ్.
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. 27
శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. 28

భగవద్గీత ౯ అధ్యాయము.

సర్వకర్మఫలముల నా కర్పించుటయే నన్నుఁ బొందు మార్గమని దీనిసారము. కుబ్జ కులటకాదు. తనపూర్వకర్మమును గూర్చి పరితపించుచుండునది. శ్రీకృష్ణదర్శనముకాఁగానే పరమ ప్రేమ ముదయించి మీరుతప్ప యీదివ్యచందనమలంద నెవ్వరు సమర్థులు గలరని ప్రార్థించెను.

వినా యువాం కోఽన్యతమ స్తదర్హతి.

అను నీభాగవతోక్తి కర్థమేమి? మీరుతప్ప నీరాజ యోగ్యచందనమున కెవ్వరర్హులనఁగా సామాన్యులలో రాజు లర్హులు. ప్రపంచసముదాయములలో మీ రర్హులు. మీరుత ప్పనింకెవ్వ రేనర్హులులేరని కుబ్జకు భగవత్సందర్శనముకాఁగానే తెలియవచ్చెనని భక్తులు గ్రహింపకపోరు. భగవంతుఁడు ప్రత్య క్షముకాఁగా జ్ఞానము కలుగలేదనుట నాస్తికులవాదము. కాన నావాదమునకు బదులిడుభాగ్యము నాకుఁ గలుగకయుండుఁ గాక.

ఈరీతి నాకుబ్జ పలుకఁగాఁ బ్రీతితో నిచ్చిన యాగంధ మును స్వీకరించి శ్రీహరి యాలేమకు లోకమునఁ గలనిందను బాప నెంచెను. ఆమెదేహమును స్పృశించెను. సుందరాంగి యయ్యెను. త్రివక్రములు తొలఁగెను. చక్కనివిరిశరమో యన నలరెను. ప్రసన్నుఁడవుకమ్ము. నాయింటికి విచ్చేయుమనికోరెను. కార్యాంతరములు ముందుఁ దీర్పఁదగినవి కలవుగాన వాని దీర్చి వచ్చెద నని హరి యానతిచ్చెను. సుహృత్కార్యములు గలవని పోయెను. కుబ్జాప్రసాదానంతరము మఱికొందఱకు ననుగ్ర హము చూపుసమయమని యామహాత్ముఁ డెఱుంగును. కావు ననే మరల వచ్చి దర్శనమిత్తునని వెడలెను. శ్రీకృష్ణజన్మఖండ మున ముదుసలియు, వణఁకుచుఁ గఱ్ఱసాయమునఁ బోవునదియు నగు నాకుబ్జ శ్రీశ్యామసుందరుని దర్శించినంతనే ప్రాగ్జన్మసుకృ తము ఫలింప నమస్కరించి దివ్యచందనమును నమూల్యపదా ర్థము నర్పించెను. భగవంతుఁ డాకుబ్జను బ్రసాదమే దురదృష్టి

నవలోకించెను. తదవలోకనమాత్రమున నామె వక్రత్వము పోయి సుందరాకార మలవడెను. పైకెత్తినందున వక్రత్రయ ముపోయి సుందరియయ్యె నన్నను, కరుణావలోకనమున సుంద రాంగియయ్యె నన్నను భేదము నాబుద్ధికిఁ గానరాదు. సంకల్ప మాత్రమున భగవంతునిపని నెఱవేఱును. కాన నీగ్రంథము లకుఁ బరస్పరవైషమ్యము శబ్దములనుబట్టియే గాని కార్యఫల మునుబట్టి కాదని యెఱుంగవలయు. పైకెత్తినంతమాత్రమున దేహమునఁగలవంకరలు తీఱునా ఇదిశక్యమగుకార్యమా యను వారు గలరని నే నెఱుఁగుదు. కాని మనుష్యులమాత్రుల యల వాటులతో భగవంతుని యలవాటులను బోల్చుట యసంగత మని వారికి నేను సమాధానము చెప్పుచున్నవాఁడ. దీని నంగీక రింపక యసాధ్యము నాశ్చర్యకరము నగునీకార్యమని మరల వాదింప నడుముకట్టుకొన్నచో మీకు భగవచ్ఛక్తి యిట్టిదని తెలియఁదగుయోగ్యత యీజన్మమున లేదని చెప్పి మఱి మాటా డకుందును. మహాత్ములారా! ఈలీల యత్యద్భుతము. భక్తిరస ప్రధానము. భక్తివలన భగవత్ప్రసాద మెట్లు కలుగునో తెలు పును. కావున దీనిం బఠించినవారెల్ల సకలకర్మములను విధివి హితములగువాని నాచరించునపుడు తత్ఫలములను గోరక భగ వదర్పణము చేయవలయును. దానికిఁ బ్రతిఫల మనంతముగా లభించును.

భగవంతుఁడగు శ్రీహరి తనవిలాసమును నెఱపంబూని మధురానగరమున సంచరించుచు శ్రీరామునింగూడి గోపబృంద

ములు వెఱిగంద భూభారహరణమునకై తాఁజేయు ప్రయత్నము బ్రహ్మాదులకే నెఱుకపడకుండఁ జేయఁబూని పయనము సాగించెను. కుబ్జానుగ్రహపూర్వకమగులీల భగవద్విలాసమున మధురానగరమునఁ గ్రొత్తదనవచ్చును. ఇట్టిలీలను జూపియుఁదోడ వచ్చుగోపాలబృందముల మాయామోహితులనుజేసి వారి కెఱుకపడకుండ నొనరించెను. ఇఁకఁ దరువాతిభగవత్కథను వ్రాయఁబూనెదను. శ్రీకృష్ణమూర్తి యిఁక బరాక్రమమును జూపఁబూనును. ఆచరిత్రమును వ్రాయుటకుముందు రజకునిం జంపుట వాయకసుదాములకు వరము లిచ్చుట యనువిషయములకుఁ బూర్వవృత్తాంతములఁ దెలుపకపోరాదు. అవి తెలిపినచో భగవద్భక్తి కుదురును.

## రజకవాయకమాలాకారుల పూర్వజన్మవృత్తాంతము.

బహుళాశ్వుఁడనురాజు నారదునిం గాంచి మహానుభావా! భగవన్మహిమమును వింటిని. రజకుఁ డెవ్వఁడు? వానిని శ్రీహరి వధింపనేల? అతనితనువునుండి జ్యోతిస్సొకటి భగవంతునిలో గలిసెఁగదా. ఏల? ఈసంశయములఁ దొలఁగింపుమా యని వేఁడ నారదుం డిట్లు పలికెను. రాజేంద్రా! చక్కఁగఁ బ్రశ్నించితివి. ఆరజకుని పూర్వజన్మవృత్తాంతమును వినుము.

* ఈకథ గర్గసంహిత మధురాఖండము పదియవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది. ఇది బహుళాశ్వునకు నారదముని చెప్పినట్టికథ యనియుం దెలియంగనగు. రజకవధమునాఁగా నాతనిదేహమునుండి జ్యోతిస్సొకటి వెలువడి శ్రీకృష్ణునిలోఁ గలిసినట్లున్నది.

పూర్వము త్రేతాయుగమున శ్రీరామచంద్రుఁ డయోధ్యాపుర ముననుండి రాజ్యపరిపాలనము చేయుచుండెను. రావణాదిదానవుల సంహరించి దుష్టజనశేషము లేక యుండఁజేసెను. రామ రాజ్యమెల్లర కానందదాయకము. ఈతిబాధ లాకాలమున లేవు. ఇట్టులుండఁగా నొకనాఁడు శ్రీరామునియానతి శిరమునఁ దాల్చి గూఢచారుఁ డొకఁడు రాత్రులయందుఁ దిరుగుచు జనుల కష్టములను వారిమాటలవలన నెఱుంగుచు వానిని శ్రీరామచంద్రున కెఱిఁగించుచునుండెను. ఒక్కనాఁ డా గూఢచారుఁడు తిరుగ నొకరజకుఁ డింటిలో భార్యతో నిట్లు పలుకుచుండెను. ఓసీ! నిన్ను నే నేలుకొనను. నీవు పర గృహమున నుంటివికదా. దుష్టచరితవైతివి. కావున నిన్ను వద లెదను. స్త్రీలోలుఁ డగుట రామభద్రుఁడు పరగృహమందున్న సీతను మరల భరించెను. నే నట్టివాఁడనుగాను. నీవు పరగృహ మున నాయానతి మీఱియుంటివి. కాన నిన్ను వదలెదను. ఈమాటలను గూఢచారుఁడు రామున కెఱిఁగించెను. లోకా పవాదమునకు నోడి శ్రీరాముఁడు సీతను వదలిపెట్టెను. ఆమె యడవులపాలయ్యెను. ఆరజకునిదండింప నించుకయు రాముఁడు పూనఁడయ్యెను. ఆరజకుఁడే మధురానగరమున శ్రీకృష్ణావతార కాలమునఁ బుట్టెను. పరిజ్ఞానములేక రాము నాక్షేపించినందున శ్రీహరి వాని వధించెను. కరుణానిధి కావున నాతనికి ముక్తి నొసంగెను. భగవంతునికరుణ యపారము. దానిమహిమము నెఱుంగ నాఁబోంట్లకుఁ దరముకాదు.

అన విని రాజు నారదమునీ! వాయకునివృత్తాంత మెఱిం గింపుము. సారూప్యమేల యతనికి హరి యనుగ్రహించెను? అన నారదముని యిట్లు బదులుచెప్పెను. మహారాజా! వినుము. శ్రీరామచంద్రుఁడు హరధనుర్భంగ మొనరించి సీతను వివాహ మాడఁబూనెను. లక్ష్మణుఁడునూర్మిళను బెండ్లాడ నంగీకరించెను. ఆవివాహసమయమున సీరధ్వజ రాజాజ్ఞ చేత నొకతంతువాయుఁ డు రామలక్ష్మణుల నలంకరింపదివ్యవస్త్రముల నేసెను. అతిసూక్ష్మ తంతువులచే నాతంతువాయుఁడు వస్త్రకర్మకుశలుఁడు కావున మెచ్చఁదగినట్లు వస్త్రముల నిర్మించెను. ఆరామలక్ష్మణులు కోటి కందర్పలావణ్యమూర్తులు. వార లావస్త్రములఁ దాల్చి విలసిల్లు తఱి నావాయకుఁడు వారిం గాంచి మోహించెను. అయ్యో! ఈదివ్యమూర్తుల కిర్వురకు నాచేతులార దివ్యవస్త్రములఁ గట్టు భాగ్యము గలుగకపోయెనే? నేను వీరి నీవస్త్రముల నలంకరించి యున్నఁ దృప్తినొందియుందును. ఆయదృష్టము లేకపోయెఁగదా ఇఁక నేమిచేయుదు? అని పరితపించెను. శ్రీరామమూర్తి సర్వ జ్ఞుఁడు. కావున మనస్సునందే వరప్రదానకార్యము నడపెను. నీమనోరథమును ద్వాపరాంతమున శ్రీకృష్ణావతారమునఁ దీర్చె దను. అని. ఇట్లు రామమూర్తి తలంపఁగా నాకారణమున నావాయకుఁడు మధురానగరమున వాయకుఁ డన జన్మించెను. శ్రీరామకృష్ణులకు వస్త్రములఁగట్టి పరమపవిత్రుఁడై సారూప్య మును బడసెను.

అను నారదోక్తుల విని బహుళాశ్వుఁ డిట్లు ప్రశ్నిం

చెను. సుదాముఁ డనుమాలాకారుఁడు తొలిబాముస నేపుణ్య మొనరించెనో తెలుపుము. ఆతనియింటికి శ్రీరామకృష్ణులు త మరే పోయిరికదా. ఆవృత్తాంతము విసఁగోరెద. నావిని నార దముని యిట్లు పలికెను. రాజా వినుము. రాజరాజునా విఖ్యా తింగాంచిన కుబేరు నెఱుంగుదువుకదా. ఆతనికిఁ జైత్రరథ మను నొకవనము కలదు. అందుఁ బుష్పముల రక్షించుచుఁ గుబేరునకు వానిం గొనిపోయి యిచ్చుచు హేమమాలి యను పేరఁబరఁగు నొకయక్షుఁ డుండెను. ఆతఁడు విష్ణుభక్తుఁడు. శాంతుఁడు, దాత, సత్సంగప్రియుఁడు నగు. ఆతఁడు చిరకా లము శ్రీకృష్ణదేవప్రాప్తింగోరి పూజించెను. ఐదువేలసంవత్స రములు దివ్యకమలములను బ్రతిదినము విసుగునొందక తెచ్చి యీశ్వరు నెదుటఁబెట్టి నమస్కరించును. ఒకానొకదినమున మిగులఁ గరుణించి సదాశివుఁడు కరుణానిధి గావున నాతనిం గాంచి నీవు బుద్ధిమంతుఁడవు. కాన వరమొసంగెద. కోరుమ నియె. హేమమాలి శ్రీశంకరునకు నమస్కరించి చేతులు జో డించి ప్రదక్షిణ మొనరించి నతాననుఁడై యిట్లు ప్రార్థించెను. మహాదేవా! పరిపూర్ణతముఁడగు శ్రీకృష్ణుని నాగృహమునకు రాఁగా నానేత్రములు సఫలములుకాఁగా జూడఁగోరియు న్నాఁడ. ఈవర మనుగ్రహింపవే. నీయనుగ్రహమున నా కీఫ లము గలుగునని నమ్మెదను. అని ప్రార్థింప నీశ్వరుఁడు వత్సా! ద్వాపరాంతమున భరతవర్షమున మధురానగరమునందు నీమనో రథమును ఫలింపఁజేయ శ్రీకృష్ణుఁడు నీగృహమునకు రాఁగ

లఁడు. అపుడు నీకన్నులకఱవు దీఱునట్లు కాంచఁగలవు. సంశ యములేదు. అని వరమిచ్చెను.

సదాశివునివరప్రభావమున హేమమాలి యనుమహా మతిమంతుఁడు ద్వాపరాంతమున మాలాకారుఁ డనుపేరఁ బుట్టెను.సుదాముఁడని యాతనిం బిల్తురు.ఈశ్వరానుగ్రహమున నాసుదామునిచిత్తము సదా శ్రీకృష్ణభక్తిభరిత మగుచుండును. భక్తులను వెదకుచుఁ బోవుట భగవంతునిస్వభావము. కావున శ్రీహరి వెదకికొనుచు సుదామునింటికిం బోయెను. ఈరూప మున శ్రీశంకరువాక్యమును సార్థకముచేసి సుదామునికోరికలు తీర్చెను. ఇదియే సుదామునివృత్తాంతము.

ఆర్యులారా ! రజకవాయకసుదాములపూర్వచరిత్రము నువింటిరి. శ్రీకృష్ణచర్య లెట్టివో ఎవ్వరెవ్వరి నీజన్మమున నుద్ధ రింపవలసియుండి యవతరించెనో తెలియవచ్చెనుగదా. శ్రీ రామావతారమున నెవ్వరెవ్వరి కేయేకోర్కులుగలవో వాని నే యవతారమునఁ దీర్పవలయునో యోజించియే భగవం తుఁడు తీర్చి తనప్రతిన నెఱవేర్చెను. శ్రీకృష్ణుఁ డొనరిం చిన ప్రతికార్యము సహేతుకము. భక్తరక్షణతత్పరము. కావున భక్తులు పఠించి తద్విషయమెఱుంగందగు. రామరాజ్య మున నామహానీయుని పాలనమునుగాని. ప్రవృత్తినిగాని యా క్షేపింప బ్రహ్మాదులకే వలనుపడదు. అట్టియెడ రజకుఁడు భా ర్యతో దెబ్బలాడుచు రాము నాక్షేపించెను. ఆదోషమున మ థురానగరమునఁ బుట్టెను. కాని పుణ్యవిశేష మొనరించియు

న్న వాఁడౌటఁగాఁబోలు శ్రీహరిచే వధింపఁబడియెను. ఆపాప మునకు ఫలము గల్గెను. భగవంతునిచే మృతిగల్గుటచేఁ బావనుఁ డయ్యెను. కావున నీచరిత్రములఁ బఠించి ముందు శ్రీకృష్ణుని చరిత్రమును బఠింపుఁడు.

పరమేశ్వరుఁడు కుబ్జకు వర మనుగ్రహించి యామె యింటికిఁ గార్యమునుసాధించివచ్చెదనని వాగ్దానమొసఁగి వెడలిన తర్వాత నాశ్యామసుందరుని యద్భుతాకారమును వీక్షించి పౌరులు జానపదులు తమశక్తికొలఁది సర్పించుకానుకలు తాంబూలాదుల నంగీకరించుచు, గంధ మలందుచుఁ బూలహారములఁ దాల్చుచు వగ్రజుఁడు దాను నొక్కరూపునఁ బోవుచుండిరి. పౌరపురంధ్రులు తద్దర్శనమున నమితానందముప్పొంగఁ దమ్ముఁదమ రెఱుంగకయుండిరి. వస్త్రములఁ గట్టుకొనుచున్నను స్వామిని జూడఁగోరి పరుగెత్తునపుడు తనవస్త్రధారణకృత్యము పూర్తియైనదా లేదా యనియు నెఱుంగరైరి. కంకణాదులఁ గైచేసికొనునారీమణు లల్లే పరుగిడుటచే నలంకారము పూర్తియైనదో లేదో యనియుఁ దెలియఁజాలకుండిరి. అనన్యపరాయణలై వారెల్ల నాశ్యామసుందరమూర్తిని దర్శించు భాగ్యము లభించెఁగదా యనుసంతోషమున నోలలాడుచుండిరి. అప్పటివారిస్థితి యవధూతచిత్తవ్యాపారమును బోలియుండెను.

అప్పుడు శ్రీహరి పౌరుల నడుగుచుఁబోయి ధనుస్సుండుతావునకుఁ బోయెను. ఆధనుస్సుచేతనే కంసుఁడు శ్రీహరిని జయింప నెంచెను. ఆధనుర్యజ్ఞమునకే పురోహితు ననుమతిని గోపాలబాలకులఁ బిలువఁబంపెను. తనచావు దూరమగునేమో.

యని మృత్యువును బ్రార్థించినట్లు శ్రీకృష్ణబలరాముల నక్రూరుని బంచి పిలుచుకొనిరమ్మనెను.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి" అన్న సూక్తి తప్పదు కదా. వలయుననియే యీ కార్యము కంసుఁ డొనర్చెను. మహర్షు లానందాంబుధి నోలలాడుచుండిరి. పౌరులు కృష్ణాగమన మెఱింగినది మొదలు శుభసమయము రాఁగలదనియు నతిసమీపముగనే యది యున్నదనియు సంభావించిరి. పరమేశ్వరుఁడు కంసునివధించు నని నమ్మియుండిరి. చాణూరముష్టికులు తెగుదురని నిశ్చయించుకొనియుండిరి. నేఁటితో తమ రాజ్యము రాజన్వంతమగు నన్న విశ్వాసమునవారుండిరి. వారిచిత్తకాంక్ష దీర్ప నెంచియే పరమేశ్వరుఁడాతురపడుచుండెను భక్తురాలగుకుబ్జ తనయింటికి దయచేయఁ బ్రార్థించినను సుహృత్కార్యమును సాధించి వచ్చెదనని నచ్చఁజెప్పిపోయెను. ప్రజలయార్తిని భగవంతుఁ డెఱిఁగిన ట్లెవ్వరెఱుంగుదురు? సర్వాంతర్యామికదా శ్రీహరి! ఆమహనీయుఁ డెఱుఁగనిదీప్రపంచజాలమున నేమియుండును. ఈవిషయము నెఱుంగనివారే మూఢు లనఁబడుదురు. వారింజూచి మనము చింతింపవలయునేగాని దూషింప నక్కఱయుండదు.

## ధనుర్భంగము.

శ్రీకృష్ణుఁడు పౌరుల నడుగుచు ధనుశ్శాలను సమీపించెను. ఆశాల విచిత్రరీతి నమరియుండెను. శూరభటు లద్దానిఁ గాపాడుచుండిరి. సర్వవిధముల నది సురక్షితమనియే మానుషబుద్ధి యూహించును. కాని దైవయత్నమున నిది చెడఁగల

దని యూహింపఁజాలదు. మానుషపౌరుషము భగవంతుని ముం దేపాటి యని యూహింపఁజాలదు. లోకదృష్టియేగాని జ్ఞానదృష్టి నది యెఱుఁగదు. ఎందఱు మానవులున్నను ఒక్క దైవయత్నము దానిలోఁ గలియకున్న మనుష్యబలము నీచము గును. ఇది యెఱింగియుండియు మనుష్యులు ఘోరపడుచుండుట వారిచిత్తవికారమే. నిర్మలబుద్ధిని సమలముగాఁ జేయునది మాయ. అది క్రొత్తదిగాదు. భగవదిచ్ఛయే. కాననే "ఇచ్ఛామాత్రా ప్రభోస్సృష్టిః" అన్న ప్రాచీనసూక్తి వెలసెడిని. మఱియు నాధనుర్వరము సదా సంపూజితము. దానఁ దనకు విజయము గల్గునని కంసునిసిద్ధాంతము. అది శైవము. అది అనిర్భేద్యము. దాని నర్చించిన నది విజయము చేకూర్పఁగలదు. దాన శ్రీవారి నిబలరాముని జంపుదునని యామూర్ఖుఁ డెంచియుండెను. ఇంతియగాక చాణూరముష్టికులనుమల్లు లిర్వురు గలరు. వారు ప్రపంచబలాఢ్యులు. వారిసాయమున రామకృష్ణుల జయించి చాల కాలము నిష్కంటకంబుగా రాజ్యమేలవలయునని కంసుని యూహ. దైవబల మన్నింటికంటె మిక్కిలి బలాఢ్యమని శాస్త్రములు ఘోషించుచున్నను మందమతు లెఱుఁగరు. అది వారి ప్రాగ్జన్మపాపపరిణతి యనవలయు. అంతియగాని వేఱొక్క మాటఁ జెప్పఁజాలను.

ఇట్టు లాధనుర్భవనము సర్వపరికరసంభృతమై శూరభటసమాకీర్ణమై దుర్భేద్యమై దుర్నిరీక్ష్యమై దుస్తరమై దురూహమై యుండెను. ఇంద్రునిధనుశ్శాలను మించియుండెను. దానిని గాంచినంతనే యెల్లరు భయంపడుదురు. ఈధనుర్వర మీాదురా

త్మునియొద్దఁ జేరినదే యని సజ్జనులు పరితపించుచుందురు. కాని యితరా ప్రధృష్య మనుమాట భగవంతునకుఁ జెల్లునా యని ప్రాయశః ఊహింపరు. భగవంతునకుఁ దనధనుస్సుగదా యని తెలియకపోదు. శివకేశవులకు భేదము ప్రతిపాదించుట పామర మతము. శివధనుస్సు విష్ణువుది కాదనరాదు. పేరుకూడ నొకరి దొకరికిఁ జెల్లును. ఈ రెండువ్యక్తులొక్కతత్త్వమునుండియే వెడలినవి. కావున శ్రీహరి దాని నశ్రమంబున భంగముచేయ నెంచెను. ఆకార్య మత్యల్పమని యామహనీయమూర్తిమతము.

శ్రీకృష్ణబలరాములు ధనుశ్శాలం జొచ్చునపుడు రక్షకభటులు వలదని మాత్రము మాటలచేఁ జెప్పఁగల్గిరికాని యడ్డఁజాలకపోయిరి. ఆపని యెవ్వరికే నశక్యముకదా. భగవంతుఁ డప్రతిహతకార్యుఁడనుట స్పష్టము. ఇట్లు రక్షకులమాటల లెక్కచేయక లోపలంజొచ్చి కోదండము నందుకొనిరియెను. ఎడమచేతితో దానిఁజేకొని విలాసముకొఱ కెత్తినట్లు లెత్తి క్షణమాత్రమున నెక్కుపెట్టి మనుజులంద ఱిదియేటిచిత్రమని చూచుచుండఁగా నారిఁబట్టి లాగెను. మదపుటేనుఁగు ఇక్షుదండమును భంజించునట్లు దానిలాగుచు భేదించెను. ఆధనుర్భంగ సమయసంజనితమహాస్వనము వియద్వీథినిదిక్కులను నిండెను. ఆశబ్దమును విని కంసుఁ డదరిపడిరియెను. చూచుచున్నవారెల్ల నిశ్చేష్టులైరి. ఆధనుర్భంగము నెఱింగి తద్రక్షకు లాగ్రహించి పట్టుఁడని చుట్టుకొనిరి. వారిం గాంచి యీక్షుద్రులం గూల్పక విడువరాదని రామకృష్ణు లాధనుశ్శకలములం జేకొని చావ నడ

చిరి. ఆవ్రేటుల కారక్షకభటులు యమదండహతులుంబోలె మృతినందిరి. ధనుశ్శాలల నిర్మానుష్యవీరభటసముదాయమయ్యెను. ఇట్లు ధనుశ్శాలాకృత్యము యథావిధి నిర్వర్తించి పురసంపదఁ జూచునెపమున రాజమార్గమునఁ జనుచుండిరి. ఆయిద్వీరపరాక్రమంబును జూచి జను లచ్చెరువంది నిరుపమానతేజోవిరాజితులగుట దేవోత్తములే యీయిద్వరని తలంచిరి. ఇట్లు కార్యము నిర్వర్తించి రాజమార్గమున వర్తించుతఱి సాయంసమయమయ్యెను. సానుచరులై యాయన్నదమ్ము లిద్దఱు తమవిడిదికింబోయిరి. నందాదులు రామకృష్ణులం గాంచి కరము హర్షించిరి. క్షీరమిశ్రాన్నమును దిని సుఖముగా నారేయి నిద్రించిరి. * ఎల్లరు సుఖనిద్ర చేయుచుండిరి. భగవంతుఁడు నిద్రపో

* ఇచట శ్రీకృష్ణజన్మఖండమున నారాత్రి శ్రీహరి నిద్రాసమయమునఁ గుబ్జయింటికిం బోయెనని చెప్పఁబడినది. తక్కినపురాణము లీవిషయమును జర్చించుట మానినవి. భాగవతమునఁ గంసవధానంతరము హరి యుద్ధవుని గూడి కుబ్జామందిరమున కరిగి రతికేళిం దేలివచ్చెనని చెప్పఁబడినది. ఈ రెండుపురాణముల ననుసరించియే యీకథ వ్రాయవలసినది కాని తక్కినవాని నాశ్రయించికాదు. ఈరెండుకథలలో నేది బాగుండునని యాలోచింప నవసరముకల్గినది. ఉద్ధవునింబిలుచుకొనిపోయి కుబ్జతో మాటలాడి రతికేళిం దేలెననుట భక్తులకు విరుద్ధముగాఁ దోఁపదని నేనెఱుఁగుదునుగాని శ్రీకృష్ణజన్మఖండమునఁ జెప్పఁబడినకథ యించుక మార్పుగానుండినను వినహితముగానున్నదని నాయూహ. కాఁబట్టి యీకథ నీఘట్టముననే వ్రాసెదను. ఇట్లు వ్రాయుటచే శ్రీకృష్ణపరమపవిత్రచరిత్రమునందు వంకలెన్న నితరులకు వీలులేకపోవునన్నసమ్మకము నాకుఁ గలదు. కావున నిచటనే వ్రాయుచు భాగవ

వృట యన నర్థమేమి.? జాగ్రత్స్వప్నసుషుప్తులనునవస్థ లాతనికిం గలవా. అందఱివలె నిదురించుచుండి కుబ్జా కాంక్షఁదీర్పఁదలంచెను. అటఁ గుబ్జయు నారేయి సుఖశయ్యపైఁ బరుండి నిద్రించెను. నిద్రేశ్వరుండగు శ్రీకృష్ణుఁడు గోపకులతోఁగూడ శయనించియుండియు నచటికిఁ బోయెను. రత్నతల్పమునఁ బరుండిన కుబ్జను దిలకించెను. ఆమె దాసీజనపరివృతయై యుండెను. నలుఁగడల దాసీజనులు శయనించి యుండిరి. కుబ్జనుమాత్రము హరి మేలుకొలిపెను. దాసీజనముమాత్ర మట్లే నిదురించుచుండిరి.

జగన్నాథుఁ డాతన్వంగిఁ గాంచి కుబ్జా! నిద్రమానుము. శృంగారఫలము నీకొసంగెద. మున్ను నీవు శూర్పణఖవు. రావణుని సోదరివి. రామావతారమున నాహేతువువలన నీవు తప మొనరించితివి. తత్తపఃఫలముగా నన్నుఁ గైకొనుము. నాతోఁ గూడి నాలోకమునకుఁ బొమ్ము. నాసంగతిఫల మిదియే కదా. నాలోకము గోలోక మనఁబడు. అందున్నవారికి జరామృత్యువులు లేవు. అనిపలికి శ్రీనివాసుఁ డాలేమను దనహృదయమున నిడుకొని గారవించెను. నగ్నయగు నాతలోదరిని శృంగారవిలాసముల బరితుష్టమతిఁ గావించెను. ఆయంగనారత్న మాశ్రీ

---

తాభిప్రాయమునుగూడ నిటఁ గలుపుచుందును. ఈమాత్రము మార్పుచేసినందులకుఁ బరమభాగవతులు క్షమింతురుగాక. భగవంతుఁడు కాముకుల కామమును దీర్చుట యామహానీయుని చరిత్రమునకుఁ గళంకము తేఁజాలదుకాని యట్టిభావమును గ్రహించువా రరుదు. కావున నిచ్చటనే యాకథను వ్రాసి యందలినీతులఁ దెలిపెదను.

కృష్ణుని గాంచి లజ్జాసమాకలితయయ్యెను. లక్ష్మీదేవివలె శ్రీహరి ప్రీతిపాత్రురా లయ్యెను. ఆరతియందు వారికి విరతి గానరాదయ్యెను. నానాప్రకారవిహారము లట సాగెను. నిశావసాన సమయమున స్వవీర్యము నాతస్వాంగియం దునిచెను. ఆమె మూర్ఛిల్లెను. కృష్ణవక్షస్థ్సలస్థితయగు నాకుబ్జ యట్లే విస్మృతిం గాంచెను. రాత్రిందివములను జ్ఞాన మాయింతికిఁ గలుగకుండెను. తెల్లవాఱుజామున నొకదివ్యరథము గోలోకమునుండి వచ్చి యాకుబ్జ నెక్కించుకొనిపోయెను. కుబ్జయు నందుఁగూరుచుండి దివ్యరూపమలరఁ జంద్రముఖియనుగోపికయై యెందఱో పరిచారికలు తన్నుఁ గొలువ నరిగెను. భగవంతుఁడును యథాపూర్వముగఁ దనతోడివారలలో నుండెను.

మహామతులారా! కుబ్జచరిత్రమును వింటిరి. ఆమె పూర్వజన్మమున శూర్పణఖ యనువిషయ మీవఱకే యెఱింగితిరి. భగవంతునకుఁ జందనమర్పించి తత్ప్రసాదపాత్రయాయెనని చదివితిరి. ఇపుడు శ్రీకృష్ణుఁ డారాత్రి యాప్రమదయింటికిం బోయి విహరించెననియు నెఱింగితిరి. ఇపు డీచరిత్రమునుబట్టి శ్రీకృష్ణ ప్రవృత్తి యెట్టిదని భావింపనగునో చిత్తగింపుఁడు.

నిద్రాం చ లేభే సా కుబ్జా నిద్రేశోఽపి యయౌ ముదా.

... ... ... ...

తాముథాచ జగన్నాథో జగన్నాథ ప్రియాం సతీమ్
త్యజ నిద్రాం మహాభాగే శృంగారం దేహి సుందరి.
పురా శూర్పణఖా త్వం చ భగినీ రావణస్య చ

రామజన్మని మద్ధేతో స్త్వయా కాంతే తపః కృతం.
తపఃప్రభావాన్మాం కాంతం భజ శ్రీకృష్ణజన్మని,
అధునా సుఖసంభోగం కృత్వా గచ్ఛ మమాలయమ్.

అని మూలమునఁ గన్పట్టెడిని. నిద్రేశుఁడు నిద్రఁబోవుచున్న కుబ్జయింటికిఁబోయెనని కన్పట్టెడిని. దీనిభావ మేమని తలంపుఁడు. శ్రీహరిసోదరుఁగూడి యనుచరులందఱు పవ్వళింప నందాదు లుండుతావుననే నిద్రించెను. కుబ్జాకాంతు మనోగోచరముకాఁగా నిద్రించుతఱి నామెచెంతకుఁబోయిన ట్లూహించెను. ఆమెయు నిద్రించుచు వచ్చినభగవంతునిఁ గాంచెను. కృష్ణుఁడీతనువున నచటికిఁ బోలేదు. సర్వాంతర్యామి కీదేహమేమి వాస్తవమా. ఆమె కోరినదేమని? శ్రీరామచంద్రుని బతిగా నున్న మంచిదనియేకదా. ఆఫల మీజన్మమున ఫలింపఁజేసెను. ఎప్పుడు? నిద్రావస్థయందు? ఎట్లు భావనచేతనే. కాఁబట్టియే "జగన్నాథప్రియాం సతీమ్" అని మూలమునఁ దోఁచెడిని. జగన్నాథప్రియామ్ = శ్రీకృష్ణుని బ్రీతిపాత్రురాలయి సతీమ్=పతివ్రతయగు నని యర్థము కదా. పతివ్రతలను జెఱచుటయా శ్రీకృష్ణునిపని?

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

అన్నప్రతిజ్ఞాఫలము స్త్రీసుఖమనుభవించుటయా. ఇట్లు గ్రహింపకుండుట పాపమనక మఱేమనవలయు? దీనిసారమేమి? అనుప్రశ్నము గలదు. దానికి సమాధాన మిది. శ్రీహరి మన

స్పునఁ గుబ్జావాంఛ సమకూరుఁగాక యని తలంచెను. వెంటనే శ్రీకృష్ణరూప మానారీమణికి నిద్రావస్థలోఁ బొడకట్టెను. ఆమెయు మేలుకొనలేదు. స్వప్నమున శ్రీహరి తనకు భర్తయై నట్లు కనుఁగొనెను.తదంగస్పర్శముకూడ లభించినట్లు తలంచెను. అంతలో గోలోకమునకుం బోయెను. రామావతారమున హరిని మోహించినందునఁ దత్ఫలము నిద్రావస్థయందు భావనారూపమునఁ గాంచెను.

భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః.

అనిగదా సూక్తి విరాజిల్లెడిని. భావనచేతనే పరమేశ్వరుఁడు ప్రసాదించును. బాహ్యవినుతులచేఁ గాదు. పదార్థములచేఁ గాదు. డాంబికాచారములచేఁ గాదు. భక్తునియాత్మ శుద్ధినిగాంచియే మహానందమందును. కావున నామె యర్పించిన దివ్యచందనముననే పరితృప్తుఁడై యామె కాంతినీరూపముగాఁ దీర్చి ముక్తినొసంగెను. తనసేవకబృందమునఁ జేర్చెను. ఇఁక భాగవతమునఁగల యీవిషయమునే విమర్శించెదను.

అథ విజ్ఞాయ భగవాన్ సర్వాత్మా సర్వదర్శనః, [యా.
సైరంధ్ర్యాః కామతప్తాయాః ప్రియమిచ్ఛన్ గృహం య

... ... ... ...

అథోద్ధవస్సాధుతయాభిపూజితో
న్యషీద దుర్వ్యా మభిమృశ్యచాసనం,
కృష్ణోఽపి తూర్ణం శయనం మహాధనం
వివేశ లోకాచరితా న్యనువ్రతః.

... ... ... ...

తస్యై కామవరం దత్త్వా మానయిత్వాచ మానదః,
సహోద్ధవేన సర్వేశ స్స్వధామాగమదృద్ధిమత్.
దురారాధ్యం సమారాధ్య విష్ణుం సర్వేశ్వరేశ్వరమ్,
యావృణీతమనో గ్రాహ్యా మసత్త్వాత్కుమతిర్హ్యసౌ.

భాగవతము ౧౦. స్కం. ౪౮ అధ్యా.

అని భాగవతమునఁ గన్పట్టెడిని. సర్వాత్మకుఁడు సర్వ ద్రష్టయునగు శ్రీహరి సైరంధ్రి కామవికారము నెఱింగి యుద్ధవునింగూడి యామెయింటికింబోయి యామెశయ్యం జేరి యామెకుఁ గామవరము ననుగ్రహించి మన్నించి యుద్ధవునిం గూడి తననివాసమున కేగెనని దీనిసారము. సర్వేశ్వరుఁడై దురారాధ్యుఁడగు నీశ్వరు నారాధించియు ముక్తిని గోరక పోవుటచేఁ గుబ్జ యదృష్టవంతురాలు కాదు. అని యీకథపై శుకులవారిభావము. ఈకథనుబట్టియే యించుక పరిశీలింతము. దానినుండి సామాన్యుల మగునస్మదాదులము గ్రహింపఁదగిన నీతియేది? పూర్వజన్మమున శూర్పణఖ యనఁబడు నీకుబ్జ రాము నింగూర్చి తప మొనరించెను. అనుకథ యిటఁ బరిశీలింపక యీ కథనుమాత్రమే ప్రధానముగాఁ జేసికొని యూహింతము. లోకానుభవమును దానితోఁ జొప్పింతము. అపుడు సారము తేలక మానదు.

శ్రీకృష్ణుఁడు సైరంధ్రి యగుకుబ్జ మనఃపరితాప మెఱింగి యామె కామమును దీర్పఁబోయెననికదా భాగవతమునఁ బొడ

కట్టుకథ. ఒకనాఁటిరాత్రి యామెయింటికిం బోయెను. వెంట నుద్ధవుఁ డరిగెను. ఉద్ధవుఁడు భక్తులలోఁ బేరెన్నికఁగన్న వాఁడనుట సుప్రసిద్ధము. అట్టి యుద్ధవుఁడు శ్రీహరివెంటఁ బోయెను. కామశరపీడితుఁ డగుపురుషుఁడు రతికేళికై పోవుచు నసుంగుఁ జెలికాని నట్టివానినే కొనిపోవునుగాని తన్ను సర్వేశ్వరునిగా భావించి తనసేవచేసి ముక్తిని బడయఁగోరుభక్తుని దాఁజేయు వ్యభిచారమును జూడనీ యని పిలుచుకొనిపోఁడు. ఒంటరిగాఁ బోవుట సర్వసమ్మతము. ఒకానొక కాముకుఁడు తనవేడుకచెలి కానిం గూడఁ బిలుచుకొనిపోవునన్నను బాధ లేదు. అట్టులుండ శ్రీకృష్ణుఁడు తనపాదసేవఁగోరిచేయుచు సంసారసాగరమునుండి తరింపఁగోరు నుద్ధవుని బిలుచుకొని నేను జేయఁబోవు నింత ఘన కార్యమును జూతువుగాని రమ్మని కొనిపోయెనని చెప్పుట పరిహాసాస్పదము కాదని యెవ్వరందురు? ఐతే దీనిసారమేమి? అన్నది ప్రశ్నము.

కుబ్జ భగవంతునిజూడగనే భక్తిరససంభరితస్వాంత యయ్యెను. కాననే యంగరాగము నిమ్మని హరికోరఁగనే మీకన్న దీనిధరింపఁదగువా రెవ్వరని ప్రశ్నించెను. వెంటనే యొసంగెను. భగవద్దర్శనమున మనస్సు పరిపక్వమయ్యెను. ఆమెయిచ్చిన యంగరాగమును రామకృష్ణులు గ్రహించిరి. నాయింటికి రమ్మని ప్రార్థింప నంగీకరించిరి. తరువాత శ్రీకృష్ణుఁ డుద్ధవునింగూడియే పోయెను! భక్తు లెట్టియెట్టివారుకలరో చూపఁదలఁచియే యుద్ధవునిగొనిపోయెను. ఉద్ధవుఁడు యథావిధిఁ బూజితుఁడై యామె

యిడిన భద్రాసనమునఁ గూరుచుండక దాని స్పృశించి భూమి పైఁ గూరుచుండెను. శ్రీహరి యామెశయ్యఁ జేరెను. ఉద్ధవుని బహిర్భాగమున నిలిపి కొంచెము పనియున్నది. ఆపనికాఁగానే వచ్చెదనని శ్రీహరి చెప్పిపోలేదు. శయ్యఁజేరెను. ఆమె యాతరుణమున లోకజ్ఞానవిహీనురాలయ్యెను. శ్రీహరి సర్వాంగసందర్శనమునఁ గృతకృత్యురాలనగుదుననియే నమ్మెను. ఆవిషయము భగవంతుఁ డెఱుఁగును. కాఁబట్టియే.

తస్యై కామవరం దత్త్వా మానయిత్వాచ మానదః.

అనుసూక్తి సార్థక మొనరించెను. ఆమెవాంఛను వరమున దీర్చి యని యర్థము లేక సుఖించెనన్నచో "మానదః" అన్నవిశేషణము సార్థకముకాదు. మానము నొసఁగువాఁడు. అనఁగా మర్యాదనుగాపాడువాఁడని భావము. మర్యాదకాపాడుట యనఁగా నిట్టిదే యైనచో ఆమర్యాద నెవరు కోరుదురు. అంతియేగాక "మానయిత్వా" అనియు నున్నది. అనఁగా మర్యాదచేసి లేక మన్నించి యనియర్థము. ఆమెభక్తికి మెచ్చి యనిభావము. ఇట్టితావుల భగవంతునిచర్య లెట్టివని వర్ణింపఁబడవలయునో తెలుపుచున్న యీశ్లోకాభిప్రాయము నెఱింగినయైన నపార్థముల నల్లకుందురుగాక యని పండితమ్మన్యుల నభ్యర్థించెదను. భావసారమేమనఁగా,

సర్వాంగసుందరియగు నొకభక్తురాలు భగవంతుని బ్రార్థించినపుడు రారాముద్దుకృష్ణా! నాయందనుగ్రహ మునుపుము. నన్నుఁ గటాక్షవీక్షణముల నలరింపుము. నావాంఛిత

ములఁ దీర్పుము. నన్నుఁ జేపట్టుము. అని ప్రార్థించును. సర్వసంగపరిత్యాగము చేసిన భక్తుఁడొకఁడు భగవంతుని వేఁడుతఱి మహాత్మా! ఈసంసారసాగరమునుండి నన్నుద్ధరింపుము. శాశ్వతానందము నను గ్రహింపుము.నీపాదపద్మసమారాధనము చేకూర్పుము. అని వేఁడును. ఈ రెండుప్రార్థనము లొక్కటియే యని నాభావము. ఇరువురకుఁ బ్రాప్యస్థాన మొక్కటియే. ఇరువురు ప్రార్థించున దొక్కభగవంతునే. మాటలుభేదము. నన్నుఁ గటాక్షవీక్షణముల నలరింపుమనుచో శృంగారపరముగా నర్థము చెప్పి రతికేళి నలరింపుమని యాసుదతి కోరెనని చెప్పినను జెప్పవచ్చును. ఇది వివేకముచాలనివాని యర్థము. ఈమ్మాటలే ప్రహ్లాదునివంటి భక్తునివాక్కునుండి వెడలిన నవు డింకొక యర్థము చెప్పుదురు. అనఁగా నర్థము చెప్పెడువాని మనోభావమట్టిదియే కాని ఆసుందరిభావ మదికాదు. దీనిదోషము పాఠకులు గ్రహింపవలయును. కాఁబట్టి కుబ్జ భగవత్కైంకర్యమునే కోరెను. ఆమెకు వాంఛితార్థము లొసఁగి రక్షించెను. ఉద్ధవునింగూడి యామెయిల్లు వెడలివచ్చెను. ఉద్ధవునివంటిభక్తుని గూడిపోవుట యనువిషయమే యీపైభావమును సిద్ధాంతము చేయుచున్నది. ఉద్ధవుని వీథిగుమ్మముకడఁ గూరుచుండఁబెట్టి యీసైరంధ్రియింటికిఁబోయి కొంచెము పనియున్నది. ఆకోరిక తీర్చుకొనివచ్చెద. నీకు ముక్తినొసంగెద. అని శ్రీకృష్ణుఁడు లోనికింబోయి రతిసుఖ మనుభవించి వచ్చెనని కల్పించుట తెలివితక్కువ ప్రసంగములో మొదటిదగు. కావున నట్టి యపార్థ

ములఁ గల్పింపక కుబ్జావరదానమను నీభగవల్లీలను బఠించి భక్తిని దృఢమగునట్లు చేసికొనఁ బ్రయత్నింపుఁడు. అదియే భక్తులకృత్యము. ఇఁక దర్వాతికథను బఠింపఁ బ్రయత్నింపుఁడు.

కంసునకు దుర్నిమిత్తములు తోఁచుట.

* రామకృష్ణులు ధనుర్భంగము, దాని కావలివారిని వధించి రాత్రి సుఖనిద్ర చేసిరి. ఆరాత్రి శ్రీకృష్ణమూర్తి తేజో రూపమునఁబోయి కుబ్జకుఁ గనఁబడి ముక్తిని బ్రసాదించివచ్చెను. ఈయద్భుతవృత్తాంత మెవ్వ రెఱుంగరు. ఇచ్చటికథ యిట్లుం డఁగా నిఁకఁ గంసునివృత్తాంత మే మని విచారింపవలయును. సాయంకాలము ధనుర్భంగవృత్తాంతము కంసునకు శ్రవణగో చరమయ్యెను రజకవధము, వాయకసుదాములవార్తలు, కుబ్జా విముక్తియుఁ దెలిసియుండునని యూహించుటలోఁ దప్పుండ దుకదా. ఈవృత్తాంతములుచెవులలోఁ దూఱఁగనే చింతా క్రాంతస్వాంతుఁ డయ్యెననుట యొకవింతవార్త కాదు. ఆరాత్రి శయ్యఁజేరి యెట్లో నిద్రనాశ్రయించెను ఆనిద్రయు వీనికి భీతిని గల్గింపవలయునన్నయూహతో నాతని నాశ్రయించెనని చెప్పవచ్చును. సుఖనిద్ర చేసె ననుటకంటెదుఃఖనిద్ర చేసె ననుట సముచితము. ఎట్లోనిద్రపోయెను.ఆనిద్రయందుభయవిహ్వలుఁ డయ్యెను. ఆనిద్రలో నొకస్వప్నమును గాంచెను. అది దుఃఖ ప్రదమగుటయేకాక మృత్యుప్రదము నని చెప్పవచ్చును.

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండమునందుమాత్రము కానవగు. ఇతర పురాణములందు దీనికి సూచనలు కానవచ్చెడిని. దీర్ఘప్రజాగరో భీతోదుర్ని మిత్తాని దుర్మతిః, బహూన్యచష్టోభయధా మృత్యోర్దౌత్యకరాణిచ. అని శ్రీభాగవతమునఁ గలదు.

సూర్యుఁడు భూమియందుండెను. అందు సూర్యబింబము నాల్గుఖండములై యాకసమునుండి భూమిపైఁబడెను. చంద్రబింబము పదిశకలములై యంబరమునుండి క్రిందఁ బడియుండెను. వికృతాకారములుగలిగి పాశహస్తులై దిగంబరులై పురుషులు కొందఱు కనఁబడిరి. విధవ యొకతుక ప్రత్యక్షమయ్యెను. ఆమె మున్ను శూద్రపత్ని. దిగంబరురాలు. నాసిక తెగి యుండెను. ఊరకుండక నవ్వుచుండెను. చూర్ణతిలకయుత. తలవెండ్రుకలు శ్వేతకృష్ణవర్ణములై నిక్కియుండెను. ఖడ్గము తలపుర్రెయు హస్తములందుండెను. నాలుక యల్లల నాడుచుండెను. కపాలహారములు దానివక్షమున వ్రేలాడుచుండెను. ఇట్లు వికృతరూపముగానున్న యాస్త్రీ కంసుని కభిముఖమైయుండెను. గాడిద, దున్నపోతు, వృషభము, సూకరము, ఎలుగుబంటి, కాకము, గృధ్రము, వానరము, విరజపక్షి, కోడి, మొసలి, జంబుకము, భస్మరాశి, ఎముకలప్రోవు, తాటిపండ్లు, వెండ్రుకలు, పైకెగురుచున్నదూది, శవదహనము చేయునగ్ని, కొఱవిదయ్యములు, చితిపైఁ బెట్టియున్న మనుష్యశవము, కూలాలుఁడు, తైలమతీయువారిగుంపులు, వక్రకపర్దకము, శ్మశానము, కాలుచున్నకొఱవులు, ఎండుకట్టెలు, దర్భ, గడ్డి, నడచిపోవుచున్న తలలేని శరీరము; సంగీతముపాడుచున్న మృత్యుశిరస్సు, కాలుచున్నస్థలము, బూడిదయుండుచోటు, జలములేనిచెఱవు, కాలుచున్న మత్స్యము, కాలుచున్నయినుము, కాలుచున్నయడవి, వృషలుఁడు, దిగంబరుఁడు, తలవిరియఁబోసికొన్న పురుషుఁడు, మిగుల నాగ్రహించియున్న బ్రాహ్మణుఁడు, శపించుచున్న గురువు, మహా

త్తరకోపావిష్టుఁడగుసన్న్యాసియు, అట్టియోగియు, అట్టివాఁడే యగువైష్ణవుఁడు వీరెల్లఁ గంసునకు స్వప్నమునఁ బ్రత్యక్షమైరి.

ఈదుస్స్వప్నపరంపర రాఁగానే యులికిపడిలేచి కూరుచుండి యావృత్తాంతమును దల్లికిఁ దెలిపెను. దుఃఖించుచున్న భార్యను బ్రేమవిహ్వలాంగిని బిల్చి వక్కాణించెను. భార్త్యముఖ్యులకుఁ దెలిపెను. ఈస్వప్నముతన కపకారముచేయకమానదని నిశ్చయించుకొనెను. కృష్ణుని బలరాముని జంపినఁ దనకీలోకమున మృత్యువే లేదని యాత్మఁ దలంచెను. మందమతియైయిఁక నూరకుండరాదనియు నూహించెను. రేపు శ్రీకృష్ణుని బొలియింపక మానఁగూడదని నిర్ణయించుకొనియెను. తా నమ్మియున్నకువలయాపీడ మనుగజేంద్రము చాణూరముష్టికులు తన్నుద్ధరింతురని విశ్వసించెను. గొప్పసభచేయించి యందుఁదానున్నతాసనమున నెత్తుగాఁ గూరుచుండి మల్లద్వయముచే సోదరులఁ జంపింపనెంచెను. ఇవన్నియు మానుషప్రయత్నములనియు దైవతంత్రము వీని కనుకూలింపకున్న నివి నిష్ఫలములగుననియుమాత్ర మాతఁడు తలంపకుండుటయే విచిత్రము. అకాశమున కెగిరినకుమారి నిన్నుఁ జంపఁగలవాఁడు పెరుఁగుచున్నవాఁడు దుర్మతీ. యన్నపలుకు మఱచెను. తనయత్నము సాగుననియే తలంచెనుగాని యారాత్రి తనకుఁ దోచినవన్నియుఁ ద్వరలోఁ దనకు మృతియని తెలుపుచున్నవని యెుఁగఁజాలక పోయెను. దుస్స్వప్నములకు శాంతిచేసిన నాఫలము కలుగదనియే తలంచెనుగాని వేఱొకయాలోచన మాతనికిఁ దోఁపదయ్యెను.

ఎట్లో తెల్లవారెను. పరిజనులు కొలువునకువచ్చి కనఁబడిరి. మంచముల నిర్మింప నాజ్ఞాపించెను. ద్వారభూమిఁ గువలయాపీడమును నిలిపెను. అది దుర్మదాంధ్యము. ఎట్టివారినేఁ జంపక విడువదు. చాణూరముష్టికుల కాజ్ఞాపించెను. యుద్ధము చేయఁదగు వీరభటుల నాహ్వానించెను. వారెల్ల సంసిద్ధులై యుండిరి. పుణ్యాహవాచనము చేయించెను. తనకు మేలుచేకూర్చుకృత్యముల నాసభాభవనమునందే చేయించెను. పురోహితుని జక్కఁగా భగవంతుని బ్రార్థింపుమా యని హెచ్చరించెను. తానును గృత్యములఁ జేసి నియతుఁడై రామకృష్ణులఁ జంపు కుతూహలమున నుండెను. రంగమండపమంతయు మనోహరముగా నలంకరింపఁబడియె. సుముహూర్తము సమీపింపఁగా శుభవాద్యములు యథార్థముగా మ్రోగెను. అవన్నియు శుభనాదములే. ఎవ్వరికి మేలుతెలుపుచున్నవి? లోకమునకు ధర్మాత్ములకు మేలు తప్పక గలుగునని తెల్పసాగెను. అవన్నియుఁ దనకు శుభసంపదల నొడఁగూర్చునని యాదురాత్ముఁ డెంచెను. అంతియకాని తత్పూర్వదిన మొనరించిన భగవదద్భుతకృత్యములఁ దలంచియైన భగవంతు నాశ్రయింపఁ దలంపలేదు.

ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపిపుంసాంమలినాభవంతి.

అన్నసూక్తి తప్పదుకదా! ఇట్లు కంసవధరూపమహత్తమ మంగళకార్యమున కన్నియు సంసిద్ధము లయ్యెను.

ధనుర్యాగమునకుఁ బిలువంబంచిన రాజులందఱు వచ్చి కంసుని దర్శించిరి. వారినెల్ల యథావిధి బహూకరించి రంగమండ

పమున నుండఁబంచెను. యథాస్థానముల వారెల్ల నామల్లరంగమున నాసీనులైరి. మంచములనెల్లఁ బుష్పమాలికలచే నలంకరించియుండిరి. పౌరులు జానపదులు మల్లరంగపమును జూచువేడుకరై నందుఁ బ్రవేశించి కూరుచుండిరి. రక్షకభటు లెల్లయెడల నిలిచి సంసిద్ధప్రయత్నముల నుండిరి. మధ్యభాగమున మల్లరంగము సాటిలేక యమరియుండెను. అందిరువురుమల్లవీరులు నిలిచియుండిరి. వారికి నీ డీభూమండలమున లేరని యందఱు విశ్వసించియుండిరి. వారింజూచినమాత్రాన నెట్టివారికే మది భీతి జనింపక మానదు. వాస్తవముగ వారట్టివారే. కాని వారి కాశక్తిని బ్రసాదించిన దెవ్వరు? ఆసర్వేశ్వరుఁడేకదా! అతని ముందీతుచ్ఛు లేపాటి? ఈవిషయమునుమాత్ర మెవ్వరు నూహింపరు.

కంసుఁ డంత రాజచిహ్నాభిరాముఁడై మంత్రిసామంతపరిజనాన్వితుఁడై మహావైభవమున రాజయోగ్యమంచము నెక్కెను. విచిత్రఖడ్గ మాతనిచెంత నలరారుచుండెను. తన చుట్టుపట్టుల రాజశార్దూలములను రణప్రచండవీరులను బ్రాహ్మణులను మునీశ్వరులను గూరుచుండ నియోగించెను. వారెల్ల రుపవిష్టులైరి. కంసక్షేమకాంక్షులగువారెల్లరు సకలాస్త్రశస్త్రసంభృతపార్శ్వులై యుండిరి. కొండపైఁబడినను జెండాడఁగల మనునమ్మకము వారికెల్ల నుండెను. సకలప్రయత్నములు తన యాజ్ఞానుసార మమరియుండుటంజూచి కంసుఁ డానందపరవశుఁ డయ్యెనుగాని పూర్వత్రియామయందుఁ దనకుఁదోఁచినదుస్స్వ

ప్నము లోకవంకఁ గలంచుచుండెను. తనమిత్రులందఱు తన్ను రక్షింతురనియు హస్తివర్యము మల్లద్వంద్వము బలరామ శ్రీకృష్ణులఁ బరిమార్చుననియు నమ్మక మాతనిభీతిని గొంత తొలఁగించుచుండెను. తనయాయుధములే తన్ను జంపుననిమాత్ర మాతఁ డూహింపలేదు.

"విషమప్యమృతంక్వచిద్భవేదమృతం వావిషమీశ్వరేచ్ఛయా."

అన్నమాట యతఁడు తలంపకుండుట దుష్కాలముగుటయేకదా.

కంసభూపాలునిపంపున నందాదుల నాహ్వానింప దూత లరిగిరి. అంతకుముందే గోపాలకులెల్ల మల్లరంగమున కేగు ప్రయత్నముల నుండిరి. రామకృష్ణులు సంసిద్ధులైయుండిరి. వారికీమల్లరంగమేమి యద్భుతావహామని తోఁచునా. ప్రపంచమే క్షణమున మార్పఁజూచుమహనీయుల రంగ మొకతుచ్ఛకార్యముగాఁ దోఁపకుండునా! ఆయాహ్వానము నాలకించి నందాదులంగూడి బృందారకపరిసేవితచరణారవిందులగు నాసోదరులిర్వురును గదలిరి. నందునకేని వారిబంధువులకేని మల్లరంగమున కేగుట యొకభీతిజనకముగాఁ దోఁపదయ్యెను. ఏల ? భగవద్భూరిపదద్వయము చెంతనున్నది. ఇఁక వారి కేమిశంక ? మహానందమునఁ బెండ్లికిం బోవునట్లే పోయిరి. నందాదులు మల్లరంగమును జొచ్చిరి. వారివెనుక రామకృష్ణులు పోవుచుండిరి.

## కువలయాపీడాఖ్యగజవధము.

రామకృష్ణులు ప్రవేశించుతఱి నంబష్ఠుఁ డామదగజమును వారిం జంపఁ బురికొలిపెను. అదియు వారిపైకిఁ జను

దెంచుచుండెను. ఆవిధమెఱింగి శ్రీకృష్ణుఁడు పట్టుదట్టిని బిగించి జడముడి సవరించుకొనుచుఁ దత్పాలకుం డగునంబష్ఠుని గాంచి మేఘగంభీరనాదమున నిట్టు పలికెను. అంబష్ఠా! అంబష్ఠా! మాకు మార్గము నిమ్ము. త్వరగా నావలకుఁ బొమ్ము. పోవవేని నిన్ను నీకుంజరమును యముప్రోలికిం బంపెదను. ఈఘట్టమున మహాకవిపోతనశక్తిం దెలుపఁ బద్యమును దహరించెద.

శ్లో. అంబష్ఠాంబష్ఠ మార్గం నో దేహ్యపక్రామ మాచిరం
నో చేత్సకుంజరం త్వాద్య నయామి యమసాదనమ్.

అని మూలము.

శా. ఓరీ కుంజరపాల! మాదెసకు నీయుద్యన్మదేభేంద్రముం
బ్రేరేపం బనిలేదు త్రిప్పు మరలం బ్రేరేచితేని న్నినుఁ గం
భీరోగ్రాశనితుల్యముష్టిహతులన్ భేదించి నేఁ డంతకుం
జేరం బుత్తు మహోత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్.

సమయోచితజ్ఞాన మెంతకలదో పరికింపుఁడు. రసికజనచక్రవర్తి గదా పోతన !!

ఆమాటల కాగ్రహించి యాయంబష్ఠుఁ డాగజరాజమును మఱింత పురికొల్పెను. అది ప్రళయకాలకాలాకృతిం జెలరేఁగి కృష్ణునిపై కడరెను. ఇట్టు లడరి యాబాలగోపాలునిఁ దొండమునఁ బట్టుకొనఁగా శ్రీహరి యాపట్టు నెట్టన తప్పించుకొని ముష్టిహతుల నొప్పించి కాలం దన్నెను. దాన నామదద్విరద మతిభీషణాకృతియై వడివడి నడరి తుండాగ్రమున స్పృశిం

పఁగా దాని నిమేషమాత్రమునఁ దప్పించికొని వెనుకకుందిరిగి తోఁకఁబట్టుకొని యిరువదైదుధనుస్సులదూరమునకు దాని నవ లీల నీడ్చెను. అత్తఱిఁ దద్విలాసము నాగమును సుపర్ణుఁ డీడ్చు కొనిపోవుతెఱంగుగా నమరెను. అంత నది వెనుకకుఁ దిరిగి శౌరి నొంపఁబూనునంతలో సవ్యభాగముగానుండు గజమునకు దక్షిణభాగముగాఁ దానుదిరిగి యావృదూడతోఁ దిరుగుబాల కునివలె నుండెను. అంత హరి ముందున కేతెంచి ముష్టిహతుల దాని నడంచి యది యెట్లు తిరిగిన నట్లు తానుఁ దిరుగుచుఁ బలుసారులు ముష్టిహతుల నొంచెను. ఆగజము పరువెత్తుచు భూమిం బడి వడిలేచి హరిని భూమిపైఁ బడినట్లే యూహించి దంతఘాతమున భూతలమును. బీడించెను. తనప్రతాపము వ్యర్థ మగుటం దలంచి యతిశయితక్రోధమూర్తియై మావటివాఁ డింకను బురికొలుప శ్రీహరిం బట్టుకొనఁ బరుగిడెను. తనపై కిట్లు బెట్టుపచ్చు నాదంతావళేంద్రమును గాంచి భగవంతుఁ డిఁక నీయాఁట చాలునని యూహించి దానితుండమును గర మునఁ బట్టి లాగి క్రిందఁబడునట్లుచేసెను. పడినంతనే పైకొని కాలందన్ని సింహాకృతిఁ దాల్చి దంతముఁ బెకలించి దాననే దానిని బలుసారులు కొట్టెను. అదితన్నుకొనుచుఁ జచ్చెను. ఆ దంతము కరమున నమర హరి బయటికిరాఁగా నాపరమేశ్వరు మూర్తివిశేష మాసమయమున భుజశిఖరమున గజదంతము, రక్తమదబిందువితత్యంకితశరీరభాగము, స్వేదజలకణికాలంకృత వదనారవిందము గలిగి యపూర్వశోభచే వెలుఁగొందెను.

కువలయాపీడగజపూర్వవృత్తాంతము.

ఆర్యులారా ! కువలయాపీడ మనుగజమును హరి వధించినప్రకారముం బఠించితిరి. ఈగజ మేల కంసుని దాపుననుండి హరిం జంపు వేడుకం బూనె నన్నగాథను బఠింపుఁడు. ఆమీఁద దీనివిధమంతయుఁ దేటపడును. *బహుళాశ్వమహారాజు నారదమునిం గాంచి యిట్లు ప్రశ్నించెను మునీంద్రా ! కువలయాపీడమను నీగజ మెవ్వరు? పూర్వజన్మమున దీనికేమని పేరు? గజత్వమెట్లలవడెను? కృష్ణహతమై యేగతి నొందెను? వచింపుమా యన నారదుఁ డిట్లు చెప్పెను. రాజా ! వినుము. బలిచక్రవర్తి కుమారుఁ డొకఁడు గలఁడు. వానిపేరు మందగతి యని. అతఁడు బలాఢ్యుఁడు. సకలశాస్త్రములయం దత్యద్భుతప్రజ్ఞగలవాఁడు. నియుతనాగసమానబలశాలి. ఒకానొకప్పుడు రంగయాత్రకై జనులెల్ల నరిగిరి. ఈమందగతి వారినడుమఁ జొరఁబడి బాహువులచే నందఱఁ ద్రోయుచుఁ బోయెను. ఆజనసందోహమున నొక వృద్ధముని యుండెను. ఆమునినామము త్రితుఁడని. ఈమందభుజా ర్తి యామునిని కెక్కువగా నంటెను. దానఁ గోపించి బలిష్ఠుఁడై మత్తుఁడై యున్న యాబలినందనుం గాంచి శపింపఁ బూని బలినందనా! నావంటివృద్ధును బాధించితివి. కాన నాశాపమును బరిగ్రహింపుము. నీవు మదోన్మత్తుఁడవుగాన గజశరీర

* ఈవిషయము గర్గసంహితయందు మధురాఖండము పదునెనిమిదవ యధ్యాయమునఁ బండ్రెండవశ్లోకమునుండి తరువాతనున్న గ్రంథ మాధారముచేసికొని వ్రాయఁబడినదని యెఱుంగునది.

మును దాల్చి జనులఁ గరమర్దనమున బాధించుచు దేహయాత్ర చేయుచుఁ దిరుగుచుండుము. దుర్మతీ! గజరూపుఁడ వగుము. అని కోపావేశమునఁ బలుక నామహాముని శాపకారణమునఁ దనరూపము దంతిరూపముగా మాఱఁగాఁబడుచు మునిప్రభావమునెఱింగి కరయుగము జోడించి దీనస్వరంబున నోమహాత్మా! కృపాసింధూ! యోగీంద్రా! నీవు బ్రాహ్మణోత్తముఁడవు. నాయపరాధము సైచి యీగజత్వమునుండి యెపుడు ముక్తి కలుగునో ఆజ్ఞాపింపుము. మీవంటిజ్ఞానులను హేళనము చేయరాదు. అపకారము చేయరాదు. మీబోఁటిమాన్యులు మహర్షులు వరమీయను శపింపనుగూడ సమర్థులు. కావున నాయందుఁ గరుణయునిచి శాపముక్తి ననుగ్రహింపుమా యని వేఁడెను. ఇట్లాతఁడు దీనుఁడై వేఁడ నాత్రితుఁ డనుమానికుంజరుఁడు ప్రసన్నుఁడై క్రోధమును వదలుటయేగాక కృపాళువై దైత్యరాజకుమారా. నావచనము మృష కాదు. నీభక్తికి హర్షించితిని. దేవతకులంగూడ దుర్లబమగువర మనుగ్రహించెదను. శోకమును వదలుము. శ్రీహరిపురము మధుర యనునది కలదు. అందు శ్రీకృష్ణపరమాత్మ కరసరసిజమునుండి నీకు శాపముక్తి కలుగఁగలదు. సంశయము లేదు.

రాజా! ఆమందగతి యనుదైత్యుఁడే వింధ్యపర్వతమున గజముగాఁ బుట్టెను. కువలయాపీడ మనుపేరఁ బరఁగెను నాగాయుతబలము కలదయ్యెను. మగధాధిపతి లక్షగజములఁ బట్టునపుడు దీనింగూడఁ బట్టెను. ఆరాజు కంసునకు దీనిం గానుక

గా నిచ్చెను ఆమునివరమునఁ గువలయాపీడము శ్రీకృష్ణునిచేఁ బొడవడంగెను. దానియాత్మ శ్రీకృష్ణునిలోఁ గలిసెను. ఇదియే కువలయాపీడగజపూర్వవృత్తాంతమని నారదుఁడు తెల్ప రాజచ్చెరువందెను. మహర్షులవాక్కును గుఱించియు భగవంతుని కరుణను గూర్చియుఁ దలపోసెను.

మహానుభావులారా!

కువలయాపీడవృత్తాంతమును వింటిరి. దానిపూర్వవృత్తాంతమును గూడ నెఱింగితిరి. దీనినుండి మనము గ్రహింపఁదగినవిషయసార మొండు గలదు. పెద్దల కేలాటియపకారముఁ జేసినను దానిఫలము చిరకాల మనుభవింపక తప్పదు. ఎంతవాఁడైనను దానిఁ బొందక తీఱదు. కాఁబట్టియే,

"సాధుసజ్జనసంతాపః కి మాశ్చర్యం కులక్షయే"

అన్నసూక్తి వినఁబడియెడిని ఇదియేకాలమందైనఁ దప్పనిది. దానిం దప్పించువాఁడు భగవంతుఁడే కాని యీశ్వరుఁడద్దానిం బొందకుండఁ దప్పింపఁబూనఁడు. ఏలయన, తనయాజ్ఞను దా మీఱఁడు. స్వోక్తవ్యాఘాతమగుపని యాయన చేయఁడు. సత్యపూతమగు మునివాక్కు ఫలించుటకు హేతువు భగవదాజ్ఞయే కాని వేఱుకాదు. భగవత్స్వరూపమే తపస్సు. దాని నాశ్రయించువారు మునులు. భగవంతు నాశ్రయించినవారి వాంఛలు ఫలించుట సహజము. కావునఁ దపోధనులవాక్కు శాపమై బాధించును. అందుననే పెద్దలనుజూచి పరిహసించుట, వారికి బాధగల్గించుట చేయరానిపనులు. ఆవిషయ మీకువ

లయాపీడగజచరిత్రము తెలుపును. ఇఁక ననంతరవృత్తాంతము నాలకింపుఁడు.

## చాణూరముష్టికవధము.

కువలయాపీడమును వధించి శ్రీకృష్ణుఁడు బలరాముని గూడి గోపాలకులు వెంటరాఁగా మల్లరంగమును బ్రవేశించెను. అప్పటి భగవద్రూపము వర్ణింపఁబడినపద్ధతి నాలింపుఁడు.

శ్లో. మల్లానామశనిర్నృణాం
నరవరస్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం
క్షితిభుజాం శాస్తా స్వపిత్రోశ్శిశుః.
మృత్యుర్భోజపతేర్విరాడవిదుషాం తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగం గతస్సాగ్రజః.

శ్రీభాగవతము.

దీనికి విపులమగువ్యాఖ్య వ్రాయక మహాకవి పోతన పద్యము వ్రాయుచున్నాఁడను.

సీ. మహితరౌద్రంబున మల్లురకశనియై
నరుల కద్భుతముగ నాథుఁ డగుచు
శృంగారమునఁ బురస్త్రీలకుఁ గాముఁడై
నిజమృత్యువై కంసునికి భయముగ
మూఢులు భీభత్సమును బొంద వికటుఁడై
తండ్రికిఁ దయ రాఁగఁ దనయుఁ డగుచు

ఖలులకు విరసంబుగా దండిరై గోప
కులకు హాస్యంబుగాఁ గులజుఁ డగుచు
తే. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై
శాంత మొనర యోగిజనుల కెల్లఁ
బరమతత్త్వమగుచు భాసిల్లె బలునితో
మాధవుండు రంగమధ్యమందు.

పై శ్లోకమున కీపద్య మెంతచక్కఁగాఁ గుదిరినదో యారయుఁడు. మూలమునందు నవరసములు వర్ణింపఁబడినవి. పద్యరత్నమునం దాపేరులు వానికిఁ గారణముకూడఁ జెప్పఁబడినవి. ఈపట్టున నీపద్య మొకనీతిని మనకు బోధించుచున్నది. దానిని దెలుపక మాననయితికాదు. శ్రీకృష్ణుఁడు కువలయాపీడమను మత్తహస్తిని బొలియించి దానిదంతమును బట్టుకొని తనువు నిండ రక్తబిందువులు పడియుండఁగా మల్లరంగమును బ్రవేశించెను. అత్తఱి నాదివ్యపురుషుని నంద ఱొకవిధమునఁ జూడక వారివారిభావము లెట్లు ప్రసరించెనో యట్లు చూచిరని దీనిభావము. భగవంతుని జంపఁబూనియున్న మల్లరకు నశనిరూపమునఁ గనఁబడియెనఁట. అనఁగా రౌద్రరసము. భయంకరాకారుఁడై కనఁబడెనని భావము. మన మీతనిం జంపలేమని వారికి ముందే తోఁపఁజేసెనని సారము. మనుజుల కంద ఱకుఁ బ్రభువుగాఁ గనఁబడెనని భావము. అద్భుతరస మిట కన్పట్టును. అనఁగా సామాన్యమానవు లెల్ల మనకు రక్షకుఁ డని భావించిరని సారము. అద్భుతరస మేలాగనఁగా మున్ను

చూడనిరూపము కనఁబడఁగానే అచ్చెరువుగా నీమహాను భావుఁడు మనకుఁ బాలకుఁడుగా నుండుభాగ్యము గలిగినదని వారు భావించిరని గ్రహింపఁదగు. సహజప్రీతి యిటఁ గన్పట్టెడిని. వాస్తవమగుప్రీతి యిదియే కదా ! సామాన్యస్త్రీలకు మూర్తిని దాల్చిన మన్మథుఁడుగాఁ గనఁబడియెనఁట. శివుని కంటిమంట నడంగిన మన్మథుఁడు మరల దేహము గలిగి వచ్చెనా యని వా రూహించిరని భావము. అంతకుమున్ను మన్మథుని జూచియుండలేదు. పుస్తకములలోఁ జదివియుండిరి. అతఁడు మృతినొందెననియు వినియుండిరి. సౌందర్యమునకు నుదాహరణము మన్మథుఁడనియే యందఱిమతము. ఆభావమే వనితలకుంగూడఁ గలదు. కాఁబట్టి యింతకుముం దిట్టి దివ్యమంగళవిగ్రహమును జూచియుండలేదు కావున వినియున్నభావము స్మృతిగోచరమయ్యెను. శృంగారము స్త్రీలస్వభావము కదా. కాఁబట్టి శృంగారరస మిటఁ గన్పట్టెడిని. సౌందర్యరాశిగాఁ దలంచిరని దీనిసారము. శృంగారాధిదేవత యనియే వారు భావించిరని యిట గ్రహింపందగు. గోపకులాపరమపురుషుని తమజ్ఞాతిగాఁ దమయింటఁ బుట్టినవానిగా భావించిరని భావము. హాస్యరసమిట సూచింపఁబడినది. సకలాంతర్యామి యగుసర్వేశ్వరునిఁ దమజ్ఞాతిగా భావించిరనుట హాస్యాస్పదముకదా ! స్వల్పదృష్టిగదా యిది. సర్వేశ్వరునిగా భావింపవలసియుండెను. అట్టివానిని రాజ్యమును బాలింప యోగ్యతలేని తమకులమునఁ బుట్టిన యొకనిగాఁ దలంచుటకన్న నీచ

భావము వేఱొండుండునా. కావున హాస్యరసము. దుష్టులగురా
జులకు మృత్యువుగాఁగనఁబడియెను. అనఁగా నామహాపురుషుని
మూర్తివిశేషము వారికి భీతిని గల్పించి మన మిఁక జీవింపఁ
జాల మనునిరాశను గల్పించెనని దీనిసారము. వీరరస మిటఁ
గన్పట్టెడిని. రాజులంతకుముం దామహాత్ముని యద్భుతచర్యల విను
టయే కాని చూడలేదు. అమూర్తియం దధికద్వేషము వారి
కున్నది. ఆట్టిమూర్తి కనఁబడఁగనే తమంతన తమరే మనల నీతఁ
డుపాలియింపక మానఁడన్న యూహగలవారై రని గ్రహింపవల
యును. తండ్రి యగునందునకు వసుదేవునకుఁ గుమారుఁ డన్న
భావమే జనించెను. దాన వారికి మఱింతకరుణ వెల్లివిరిసెను. ఇటఁ
గరుణారసము సూచింపఁబడినది. ఇందఱ కిన్ని యూహలు కలు
గఁగా నందాదులు కుమారునిగానే భావించిరి. నాకన్న కొడు కింత
వాఁడాయెఁగదా. నానోములు ఫలించిన వన్న సంతోషముకల
వారై రని భావము. మల్లరంగమున జరగఁబోవు యుద్ధమునఁ
గొడుకులు జయింతురో లేదో యన్న సంశయము పోయి
కరుణ యుప్పతిల్లెనుటచే ముందు విజయము గల్గనుంటచే
నాభావమే వారికిం దోఁచెనని గ్రహింపందగును. భోజవంశపా
లకుఁ డగుకంసునకు మృత్యువుగా నాభగవన్మూర్తి కన్పట్టెను.
దీనిచే భయానకరస మిట సూచితమని గ్రహింపఁదగును. అంత
కుముం దాకంసుఁ డీబాలకుని జంపింపఁగలనని గంపె డాశతో
నుండెను తన్మూర్తివిశేషము చతుర్గోచరము కాఁగా మృత్యు
వెదుటఁ గన్పడినట్లు తోఁచెను. మృతియాసన్నమయిన ట్లాతనికిఁ

దోఁచెనని గ్రహింపందగు. మూఢులు విరాట్టుగా అపర్యాప్త ప్రకాశునిగా భావించిరని భావము. కాన నిట భీభత్సరసము సంసూచితము.పరమయోగులామూర్తిం గాంచి పరతత్త్వమని భావించిరి. ఇట శాంతరసము సంసూచితము. యోగులు నిరంతరము భక్తిభరమునఁ దమహృదయాబ్జమునఁ బరమేశ్వరు నిలిపి తత్తేజోరూపమునే ధ్యానింతురు. వారియానందమునకుఁ గొదువ యనునది లేదు. ఆధ్యాననిష్ఠయందు నెన్నియోదినములు గడచిపోవును. వారి కవ్వి డొడలు తెలియదు. దానికే మహానందమనియు, బ్రహ్మానందమనియుఁ బేరులుగలవు. ఆయానంద మవ్యయము, అపరిమేయము నగు. యోగులుకానివారికది తెలియఁబడదనుట సిద్ధాంతము. భర్తృహరి.

శ్లో. ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుజలం పిబంతి శకునా నిశ్శంక మంకేశయాః.

అని యోగులధ్యానమును వర్ణించెను. కరచరణాద్యవయవ విశిష్టునిగ ధ్యానించుట యవ్యయానందసుఖకాంక్షులచేఁ గాదు. వారైహికఫలమును గోరరు. ఐహికసుఖములను గోరువారు సాకారునిగా భగవంతుని ధ్యానింపవలయు. తేజోరూపోపాసము పరమపవిత్రము. దానిని యోగులే చేయఁబూనుదురు. ఇతరుల కది దుర్జ్ఞేయమయియుండు. ఇట యోగులాశ్రీకృష్ణుని దేజోరూపునిగా ధ్యానించిరి.-వారు పరతత్త్వమనియే తలంతురు.బాంధవులగు వృష్ణికులజులు కృష్ణమూర్తిని మల్లరంగ

మునఁ గనుంగొని పరదేవత యనియే తలపోసిరి. ఆసమయమున వారిమది కట్లు భగవంతుఁడు చూపట్టెను.

ఆర్యులారా! ఇట్లు భగవంతుఁ డందఱ కన్నిరూపులై దర్శనమిచ్చె ననఁగాఁ దాత్పర్యమేమి? అనునదియే యొక్కఁగట్టిప్రశ్నము. దీనింగూర్చి యింత పెంచి వ్రాయనేల? అన్నది రెండవప్రశ్నము. కారణము వినుఁడు. ఈరీతి నింద ఱిన్నిరూపుల నిట్లు భావించి రనుదానిలోనియర్థమును గ్రహించుటయే మనకుఁ దరణోపాయము. నిష్పక్షపాతి భగవంతుఁడన్నవిషయ మీశ్లోకము చెప్పుచున్నది. ఎవ్వరెవ్వ రెట్లెట్లు భావించిన నందఱ కోర్కె లొక్కవిధమునఁ బ్రసాదించు ననుటయే యిందు నీతి. శృంగారప్రధానముగా భావించి ధ్యానించినస్త్రీలకు, పరతత్త్వమని ధ్యానించినయోగులకుఁ దుల్యఫలము. ఈ రెండింటియం దున్నభక్తి సమానమే. కపటములేనిచో ప్రేమము తుల్యమే కదా. కావున సర్వవ్యాపకత్వము. సర్వభూతదయాళుత్వ మీఘట్టము బోధించుచున్నది. కంసాదులు మృత్యువుగాఁ దలంచిరి. ఆఫలము వారికిని సిద్ధించినది. బంధువులు తమవానినిగా భావించిరి కాన వారికోరికయు నిండినది. కావున సర్వేశ్వరుని నెవ్వ రెవ్వ రేయేచందముల భావించినను బ్రేమము సమానమయ్యె నేని భగవత్కృప యేకరూపముగాఁ బ్రసరించును. ఇదియే తెలిసికొనఁదగినవిషయము. ఇది తెలిసినఁ జాలదు. వాగ్రూపమగు భక్తి ఫలింపదు. అది యనుష్ఠానమునకు రావలెను. అప్పుడే

యది సఫలమగును. దానికై ప్రయత్నింపుఁడు. ఇఁకఁ దర్వాతి కథను జిత్తగింపుఁడు.

### చాణూరముష్టికసంహారము.

ఇట్లు రామకృష్ణులు మల్లరంగమును జేరిరి. సర్వజనులాయద్భుతాకారులసోదరుల వీక్షించి కృతార్థులైరి. కంసుఁడున్నతమంచాగ్రమున నాసీనుఁడై కువలయాపీడగజమును జంపుట యాలకించి మనోవైకల్యము తన్నుఁ బరిపరివిధముల బాధింపఁగా మల్లవీరులగుచాణూరముష్టికుల నిర్వీరం బిల్చి యీసోదరు లిద్దఱు నామరణకారణులు. కాన వీరిని న్యాయయుద్ధమున గాని, అన్యాయయుద్ధమునఁగాని పొలియింపుఁడు. వీరివధించినంతన మీకు సకలవాంఛలు ఫలింపఁజేసెద. నిష్కంటకమగు రాజ్యము మీకును సామాన్యమగును. నాచావుకొఱకుజన్మించిరని వినవచ్చెడిని. కాన వీరినే విధముచేతనైనను బొలియింపుఁడు. నాకానందమును గల్గింపుఁడు. నాయానందఫలమును మీరనుభవింపఁగల్గుదురు. ఇది నిశ్చయము.అని పలుభంగులఁ బ్రోత్సహించెను. వారును సోదరుల నీయాదవకుమారులఁ జంపు టెంతటిపని యని యుద్ధసన్నద్ధులై యుండిరి. వారిశిష్యులగుమల్లురెల్లరు మహోత్సాహముతోఁ గంసరాజ్యరక్షణభారము తమదనియే భావించుచుండిరి. వీరు చావఁగాఁ దమకెల్లఁ గొంతరాజ్య మిచ్చునన్నయాశ వారికిఁ జక్కఁగాఁ గుదురుకొనియెను.

ఇంతలో రామకృష్ణులం గన్నులారఁ గాంచినజనులందఱు పరవశములగుమనంబులతో నాదివ్యమంగళవిగ్రహంబుల

నిద్దఱింగూర్చి యిట్లు చెప్పుకొనసాగిరి. ఔరా! ఏమి యీసుందరాకారములు! ఏమి వీరినడకబెడఁగు? ఈనేత్రలక్ష్మి యేమి? త్రిజగన్మోహనులగు వీరింగన్నతలిదండ్రు లెంతటి ధన్యాత్ములో కదా! జగదుద్ధరణార్థ మీయిద్దఱు వసుదేవు నింట నవతరించిరనుట నిక్కము. అని గుసగుసలాడుచు శ్రీకృష్ణుంగూర్చి యిట్లు చెప్పుకొనిరి. జగన్మోహనాకారుఁడు కృష్ణుఁడు దేవకీగర్భమున జన్మించి నందగోకులమునకుఁ గొనిపోఁబడెను. గూఢముగా నందుఁ బెంపఁ బడి వృద్ధినొందెను. ఈఘట్టమున మహాకవిపోతనపద్యమును వ్రాయుట సముచితమని తోఁచినది. శ్రీకృష్ణచర్యలందు వర్ణింపఁబడినవి.

సీ. చంపె రక్కసిఁ బట్టి చక్రవాకునిఁ గూల్చె
బడఁద్రొబ్బె మద్దుల బకుని జీరె
నఘదైత్యుఁ బొరిఁగొనె నడరి వత్సకుఁ ద్రుంచె
గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందుపఱచె.
గాళియు మర్దించె గహనానిలముఁ ద్రావెఁ
గేశి నంతకు పురి క్రేవ కనిచె
మయుపుత్త్రుఁ బరిమార్చె మఱియును దానవ
భటుల మర్దించి గోపకులఁ గాంచె
తే. గోపకాంతల మనముల కోర్కిఁదీర్చె
నీసరోరుహలోచనుం డీశుభాంగుఁ
డీమహామహుఁ డీదిగ్గజేంద్రనిభుఁడు
మనుజమాత్రుఁడె తలపోయ మాధవుండు.

అని రాముంజూచి యిట్లు చెప్పుకొనసాగిరి. ఈఘట్ట మున రామవర్ణనమును మహాకవిపోతన యించుకంతయైనఁ దెలిఁగింపక చల్లఁగా వదలుకొనియెను. మూలమున విపుల ముగ నున్నది. ఆశ్లోక మిదియె.

"అయం చాస్యాగ్రజశ్శ్రీమాణ్ రామః కమలలోచనః
ప్రలంబో నిహతోఽనేన వత్సకో ధేనుకాదయః."

అని పలుకుచుండిరి. ఇంతలోఁ గంసానుమతిఁ దూర్య నాదములు రోదసీకుహరముల నిండి వెలసెను. బలరాముఁడు మల్లరంగమధ్యభాగమును బ్రవేశించెను. చాణూరముష్టికు లంతకుముందే ఆతావునుండి యిటునటు దిరుగుచు మల్లచర చుచుఁ దిరుగుచు నేత్రణమున బాలకులఁ బొలియించి రాజ్య సుఖముల ననుభవింతమా యని యువ్విళ్లూరుచున్నవారు కాన సోదరు లిర్వురు మల్లరంగమధ్యభాగమునకు రాఁగానే మఱింత యుప్పొంగునుత్సాహముతో వారిం గాంచి చెంత కరిగి పరి హాసముగా నిట్లు పలికిరి. అందుఁ జాణూరుఁడు మాటలపొంక మెఱిఁగినవక్త. వారిద్దఱిలో నీతఁడు వాగ్విశారదుఁడు కాన నిర్వాహకుగా నాతఁడే యిట్లు పలికెను.

పాఠకులారా! ఈఘట్టమున శ్రీభాగవతమున గూఢ ముగా నున్నయర్థమును విమర్శింపక మాన వలనుపడదు. కావున వ్రాసెదను. ఏలయని విసుగునొందకుఁడు. చాణూరు నకు శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుఁడని తెలిసికొనఁదగుశక్తి చాలదు.

కాని వాఁడు చెప్పఁబూనునపుడు కర్మప్రేరితుఁడై తెలిసినట్లు మాటలాడెనని గ్రహింపఁదగును. ఆవిధమును వినుఁడు.

ఓనందనందనా! ఓరామా! మీరిరువురుపరాక్రమోపేతులరు. బాహుయుద్ధమున నేర్పరులరు. అని విని మారాజు మిమ్మిద్దఱిం బిలిపించెను. రాజునకు సంతోషమును బుట్టించు కార్యము చేయుట శ్రేయస్సని ప్రజ లూహింతురు. మనోవాక్కాయకర్మములచే నేకరీతిగా రాజకార్యముల నొనరింపఁదగు. లేకున్న విపరీతమగును. నిత్యము మీచే గోపకులు సంతోషింపఁజేయఁబడుచుందురు. గోవులమేపుచు వనములయందు మల్లయుద్ధమునఁ గ్రీడించుచు మీరలుందురు కదా. కావున మారాజేంద్రునకుఁ బ్రియమును మీరును మేమును జేయఁబూనుదము. మన యీకార్యమునకు సర్వభూతము లానందించును. రాజనఁగా సర్వభూతమయుఁడు కదా ! అని సహేతుకముగాఁ జాణూరుఁడన శ్రీకృష్ణుఁడు విని యిట్లు బదులు చెప్పెను. ఈ ఘట్టమున మహాకవి పోతన,

మ. వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచున్
బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీపృథ్వీజనుల్ చెప్ప మా
మనుజేంద్రుండిటు మిమ్ముఁ జీరఁ బనిచెన్ మల్లాహవక్రీడకుం
జనదే కొంతపరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్.

పైనవ్రాసిన యావదభిప్రాయమునకు సారముగా నీపద్యమును వ్రాసిన ట్లగపడియెడిని. మూలమున లేనిభావ మీక్రిందిపద్యమునఁ జేర్పఁబడినది.

మ. జవ _స్తత్వంబులు మేలె సాము గలదే సత్త్రాణమే మేను భూ
ప్రవరుం బో నన మిమ్మనంగవలెనే పాలీలభీష్టంబులే
పవివో కాక కృతాంతదండకమవో ఫాలాక్షునేత్రాగ్నివో
నవనీతంబులముద్దగాదు మెసఁగక నాముష్టి గోపార్భకా.

ఈపద్యము నిరర్థక మనఃజాలనుగాని చదువుటకుఁ జమత్కా-
రము గలదిగా మాత్రము కన్పట్టెడిని.

ప్రకృత మీసంభాషణములోనిసార మేదని విచారిం
తము. చాణూరుఁడు పరమమూర్ఖుఁడు. ముష్టికుఁడు వీనికి వండి
పెట్టువాఁడు. ఇంతకుముందు కంసు ననుజ్ఞనొంది వీ రీసోదరులఁ
జంపఁబూనియే యుండిరి. భగవద్దర్శనముకాఁగానే చాణూ
రుఁడు మాటలాడఁబూని విధివశమున సత్కర్మము పురికొలు
పఁగా నిట్లు పలికెను. నందనందనా! ఓబలరామా! మీరిరువురు
వీర్యసమ్మతులని ప్రఖ్యాతినిగాంచినవారు. బాహుయుద్ధమున
నేర్పులులని మారాజు విని పిలువంబంపెను అనఁగా సార
మేమి? వీర్యసమ్మతులరనఁగా వీర్యము మిమ్మే వరించినది. తానుం
డఁదగుచోటు మీరుగా నిశ్చయించుకొన్నది. లోకమున మీ
కంటెఁ బరాక్రమసమగ్రులుందురా. రాజగుకంసుఁ డీతఁడు
పామరుఁడుగాన నిట్టి మీకు మల్లుపోరాటమునందు నేర్పుగల
దని వినెను.అదిచూడఁగోరి పిలువంబంచెను. శత్రువులు మీకు
లేకున్నను లోకదృష్టిచే శత్రువులుగాఁ దోఁచువారిని బాహు
యుద్ధంబునను, భక్తుల బాహుకృతాలింగనమువలనను గాపాడు
దురు. ఈయుభయులకు ననుగ్రహఫల మొక్కవిధముననే ప్రసా

దింతురు. మీచేఁ దెగినను మీ పాదము లాశ్రయించినను ఫల మొక్కఁడే యని సారము. ఈభావమే పోతన "చనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్" అన్నపద్య చతుర్థపాదమున నిమిడ్చిరి. కొంతపరాక్రమింపన్=మీతోఁ బోరాడువారు లేరు. ఐనను గొంతమాత్రము (ఇంచుకసేపు) పరాక్రమవిహారముచేయుట మనకుఁ దగదా. ఏలయన, "ఈస భ్యుల్ విలోకింపఁగన్=ఈసభలో నుండుసాధువులు చూచి యానందించునట్లు మనము కలిసి విహరింతము. దీనిచే మమ్ము నమ్మియున్నకంసుఁడు సంతోషించును. సభలో నున్నపెద్దలు మాపౌరుషమును గాంతురు. మీచే మేము తెగిన నది యవ మానముకాదు. మాకది కీర్తిదాయకమే. ఇహమందుఁ గీర్తి యుఁ బరమందు ముక్తియుఁ గలుగును. కావున నాపనిచేయుట తగదా యని చాణూరునినోటనుండి కవి చెప్పించెను.

రాజునకుఁ బ్రియమగుకార్యము చేసినచో నదియే శ్రేయస్సని ప్రజ లెఱుంగుదురు. ఆప్రియము మనోవాక్కా యములచే నేకరీతిగాఁ జేయఁదగును. లేకున్న నవి విపరీత మగును. అన్నచాణూరునిభావములోని సారమేమి? అనునది యొకప్రశ్నము. రాజు తండ్రివంటివాఁడు. భగవంతునివలె నాతనియానతిఁ బాటింపవలయు. భగవత్ప్రియకార్యములు చేయు టెట్లు శ్రేయస్కరమో యట్లే రాజహితకార్యములు చేయుటయు నని ప్రజ లెఱుంగుదురు. అనఁగా నెవరివలన నుప కారముగలుగునో ఆతనికిఁ బ్రియములగుకార్యములుచేసి సం

తోషపఱచుట కృతజ్ఞతకుఁ దార్కాణము. అట్లుచేయుట నలుగురకుఁ దెలియవలయుననికాక మనోవాక్కాయములచేఁ దుల్యముగా నొనరింపవలయును. అదియే సుజనపద్ధతి.

"మనస్యన్యం వచస్యన్యం కర్మణ్యన్యం దురాత్మనామ్
మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్."

అన్నసూక్తి యుండనేయున్నదికదా. ఇది ప్రాతీతికార్థము. వాస్తవార్థమేమనఁగా, శ్రీకృష్ణా! మేము లోకాచారము ననుసరించుచున్నారము. నీతోఁబోర నెవ్వరికే నశక్యమని యెఱుంగమా. ఐనను జాలకాలమునుండి యీకంసునియన్నము తిని యీతనివస్త్రములం గట్టితిమి. అందులకుగాఁ గృతజ్ఞత చూపవలయునుగదా. ఆకృతజ్ఞతను మనస్సుచేతను వాక్కుచేతను శరీరముచేతను జూపఁబూనితిమి. శ్రీకృష్ణునితోఁ బోరాడఁజాలకున్నను బోరాడి యామహాత్మునిచేఁ జచ్చి పరమపదము నొందుదుము. మేనిలోఁ బ్రాణములున్నదాఁక వంచనసేయక పోరాడుదుమని మనస్సుచేతను; వాక్కు ప్రసాదించినందులకు ఫలముగా భగవంతుని నుతింపవలసినది విధిగా నుండఁగా నరపతికి విశ్వాసముచూపునెపమునఁ బ్రేలుచున్నవారమని వాక్కుచేతను భగవత్కైంకర్యమునకు బదులుగాఁ బరమేశ్వరుఁడవగు నీతోఁ బోరాడుటకుం బూనితిమి. రాజునకుఁ గృతజ్ఞతకుగా నీదేహము నే యర్పింతు మనుకర్మముచేతను మేమిరువురము లోకాచారము ననుసరించితిమి. అంతియకాని నిన్ను గెలుతుమన్న యూహచేఁగాదు. "విపరీతమతోఽన్యథా" మే మిట్లు

లోకాచారము ననుసరింపకపోయినచో మల్లులజాతియే యిట్టి దని మమ్మాక్షేపింతురు. "లోకాపవాదాద్భయమ్" అన్న సూక్తి ననుసరింపవలదా. మే మిప్పు డూరకున్న నది లోకాచారము నకు విరుద్ధమగును. అట్లుకాఁగూడదు కాన లోకాచారమును బాటించుటకును, కంసుఁ డింతకాలము మమ్మన్నవస్త్రదానములఁ బోషించినందులకును బ్రతిఫలముగా నీయకార్యమునకుఁ బూని తిమి. ఇంతియకాని జగదారాధ్యుఁడవై జగదేకశరణ్యుఁడవై జగన్నిలయుఁడవు నగు నీతోఁ బోరాడి గెల్తుమనునూహ మాకుం గలదా. ఓస్వామీ! దీనబంధూ! మమ్మీయపరాధమును లెక్కింపక కాపాడుము. ఈశరీర మతిస్థూలమైనది. ఈభార మును దీర్పుము. అని ప్రార్థించెనని గ్రహింపవలయు. ఈయర్థము చాణూరునిమనసునఁ గలదని దీనితరువాతిశ్లోకము తెలుపు చున్నది.

శ్లో. నిత్యం ప్రముదితా గోపా వత్సపాలా స్తథా స్ఫుటం,
వనేషు మల్లయుద్ధేన క్రీడంత శ్చారయంతి గాః. 38

దీనిప్రాతీతికార్థ మీావలకే వ్రాయఁబడినది. విశేషార్థమిద్ది. వత్సము లనఁగా అసమర్థులు స్వతస్సంరక్షణము లేనివా రని భావము. అనఁగాఁ బ్రాణికోటులు. వానిని బాలించుచు ననఁగా సకలప్రాణులఁ గాపాడుచున్న మీారని భావము. తథా అట్లే. అనఁగా సగుణబ్రహ్మమువుగా నుండుతఱి సకలబ్రహ్మాండ ముల నెట్లు పాలించుచుందువో అట్లే యీలీలామానుషరూప మునుదాల్చిన యిప్పుడని భావము. మల్లయుద్ధేనక్రీడంతః=

బాహుయుద్ధముచేత. ఇటఁ దృతీయహేత్వర్థమని గ్రహింప వలయు. మల్లయుద్ధ మను హేతువుచేతఁ గ్రీడించుచు, యుద్ధ ముచేఁ గ్రీడించుట యనఁగా దుష్టసంహారమున నీయవతార మును సఫలముచేయుచునని తాత్పర్యము. నా కేయాయుధము లక్కఱలేదు. తలంచినపు డాయుధములన్నియు నాకలవడును. బాహుస్పర్శముచే నీభూభారము నడంతునన్నభావ మిట సూచింపఁబడినది. గాః చారయంతః=గోవులను మేపుచు నిటు నటుదోలుచు ననఁగా భూతములన్నియుఁ బశువులు. దైవము పశుపతి యని రహస్యము. సకలభూతముల ననేకరీతుల భ్రమిం పఁజేయుచు నిందు నందుఁ బుట్టించుచు నని సారము. ఇట్టిమహా త్ముఁడవగు నీచేత సదా గోపకులు సంతోషింపఁజేయఁబడుచు న్నారు. గోలోకమునుండి నీసేవార్థ మవతరించిన గోపకుల నెల్ల ప్పుడు సంతోషింపఁజేయుచున్నవాఁడవుకదా. అట్లే మమ్మిద్దఱను గూడ మల్లయుద్ధవ్యాజమున రక్షింపుమా యని భావము. ఆ గోపకులకు నొసంగెడునానందము మాకును గటాక్షింపుమా యని ప్రార్థించె నని గ్రహించుటయే సరసము

ఈయర్థమును దీనితరువాతిశ్లోకము దృఢపఱచుచున్నది. దానిం దిలకింపుఁడు.

తస్మా ద్ధాత్రిజ్ఞః ప్రియం యూయం వయం చ కరవామ హే
భూతాని నః ప్రసీదంతి సర్వభూతమయో నృపః.

ప్రాతీతికార్థము స్పష్టము. విశేషార్థము. తస్మాత్=అందు వలన, మేమిట్లు మిమ్ముఁ బ్రార్థించుచున్నందువలన. యూయం

వయంచ=మీరిర్వురు మేమును (రామకృష్ణులు చాణూరముష్టి కులమగు మనము నలువురము) రాజ్ఞః ప్రియం=ఈకంసునకు హితమును. మమ్ము నమ్మి మాద్వారా మిమ్ముఁ జంపించి సర్వ కాలము నిష్కంటకముగా రాజ్యమేలఁ దలంచుకొన్న యీ కుమతికిఁ బ్రియమయిన, అనఁగా వీని వధించి పుణ్యలోకములఁ బడయఁజేయునదే ప్రియము. కాన నట్టిదానిని, కరవామ హే= చేయుదము. మేము లేకయున్న నీమల్లరంగమున నిందఱు చేరరు. ఈతఁడును రాఁడు. కావున మాసహాయముకూడ నీ కార్యమునఁ గలదని ధ్వని. అట్లొనర్చినచో నః=మమ్ములను భూతాని=సకలభూతములు-చరాచరప్రపంచమున నుండుప్రాణు లెల్లరు నని భావము. దుష్టసంహారమునకుఁ దోడ్పాటుగావిం చినవారినిగూడ మెచ్చుకొనుట లోకాచారమేగాని క్రొత్త విషయముకాదు. మఱియొకవిధముగా నిట నర్థము చెప్ప వచ్చును. నః భూతాని = మాయొక్కభూతము లనఁగా మా సంబంధమున నలరారుబంధువులెల్లరు నని భావము. ప్రసీదంతి = ప్రసన్నులగుదురు. ఈకార్యముచే నింతటి గొప్పకార్యమునకుఁ దోడ్పడితిరి కాన భగవత్కటాక్షమునకుఁ బాత్రులయ్యెదరని యాశీర్వదించునని సారము. రెండవపక్షమున. మే మీకార్య మునకుఁ బ్రయత్నింపఁగా నపజయము గల్గినను మల్లజాతి కను గుణమగుకార్యము నొనర్చితిరి. ప్రాణ ముండుదాఁక రక్షించిన వారి కుపకారముచేయుట మల్లురకు ధర్మమని భావము. అట్టి మావారెల్ల సంతోషింతురని తాత్పర్యము. ఏల సర్వభూత

మయో నృపః = సర్వభూతస్వరూపుఁ డనఁగా సకలభూతముల కాత్మవంటివాఁడు. అనఁగా రక్షకుఁడని రహస్యము. అట్టిరాజు కుమతియైనపుడు వానికి పరమాత్మవగు నీచేత స్మృతిని గల్పించి శాశ్వతసుఖమును గల్పించుట మంచిదని సారతరార్థము.

ఈయర్థమును సిద్ధాంతముచేయు పైశ్లోకమును వినుఁడు.

శ్లో. తన్నిశమ్యాబ్రవీత్కృష్ణో దేశకాలోచితం వచః.

దేశకాలోచితం వచః=అనఁగా ఆమల్లరంగమునకు, కాలమునకుఁ దగినమాటను జెప్పెననఁగాఁ దాను భగవంతుఁడే యైనను సామాన్య యాదవునిగా భావించినకంసుఁడు వినుటకుఁ బామరులెల్లరు తన్ను డాంబికములు పలుకువాఁడుకాఁడని తలంచుటకుఁ గంసునకుఁ గాలము సమీపించినందున దానికిఁదగినట్లు శ్రీకృష్ణపరమాత్మ సంభాషించెనని భావము. ఇట్టు లీఘట్టమున భావముగ్రహించినచో మహానందము గలుగును. ఇఁకఁ బ్రకృత కథకు మరలుదము.

చాణూరునిమాటలసారము శ్రీహరి యెఱిఁగి దేశకాలోచితముగా నిట్లు పల్కఁబూనెను. ఆమాటలు బాహుయుద్ధము తన కభిమతమే యని తెలుపునట్లు చాణూరుని మన్నించి యతఁడు చెప్పినట్లే తా నంగీకరించినట్లు లోకుల కవి కనఁబడురీతిఁ బల్కెను మల్లాగ్రణీ! మీభోజరాజునకు నందజెట్లు వశవర్తులో వనచరులమగు మేమును బ్రజలమే. కావున రాజునకుఁ బ్రియమగు కార్యమును జేయుదుము. అది మాయందుఁ బరమానుగ్రహ మునిచినట్లే. మేము బాలురము.

మాతో టిసమానబలము కలవారితో యథోచితముగాఁ గ్రీడింతుము. మల్లురతో బాహుయుద్ధము పొసఁగెను. మల్లసభాధికారుల కధర్మము స్పృశింపక యుండుఁగాక. అని చమత్కృతితోఁప మాటలాడెను. ఈభాగమునకుఁ దెనుఁగుపద్యములు కానరావు. ఏలొకో మహాకవి వదలెను. సూక్ష్మముగా నీయర్థము పైపద్యమునఁ గలదనియేమో.

ఆర్యమహాశయులారా! శ్రీకృష్ణుని యభిప్రాయమును వింటిరికదా.ఇందు విశేషార్థము కలదని తేటపడకమానదుకదా! చాణూరసంభాషణమున నొకరహస్యార్థము కలదని శ్రీహరి గ్రహించియే తదనుగుణముగా బదులుచెప్పెను. ఆవిషయము నాలకింపుఁడు. భోజపతికి నందజీవలెనే వనచరులమగు మేమును బ్రజలము. చాణూరా! అడవులలో గోపబాలకులతో మల్లయుద్ధమున విహరించువారలంటివి. నిశ్చయమే. మే మాటవికులము. మీరు నాగరకులు. మీకున్నంత తెలివితేటలు మాకుండవు. అని ప్రాతీతికార్థము. "వయం చాపి వనేచరాః" వనచరులమగు మేముఁగూడ మీకంసునకుఁ బ్రజలమా. అపి శబ్దము ప్రశ్నార్థముగా గ్రహింపఁదగు. మే మెవ్వరమని మీరాజు కండగర్వమున నూహించెనో కాని మేము వనచరులము. కేశవస్వరూపులమని భావము. రాజునకుఁ బ్రియము సదా చేయువారము. సర్వజనులకుఁ బ్రియముఁగూర్చుటకే మే మవతరించితిమి. ఇఁక మీరాజునకుఁ బ్రియముచేయక యుందుమా, మీరాజున కేదిప్రియమో అది చేసెదము. అదియే మా

యొక్క పరమానుగ్రహము. అనఁగా మీరాజునకుఁ బ్రియమైనది యీమూర్ఖభావము వదలుటయే. అది కొలఁదిగడియలలో సమకూర్చెదము. మాయనుగ్రహ మట్టిదే. మేలు చేకూర్చుటకే. మాకు శత్రుమిత్రభావములు లేవు. అందఱకు మాకరుణ సమానముగా ఫలము నిచ్చును అని రహస్యము. దీనికి మూలమును జూడుఁడు.

ప్రజా భోజపతేరస్య వయం చాపి వనేచరాః
కరవామ ప్రియం నిత్యం తన్నః పరమనుగ్రహః.

౧౦ స్కం. ౪౩ అ. ౩౭ శ్లో.

దీనితరువాతిశ్లోకమును బరికింపుఁడు. ఈభావము విస్పష్టమగును.

బాలా వయం తుల్యబలైః క్రీడిష్యామో యథోచితమ్,
భవేన్నియుద్ధం మాధర్మస్స్పృశే న్మల్లసభాసదః. ౩౮ శ్లో.

దీనికి మహాకవి పోతన.

ఉ. సాములు లేవు పిన్నలము సత్వము కల్దనరాదు మల్లసం
గ్రామవిశారదుల్ కులిశకర్కశదేహులు మీరు మీకడన్
ఏము చరించు టెట్లు? ధరణీశునివేడ్కలు చేయువారముం
గాముువినోదముల్ సలుపఁ గాదనవచ్చునెయొక్కమాటికిన్.

అని వ్రాసిరి. పైశ్లోకమున కీపద్యము విరుద్ధముగా నున్నది. బాలశబ్దము నాధారముచేసి యాకాశసౌధమును నిర్మించి రనుకొనక తప్పదు. పైశ్లోకమునకుఁ బ్రాతీతికార్థము ముందె వ్రాయఁబడినది. విశేషార్థమును జిత్తగింపుఁడు.

భగవంతుఁ డిటుఁ దనసర్వేశ్వరత్వమును దెలుపుచున్నాఁడు. నేనును మాయన్నయు ననుటకు "ఆవామ్" అనక "వయమ్" అని చెప్పెను. ఏల? సర్వలోకస్వరూపుల మగు మేము ఈజన్మమున బాలురము. తుల్యబలైః క్రీడిష్యామః యథోచితమ్=మాతో సమానబలముగలవారితో నుచితమునకుఁ దగినట్లు విహరింతుము. అనఁగా మాతో మీరు సమానబలముగలవారేని విహరింతుము. మీ రత్యల్పులు. మీతో మాకేటి విహారము. ఎవరితో నెట్టివిహారము చేయఁదగునో వారితో నట్టివిహారము సల్పుదుము. ఒకప్పుడు మీతోటి బాహుయుద్ధము పొసఁగునేని అధర్మము సభాసదులకుఁ గలుగకయుండుఁగాక. అనఁగా అధర్మయుద్ధముగాఁ బ్రవర్తింపకయుండ మీామల్లసభాధిపతులు చూతురుగాక యని సారము. అధర్మముగాఁ బ్రవర్తించినచో మాకేమియు బాధలేదు కాని లోకమునకు నుదాహరణము కాఁగూడదుకదా. అనిరహస్యము. ఇట్టిశ్లోకమునకుఁ బద్యము వ్రాయునపుడు "ధరణీపతివేడ్కలు చేయువారముంగాము" అని చెప్పు టేటికో తోఁపకున్నది. దీనితర్వాతిపద్యమునకు మూలము విరుద్ధముగా నున్నది.

ఇట్లు శ్రీకృష్ణమూర్తి భావగర్భముగాఁ బలికిన విని చాణూరుం డామాటలనుండి తాను గ్రహింపఁదగినంతమాత్రము గ్రహించి బదులు చెప్పఁబూని యిట్లు లనియె. కృష్ణా! నీవు బాలుఁడవు కాదు. శిశువవుకూడ కాదు. బలరాముఁడు బలవదగ్రగణ్యుఁడు. ఎట్లులనఁగా. వేయియేనుంగులబలముగల కువల

యాపీడగజము మీచే సంహరింపఁబడెనుకదా. అట్టిగజమును సంహరించిన నీవును బలరాముఁడును బాలురనుట యేటిమాట? స్తనంధయులనుట యేటిమాట? కావున మాతో మీరు పోరాడఁగలరు.

ఆర్యులారా! దీనిమూలమును దిలకింపుఁడు.

న బాలో న కిశోర స్త్వం బలశ్చ బలినాం వరః,
లీలయేభో హతో యేన సహస్రద్విపసత్వభృత్. ౩౮ శ్లో.

చాణూరుఁడు కేవలాజ్ఞానమునఁ గప్పఁబడి మాటలాడి నచోఁ గువలయాపీడమను గజమునకు వేయియేనుఁగులబలము కలదు. దాని నశ్రమంబునఁ జంపితివి. కాన నీవు బాలుఁడవు కాదు. శిశువవు కాదు. మీసోదరుఁడు బలవంతులలో మేటి బలుఁడు. అనుమాట లాగ్రహపరవశుఁడైనవాఁడు చెప్పునట్టివే యగునా. లేక శ్రీకృష్ణమూర్తి యాకృతిని దర్శింపఁగనే పూర్వ పుణ్యవశమున జ్ఞానముదయించి యిట్లుపలికె నని చెప్పఁదగునా మీరే యూహింపుఁడు. దీనిరహస్యార్థము.

మహాపురుషా! నీకు శిశుత్వబాలత్వము లెక్కడివి? ఇప్పటి నీవయస్సును బట్టిచూడఁగా లోకములో నుండుగజములలో సహస్రగజబలయుక్తమగు కువలయాపీడమును దేఱిచూడనైన శక్యము కాదని తోఁపకపోదు. అట్టిదానిని విలాసముగా వధించి తివి. మహాత్మా! నీ వెక్కడి బాలుఁడవు? ఎక్కడి శిశువవు? మా వంటిమూర్ఖులకు నీతత్త్వము తెలియఁబడకయున్నను, కువలయా

పీడమును వధించుటచేనైనఁ దెలియఁబడకుండునా. అట్లే మమ్ముం గడతేర్పుమా యని సారము.

ఇట్లు భావగర్భముగాఁ బలికి మఱియు లోకాచారము ననుసరించువాఁడై మల్లజనసామాన్యమగురీతి నిట్లు పలికెను. ఆమాటలు భావగర్భములే. మూల మిదిగో.

తస్మా ద్భవద్భ్యాం బలిభిర్యోద్ధవ్యం నానయోఽత్రవై,
మయా విక్రమవార్ష్ణేయ బలేన సహ ముష్టికః. ౪౦ శ్లో.

తస్మాత్=మీరు పరమపురుషులైనందున, బలిభిః=బలవంతులమగు మావంటివారితో, భవద్భ్యాం=మీచేత, యోద్ధవ్యం=యుద్ధముచేయఁదగినది. అత్ర=ఈవిషయమందు, అనయః=అధర్మము, నవై = లేనేలేదు. వార్ష్ణేయ=వృష్ణివంశోద్భవా, మయా=నాతోడ, (నీవు) విక్రమ=పరాక్రమింపుము. (యుద్ధము చేయుము.) బలేనసహ=బలరామునితో, ముష్టికః=ఈముష్టికుఁడు (విక్రమతాత్)=పరాక్రమము చూపునుగాక. ఇది ప్రాతీతికార్థము. చాణూరునిభావ మేమనఁగా లోకసామాన్యబలశాలురము మేము.మీరలోకసామాన్యబలశాలురు. ఐననుమాతో మీరు పరాక్రమింపఁదగును. నీవు నన్నును బలరాముఁ డీముష్టికుని గృతార్థులను జేయుఁడు. మాతో యుద్ధముచేయువిషయమందు మీకు నధర్మ మేమియులేదు. మీతో యుద్ధము చేయఁబూనువిషయమందు మాకు నధర్మములేదు. ఏలయనఁగా నతితుచ్ఛులమగు మమ్ముద్ధరించుపొంకెఁ బోరాడుట మీ కధ

ర్మముకాదు. మహాపురుషపుంగవులగు మీతోఁ బోరాడుట మాకు నధర్మముకాదు. మేము మామేలుకొఱకే యుద్ధము చేయుదుము. మీరు మామేలుఁగోరియే మాతోఁ బోరాడుఁడు.

"ఆర్తత్రాణపరాయణస్య భగవాన్నారాయణో మేగతిః."

అన్నమాట మే మెఱుఁగుదుము. ఈతుచ్ఛభూపతుల నాశ్రయించి కన్నుమిన్నుఁగానకయున్న యీవిపన్నులఁ గావ నవతరించితిరి. మీసందర్శనమున నించుకజ్ఞాన ముదయించినది. కాన మాకు నీదాస్య మొసంగుము. అంతియ చాలును. ఎడ చేయుటేల? అని తనమనోభావమును గృష్ణుఁ డెఱుంగునట్లు కంసాదుల కింకొకవిధముగా నర్థమగునట్లును జెప్పెను. ఈశ్లో కార్థమును వింటిరి. పద్య మిందులకు విరుద్ధముగా నున్నది. చాణూరుఁడే యెవరెవ్వరితో యుద్ధముచేయునది నిరూపించి నట్లు మూలము తెలుపుచుండఁగాఁ బద్యమున శ్రీకృష్ణుఁడే నిర్ణయించినట్లున్నది. ఆపద్యమిదియే.

క. నీతోడుత నేఁ బెనఁగెదఁ

బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁ డు

గ్రాతతమల్లాహవమున

భూతలనాథునకు మెప్పుఁ బుట్టింతు సభన్.

*ఈపద్యము నాధారముగా మహాకవి మఱికొన్ని పద్యముల వ్రాసెను. తరువాత మఱికొన్నిపద్యముల వ్రాసెను. అవి

* ఇటనుండి శ్రీభాగవతము నలువదినాల్గవయధ్యాయమునుండి వ్రాయఁబడును. తక్కినపురాణములలో లోపల వ్రాసినట్టే.

మాత్రము శ్రీకృష్ణుఁడే శ్రీమన్నారాయణమూర్తి యని తెల్పును. పరస్పర మివి విరుద్ధములే. ఐనను ఆపద్యములలోని భావము సాధుసమ్మతము. కావున వానినిమాత్ర మిట వ్రాసె దను. ఇది పోతనగారిభావము.

చాణూరుఁ డాకృష్ణునిమాటల కాగ్రహించి తనపరా క్రమ మందఱకు మెప్పుపుట్టించుచుండఁగా,

శా. నాతోఁబోరఁగ నెంతవాఁడ విసిరో నాపాటియే నీవు వి
ఖ్యాతుండం గులజుండ సద్గుణుఁడ సత్కర్మస్వభావుండ నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే యీవీటఁ బోరాడుటల్
ప్రేతల్ చూడఁగఁ గుప్పిగంతులిడుటే వీక్షింపు గోపార్భకా!

అని పలికి యంతతో నూరక పోరాడఁబూనక భక్తియుఁ బరాక్రమ ముట్టిపడునట్లు.

సీ. చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు
నిగిడి గోత్రముదండ నిలువరాదు
కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు
మనుజసింహుఁడ నని మలయరాదు
చేరినఁ బడవైతుఁ జెయి చాపఁగారాదు
బెరసి నాముందటఁ బెరుఁగరాదు
భూనాథహింసకుఁ బోరాదు ననుమీఱి
శోధింతుఁ గానలఁ జొరఁగరాదు

తే. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగారాదు
ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁపరాదు

కలికితనము చూపి గర్వింపఁగా రాదు
తరము కాదు కృష్ణ తలఁగు తలఁగు.
నీవు శ్రీహరివే యైనచో

సీ. మహిమతో నుండంగ మధురాపురముగాని
పాలుపారు వైకుంఠపురముగాదు
గర్వంబుతో నుండఁ గంసునిసభగాని
సంసారరహితులసభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నాబాహునాదముగాని
నారదువీణాస్వనంబు గాదు
చదురులాడఁగ మల్లజనవిగ్రహముగాని
రమతోడి ప్రణయవిగ్రహముగాదు
తే. వెలసి తిరుగంగ వేదాంతవీథిగాదు
మెఱఁగి పో మునిమనముల మూలగాదు
సాఁగి నడువంగ భక్తులజాడ గాదు
శౌరి నామ్రోల నీ వెందుఁ జనియె దింక.

ఈపద్యములనుబట్టి యాలోచించినను భగవంతుఁడు. శ్రీహరి యీరూపమున నవతరించెననియుఁ జాణూరునిభావమే యైనట్లు కనుపట్టు. కంసాదులకు సంతోషముపుట్టించుటకుగాఁ బ్రతాపవచనము లాడుటయేగాని వేఱుగాదనియుఁ దేటపడి యెడిని.

ఇట్లు చాణూరుఁడు నిర్ణయింపఁగా హరి యందులకు సమ్మతించి తనయన్నను ముష్టికుని మార్కొన నియమించెను.

ఇట్లిద్దఱు నిద్దఱిని దలఁపడిరి. మల్లయుద్ధము కొంతదనుక శాస్త్ర రీతి ననుసరించియే సాగెను. ఆయుద్ధ మమరులకుంగూడ నచ్చెరువుగొలుపుచునే యుండెను. చూచువారెల్ల నిదియేమిబాహాయుద్ధము! ఇట్టి దీవఱ కెన్నఁడు చూచియుంటిమా యని యనుకొనిరి. ఆసభలో నున్నవారంద ఱాసక్తిమెయి నాపోరాటమును జూచుచుండ నందున్నవనితామణులు తమలోఁ దమరిట్లనుకొనసాగిరి. ఇదేటిసభ? ఇదేమిన్యాయము? కేవలబాలకులను బలాఢ్యులగు మల్లురతోఁ బోరాడ నియోగించి కన్నులార దయలేక చూచుచున్న యీసదస్యు లేటిసజ్జనులు? ఈరాజన్యునిసభ యింతయధర్మమునకుఁ బాల్పడఁదగునే. ఇంచుక యాలోచించినచో నెట్టివారికేనిది యధర్మమనితోఁపకపోవునా. చూడుఁడు ఈచాణూరముష్టికుల సర్వావయవములు వజ్రసారమయములు. కొండలవలెఁ జూడ నొప్పుచున్నవారు. బాలకులం బరికింతము. వీరిదేహములు సుకుమారములు. యౌవనము పొడచూపని కిశోరులు. అట్టివారితో నిట్టిబాలకులను దలఁపడ నియోగించుటేపాటిధర్మము? ఇందు ధర్మమనఁగా నధర్మమే యనవలయును? కటా! ఎంతటి యన్యాయము! ఏచోట నధర్మమున్న యగునో యాచోట నొకగడియయైన నిలువరాదు సుఁడీ! సభ్యులదోషములు తెలియవచ్చినచో బుద్ధిమంతుఁ డాసభకుఁ బోరాదు. సభలో సాగుచున్నదోషమును దెలుపకున్నను బాపము. విపరీతముగాఁ జెప్పినను బాపము.

పంకజాక్షులారా! అదిగో మల్లునియెదుటఁ దిరుగుచుండు

శ్రీకృష్ణమూర్తిముఖమును బరికింపుఁడు. జలబిందువులచే నావృతమైన పంకేరుహాంబుచాడ్పున స్వేదబిందువులచే నావరింపఁబడియున్నది. అదిగో బలరాముని నెమ్మోమును జూడుఁడు. అరుణవర్ణలోచనము లొప్పూట. దన్ను మారుకొన్న మల్లవీరునియీసునసంరంభించుచున్నట్లున్నది చూడుఁడీ! ఈకృష్ణుని ఈతఁడు పురాణపురుషుఁడు. మనుష్యవేషమును దాల్చి శంకరుఁడు రమాదేవియుఁ బాదారవిందములఁ బూజింప వనములఁ జిత్రమాల్యముల ధరించి వేణుగానముచేయుచు గోవులమేపుచుఁ జరించుచుండుటచే బృందావనమునందలి భూభాగములు పరమపవిత్రములయినవి. అని యనుకొనుచుండిరి. ఈఘట్టమున శ్రీభాగవతమునందున్నభాగమున లేనివిషయములఁ జొప్పించి మహాకవి పోతన యల్లినపద్య ముల్లాసమును గల్గింపక మానదు.

సీ. వేణునాళములపై వెలసిన మాధవుం
డధరామృతము లిచ్చి యాదరించుఁ
బింఛదామములపై పెరిఁగిన వెన్నుఁడు
మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ
బీతాంబరములపై బెరసిన గోవిందుఁ
డంసభాగమునఁ బాయక ధరించు
వైజయంతికలపై వాలినఁ గమలాక్షుఁ
డతికుతూహలమున నఱుతఁ దాల్చుఁ

తే. దనరు బృందావనంబునఁ దరులమైనఁ
గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడసల్పు,

నెట్టినోముల నైన ము న్నిట్టివిధను,
లేల కామైతిమో యమ్మ యింక నెట్లు.

మఱియుఁ గొంద ఱిందువదనలు లావణ్యమునకు నిధాన మై సమానముగాని అధికముగాని యేదియు లోకముల యందు లేక యన్యులకు సిద్ధింపక యితరులకుఁ బొంద నశక్యం బైయలరారు నీ యీశ్వరునిరూపమును బ్రతిక్షణమందును గన్నులఁ గ్రోలుభాగ్యముగలగోపిక లేమితపము నొనరించిరో కదా. పాలుపిదుకుట, ధ్యానముదంచుట, మదనోద్దీపకము లగు పూఁతలు గూర్చుట, డోలికల నూఁగుట, రోదనముచేయుబాల కులను బుజ్జగించుట, వృక్షముల పాదులయందు నీరుపోయుట, నీరుచల్లుట మొదలగుపనులు చేయుచుండియుఁ బ్రీతిచేఁ జిత్తము శ్రీకృష్ణునిపైఁ జేర్చి నేత్రముల నానందబాష్పములు గ్రమ్మ శ్రీహరి కీర్తిగీతములం బాడుదురు. అని చెప్పుకొనిరి.

ఈఘట్టమున గోపికలభావ మెట్టిదో యించుక వ్రాయక తప్పదు. మూలమును బరికింపుఁడు.

యా దోహనే వహనసే మదనోపలేప
 ప్రేంఖేంఖనార్భరుదితోక్షణమార్జనాదౌ
గాయంతి చైన మనురక్తధియోఽశ్రుకంఠ్యో
 ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమచిత్తయానాః

౪౪ అ. ౧౬. శ్లో.

దీనియర్థముపై వ్రాయఁబడియెను.మల్లరంగమున బాహు యుద్ధము చేయుచున్న శ్రీకృష్ణునిముఖమును గాంచి యందున్న

యంగనామణులు గోపిక లెంతపుణ్యము నొనర్చిరో యనుకొ నిరి. గోపికలవ్యాపార మేలాటిదో వా రెటేంగియుండవల యును. వీరిసంభాషణములనుబట్టి గోపికలవ్యాపార మెంతపరి శుద్ధమైనదో మన మెఱుంగవచ్చును. ఇందలి నీతి యేమనియు మన మూహింపవచ్చును. పాలుపిదుకునపుడు,వడ్లుదంచునపుడు, సుగంధవస్తువులం గూర్చునపుడు, ఉయ్యాల లూఁగునపుడు, పిల్ల లేడ్చుచుండఁగా వారియేడ్పుడుపఁబూనినపుడు, చెట్లపాదు లలో నీరుపోయునపుడు మొదలగుసర్వకార్యములయందును బ్రీతిచేఁ జిత్తమును శ్రీకృష్ణునందుఁ జేర్చి యానందబాష్పములు కన్నులనుండి ప్రవహింపఁగా భగవద్గుణకీర్తనములం బాడుదు రఁట. ఇట్టిగోపికలు వ్యభిచారముచేసిరనుట తెలివితక్కువగాక మతేమగును? సదా భగవంతుఁడగు శ్రీకృష్ణునినే దలంచుచు నేకార్యముచేయుచున్నను ఆపనియందు మనస్సును నిలుపక భగ వద్గుణసంకీర్తనమునందే శ్రద్ధగలవారలగుట భక్తిపారవశ్యము నకు లక్షణమా. వ్యభిచారవృత్తికి లక్షణమా. ఇంచుక యోజిం పుఁడు. భక్తిపరవశత్వమున నేకార్యము చేయుచున్నను దదా రాధనమునందే చిత్తము లగ్నమగుటయే సాధుసమ్మతమార్గము. ఈవిషయము భగవద్గీతయందు,

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్నన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్.
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. ॥ అ.౫

చెప్పఁబడినది "నైవ కించిత్కరోమీతి యుక్తస్సమాహితస్సన్మన్యేత చింతయేత్. తత్త్వవిదాత్మవిత్ ఆత్మనో యాథాత్మ్యం తత్త్వం వేత్తీతి తత్త్వవిత్ పరమార్థదర్శీత్యర్థః "అని శంకరభాష్యము.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే.

కావున నే కార్యముచేయుచున్నను దానియందాసక్తి లేక లోకసంగ్రహార్థమై చేయుచు భగవత్సంకీర్తనముచేయుట పరాకాష్ఠచేతనేకదా. కావున గోపికలందఱు బృందావనప్రాంతములందున్నను ఏయే కార్యములు చేయుచున్నను వానియందాదరములేక శ్రీకృష్ణగుణకీర్తనముచేయుచుఁ దదానందమునఁ గంఠము తడఁబడఁగా భక్తిపరవశలైరని భావము. దీనిచే గోకులమందలి గోపికలెల్ల సదా శ్రీకృష్ణసద్గుణములు పాటలుగాఁ బాడుచుందురనియు నామహానందము ననుభవించుచున్నవారనియు భావము. ఇట్లు భగవద్గుణగణకీర్తనముచేయుచు సర్వకార్యములు మఱచువారు వ్యభిచారిణులు కారనియు, పరమభక్తిగలవారనియు గ్రహింపవలయునేగాని వారియం దొకదోషమును గల్పింపరాదని గ్రహించుట సజ్జనులమార్గము.

ఇఁక ప్రకృతమునకుఁ గడంగుదము. ఈరీతిఁ గొందఱు చెప్పుకొనుచుండఁగా నింకనుం గొందఱు పురంధ్రులు తమలోఁ దమ రిట్లు చెప్పుకొనిరి. సుదతీ! చూడుము. ప్రాతఃకాలము వనమునుండి యావుల మేఁపం దోలుకొని వనముల కరుగునపుడు,

సాయంకాలమున వనములనుండి యావులందోలుకొని గోకులంబు ప్రవేశించునపుడును శ్రీకృష్ణుఁడొనరించు వేణునాదమును విని యాగోపికలు సంరంభంబున గృహములువదలి పరుగున వచ్చి చిఱునవ్వుతో నలరుమోమును, గనుంగొనఁ గరుణాకటాక్షవీక్షణములను బడయ నెంతపుణ్యమును దొలిజన్మమున నొనరించిరొకదా. యని ప్రీతిమీఱఁ జెప్పుకొనిరి.

మహాశయులారా! ఈభావమునుబట్టి యూహించినను గోకులమున నున్న గోపికలు శ్రీకృష్ణుని సాక్షాత్పరమేశ్వరునిగా భావించిరనియుఁ దద్దర్శనమే తమకానందమనియుఁ దత్కటాక్షప్రసారమే వరప్రసాదమనియు భావించిరనియుః బ్రాతస్సాయంకాలములయం దాపరమేశ్వరసందర్శనము ప్రతిదినము గోరుచుందురనియు మహాభక్తిరసప్రపూర్ణహృదయులై యున్నారనినియు స్పష్టమగునుగాని కామబాణములచేఁ జెదఱినమనస్సులు గలవారని కాని మోహావేశమునఁ గృష్ణుని జూచిరని కాని యించుకంతయు స్ఫురింపదు. ఎట్టిపక్షపాతము కలవాఁడైనను నిట్టి తుచ్ఛభావముగలదని చెప్ప సాహసింపఁజాలఁ డనునమ్మకము నాకున్నది. మూలమును దిలకింపుఁడు.

ప్రాతర్వ్రజాద్వ్రజత ఆవిశతశ్చ సాయం
గోభిస్సమం క్వణయతోఽస్య నిశమ్య వేణుమ్,
నిర్గమ్య తూర్ణమబలాః పథి భూరిపుణ్యాః
పశ్యంతి సస్మితముఖం సదయావలోకమ్.

౧౦ స్కం. ౪౪ అ.౧౬.

ఎవ్వరు ప్రాతస్సాయంకాలములందు గోవులఁదోలుకొని వనములకరుగుచు నడవులనుండి వచ్చుచున్న శ్రీబాలకృష్ణుని సస్మితముఖమును గరుణావలోకనాంచితమును జూడఁగల్గుదురో ఆకాంతలే భూరిపుణ్యమును జేసికొన్నవారని పైశ్లోకతాత్పర్యసారము. కామాతురలగు కాంతలనుఁ బుణ్యవతులని చెప్పుట యెందేనిఁగలదా. ఈరీతిగా ననుకొనువారు మధురానగరమున మల్లరంగమునఁగల స్త్రీలుగాని గోకులముననుండు గోపికలుకారు. వారు కామార్తలే యని యడుగుదురేమో. అది పొరపాటు. ఎట్లనఁగా, గోపికలవలెనే వీరుకూడ భగవంతునిం గాంచిరి. తద్దర్శనమాత్రమునఁ బాపాత్ములు పుణ్యాత్ములుగా మాఱవలసినదేగాని పుణ్యాత్ములుమాత్రము భక్తులై పాపాత్ములక్లే యుండిన నిఁకభగవద్దర్శనమునకుఁ బ్రభావ మేమున్నది? పరమేశ్వరసందర్శనము సకలపాపములను నాశనముచేయునని సకలశ్రుతిస్మృతిపురాణేతిహాసములు ఘోషించుచుండ నట్టి శ్రీకృష్ణపరబ్రహ్మమును గాంచి గోపికలు కామాతురలై రని వర్ణింప నిఁకఁ గృష్ణునిమహిమ మేమో నాకు బోధపడలేదు. కావున శ్రీకృష్ణుఁడు భగవదవతారమే యని తలంచినచో నేఁజెప్పినయర్థము సార్థకము. ఒక్కమనుష్యుఁడు. అందును దుష్టుఁడు. అని భావించినచోఁ గామకుఁ డనవచ్చును. ఈయర్థము సిద్ధాంతమని చెప్పఁగలవారు భారతమాతృపుత్త్రులలోనుండరని నావిశ్వాసము. ఇది సత్యము! కావున నింక నీచర్చమాని తరువాతికథకుం గడంగెదను. ఈఘట్టమున నిట్టి

శ్లోకరత్నమునకుఁ దగినపద్యముల మహాకవి పోతన యేల వ్రాయలేదో తోఁచక పరితపించుచున్నాఁడను.

ఇట్లు పురంధ్రీమణు లెల్లఁ దమలోఁదమ రామహానుభావుల శ్రీరామకృష్ణులం గాంచి యనేకభంగులఁ బొగడుచుండఁగా మహాజనులెల్ల రీకుమారకు లెప్పు డీదురాత్ముల నిగ్రహింతురో యని యువ్విళ్లూరుచుండఁగా మహర్షులీమహీగురుతరభార మేక్షణమునఁ బోయి ధర్మము పాదుకొనునా యని యాశించుచుండఁగా మింటనున్న దేవతలు మహాత్మా! సంరంభంబున నీశత్రువులం బోకార్చి మాభయంబు దీర్చి లోకుల రక్షింపుమా యని దోసిలులొగ్గి వేఁడుచుండఁగా శ్రీకృష్ణమూర్తియుఁ దనతో బాహుయుద్ధము చేయుచున్న చాణూరుని భక్తుని ముక్తికిం బంప నాత్మ నెంచెను. మరలఁ బోరాడుసమయంబున హరి యతని నాలస్యముచేయక సంహరింపఁ దలఁచి పోరాడుచు విలాసముగా విహరించుచందంబున వానిం బడవైచును. రెండుమూఁడుమాఱులు లా చాణూరుఁడు లేచి కయ్యము చేయుచుండెనుగాని హరిబలము తనకన్న నురుతరమని పరికించి విధిలేక పోరాడుచుండెను. శ్రీహరి మనమున నతనిఁ జంపఁదలంచి పడవైవ నా వ్రేటుననే యతఁడు కాలునివీటికిం బోయెను.

బలభద్రుఁడు ముష్టికుఁడును బోరాడుచుండుతఱిఁ బెక్కుమారులు బలుని ముష్టికుఁడు లెక్కసేయక యుండెను గాని తుద కాతనివిక్రమంబు తనపరాక్రమంబునఁ జెడదని నిశ్చ

యుంచుకొనునంతలో బలరాముఁ డీతనితో నింకేటియుద్ధం బని తనబాహుదర్పోద్ధతిం జూపి పడవైచి వానియవయవంబులు చూర్ణమగునట్లు రక్తనాళములు తెగునట్టులు కరతలమున నడంచి వానిశరీరమునకు బ్రాణవాయువులకు సంబంధము లేకయుండఁజేసెను. *చాణూరముష్టికుల దేహములందుండిన జ్యోతిర్విశేషములు శ్రీహరియందు విలీనము లయ్యెను. ఆచి త్రమును సాధువులగు భక్తులు కాంచఁగల్గిరి. తక్కినవారి కది చూడ శక్యముకాదు కదా. ఆయద్భుతకృత్యమున కాసభయం దలి వారెల్లఁ బరమానందభరితులైరి. మునులయుమ్మలికలు చల్లవడెను. దేవతలు హరిపై రామునిపైఁ బూలవాన గురిపించిరి. అత్తఱిఁ జాణూరముష్టికులపాటుం గాంచి మల్లురెల్ల భీతిల్లిరి. అందుఁ గూటుఁ డనుమల్లుఁ డాగ్రహించి రౌహిణేయుని మార్కొని యఱచేతివ్రేటునఁ బ్రాణముల వదలెను. చాణూర పక్షపాతముగల శలతోసకలను నిర్వురుమల్లురు శ్రీహరిం దలపడఁగా వారిం గాలందన్ని శిరంబులు పగులఁజేసి వారిం బిలుకుమార్చెను. ఈముప్వురిపాటుంగాంచి తక్కినమల్లురెల్ల నుల్లాసంబు దక్కి భీతిల్లి నలుదెసలకుం బాఱిరి. అత్తఱి భగవ చ్చర్యను మహాకవి,

ఉ. మల్లురఁ జంపి గోపకసమాజములో మృగరాజురేఖ శో
భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయవచ్చు నా

---

*ఈవిషయము గర్గసంహితయందున్నది. తేషాం జ్యోతీంషి వైకుంఠే వివిశుః పశ్యతాం సతామ్=అని మూలము.

వల్లవరాజనందనుల వారక చూచి మహీసురాదు ల
ల్లల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్కనందఱున్.
అని వ్రాసి కృతార్థుఁ డయ్యెను.

ఇట్లు దుష్టమల్లురెల్ల నుక్కడంగఁగా సాధుసాధునాద ములు సభనుండి వెడలి దెసల నావరించెను. పురంధ్రు లాకృత్యము ఘోరతరముగనే కన్పట్టినను మున్ను వారివలన లోక మునకుం గల్గిన బాములవలన వారికిని సంతోషదాయక మే యయ్యెను. నేఁటితో దురాత్ములబాధ లడంగెనని యామల్ల రంగమున నున్నవారెల్లఁ గంసపక్షపాతు లొక్కకొందఱు తప్ప నంద ఱంగీకరించిరి. కంసపక్షపాతులుమాత్రము వగఁగుందిరి. శ్రీకృష్ణుఁడు బలరాముఁడును సమానవయస్కులగుసుదామాది గోపాలబాలకులంగూడి యారంగమునఁ బెల్లురేఁగువాదిత్ర నాదంబులకుఁ దమనూపురనినదంబులు తోడుపడుచుండఁ దాళ లయానుగతిమీఱఁ జరించుచు వేడుకఁ గూర్చుచుండ బ్రాహ్మ ణాదులెల్ల వారిం గనులారఁ గాంచుచుండిరి. వారియానంద మునకుఁ బరిమితి లేకయుండెను.

మహానుభావులారా! చాణూరముష్టికులసంహారమును వింటిరి. అందుఁ గలవిశేషవిషయములు నాయాతావులయందే వ్రాయఁబడియెను. ఇపుడు నాలుగుమాటలు వ్రాసెదను. చాణూరముష్టికులు కువలయాపీడము లోనగునవియెల్ల భూ భారమును హరింప భగవంతునకుఁ దోడుపడ నవతరించినవే. రెండుపక్షములుగా నుండకున్న నేకార్యము సాగదు. ఇందొక

రిని మనము నిందింపరాదు. భగవత్సహాయులలో లోకదృష్టిచే నుత్తమాధమములు కానఁబడునుగాని పారమార్థికదృష్టిచేఁ గానఁబడవు. ఏలయనఁగా నివిరెండును గూడకయున్న నేకార్యము కొనసాగదు. భూభారమును హరింప దేవతలెట్లు సాయపడుదురో రాక్షసు లట్లే సాయపడుదురు. వీరిద్దఱిపై భగవంతునికృప సమానమే. అది లోకదృష్టికి నించుక భేదముగాఁ గానంబడును. దుర్వృత్తి లేకయున్నచో సద్వృత్తిని బోధించుటకు నుదాహరణము లుండకపోవును. ఇట్లనుటచే దుర్గుణము లుండఁదగినవని చెప్ప నెంచినవాఁడను గాను. రెండును గార్యమునకు సాయపడునని చెప్పుచున్నాఁడను. భూతలము ప్రజానీరంధ్రమగుచో వ్యాధు లుద్భవిల్లును. అవియు భగవదాజ్ఞచే నుప్పతిల్లినవే. కాని తమంతట దమవుప్పతిల్లినవి కావు. అవి భగవంతునకు శత్రువు లనవచ్చునా. ఒక్కకార్యము సాధించుట కెన్నియోపరికరములు గావలెను. అన్నియుఁ గలిసినఁగాని కార్యము ఫలింపదు. ఇందేది కొఱఁతపడినను గార్యము సంపూర్ణము కానేరదు. అట్లే దేవతలు రాక్షసులు కలిసినఁగాని భూభారము హాయదు. సాక్షిమాత్రుఁడై యుండును. తదిచ్ఛచేఁ బ్రకృతి యందఱ నాడించును. పని సాగును. కావున మనము చాణూరాదులను దూషింపరాదు. వారును భగవత్కార్యము చక్కఁగూర్పఁ బ్రయత్నించినవారలేకాని రిత్తవారు గారు. లోకదృష్టిచే వారి కించుక యపకీర్తిగలదు. కావున వారిప్రవృత్తులం గాంచి లోకులెల్ల నట్టి

ప్రవృత్తులు మంచివిగావనియు వానికి విరుద్ధములగుసత్ప్రవృత్తు లలవఱచుకొనఁదగినవనియు నేర్చుకొనవలయును.

విశ్వరూపసందర్శనమున భగవంతుని యాకృతియందే సకలబ్రహ్మాండము లుండినవి. రాక్షసులు దేవతలు నందుండిరి. పరమేశ్వరుఁ డేల వారిని ధరించవలెను ? అన్న ప్రశ్నము చేయఁ దగదు. అదియంత మంచిదికాదు. ఏలయన సకలరూపము లాతనిస్వరూపములే. సర్వాంతర్యామికదా పరమపురుషుఁడు.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గంధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే.

గీత ౧౧ అ ౨౨ శ్లో.

గంధర్వయక్షులు, అసురులుండ హేతు వేమనరాదు కదా. సర్వసత్వములు భగవదంశములుగలవియే. కాని యందు స్వస్వకర్మానుసారము, సత్వరజస్తమోగుణప్రధానములై యుం డు. కావున లోకమున నుత్తముఁడగు జీవుఁడు సాత్వికజీవుల నుదాహరణముగాఁ దీసికొని వారివలెఁ బ్రవర్తించుచు లోక యాత్ర నడుపవలయును. ఇందులకే గుణత్రయము, తత్ప్ర ధానములగుజీవకోటులు పుట్టినవి. అందు దేని ప్రవృత్తి లోక సమ్మాన్యమో దానిని గ్రహించి లోకదూష్యమును వదలవల యునని నీతినిగ్రహించుట సాధులక్షణము. ఇది చాణూరముష్టి

కాదులను గుఱించి వ్రాయఁదగినవిషయము. ఇంక నీవిషయ మును వదలి ప్రకృతచరిత్రమునకుఁ గడంగెదను.

## చాణూరముష్టికాదుల పూర్వజన్మవృత్తాంతము.

* బహుళాశ్వమహారాజు నారదమునిపతిం గాంచి మహాత్మా! చాణూరాదులగుమల్లురు పూర్వజన్మమున నెవ్వరు? ఎచ్చటనుండి యిచ్చటం జేరిరి? ఔరా! వీరు శ్రీకృష్ణపరబ్రహ్మముతో యుద్ధ మొనరించిరికదా! వారిపుణ్య మేమనవచ్చును. వారితేజస్సు లాపరమేశ్వరునం దైక్యములయ్యెనే. ఆచరిత్రమును వినఁగోరెద నన నారదముని యిట్లుచెప్ప నారంభించెను. అమరావతీ నగరమున నుతథ్యముని యొకఁడుండెను. ఆముని కైదుగురు కొమరు లుండిరి. వారెల్ల మన్మథుని దిరస్కరించు రూపసంపద గలవారు. వారు వేదశాస్త్రపఠనము మానిరి. జపముచేయుట మానిరి. ఏవిద్యయు మేము పఠింపమనిరి. పర్వతప్రాంతములకుం బోయి మల్లయుద్ధము నభ్యసించుచుండిరి. బ్రహ్మకర్మపరిభ్రష్టులై వేదాధ్యయనశూన్యులై యిష్టానుసారము తిరుగుచున్న సుతులను గాంచి వీరు మదించి సత్కర్మపరిభ్రష్టులైరికదా యను నాగ్రహమున నాయుతథ్యముని యిట్లు పలికెను.

శమము, దమము, తపస్సు, సదాచారము, క్షాంతి, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము నను నివి బ్రహ్మకర్మస్వభా

---

*ఈచరిత్రము గర్గసంహిత మథురాఖండము పండ్రెండవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది. ఇతరపురాణములయం దీగాథ యిట్లు కానరాదు.

వజములని పెద్దలు పలుకుదురు.శౌర్యము, తేజస్సు,ధృతి, దాక్ష్య
ము, యుద్ధమునఁ బాఱక నిల్చియుండుట, దానము, ఈశ్వరభా
వము, క్షాత్రకర్మస్వభావజము లని న్యాయసిద్ధము.కృషియు గో
రక్షణము, వాణిజ్యము ననునివి వైశ్యకర్మస్వభావజములు. పరి
చర్యాత్మకకర్మము, శూద్రస్వభావకర్మజము. పుత్త్రులారా!మీరు
బ్రహ్మవంశమునఁబుట్టి బ్రహ్మకర్మపరిభ్రష్టులైతిరి. మల్లయుద్ధము
క్షత్రియకర్మము. దుర్జనులరై దాని నేల యభ్యసించుచున్న
వారు? బ్రహ్మవంశమునఁబుట్టియుఁ గులస్వభావజము లగుకర్మము
ల మాని మత్తులరై తిరుగుచున్న వారు గాన మల్లురుగాఁ బుట్టుఁ
డు. భారతభూమియందు జన్మింపుఁడు. అసురుల ప్రసంగముచే
దుర్జనులుగా నుండఁగలరు.అని శపించెను. రాజేంద్రా! ఆయుత
థ్యమునితనయులే మల్లవంశమున జనించిరి. శ్రీకృష్ణాంగస్ప
ర్శమాత్రమునఁ బరమసుగతికిం బోయిరి. చాణూరముష్టికులు
కూటశలతోశలులనువారే యామునితనయు లైదుగురని
యెఱుంగుము. ఇది వీరిపూర్వచరిత్రము.

మహాశయులారా! చాణూరాదిమల్లపంచకచరిత్రమును
ఆలకించితిరి. శాపవశమునఁబుట్టిన మునితనయులేకదా యీమ
ల్లురు. కర్మవశమున శాపము గలిగెను. దాని ననుభవించుచు
మరల నుత్తమగతి కరుగుట కుపాయముగా వారిసత్కర్మమే
కంసునిచెంతకుం జేర్చెను. తత్సంగతిచేఁ బాపకర్మఫల మనుభ
వించి సత్కర్మమున శ్రీకృష్ణబలరాములతోఁ బోరాడ నెంచిరి.
భగవంతున కీవిషయము తెలియనిది కాదు కదా. కావున వారితో

మల్లరంగమున విహరించెను. పూర్వజన్మమున సత్కర్మము చేసి యుండనిచో భగవత్సందర్శనసంభాషణాంగస్పర్శనాదులు కలుగవు. అవన్నియుఁ జేకూరెను. వారికి దివ్యజ్ఞానముదయించెను. అంతమున భగవంతునందే వారి తేజస్సులు కలిసిపోయెను. ఇందు విశ్వాసపాత్రముగాని విషయలేశముకూడ లేదని చెప్పఁగలను. ఇంకఁ దరువాతివిషయమును జిత్తగింపుఁడు. చాణూరముష్టికుల తేజస్సు శ్రీకృష్ణునందుఁ గలిసెనన్నఁ గొందఱు నమ్మనివారుండక పోరు. అట్టివారికి విశ్వాసము పుట్టించుగాథ యీకంసవధమే. చాణూరముష్టికాదుల నెందఱనో చేర్చి వారిచేఁ గృష్ణుని జంప నెంచినవాఁడుగదా కంసుఁడు. వసుదేవతనయుల నాలుగురను జంపెను. అంతియకాక ధనుర్యాగ మనుపేర రామకృష్ణుల రావించి యెట్లైనిని జంపింపఁ దలంచెను. అట్టి పాపాత్ముఁడు భగవంతునిచేఁ జంపఁబడి ముక్తినందెనని భాగవతమునఁ గలదు. ఇతరపురాణములయందుఁ జాణూరాదులకుఁ బరమపదము లభించినట్లున్నది. భాగవతమున నావిషయమే లేదు. కావున నన్నియు సుసంగతములే యనక తప్పదు. ఇపుడావిషయమును జదువుదము.

### కంసవధము క్షిప్రదానములు.

చాణూరముష్టికాదుల సంహరించి సుదామాదిగోపకుమారులంగూడి నందాదుల కానందమును గల్గించుచు దేవకీవసుదేవు లపరిమితానందమునఁ దన్నుఁ బరికింప భూసురులు భక్తిభావములఁ దన్ను ధ్యానింపఁ బురందరాదిబృందారకులు

తన్నుఁ గంసవధమునకై పురికిఁ బిలుపఁగా సకారణముగా నాతనిం జంప నెంచి లోకాపవాదము కలుగకుండఁగాఁ జరించుచుండెను. ఆచర్య వింతగా నుండెను. అది సజ్జనులకే యానందదాయకము. దుర్జనులకు నది గుండెగాలమనవచ్చును. అప్పటి దేవకీవసుదేవుల యానందమును వర్ణింప నెవ్వరికే నశక్యమని చెప్పుట పొరపాటుగాదు. గోకులమున విడిచివచ్చినది మొద లింతదనుక నారదాదిమునులనుండి తనతనయునిచర్యల విని సంతసించుటయే గానికన్నులార నాదివ్యసుందరవిగ్రహమును జూచుభాగ్యము లేకయుండెను. అట్టి నిరుపమాకారము నామల్లరంగమునఁ జూచినపు డాతల్లిదండ్రుల మనస్సంతోషమునకు బరిమితి యుండునను టయాశ్చర్యమేకాక మఱేమగును? మల్లరంగమునఁ జాణూరముష్టికాదిమల్లురు, కువలయాపీడ మనుదుష్టగజము నుండుటయుఁ గృష్ణుని జంపఁ గంసుఁడు ప్రయత్నించుటయు వసుదేవాదులకుఁ దెలియక యుండునా. అట్టి కృత్రిమప్రయత్నముల నెఱింగియు నందు జయాపజయముల నిర్ణయింప వీలుగాకుండు టెఱింగియు గోకులమునుండి నందాదులు మధురలోనున్న వసుదేవాదులు మల్లరంగమున కేలవచ్చి రను ప్రశ్నము చేయవచ్చును. ఈ ప్రశ్నము సమంచితమే యనియుఁ దోఁపవచ్చును. సమాధాన మిట్లు.

కంసుని ప్రయత్నములు కృత్రిమములు. కపటనాటకమాడుటలోఁ గంసునకు సాటిచేయఁదగువారు లేరు. పూతనాదులఁ బంపుట యీవిషయమును దృఢపఱచుచున్నది. పురోహితుని

యనుమతిచే ధనుర్యాగ మారంభించెను. అక్రూరునిం బంపున పుడు కృష్ణాదులధనుర్యాగమునకుఁ బిలిచిరమ్మని చెప్పిపంపెను. ఒకప్పుడు కర్ణాకర్ణికగా నాకర్ణించి యుండవచ్చును. కాని యందఱు మధురకుఁ గంసాహూతులై యపుడపుడు పోవుట యాచారమైయుండెను. వసుదేవాదులకుం గూడ నీకపటోపాయము తెలిసియుండుననుట కాధారములు చక్కఁగాఁ గాన రావు. కావున మల్లరంగమున నేమేమియాటలు సాగునో. రాజును సామంతరాజులు కూరుచుండుదురు. వినోదము లెట్టివి జరగునో చూతమని యందఱు చేరిరి. ఇంతియగాక యింతటమహోత్సవము సాగుచుండఁగాఁ గ్రూరకార్యములు జరగవని యందఱు విశ్వసింతురనుట లోకాచారవిరుద్ధముకూడఁ గాదు. కావుననే శంకలులేక యందఱు చేరియుండిరనునది సమాధానమే.

మఱియొకసమాధానము. జననకాలమునందు దేవకీవసుదేవు లాభగవంతుని గన్నులారఁ గాంచియుండిరి. వినుతించిరి. కావుమా యని ప్రార్థించిరి. భగవంతుఁడు వారికిఁ దగురీతి సమాధానము చెప్పియే యుండెను. తన్నుఁ గొనిపోయి గోకులమున విడువు మని యాజ్ఞాపించెను. ఆరీతినే యతఁడు కొనిపోయి యుత్తుంగతరంగములతోఁ బొంగుచున్న యమునమార్గ మీయఁగా దాఁటి గోకులమున శ్రీకృష్ణు నునిచి వచ్చెను. అందున్న కన్యకను గొనివచ్చెను. ఆమె కంసునిచే నెగురవేయఁబడి యంబరమున నిలిచి చెప్పినమాటలును వినియుండెను. పిదప గర్గము

నిని బిలిచి నందునికడకుం బంపియుండెను. ఇన్ని కారణములతోఁ దనపుత్త్రుఁడు భగవంతుఁడే యనియతనికి విశ్వాసము కలదు. నందునకుంగూడఁ బూతనాసంహారము మొదలు సమస్తాద్భుతకృత్యములుతనకుమారుఁడు చేయుట కన్నులారఁ గాంచియుండెను. అంతియగాక గర్గమహర్షి రహస్యముగాఁ బిలిచి శ్రీకృష్ణునిచరిత్రమును దెలిపియుండెను. కాఁబట్టి నందవసుదేవుల కిట్టిమల్లరచేఁ దనకుమారున కపాయము కల్గదనునమ్మకము కలిగియే యున్నది. కావుననే సంతోషముతో నామల్లరంగమునఁ గూరుచుండిరి. తక్కుంగలవారిలోఁ బెక్కుమందికి శ్రీకృష్ణదర్శనము వలన నొకయద్భుతజ్ఞాన ముదయించియుండెను గాన నెవ్వరు గాని సంశయించినవారు లేరు. చాణూరముష్టికులకే కువలయాపీడమత్తగజమును జంపినవార్త వినినతోడనే యీబాలుఁడు లోకసామాన్యుఁడుకాఁడని తోఁచెను. కావుననే సహస్రగజసత్త్వముగల కువలయాపీడము చంపిన నీవు బాలుఁడవు కావని తెల్పెను. ఇట్టులుండ నింక మల్లరంగమున నున్నవారికెల్ల నింతకుముందే శ్రీకృష్ణు నద్భుతచరిత్రములు వినఁబడుచున్నందున వారెల్ల వీరమానుషవిగ్రహులని నమ్మియుండిరి. కాఁబట్టి యిట్టిశంకల కిట నించుకంతయుఁ దావులేదు. ఇఁకఁ గంసవధవృత్తాంతము విచిత్రము. అదియే శ్రీకృష్ణమహిమమును విశేషించి తెలుపును. అదియే చాణూరముష్టికాదులు భగవంతునిగా శ్రీకృష్ణునెఱింగిరనియు దృఢపఱచును. కారణములను ముందే తెలిపి

నాఁడనుగదా. ఇపుడు కంసవధవృత్తాంతమును దానిచే నెఱుంగఁదగుభగవత్తత్త్వమును బరికింపుఁడు.

* చాణూరుఁడు ముష్టికులు తక్కుంగలమూవురుమల్లవీరులు చనిపోఁగా శేషించినమల్లురు కాలికి బుద్ధిచెప్పిరి. ఎందఱెందఱేమార్గమునఁబోయిరో యెందుండ నిశ్చయించుకొనిరో యెవ్వరెఱుంగరు. పాప మామల్లురందఱు రక్షకుఁ డీకృష్ణుఁడని తెలిసికొనఁజాలక మల్లరంగముననున్నఁ జావు దప్పదని వెడలిపోయిరి. వారు పోఁగానే యందఱుల్లాసమున జయజయధ్వనులు చేయసాగిరి. అది కంసునకు నిష్టముగానుండునా. మనస్సు కలవిలపాటొందెను. చాణూరముష్టికాదులు హతులయిరికదా ఇంకెవరిని నమ్ముకొని వీరి జయింతును? అన్నయూహలు ప్రసరింపసాగెను. ఏదెసచూచినను శ్రీకృష్ణజయధ్వనులే వినఁబడసాగెను. తనదృష్టికి నెందఱో కృష్ణులు మల్లరంగమున నిండియుండినట్లు తోఁచెను. దానఁ జిత్తము సాధ్వసాక్రాంతమయ్యెను. ఆభయము సామాన్యులకుఁ గలుగునదికాదు. ఆసన్నమృత్యువులగు ప్రాణులకుం గల్గునది. అప్పుడైన భగవంతునితోఁ బోరాడువాఁడును గలఁడే యని యాతనికిఁ దోఁచకుండెను. ప్రభుత్వగర్వము మదినుండి తొలఁగిపోవ నిష్టపడినదికాదు. తనకంటె

* ఇది శ్రీభాగవతము శ్రీకృష్ణజన్మఖండములోనగు నన్నింటియందు సమానముగా నున్నను విశేషించి బ్రహ్మవైవర్తమునందుఁ జెప్పఁబడినది. కావున దాని నిట నెక్కువగాఁ బ్రధానముగా భావించి తక్కినవానిం గలుపుచు వ్రాసెదను.

నౌరు లధికు లుండఁగూడ దన్న దురూహాలు దూరముగా లేదు. వాని తావున నవియే యుండెను. ఆసమయమున నాతనిమనఃపద మున సదుద్దేశమునకుఁ జోటులేదు. భక్తికి నిలువ నీడలేదు. ఇట్టితటినైనఁ గడ తేలునుపాయము వెదకుట మంచిదనుభావ మున కిష్టు చాలదు. అన్నితావుల నాక్రమించుకొని మదము పాదుకొనియుండెను. తనయధికారమే సాగవలయు నన్నయా శయము మదగజమువలెఁ జరింప నందవకాశము చాలకుండెను.

ఆతరుణమున నాకంసుఁడు చాణూరముష్టికాదులు తెగు టయు జను లానందపరవశులగుటయుఁ గాంచి కోపావేశమునఁ దనచిత్తము పరవశముకాఁగాఁ దనపరివారముంజీరి యధర మద రుచుండగా.

ఉ॥ పల్లవబాలురన్ నగరివాకిటకిన్ వెడలంగ ద్రొబ్బుఁడీ
గొల్లలముట్టికోల్ గొనుఁడు క్రూరుని నందునిఁ గట్టుఁ డుర్వికిం
దెల్లముగాఁగ నేఁడు వసుదేవుని జంపుఁడు తండ్రిగాఁడు వీఁ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్.

భాగవతము.

అని పలుకసాగెను. తూర్యఘోషముల నిలుప నాజ్ఞా పించెను. మహాగ్రహమున నేమిచేయఁదగునో తోఁపమి నాతఁ డేమియో యసందర్భముగా మాటలాడఁజొచ్చెను. కన్నులారఁ జాణూరాదులసంహారించినశూరులను బాలకులనియే తలంచి కాఁబోలు నగరివాకిటికిం దోలుఁడనియె. మల్లురు వారిని దోలఁజాలక పోయిరికదా. ఇఁక బీదభటులా వారలం దఱుము

వారు. ఇంతమాత్ర మాలోచనము కంసునకుం దోఁపదయ్యె. కోపము సకలసద్గుణములకు బాధకమనుట నిక్కమేకదా! పోతనగారిపద్యమునందు రెండవపాదము కడపట "నందుని గట్టుఁడుర్విశకీ" అనునది కంసునుద్వేగమును దెలుపుచున్నది. వాని చిత్తవృత్తి యిట్లున్నదని మహాకవి తెలిపిరి. నందునుర్వీకిం గట్టుఁడనఁగా నర్థములేదు. ఎట్లన్వయింపవలెనో తోఁచకున్నది. భూమికి నందునిం గట్టివేయుఁ డనఁగాఁ గంసుఁ డాతురుఁడు కాననట్టు లాడెనని తెలుపుటకే యిట్లు తెల్పిరనునదియే సమాధానము. మూలముం జూడుఁడు.

నిస్సారయంత దుర్వృత్తౌ వసుదేవాత్మజౌ పురాత్
ధనం హరత గోపానాం నందం బధ్నీత దుర్మతిం.
వసుదేవస్తు దుర్మేధా హన్యతామాశ్వసత్తమః
ఉగ్రసేనః పితా చాపి సానుగః పరపక్షగః.

దీనిసారమును వినుఁడు. చాణూరాదుల వధానంతరమే కంసునకు నారదవాక్యములన్నియు స్మృతికం దగిలెను. కాఁబట్టియే వసుదేవపుత్రులను రామకృష్ణులను వెడల నడుపుఁడని యాజ్ఞాపించెను. వసుదేవుఁ డష్టమపుత్రుని గోకులమునకుం బుచ్చె నన్నమాట యానాఁడు తాఁ జంప నెగురవైచినపుడు క్రిందఁబడక యంబరమున నిలిచి బాలిక చెప్పినమాటలు నమ్మకపోతిఁగదా యని చింతించెను. ఈకృత్రిమమంతయు వసుదేవుఁడు చేసినదే యని నమ్మెను. ఆనాఁ డెట్లో తప్పించుకొనిపోయి నామృత్యువుగా మరల నేఁటికిటఁ జేరిరని నమ్మెను.

కావుననే "వసుదేవస్తు దుర్మేధాః" అనెను. వసుదేవుఁడు దుర్బుద్ధి కలవాఁ డనియే ఇంతమోసమా చేయవలసినది. నాకొడుకుల నందఱ నీకు నిత్తునని యాఁలుగుర నిచ్చెను.ఏడవగర్భ మెట్లో పోయిన దనిపించెను. ఎనిమిదవతడవ కొడుకు కలుగఁగా నాతని నెట్లో గోకులమునకుఁ జేర్చెను. ఎచ్చటినుండియో యొకయాఁడుశిశువుం దెచ్చిపెట్టెను. అది మంత్రనిర్మితరూపము కావలయు. ఏమో నాకపు డీయూహాలు ప్రసరింపలేదు. భార్యచే నిది యాఁడుశిశువు. కాపాడుమా యని ప్రార్థింపఁ జేసెను. ఇన్నికపటములు పన్నెను. ఇంచుకంతయు నెఱుంగక మోసపోతినిగదా. నావంటివాని నింతమోసపుచ్చినవాఁ డీదుర్బుద్ధివసుదేవుఁడు. వీనికొడుకులుకదా వీరు. కావున నసాధువులలో మొదటివాఁ డగువసుదేవుని వీని వధింపుఁడు. నాతండ్రియగు నుగ్రసేనుఁడు శత్రుపక్షపాతి. తండ్రియైనను శత్రుపక్షమువానిని వధింపరాదు. దీనిచేఁ బితృవధపాపమురాదు. ఔరసపుత్రుఁడనగు నన్నుఁ బ్రేమింపక శత్రువులపక్షమునఁ జేరి నాచావుకోరుచున్నవాఁడు. కాన నీతని నన్నువంచించిన వసుదేవుని జంపుఁడని యాజ్ఞాపించెను.

*ఇట్లు తనపాటెఱుంగక యింకను రాజగర్వమున విఱ్ఱవీఁగుచుఁ దనమాటను దలఁదాల్చుమూర్ఖులు కొందఱు చుట్టు

---

* ఈఘట్టమున శ్రీకృష్ణజన్మఖండమున విశేషము కన్పట్టెడిని. భాగవతాదులయందు సాధారణచరిత్రమే కనఁబడుచున్నవి. కాననే నీరెంటిని గలిపి వ్రాసెదను. పరస్పరవిరుద్ధములుగాఁ గన్పట్టుచున్నవి. ఐనను గథాసారము

నుండ వారి కీరీతి నాజ్ఞాపించుచుండుకంసుని గాంచి హరి యిఁక వీనికిఁ గాలము సమీపించినది. తడవుచేయ నేల? ఇత నియం దున్నయాత్మ నా తేజస్సేకదా. దాని కీతనితనువు నివ సింపఁదగుచోటుగాదు. దేహ మిది యపవిత్రము. ఇంక నిందు నా తేజస్సు నిలువవలనుపడదు. వెడలించెదఁగాక యని యూహించెను.

కంసుని యాదేశముల నాలకించెను. వసుదేవోగ్రసేనులఁ జంపుఁడు. గోపాలకులద్రవ్యమును గొల్లగొనుఁడు. అను మాటలు చెవిసోఁకగనే మండిపడి యాగ్రహమును దెచ్చుకొని సాక్షాదవ్యయుఁడు నారాయణమూర్తియునగు శ్రీకృష్ణమూర్తి కంసుఁడెక్కియున్న యత్యున్నతమంచముమీఁదికి లాఘవంబున లంఘించెను. మృత్యువువలెఁ దనమీఁదికివచ్చిన యచ్యుతినిం దిలకించి కంసుఁడు వేగమున లేచి పౌరుషంబున వాలును బలుకయుఁ గైకొని సమరమునకు సిద్ధపడియెను. అంత నాకాశమునఁ దిరుగు డేగపక్షివలెఁ దనచావుదప్పించుకొనఁ బూని సవ్యాపసవ్యములుగాఁ దిరుగుచుఁ దొలఁగుచుఁ గరమున

---

సమానమే. నీతియు సమానమే. శబ్దభేదమున నించుక కథమార్పు నొందిన ట్లగపడును. భక్తుఁడగుకంసు ననుగ్రహింపఁగోరి శ్రీకృష్ణుఁడు దాపునకుంబోయి వధించి తనలోఁ గలుపుకొనియెనని శ్రీకృష్ణజన్మఖండము తెలుపుచున్నది. కంసుని వధించి యాశవమును రంగమండపమున నీడ్చెననియుఁ సారూప్యముమాత్రమాకంసునకు లభించెననియుఁ శ్రీభాగవతమున నున్నది కాన నివిరెండును వ్రాయఁదగినవే. సంగ్రహించి వ్రాసి ఆర్తత్రాణ పరాయణత్వ మిట సూచింపఁబడిన దనువిషయమును దెల్పెదను.

నున్న తీవ్రాసిని జళిపించుచుఁ గులపాంసనుఁ డయియున్న యా భోజనృపతిని గంసుని జూచి యారా! యింకను జావు తప్పించుకొనఁ జూచుచున్నవాఁడే యని పామునుబట్టుకొను వినతాతనయునివలె మహోగ్రతేజంబున నట్టె యాతనిజడముడింబట్టుకొని నవరత్నమయకిరీటంబు క్రిందఁబడఁ దన్ని యాయున్నతాసనంబునుండి మల్లరంగమునఁ బడంద్రోచి వానిశరీరము శకలములగునట్లు లాత్మతంత్రుఁడై హరి వానిపయిం బడెను. ఆపాటునకే వానియాత్మ వెడలిపోయెను. ఏనుఁగును సింహం బీడ్చునట్లు ఆభోజకులపాంసునునిపీనుఁగును ఈడ్చుటయు నారంగమున నున్నజనులెల్ల హాహాకారంబు లొనరింప నాశబ్దము వియద్వీథిం దాఁకెను. ఆకంసుఁడు నిరంతరము ఆహారముగొనునప్పుడును, జలపానము చేయునపుడును, సంచరించుతరుణమునను, గూరుచుండుతఱిని, శ్వాసమువిడుచుసమయమందును, నుద్విగ్నచిత్తమునఁ జక్రిని దలంచుటచే నెంతపాపియైనను, పరమేశ్వరుసారూప్యమును బొందెను. అది దురవాపము. వినను గంసుఁ డద్ధానిం బడయఁజాలెను.

పాఠకమహాశయులారా! బ్రహ్మ విష్ణు హరివంశగర్గసంహితాదులయం దీకంసవధప్రకార మిట్లే యున్నది. ఈషద్భేదమేకాని పద్ధతిభేదము కానరాదు. శ్రీకృష్ణజన్మఖండమున నీచరిత్రము విచిత్రముగాఁ గనుపట్టెడిని. దానిం దెలుపక మానునావమానస మంగీకరింపకున్నది. కాన వ్రాసెదను.

చాణూరముష్టికాదులు మడిసినవెంటనే యాదవులెల్లఁ

నుల్లాసంబున నాహరిని గాంచి సంతోషాంబుధిం దేలిరి. కృష్ణుఁ డంత వారియానందమును దెలిసికొని దేవకీవసుదేవులఁ గాంచి నమస్కరించి మునులకు నాత్మయందే వందనము సలిపి పూజ్యు లగుబ్రాహ్మణుల సత్కరించి గురువు లనఁదగువారికి సాష్టాంగ నమస్కరణములు చేసి భూభారహేతుభూతుఁడగు కంసునిజంప నూహించెను. తనయాత్మలో సుదర్శనమును దలంచెను. అయ్యది మహానుగ్రహమని యప్పుడే పాదసూపి హస్తసరోరుహము నలంకరించెను. *ఇఁకఁ దడవుసేయుట పాడిగాదని చివాలున భోజభూపతియుండు నున్నతమంచాగ్రముపైకి లంఘించెను. ఆలస్యము చేయక యాతనింబట్టుకొనియె †అత్తటి నాభోజకుల పాంసనుఁడగుకంసునకుఁ బ్రపంచమెల్లఁ గృష్ణమయముగాఁ గానంబడియె. అత్తరుణముననే సుదర్శనము నాతనికంఠమున నునిచెను. తత్సంస్పర్శముచేతనే యాతనిమేన నిల్వక ప్రాణవాయువులు లేచెను. చక్రము మెడన నిలువునపు డాతనిదృష్టికిఁ బ్రపంచమెల్లఁ గృష్ణస్వరూపముగాఁ గానంబడియెను. ప్రాణము లాదేహమునుండి వెడలఁగనే దివ్యరూప మలవడెను. అంతలో దివ్య విమానము దృగ్గోచరమయ్యెను. అందలిమణిగణకాంతులు దిక్కుల వెలిఁగింపఁజాలెను. ఆతేజోరూప మావిమానముపైఁ జేరఁగనే యత్యద్భుతముగాఁ జూడఁదగియుండెను. ఆతేజస్సు

---

* దృష్ట్వా భక్తం భక్తబంధుః కృపయా చ కృపానిధిః. అని మూలము. ౭౨ వ అధ్యాయము.

† రాజా దదర్శ విశ్వం చ సర్వం కృష్ణమయం పరమ్. అని మూలము.

శ్రీకృష్ణపాదాంబుజముల ధ్యానించుచు గోలోకమున కరిగెను. శ్రీకృష్ణపాదారవిందములయందు లీనమైన ట్లగపడిరెు. విమానము గోలోకమున కరిగెను.

మహాశయులారా! కంసవధకథాప్రసంగమునఁ గలవిశేషము లంతగాఁ జర్చింపఁదగినవికావు. కంసుఁ డాయుధసహాయముంబూని హరిని దునుమి తన్నుఁ గాపాడుకొన నెంచెను. కాని హరినిజంప శక్యమగునా. హరియే యాతని వెండ్రుకలు పట్టుకొని యీడ్చి క్రిందికిఁ బడఁద్రోసెను. తానును వానిపై దుమికెను. కంసుఁ డంతమొందెను. కాని సదా తలంచుచున్నందున శ్రీహరిసారూప్య మాతనికి లభించెను. అనుభాగవతకథను వింటిరి.

కంసు నంతమొందింపఁబూని సుదర్శనమును స్మరించి యది రాఁజే నంది మంచముపైకి లంఘించి యతనిం బట్టుకొని చక్రధారచేఁ దునుమ నతనికిఁ దత్కాలమునఁ బ్రపంచమంతయుఁ గృష్ణమయముగాఁ గన్పడ నాతఁడు దేహావిముక్తినొంది దివ్యశరీరమును ధరించి గోలోకమున కేగె ననుశ్రీకృష్ణజన్మఖండమునందలి చరిత్రమును వింటిరి. కంసునిపీనుఁగును శ్రీహరి రంగస్థలమునఁ జాలదూర మీడ్చె నన్నవార్తను వింటిరి. ఈరెండింటియందును గంసునకుఁ బరమపదము లభించుట సామాన్యగాథ. మనకుఁ గావలసిన దదొక్కటియే ఈగాథచేఁ జాణూరాదులకుంగూడ హరిదర్శనానంతరము జ్ఞానోదయమయ్యెనని చెప్పుట కేమాత్ర మాక్షేపము లేదు. ఏలయనఁ బరమపాపాత్ము

డగు కంసునకే కృష్ణునియముగా లోకమెల్ల నాకాలమునఁ గనఁ బడినపుడు చాణూరముష్టికాదులకుమాత్ర మేల హరిదర్శనము ఫలింపదు. ఫలము నిచ్చియే తీఱవలయు. హరిచే మృతిగలుగుట పుణ్యవిశేషముననేకదా యనక తప్పదు. వారికిని హరివలనిమృతియే కల్గెను. కంసునకు నట్లే కల్గెను. ఈయిరువ్వురియందు భగవత్ప్రసాద మొక్కరీతినే ప్రసరించెను. కంసునకే పదములభించునో చాణూరాదుల కాపదమే లభించును. భగవంతునిచే మృతిగల్గుటచే నంద ఱొక్కవిధమగుపుణ్యము చేసినవారే యనవలయును.

మహాపాపులకుంగూడ సారూప్యము లభించునా యనునది చిన్నప్రశ్నము కలదు. దానికి భాగవతమునందే,

"స నిత్యముద్విగ్నధియా త మీశ్వరం
పిబన్నదన్ వా విచరన్ స్వపన్ శ్వసన్
దదర్శ చక్రాయుధమగ్రతో యత
స్తదేవ రూపం దురవాపమాప."

అని చెప్పఁబడినది. భగవద్గీతయందు,

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬ శ్లో.

అక్షరపరబ్రహ్మయోగము.

కంసాదులు సాధారణజనులవలెఁ బాపకార్యములు చేయువారుకారు. కారణాంతరములచే ఘోరకార్యము లొనరించువారైరి. అదియు భగవత్కార్యమునకు సాయపడినది.

కంసాదులు లేకయున్న భూభారహరణమునకు వీలులేదు. కావున నే దేవదానవులు రాజరూపముల నవతరించిరి. వారియొద్దఁ జావఁదగిన జీవులందఱు చేరిరి. రెండుపక్షము లయ్యెను. ఈయిరుపక్షములు ప్రయత్నించినఁగాని మహాసంగ్రామము సాగదు. అదిసాగినఁగాని ప్రజాక్షయము కానేరదు. అదియైనఁగాని భూభారము తగ్గదు కావున భగవత్కార్యమునకు సాయపడువారందఱు సుగతికిఁ బోవవలసినవారలే కాని దుర్గతికిఁ బోవవలసినవారు కారు. కాననే పాపాత్ములుగాఁ గనఁబడువారికి భగవంతునిచే మృతిగల్గును. కేవలపాపులకు రోగాదులచే మృతిగల్గును. ఇట్టితఱి బుద్ధిమంతు లించుక యోజించుకొనవచ్చును. పాపులకుంగూడ భగవంతునిచే మృతిగల్గిన నింకఁ దదనుభవమేలాగని? ఇదియే వా రేకాంతమునఁ గూరుచుండి యూహించుకొనవలసినది. పాపాత్ములను బరమేశ్వరుఁడు వధించునెడల వారిపాపములకు ననుభవరూపఫలమే లేదుకదా. ఇంకయమలోకమేటికి? నరకము లేల? కేవలపాపాత్ములకుఁ గంసాదులకు భేదము గలదు. దేవదానవులు భూభారహరణార్థమై యవతరించినవారని పురాణములు ఘోషించుచున్నవి. మనుష్యలోకమునఁ బుట్టినపిదపఁ దమ రెందులకుఁ బుట్టిరో యది యెఱుంగక పోవచ్చును. కాని భగవంతుఁ డెఱుఁగును. వారు చేయుకార్యములు భూభారహరణమునకు సంబంధించినట్లే యుండును. వారికి భగవంతునిపై విడువనివైర ముండును. అదియుండినఁగాని వ్యవహారము సాగదు. సాగకున్న వారు పుట్టియు లాభము

లేదు. కావున భగవంతునియుద్దేశము నెఱవేఱుటకే వా రట్టి కార్యములు చేయుచుందురు. పరమాత్మ వారిపట్ల సాను భూతిని జూపనట్లు నటించుఁగాని తుదకు వారిపైఁ దనకుఁ గల దయను జూపును. వారికి ముక్తి కలుగకపోదు. ఎట్టిపాపాత్ముఁ డుగాఁ గనఁబడుచున్నను భయముచేతనో, భక్తిచేతనో భగవం తుని దలంచుచుండిన నది ఫలింపకపోదు. సదా సర్వేశ్వరుని దూ షించు వారికింగూడ ముక్తి కలిగెనన్న గాథల కర్థమేమి? ఘంటా కర్ణుఁడు అజామిళుఁడు లోనగువారు హరిభక్తిపరాయణులు కారు. అంతియగాక హరిపై ద్వేషముగలవారు. అట్టులయ్యు వైరమున సదా హరినే స్మరించిరి. ఆస్మరణముననే వారు పరమ పదమున కేగిరి. దీనిభావమేమి?

> సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
> యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.
>
> భగవద్గీత.

అను భగవత్ప్రతిజ్ఞ ననుసరించి మిత్రామిత్రులు లేని భగవంతునకు సర్వభూతములయందుఁ గరుణ సమానముకాన నెవ్వరుగాని యెట్టులేని దన్ను స్మరించినచో వారిని గాపా డుటకై కంకణము కట్టుకొన్నవాఁడు కావున నేదేని పుణ్య లేశమున స్మరించినవారికే వరము లిచ్చు దయాళువు తన యాజ్ఞానుసారము భూభారహరణార్థ మవతరించిన కంసాదు లకు ముక్తినీయఁడనుట యవివేకమూలము. కావునఁ గంసాదు లందఱు భగవత్కార్యమునకు సాయము చేయఁబూనినవార

లనియు, వారు లోకసామాన్యదృష్టికి దుర్వృత్తులుగాఁ గనఁ బడినను, భగవంతునిదృష్టికి స్వకార్యనిర్వహణాసక్తులుగాఁ గానంబడుదురు. కాన నట్టివారు భగవత్కరుణకుం బాత్రు లగుట సత్యమని మూఁటికి ముమ్మాటికి నిరాఘాటముగాఁ జెప్పఁగలను. కంసునిచరిత్రమునుబట్టి చాణూరముష్టికాదులు కూడ భగవంతునిదయకుఁ బాత్రులై హారిదాస్యమును బడయఁ గల్గిరని వ్రాయుట సమ్మతము సముచితము నగుననుట నిక్కమే యని మఱియొక్కమాఱు నొక్కి వక్కాణించువాఁడను. ఇఁకఁ దరువాతిగాథ నాలకింపుఁడు.

పాఠకమహాశయులారా! కంసవధానంతర మేవిధముగా భగవంతుఁడు నటించెనని మనము తెలిసికొనఁదగును. కంసవధ ముతో శ్రీకృష్ణమూర్తికి బాల్యము గడచెనని మన మూహింప వచ్చును. ఇఁకమీఁదటిచర్యలు వేఱు. బాలక్రీడలరూపముగాఁ జూపు చమత్కృతులు ముగిసినవి. ఒకటిరెండుండును. కాని తఱచుగానుండవు. ఇఁకఁ దత్త్వబోధ మొనరింపఁ బ్రయత్నించును. లోకసంగ్రహార్థ మాయాయికార్యములు తాఁజేయఁబూనుట వాక్కుచే నెల్లర కెఱిఁగించును. లోకప్రవృత్తి యెట్లుండవల యునో తెల్పును కావున మనమింకను శ్రద్ధగా శ్రీకృష్ణ గాథలం బరికింపవలసియుండును. వానిమార్గము లరయవలసి యుండును. అందలిసారము గ్రహింపవలసియుండును. ఆసారము నాచరణమున కెంతమాత్రము తేఁగలుగుదుమని పరీక్షింపవలసి యుండును. ఆచరణమునకుఁ దేఁజాలకయున్న చందము దెలిసిన

దుఃఖింపవలసియుండును. ఎట్టులేఁ బట్టుపట్టి భగవదుపదేశ సారము నాచరింపఁ బ్రయత్నింపవలసియుండును. కావుననే మనము ముందు సాగఁబోవుకథలను మఱింత పట్టుదలతోఁ బఠింపవలసియుండునని మఱియొకసారి విన్నవించుచున్నవాఁడ. ఇఁక ముందటికథలలో నొక్కొక్కయక్షరము వేదసారము, స్మృతి సంగ్రహము, పురాణహృదయము, ఇతిహాసమూలధర్మము నయి యుండును. కావున నట్టిగాథల నోపికమైఁ బఠించుటయే తర ణోపాయమార్గము. పఠించుటమాత్రమే కాదు. వానిని సదా స్మరించుటయు నంతియగాక దానియందున్నసారభూత భగవ దుద్దేశము నెఱుంగుట తరణోపాయ మనక తప్పదు. అట్టులొట శ్రద్ధమైఁ బరికింపుఁడు.

### కంసపత్నులు శోకించుట.

కంసవధానంతరము శ్రీహరి కించుక విశ్రాంతి కలిగెను. కాని చేయఁదగుపని చాలఁ బెద్దదని తోఁచెను. సమయ మరయు చుండెను. ఊరకుండరాదుకదా! సుదామాదుల కీకార్యము మహత్తరమని తోఁచెను. కాననే శ్రీకృష్ణుని బరివేష్టించి కిల కిలారావములు గావించుచు వేణువులు వాయించుచు నెగు రుచు దుముకుచు మల్లరంగమందంతటఁ దిరుగసాగిరి. తక్కిన గోపకులు వారింగూడి యుల్లము లాడుచుఁ దిరుగుచుండిరి. సభాసదుల కీకార్యములన్నియు సమ్మతములుగనే యుండెను గాని కంసునివంకవారి కవి దుస్సహములుగాఁ దోఁచెను. అందును గంసునిసోదరులకు మఱింతదుస్సహమని తోఁచెను.

ఈజయజయధ్వనుల నాలకించుటకంటె మృతిఁ గాంచుటయే యుత్తమమని వారూహించిరి. సోదరు లొక్కరిద్దఱుగారు. ఎనమండ్రుగురు గలరు. వారు సామాన్యులుగారు. మహాపరాక్రమసమగ్రులు. సునాముఁడు, సృష్టి, న్యగ్రోధుఁడు, తుష్టిమంతుఁడు, రాష్ట్రపాలకుఁడు, సుహూనుఁడు, కంకశంకువులు అని వారిపేరులు. వీరెల్ల భాతృవధజనితక్రోధాగ్నిసంతప్తచిత్తులైరి. గోపాలబాలకులతోఁ గృష్ణుని రాముని వధించి కంసునకుఁ దమకృతజ్ఞతను బరలోకమందున్నను జూపవలయునని నిశ్చయించుకొనిరి. కావున వివిధాయుధంబులఁ దాల్చి హరిపైఁ బడఁ బరువిడిరి.

ఆదురాత్ముల ప్రవృత్తిని బలరాముఁడు కాంచెను. వారి యాగ్రహంబును గుఱుతించెను. తమ్ముని కేల యాయాసమును గల్పింపవలెనని యెంచెను. వెంటనే యందున్నయొకపరిఘమును దీసికొని పశువులజంపు మృగరాజువలె నతిరభసమునఁ బైఁబడఁ బరుగిడువారినెల్ల గట్టిగా మోఁది యంతకునిచెంత కనిచెను. క్షణమాత్రమున వారెనమండ్రుగురు సోదరునిపరిసరమున కరిగిరి. వారిపాటుగాంచి కంసుపక్షపాతులగువారెల్ల నిరాశులై శ్రీహరిపక్షము నాశ్రయించిరి. ఆకాశమున దేవదుందుభులు మ్రోసినవి. రామకృష్ణులపై మఱియొక్కసారి విరులవాన కురిసెను. మందమారుతము వారియాయాసమును దీర్పనెంచి కాఁబోలు విసరెను. ఎల్లరమనంబుల నుల్లాసంబు నిండియుండెను. మహర్షులు, మహానుభావులారా! లోకకంటకులగు దురాత్ములఁ

బొలియించితిరని పొగడిరి. అచ్చరలాడి తమయానందమును దెలిపిరి.

ఇంతలో నంతఃపురమున కీవార్త వ్యాపించెను. కంసుని భార్యలు, వానితమ్ములపత్నులును భర్తృమృతికై పట్టరాని దుఃఖమునఁ బరువిడి వచ్చిరి. వీరశయనంబున నున్ననాథుం గాంచి యొడలెఱుంగక పైఁబడి బిట్టు రోదనముచేసిరి. ప్రాణేశా! మమ్ము వీడిపోయితివే యనిరి. ప్రియధర్మజ్ఞా! ఒంటరిగా బోవుట న్యాయమా యనిరి. కరుణామూర్తీ! మమ్ముంగూడఁ బిలుచుకొనిపొమ్మా యని యుమ్మలించిరి. నీవు తెగుట మేమెల్లఁ జచ్చినవారమేకదా యని విలపించిరి. నీవులేని యీనగరము మావలెనే విధవయయ్యెను. సకలోత్సవమంగళములు నిలిచిపోయినవి. ఏయపరాధముచేయనిభూతముల కెగ్గుచేసితివి. దాన నీ కీదశ చేకూరెను. భూతముల కపకారమొనరించి యెవ్వఁడీభూతలమున బాగుపడఁగలఁడు.

అనిపలికి యంతలో శ్రీకృష్ణదర్శనమున నుదయించిన విజ్ఞానమున నిట్లు పలుకసాగిరి. సర్వభూతముల యుత్పత్తిపాలన సంహారముల కీశ్రీకృష్ణుఁడే కారణము. అట్టి యవ్యయుఁ డగు జగదీశ్వరున కెగ్గుచేసినవాఁడే కాలముననైన సుఖంపడఁగలఁడా. అని రాజపత్నులు పెక్కుతెఱంగుల రోదనములుచేయుచుండిరి. ఆయార్తనాదములు వినువారిగుండెల నీఱుచేయసాగెను. కరుణావారిరాశియగు పంకజాక్షుఁడు వారియార్తిఁ బాప నెంచి చెంతకుంబోయి యాశ్వాసించెను. భగవదుక్తిశ్రవణముననే

వారియార్తి తొలఁగెను. చేయునది లేదని యెంచిరి విధిచేఁతకు మాఱుగలదే యని భావించిరి. దుర్వృత్తులకు నేకాలమందును సుఖము యశస్సు గలుగదని యెంచిరి. దుఃఖించిన లాభము లేదని భగవద్వాక్యములను దలంచుచు నింటికిం బోయిరి.

అంత మల్లరంగము చల్లారెను. ఎక్కడివా రక్కడికిఁ బోయిరి. శవనివహములతో నారంగము భయంకరముగాఁ జూడఁ దగియుండెను. శ్రీహరియు బలరామాదులు తమవిడిదిపట్టులకుం బోయిరి. కృష్ణమూర్తి కంసాదులకు నుత్తరక్రియలు విధిమంత ములుగా జరప నియోగించెను. అంతఃపురమునకుఁ దగువార లం బంచి కంసునిచావునకును దత్సోదరమృతికిని జింతించు వారలదుఃఖమును నిలుపఁ బ్రయత్నించెను. ఆనాఁడు మధురా నగరమున శ్రీకృష్ణునియానతి సాగెను. ఎల్లవారు శ్రీహరిని దలంచుచు వేడుకగా నుండిరి. అక్రూరాదులసంతోషముకుఁ బారమే లేదనుట యొకవింతకాదు. ఇట్లు శ్రీహరి యాదిన మునఁ గంసుని జంపి యారాజ్యమును రాజన్వంతముగావింప నిచ్ఛగించెను. భగవత్సంకల్పమున కంతరాయము కలుగదుకదా!

అంతటఁ గంసునితల్లియు బాంధవులు మాతృసంబంధు లును భార్యాత్రికాముకియగుభగినియు నరుదెంచి కంసునికళేబర మును జూచి రాజేంద్రా! దర్శనముచేయవచ్చితిమి. మమ్మాద రింపుము. ఇట్లు పరుండెదవేల? లెమ్ము. సింహాసనము నలంకరిం పుము. రాజ్యమును బూజ్యభంగిఁ బాలింపుము. ధనమును సం పాదింపుము. బాంధవుల నాదరింపుము. చతురంగబలంబుల

సేకరింపుము. బాంధవులమగు మమ్మువదలి యెందుఁబోయెదవు? మే మనాథులముకదా! అని వాపోవుచు నంతలో దైవికముగా నుప్పతిల్లినవిజ్ఞానమున నిట్లు పల్కిరి. బ్రహ్మాదిస్తంబపర్యంతమగు నీవిశ్వమునెల్ల విలాసముమీఱ క్షణకాలమున నెవఁడు సృజించునో తదాధారములఁ బుట్టించునో, బ్రహ్మాదిలోకపాలకుల స్వాంశములనుండి యెవఁడు నిర్మించునో సకలభూతస్వరూపుఁ డెవఁడో, మునీంద్రులు, దేవేంద్రులు, సదా యేమహాపురుషుని నుతింతురో, ధ్యానింతురో పూజింతురో, వేదములెల్ల నెవ్వని స్తుతించునో, సరస్వతి యేపురాణపురుషుని వినుతింపఁబూని యేమిలోపముగలుగునో, యని భయంపడుచుండునో, మూల ప్రకృతి పరిపూర్ణానందమున నెవని తత్త్వమెఱిఁగినదాట వినుతించుచుండునో, ప్రకృతికంటె నెవ్వఁ డధికుఁడో స్వేచ్ఛామయుఁడు, నిరీహుఁడు, నిర్గుణుఁడు, నిరంజనుఁడు, పరాత్పరుఁడు, బ్రహ్మము, ఈశ్వరుఁడు నెవ్వఁడగునో, జ్యోతిస్స్వరూపుఁ డెవఁడో, భక్తానుగ్రహార్థసుధృతవిగ్రహుఁ డెవ్వఁడో, నిత్యానందుఁడు, నిత్యుఁడు, అక్షరవిగ్రహుఁడు నెవ్వఁడో, ఆమహాత్ముఁడే, ఆభగవంతుఁడే, ఆపరబ్రహ్మమే భూభారహరణార్థ మీలోకమున నవతరించెను. గోపాలబాలవేషమున మాయేశుఁడు మాయంగూడి యవతరించిన యీకృష్ణుఁడే వధింపఁబూన నిఁక నిన్ను రక్షించువాఁ డెవ్వఁడు కలఁడు? ఆకృష్ణుఁ డెవని రక్షింపఁబూనునో యతని శిక్షించువాఁ డెవ్వఁడు కలఁడు? అనిపలుకుచు నంద ఉూరకుండిరి.

అరయ్యలారా! ఈవిజ్ఞానము దుఃఖార్ణవనిమగ్నులగువారి కెట్లు కలిగెను? అని యూహింపకుఁడు. లోకమున వైరాగ్య త్రయము గలదు. ప్రసూతివైరాగ్యము, పురాణవైరాగ్యము, శ్మశానవైరాగ్య మని ఆమూఁడింటికిఁ బేరులు. అం దిది శ్మశాన వైరాగ్యము కావచ్చునని కొందఱనవచ్చును. అది పొరపాటు. భగవంతుఁ డొకవేషమూని కృష్ణనామమును ధరించి దురాత్ముల వధించి యామల్లరంగముననే యున్నవాఁడు కదా. తద్దర్శన మాత్రమున సకలకల్యాణములు చేకూరుననఁ నిఁక నీపాటిజ్ఞా నము కలుగదనుట భగవచ్ఛక్తిని దగ్గించినట్లగును. ఆకార్యము నెవఁడును జేయఁజాలఁడు. అది మహాపాపకార్యములలో మొద టిది. ఆవాంఛ ఫలింపకున్నను దలంచుటయుఁ బాపము. కృష్ణ మూర్తిని దర్శింపకమున్ను వారి కెట్టియజ్ఞానమున్నదన్న నన చ్చునుగాని తత్సన్నిధి సకలాజ్ఞానములు తొలఁగిపోవుననుట నిర్వివాదాంశము.అందును భక్తులరక్షింపఁ గంకణముకట్టుకొన్న యవతారమది. అందును రెండువ్యక్తు లొక్కచోట నున్నవి. వానిం జూడఁగనే సకలాజ్ఞానపరంపరలు పటాపంచలై పోవవే. కావునఁ గంసునిబాంధవు లెంతటిదుఃఖసాగరమగ్నులైనను సా క్షాచ్ఛ్రీకృష్ణుని గన్నులారఁ గాంచినపుడు వారు విజ్ఞానసంపన్ను లైరనుట వింతవాక్యముకాదు. ప్రకృతము ననుసరించెదను.

## ఉగ్రసేనపట్టాభిషేకము.

"యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం,. అపంథానంతు గచ్ఛంతం సోదరోఽపివిముంచతి." మురారికవి

* మల్లరంగకృత్యము నిర్వర్తించినపిదప భగవంతుఁ డాలోచించెను. కంసవధానంతరము రాజులేక రాజ్యమున్న దన్నవార్త కలుగరాదు. ప్రజలు క్షణమాత్రమున భయముమాని దుష్పథములఁ బ్రవర్తింపఁగలరు. కంసునికాలమున దురాచారము లెక్కుడైనవి. వానిఁదొలఁగించి రాజ్యము రాజస్వాంతముగా నొనరించినఁగాని దురాచారములు మానవు. మాయావులు రూపుమాయరు. సజ్జనులకు మనస్సంతోషము గలుగదు. పతివ్రతలకు శాంతి చేకూరదు. ప్రకృతమునేఁ జేయఁదగుకార్యములలో మొదటిదిదియే. తరువాతికృత్యముల కింతత్వర యవసరము లేదు. పలువురుదుష్టులు ఘోలిసిరి. వీరితరువాతివా రిట్టివారు కాకయుండఁ జేయఁగలరాజు కావలయును. అందులకుఁ దగినవాఁ డుగ్రసేనుఁడే. వంశపరంపరాగౌర మీతనియందుఁ బ్రజలునుతురు. అంతియగాక ధార్మికుఁడు. నాభక్తుఁడు. పుత్రకృతదుష్కార్యవిముఖుఁడు. కావున నీతని కీరాజ్య మప్పగించెదనని యూహించెను.

---

*కంసవధానంతరము వసుదేవాదుల దర్శించి యుగ్రసేనునకుఁ బట్టము కట్టినట్లు భాగవతము బ్రహ్మపురాణవిష్ణుపురాణాదులు తెలుపుచున్నవి. ఉగ్రసేనునకు వెంటనే పట్టాభిషేక మొనరించి పిదప వసుదేవాదుల నూఱడించెనని శ్రీకృష్ణజన్మఖండమునఁ గన్పడియెడిని. తరువాతికథలు భాగవతాదులయందుఁ గానరావు. కావున ముందే యుగ్రసేనాభిషేకకథచు వ్రాసి తరువాత శ్రీకృష్ణుఁ డొనరించిన యద్భుతకృత్యములను వ్రాసెద. ఈఘట్టమున నిదియే తెలుపఁదగినవిషయము. ఉగ్రసేనరాజ్యసమర్పణకథ యన్నింటియందు సమానముగనే చెప్పఁబడినదనియుఁ బాఠకు లెఱుంగనగును.

సజ్జనుల కే ప్రయత్నములేక సకలకార్యములు నెఱవేఱును. దుర్మతుల కెందఱు సాయపడఁబూనినను ఫలింపవు. భగవత్కరుణచే సజ్జనుల కెల్లరు తోడ్పాటు గావింపనే చూతురు. దుర్జనులను సోదరుఁడుకూడ వదలి శత్రువులనైన నాశ్రయించును. ఉగ్రసేనుఁడు రాజ్యమును గోరలేదు. సహాయులను గాంక్షింపలేదు. కాని శ్రీకృష్ణసహాయ మాతనికిం గల్గెను. ఇంకఁ గొదువయేమి? సర్వసంపదలులభించినట్లే. తుచ్ఛసంపదలేకాదు. భగవద్దాస్యము లభించినట్లే యనుకొనవచ్చును.

ఆరాత్రి గడువగనే శ్రీకృష్ణుఁడు గోపాలకులంగూడి యుగ్రసేనుం జూడఁబోయి యాతనికష్టములఁ దొలఁగినవానినిగా భావించి యిట్లు పలికెను. రాజేంద్రా! మేమెల్ల నీప్రజలము. హితకార్యాచరణమునకు మమ్ముఁ బురికొల్పుము. మఱొక్కమాటవినుము. యయాతిశాపవశమునయాదవులకు రాజ్యమును బాలించుయోగ్యత లేదు. వీరు సింహాసనము నెక్కరాదు. అను నియమము గలదు. ఆరీతిగా నింతదనుక సాగినది. యాదవు లశ్వమేధమును జేయరాదు. దానికిని రాజులు కాకుంటయే ప్రధాన కారణము. వీనినాలోచించితిని*భృత్యుఁడనగు నేను నీకునండగనుండ నాశాపము యాదవవర్యుఁడ వగునిన్ను బాధింపదు. నాయనుగ్రహమున నీకు దేవతలుకూడఁ గప్పము నీఁగలరు.

*మయి భృత్య ఉపాసీనే భవతో విబుధాదయః, బలిం హరంత్యవనతాః కిముతాన్యే నరాధిపాః, ఇత్యుక్త్వావహాయ పవన ముగ్రసేనాయ భూభుజే సుధర్మాఖ్యాం సభాం శక్రాదాహరేత్యాహ కేశవః. శ్రీభాగవతము ౪౫ అ ౧౫ శ్లో.

ఇఁక రాజులమాట యిటఁ జెప్ప నేఁటికి? అనిపలికి యాయుగ్ర సేనుని రాజ్యపాలనముఁ జేయ నొడఁబఱిచెను. శ్రీకృష్ణవాక్యశ్ర వణానంతర మాయుగ్రసేనుఁడు బదులుపలుకక యంగీకరించెను. అంతట శ్రీకృష్ణమూర్తి వాయుదేవునిబిలిచి పవమానా! నీవు నాశాసనమున సురపురికరిగి సుధర్మాఖ్యసభను మాయుగ్రసేన భూజాని కిమ్మని తెల్పుము. నాయానతి యని హెచ్చరింపుము. నావిని యావాయువు పరమేశ్వరాజ్ఞ మౌళిఁ దాల్చి విబుధవ ర్యునిచెంతకుంబోయి శ్రీకృష్ణశాసనమును దెలుప నద్దాని నాశత మఖుఁడు మాఱుమాటలాడక యొసంగెను. పరమాత్ముని యను జ్ఞ నెఱవేర్ప నింద్రుఁడు సంసిద్ధుఁడయియే యుండెను వాయు వాయానతిఁ దెలుప వినినంతనే మహానందమందెను. 'కృతార్థోఽ స్మి'యనియె. సుధర్మ నొసంగెను.

పిదప శ్రీహరి యాసింహాసనమున నుగ్రసేనుం గూరు చుండ నియోగించెను. సకలసామంతు లాతరుణమున విచ్చేసిరి. సాధుజనులెల్లరు మహోత్సవమున నాయుత్సవమును జూడ నే తెంచిరి. కంసభీతిచేఁ బలుదేశములకుం బాఱిన రాజన్యు లాతని మృతిని విని మరల మధురానగరమున కేతెంచిరి. వారికన్నుల కాతరుణమున నానగరము మహోత్సవముల నలరారుచుఁ గ్రొత్త దిగాఁ గనఁబడియెను.మహాసభ గూడెను. ఉగ్రసేనుఁడు సింహాసన మెక్కెను. శ్రీహరి యాతనిరాజభావమునఁ బూజించెను. తాఁ బూజించిన నెల్లరుఁ బూజింతురనుభావము శ్రీహరిమదిఁ గలదని యూహింపవచ్చును. హరియే పట్టాభిషేకమహోత్సవమునఁ

బొల్గొనియెను. ఇంక నాతనికిఁ గొంత యావంతయే నుండదు కదా. ఎల్లరు మహానందముందెరి. ఈభూతలము రాజన్వంతమగు నని నిశ్చయించిరి.

పట్టాభిషేకమహము జరపఁబడఁగా నుగ్రసేనుఁడు కంస భీతిం బాఱిన యదువృష్ణికుకురాంధకప్రముఖుల సగౌరవముగా సత్కరించెను. వారును భీతిమాని సుఖముగ నందే నివసింపఁ దలంచిరి. శ్రీకృష్ణబలరాములీయుగ్రసేనుని రాజ్యముగాచు భారము మాది యని వాగ్దానమొసరించిరి. ఆవాగ్దానము నెఱింగిన వారెల్ల నిష్కంటకమగు నీరాజ్యంబున కేమియు బాధలు పొసఁగవని నమ్మిరి. బాంధవుల యారాటము తీఱెను. మహోత్సాహము మీఱెను. * భగవదనుగ్రహమున యాదవులలో వృద్ధులందఱు వయస్స్ఫురణ మించిరి. శ్రీముకుందుని ముఖాంభోజమునుండి వాగ్రూపమున వెలయు సుధాపానమే యిందులకుం గారణము. భగవంతునిం గన్నులారఁ గాంచుచుఁ దత్సంభాషణముల నాలకించుచు దత్సంగతి మెలంగుచుఁ బరమేశ్వరుని ధ్యానించుచు వలసినపుడెల్ల నాతనిముఖారవిందమును గాంచుచు నుండుట వారు వయస్సున విఱ్ఱవీఁగువారైరి. ఇట్టు లాహరియు బలరాముఁడు సుదామప్రభృతులగుగోపాలకులు మహానందముల నానగరంబునఁ గొలఁదిదినములే యుండినను దత్కాలమున నాపురవరపరిశోభ వర్ణనాతీతముగా నుండెను.

---

*తత్ర ప్రవయసోఽప్యాసన్ యువానోఽతి బలౌజసః, పిబంతోఽక్షైర్ముకుందస్య ముఖాంభోజసుధాం ముహుః. ౨౧ శ్లో.

మహాశయులారా! ఈవిషయమున నొకవిశేషాంశము కలదు. పట్టాభిషేకకథయం దేమివిశేషార్థము గ్రహింపవలసి యుండునని తృణీకరింపకుఁడు. ఇందే యత్యద్భుతాంశము కలదు. తొలుదొలుత నది విశ్వాసపాత్రముగ నుండకపో వచ్చును. ఆలోచించిన కొలఁదిని విశ్వాసపాత్రమై యభివృద్ధి హేతువై యుండును. ఆలకింపుఁడు.

దూరదేశమునకుఁ గంసభీతిఁబాఱిన యాదవులందఱు మరల వచ్చిచేరిరి. అందు వృద్ధులందఱు భగవత్సందర్శనమున నవయౌవనవిరాజమానులైరి. అని యిందు గానంబడియెడిని. ఇట్లుగూడ లోకమున జరగునా. ముదిమిని మార్ప శక్యమా. అనుశంక గలుగుట సహజమేగాని యందేమియు నచ్చెరువు పుట్టించువిషయము లేదు. ఎట్లనఁగా. మహర్షులుతపస్సుచేయుచు నమితాయుర్దాయమును సంపాదించిరని తెలియవచ్చెడిని. ఒక ముని యొకనారీమణిం బెండిలియై తనముదిమిని వదలి తదిచ్ఛం దీర్చుకొఱకై వయస్సుఁ ధరితుఁడయ్యెనని కానవచ్చెడిని. యయాతి తనముదిమిని దనయున కొసఁగి వానియౌవనమును గైకొని సుఖించి మరల దాని నాతని కిచ్చెనని భారతము వాచ్చరిం చెడిని. మూలికాప్రభావమున నిరంతరయౌవన మలరారునని వినఁబడియెడిని జ్యోతిర్లతాప్రభావమునమృతినొందినకళేబరము సజీవమైనట్లు, శకలములైనయవయవములు యథాపూర్వముగా నమరినట్లు, మాసినముఖకాంతి యథాప్రకార మలరారినట్లును, ఎందెందో పడియున్నయంగము లొకదానినొకటి సంధించిన

ట్లును, రామాయణము తెలుపుచున్నది. శాపమున నాతి పాషా ణరూపమున నున్నట్లు తెలియవచ్చెడు. ఇలుఁడు శాపవశమున స్త్రీరూపమును దాల్చి పార్వతీవరప్రభావమునఁ గొంతకాలము పురుషుఁడై కొంతకాలము స్త్రీగానుండి రాజ్యముపాలించెనని యాదికావ్యమునఁ గానవయ్యెడిని. వీనినన్నింటిని బరికింపఁగా సామాన్యసృష్టి భగవచ్ఛక్తిచే మార్పఁబడియెడి నని యెఱుంగ నగును.

ఇవన్నియుఁ బురాణవచనములుగాని ప్రత్యక్షప్రమా ణములు కావుకదా యనవచ్చును. ఇంచుక పరికింపుఁడు. కంటిలో నిపొర (ఒకరోగము) ఒక్కమూలికారసమును బిండినమా త్రమున నశించుచుంట మన మిప్పుడే చూడవచ్చును. అకాల మున మామిడిచెట్లు లోనగువృక్షములు కొన్నివస్తువులసంగ తిచే ఫలించుచుండుట మనము చూచుచున్నారము. లతలి ట్లే యథారీతి నకాలమునఁ బుష్పించుచున్నవి. మూలికలప్రభావ మున మనము ప్రతిదిన మనుభవించురోగములు నశించుచు న్నవి. ఇవన్నియు నిజములేకాని వయస్సును దెచ్చిపెట్టుమందు నెవరును గనిపెట్టలేదుకదా యందురేమో. మూలిక కొక్క యద్భుతశక్తియుండునపుడట్టిశక్తులింకెన్ని యోయుండవచ్చును. స్థాలీపులాకన్యాయము ననుసరింపవలయునే కాని యెన్నిరీతుల నది పనికివచ్చునో మన మూహింపఁజాలము. కుష్ఠాదిరోగముల నిర్మూలింపఁజేయుట ప్రత్యక్షముగ నున్నపుడు తక్కినవానిని నమ్మమనుట మొండిపట్టుగాక మతేమగును? పసరుచే వియద్గ

మనము సిద్ధించును. ఒకమూలిక చెంతనుంచుకొనినఁ గనఁబడక యుండవచ్చును. కాలుచున్న యినుపగుదియ నొకపసరు కరతలమున నునిచి పట్టుకొనినఁ గాలదు. ఏల? తత్ప్రభావ మగ్ని నాపునని భావము.

ఇట్లు భగవత్సృష్టిలో మూలిక లిట్టి యచ్చెరువును బుట్టించుకార్యజాలమును జేయుచుండఁగా నిఁక భగవచ్ఛక్తి యేకార్యమును సాధింపఁజాలదో యోజింపఁజాలకున్నాఁడను. ఈకాలమునందుఁ గూడ ఖండాంతరములయందును గొందఱు మహాత్ములు భవిష్యత్కాలగతులఁ దెలుప నపుడు నమ్మకున్నను మఱి పదిసంవత్సరముల కది యనుభవముగఁ గన్పడఁగా నిజమే యని నమ్మినవారున్నారుకదా! ఆశక్తి యెట్లు వారి కలవడినది? అట్టి యద్భుతశక్తి వారికిం గలదనియేకదా వారు వ్రాసినలేఖలఁ బ్రకటించుచున్నారు. వేనోళ్లఁ గొనియాడుచున్నారు. యోగప్రభావమున హృదయము నిశ్చలమైయుండఁగాఁ గన్నులారఁ గాంచినవైద్యు లిప్పటివారే మృతినొందెనని తీర్మానింప నుత్తరక్షణమున నామహానుభావుఁడు లేచి కూర్చుండుటం గాంచి యీయోగశక్తి మాకుఁ దెలియ లేదని చెప్పుట యసత్యమా. అందఱు సత్యమేయని చూచినవారు చెప్పుచున్న యీకాలమున నంగీకరించుచున్నారు కదా? అట్టి శక్తి యోగమునకుఁ గలదుకదా. ఆయోగమహిమముననే ఖేచరశక్తి యలవడును నంగీకరింపక తప్పదుకదా! ఇవి సామాన్యములు. మనుష్యప్రయత్నసాధ్యములు.

ఇట్టిశక్తి యలవడుటకుఁ గలకారణమేమి? భగవద్ధ్యాన ముననే యిట్టివి ఇంకను వీనిని మించినవికూడ నలవడును. ప్రతిమనుజునియందును భిన్నభిన్నశక్తులు గలవు. అవి వారివా రికర్మాధీనములు. తొలిపుట్టువునఁ జేసికొన్నకర్మముల ననుసరిం చినశక్తులు ఏకరీతిగా నుండక భిన్నభిన్నములుగా నగపడుచుం డును. అట్టి కర్మములుగూడఁ బరాత్పరునియాజ్ఞలే యని నమ్మ వలయునుగదా. కావున నిన్నిలోకముల సృజించి యిన్నిభేద ములఁ గల్పించినపరాత్పరుని దర్శనమాత్రమున వృద్ధులు వయశ్శ్రీనలరుట యొకతుచ్ఛమగుకార్యమేకాని మహాకార్య ముగాదని విశ్వసించుచున్నాఁడను. పరాత్పరుఁడు "కర్త మకర్తు మన్యథా కర్తుం సమర్థః" అని ప్రాగ్దత్తగాంచినవాఁడు కదా. అట్టి దేవదేవుని దర్శించి సహవాసము గావించి తద్వా క్యముల నాలకించియుండువారలకీపాటిలాభము గలిగెననఁగా నచ్చెరువుపడవలసిన దేమియులేదని విన్నవించువాఁడను. ఇట్టు లామహోత్సవమును సాగించి పిదప శ్రీపతి యొనరించిన మహా కార్యముల నాలకింపుఁడు.

## రామకృష్ణులు జననీజనకుల నూఱడించుట.

ఉగ్రసేనునకుఁ బట్టాభిషేకకార్యము నిర్వహించి జనుల నప్పగించి బంధువులను సంతృప్తులనుజేయ నియమించి రాజ్యమరాజకముగాకుండఁ గట్టుదిట్టములుచేసి యంతట జన నీజనకు లగు దేవకీవసుదేవుల నాశ్వాసింపనెంచెను. అన్నయు దానును బయలువెడలి చనిరి. మల్లరంగమున నాఁడు దేవకీ

వసుదేవులు కంసు నానతి నిర్బంధితులయియే యుండి రన వచ్చును. వారికి బంధమోక్షమును బ్రసాదించుటయే గాక నిరతిశయానందమును గల్పింప నెంచిరి. వారున్న చోటికిం బోయిరి. నిగడముల శకలములఁ గావించిరి. బంధవిముక్తిని గల్పించిరి. సాష్టాంగనమస్కారము లొనరించిరి. భక్తిచేఁ దలలు వాంచిరి. అత్తఱి శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను. జనకులారా! ఏనరుఁడు తల్లినితండ్రిని, విద్యాదాతను, మంత్రదాతను, గురువును గౌరవింపఁడో యావజ్జీవమువాఁ డశుచియనంబడు. పూజ్యులందఱిలోఁ దండ్రియే ప్రథమపూజ్యుఁడగును మహాగురువనఁ దండ్రియే. తండ్రికంటె నూఱుమడుంగులు తల్లి పూజ్యురాల గును. గర్భధారణపోషణముల నామె యొనరించినయుపకార మునకుఁ బరిమితికలదా. తల్లి పృథ్వీస్వరూపిణి. అందఱికంటె హితమును గోరునది. కానఁ దల్లికంటె మించినబంధువు ప్రపంచమునందు దీపముపట్టుకొని వెదకినను గానరాదు. విద్యామంత్రప్రదుఁడు సత్యముగా జననికంటెఁ బూజ్యుఁడు. ఆతనికంటె మించినవంద్యుఁడు లేఁడు. ఇది వేదవిహితము. అనిపలికి బలరాముంగూడి మరల నమస్కరించెను.

ఆతనయుల నిర్వురను దల్లి కౌఁగిటంజేర్చి ముద్దాడెను. తండ్రి సాదరముగాఁ గాంచి ప్రీతులనుగా నొనరించెను. మృష్టాన్నము పెట్టి యాతలిదండ్రులు తృప్తినందిరి. రామకృష్ణులాజనకులం గాంచి మీరు మాబాల్యక్రీడలఁ జూడ నోచరైతిరి. తనయులముద్దులు సూచుట మహాభాగ్యమని లోకు

లంద్రు. ఆభాగ్యము మీకుఁ గలుగదయ్యెను. మేమును వచ్చుట కవకాశము లేకుండెను. తల్లిదండ్రుల సేవించుభాగ్యము కూడ మా కీపుట్టువున లేదయ్యె. ఏతనయుఁడు తల్లితండ్రులకుఁజక్కనివృత్తిని గల్పింపఁజాలఁడో వానిని బరలోకమున యమభటులు స్వమాంసమును దినిపింతురు. తల్లిని వృద్ధుడగుతండ్రిని, పతివ్రతయగుభార్యను, వయసురానికొడుకును, గురువులను దన్నాశ్రయించినబ్రాహ్మణుని సమర్థుఁడయ్యు భరింపనిపూరుషుఁ డెవ్వఁడుండునో వానిని జీవన్మృతునిగాఁ బెద్దలు పల్కుదురు. కంసునకు జంకినట్లు నటింపవలసివచ్చెను. వానికాలము నేఁటికి పూర్ణమయ్యెనుగదా. ఆకారణమున విధిలేక మీకుఁ బరిచర్య చేయఁజాలకుంటిమి. మన్నింపుఁడు. అంతియకాక శత్రువులచేఁ బీడితులగు మీ కూఱటఁ గల్గింపఁజాలక యింతకాల మూరకయున్న మా యీయపరాధమునుగూడ క్షమింపవలయును.

అని యిట్టులావిశ్వమూర్తి తెల్పినమాటలకు మోహమంది దేవకీవసుదేవు లాకుమారకుల నానందబాష్పములఁ దడుపుచు ముద్దాడిరి. మఱియేమియు మాటాడఁజాలకపోయిరి. ఆతరుణమున నాజననికి నాజనకునకుఁ గల్గినయానంద మీలోకమునఁగా దేలోకముననైన నెవ్వరికేఁ గలిగియుండునన నవకాశముకలదా. అవ్వేల వసుదేవుఁ డాయానందమునకు గుఱుతుగా బ్రాహ్మణులకు నన్నదానవస్త్రాదిమహాదానముల నొసరించెను కుమారకులకు స్వస్త్యయనకర్మమును జేయించెను.

తనజన్మము సార్థకమాయెనని తలంచెను. కుమారకులఁ జెంత నునుచుకొని ప్రొద్దుపుచ్చెను.

ఆర్యమహాశయులారా! ఈచిట్టిగాథనుండి తెలిసికొనఁ దగిన విషయమొక్కఁడు కలదు. తల్లిదండ్రులఁ దృణీకరించుట మహాపాపమనునదియే. వారిఁ బూజింపక మఱెవ్వరిని బూజించి నను ఫలములేదనునదియే యిందలిసారము. గురువులన నెవ్వ రెవ్వరో యిందుఁ జక్కఁగాఁ దెలుపఁబడినది. పూరుషుఁడు సమ ర్థుఁడయ్యుఁ దాను రక్షింపక మానఁ దగనివా రెవ్వ రెవ్వరో శ్రీహరియిటఁ దేటపఱచెను. పతివ్రత యగుభార్యను రక్షింప వలయుననఁగాఁ బతియానతిమీఱిన నాతిని వెంటనే వదల వలయునని భగవంతుని యాశయము.

శ్లో. వంధ్యాష్టమేధి వేద్యాబ్దే దశమేతు మృతప్రజా,
ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ.

మనుస్మృతి. ౯అ. ౮౧ శ్లో.

"వ్యా. ప్రథమర్తుమారభ్యావిద్యమానప్రసూతా అష్ట మేవర్షే అధివేదనీయా మృతాపత్యాదశమే వర్షే స్త్రీజనన్యేకా దశే. అప్రియవాదినీ సద్య ఏవ యద్యపుత్రా భవతి. పుత్రవ త్యాంతు తస్యాం "ధర్మప్రజాసంపన్నే దారే నాన్యాం కుర్వీత. అన్యతరాపాయే తు కుర్వీత" ఇత్యాపస్తంబనిషేధాదధివేదనం నకార్యమ్" అని కుల్లూకభట్టు.

ప్రథమసంయోగము మొదలు సంతానము లేకుండెనేని యెనిమిదివత్సరంబులు చూచి వదలవలయును. సంతానము కలు

గుచు నది మృతినొందుచుండునేని అట్టిభార్యను బదివత్సరం బులు చూచి పరిత్యజించి వివాహాంతరమునకుఁ గడంగవలయు. ఆఁడుశిశువులనే కనుచుండుభార్యను బదునొకండువత్సరములు నిరీక్షించి మఱొకపెండ్లి చేసికొనవలయును. భర్తను దిరస్కరించి మాటలాడుభార్యను వెంటనే వదలవలయును. ఆమె సంతానవతియైన వదలక పూర్వోక్తవిధి ననుసరింపవలయు నని మనుస్మృతిభావము.

వలయసురానికుమారుని వదలరాదు. తన్నాశ్రయించి యున్న బ్రాహ్మణుని వదలరాదు. అనఁగా వీరి నవశ్యము శక్తి యుండినచో రక్షింపవలయును. ఏలయన నిది గృహస్థుపుధర్మము. ఈధర్మమును మానరాదు. మానిన నరకప్రాప్తియగునని సిద్ధమగును. ఇట్టిధర్మములు భగవంతున కనవసరము లేయైనను దాను జేసిన లోకు లాచరింతు రన్నభావమున నిట్లు చెప్పెనని మనము గ్రహింపవలయును. తా సర్వజ్ఞుండయ్యుఁ దనయప్పటి యాకృతికిఁ దగినట్లు శ్రీహరిపలికెననుటచే నెట్టివాఁడుగాని తల్లిదండ్రులను, సాధ్వియగుభార్యను బాలుఁడగుకొడుకును రక్షింపక విడువరాదనియు వీరిని దూలనాడరాదనియు సారాంశము. ఇంక దీనిం బెంచివ్రాయక ప్రకృతకథాప్రకారము వివరింపఁ బూనెదను.

ఆర్యులారా! ఇఁకమీఁద భాగవతకథ ననుసరింప వలను పడదు. చాలసేపు పురాణాంతరకథలఁ దెలుపవలయు కావున నిటనుండి కథలు క్రొత్తవిగాఁ దోఁచును. కాని యవి భగవ

దవతారార్థమును సార్థకము చేయఁజాలినవి. భగవద్బోధము నే తెల్పును. మనకుఁ గావలసినవియు నవియే. కాన వానిఁ బఠింపుఁడు. భక్తిమార్గమును వీడకుఁడు. సర్వదేవతాస్వరూపునిగా భగవంతుని భావింపుఁడు. భేదబుద్ధిని వదలుఁడు. భగవత్కథలు విశ్వాసపాత్రములుగా వనుకువాదమును స్మరింపకుఁడు. వారిని గూడ దూషింపకుఁడు. అది వారితప్పుగాదు. ప్రథమజన్మము గాన వారి కవి రుచింపకుండును. క్రమముగ వారికే భక్తి కుదురును. వానినమ్ముదురు. పరమభాగవతులగుదురు. కాన నట్టి వారిని భక్తులగాఁజేయుమా సర్వేశ్వరా యని ప్రార్థింపుఁడు. ఇఁకఁ గథ వినుఁడు:

## నందునకు శ్రీకృష్ణుఁ డాధ్యాత్మికవిషయముల బోధించుట.

*మధురానగరమున నిన్ని చిత్రవృత్తాంతముల నెఱుంగుచుఁ గన్నులార శ్రీకృష్ణునికార్యంబులం జూచుచున్న నందున కుగ్రసేనపట్టాభిషేకానంతరము మధురానగరంబుననున్న నింక నేమేమి కీడులు కుమారునకుఁ బ్రచ్ఛన్నశత్రువు లొనరింతురో యన్న వగ గదిరెను దాన నతఁడు దీనుఁడయ్యెను. ఏదెసచూచిన నాతనికి శ్రీకృష్ణచింతయే తోఁచుచుండెను. ఎవ్వ రెవ్వ రేయేయుపాయములు పన్ని కొడుకు నడఁగింపఁ జూతురో యని దుఃఖింపసాగెను. శ్రీహరి యీవార్త నెఱిఁగెను. ఈ శోకము మాన్పినఁగాని యీనందుఁడు సంతోషమునఁ

* ఇది శ్రీకృష్ణజన్మఖండము డెబ్బదియూఁడవయధ్యాయమునుండి సంగృహీతమని యెఱుంగునది. ఈగాథ భాగవతాదులలోఁ గానరాదు.

గొంతకాలము జీవింపఁజాలఁడని తోఁచెను. గట్టిగా నేఁడు
చున్న నందునిమందిరమున శోకనాదము పోయెను. నందుఁ
డపుడు పుత్రవిచ్ఛేదకాతరుఁడుగ నుండెను. అంతియగాక
వసుదేవునికుమారుఁడు శ్రీకృష్ణుఁ డన్నమాట మున్నే
వెడవెడ వినియుండెనుగదా. ఉగ్రసేనునకుఁ బట్టముగట్టి
వసుదేవు నింటికిఁ దనకొడుకు కరుగుటయు నందుండుటయు
వినియుండెను. దాన మఱికొంతదుఃఖము హెచ్చెను. మరలఁ
దనయొద్దకు వచ్చునో రాఁడో యన్నసంతాప మానందుని నిం
తగా బాధింపసాగెను. తనకొడుకే యని పెంచిన నందునకు
హరి వసుదేవుతనయుఁడని విన్నపుడు సంతాపము గల్గుట యొక
యద్భుతము కాదు.

శ్రీకృష్ణుఁ డీపాటివిషయ మెఱుంగఁజాలఁడా. సకల
భువనవ్యాపకుఁడుకదా. తండ్రిచింతఁ దీర్ప నెంచి యటకేగి మణి
వర్యము నొసంగెను. అదియే చింతామణి. సకలదుఃఖముల
నడంచునది. దానినిచ్చి యానందపరవశునిగఁజేయ నెంచి యిట్లు
పలికెను నందమహారాజా! ఆనందమనుభవింపుము. నిరర్థకమగు
నీశోకమును వదలుము. ఇది యెవ్వరికేని మంచిదిగాదు. ప్ర
మోద మాశ్రయింపఁదగినది. జ్ఞానము నాశ్రయింపుము. పెద్దల
నుండి విన్నమాటలు' స్మృతికిఁ దెచ్చుకొనఁదగినవి. వానికిఁ దోడు
నేను గొన్నిమాటలు చెప్పెద. అవధరింపుము. ఈజ్ఞానమే
మున్ను బ్రహ్మదేవునకుఁ జేయఁబడియెనని యెఱుంగుము. అద్దా
నినే నీకు వచింతును. ఈయత్యద్భుతజ్ఞానమే మున్ను పుష్కర

క్షేత్రంబున శేషగణేశ ప్రమథేశదినేశమునీశ యోగీశులకుఁ జెప్పఁబడియెను. దానినే వచియింతును. శ్రద్ధగా నాలకింపుము.

నందమహీజానీ! ఎవ్వఁ డెవనికిఁ బుత్త్రుఁడగును? ఎవఁ డెవ్వనికిఁ దండ్రియగు? ఎవతుక యొవనికిఁ దల్లియగు? ఒక్కరితో నొకరికి సంబంధ మేలాగు కలుగును? తమతమకర్మాను సారము వచ్చుచుఁ బోవుచు జంతువులు భ్రమించుచుండును. కర్మము ననుసరించియే జీవునకు స్థానభేదముల రూపభేదములు గల్గుచుండును. కర్మముచేతనే యోగీంద్రులవంశమున నొకజంతువు జన్మించును. రాజస్త్రీలయందు వేఱొకజంతువు జన్మించును. ఇట్లే కర్మానుసారమే ద్విజపత్నియందును, క్షత్రియకులమునందును, వైశ్యశూద్రయోనులయందును, పశుపక్ష్యాది తిర్యగ్యోనులయందును బుట్టుచుండును. ఇట్టివిధములఁ బుట్టుటకుఁ గర్మములే కారణముగాని వేఱుకారణములేదు. తమ యభివృద్ధికి నాశనమునకు దానే హేతువుకాని యింకొకఁడు కారణము కాఁజాలఁడు. దీని నెఱింగియు నందఱు మోహగర్తమునఁ బడుదురు. కర్మవశమున సాధ్వసాధుజన్మములు కల్గుచుండును కాని వేఱుకారణమునఁ గాదను నిదియే ప్రధానసిద్ధాంతము. దీనిని మీఱఁజాలు రాద్ధాంతము వేఱొకటి కానరాదు.

భూనాయకా! ఆలకింపుము. నామాయచేతనే యందఱు విషయవాంఛలంబూని సానందులైయుందురు. దేహత్యాగమునందు బంధువియోగమునందును వారు విషణ్ణులగుదురు. ప్రజాభూమిధనాదులు పోవుట వారికి మరణాధికదుఃఖకర

ముగాఁ గానంబడు. ప్రతిక్షణము మూఢుఁడగుచుండును. దుఃఖము గుడుచుచుండును. జ్ఞానికాఁడు.ఎవ్వఁడు మద్భక్తుఁడై నన్ను గూర్చియేయజించుచు నింద్రియములకు లోఁబడక నామంత్రమునే యుపాసించుచు నాసేవయం దాసక్తుఁడై శుచియై యుండునో వాఁడు తరించును. నాశాసనమును మీఱరాదను భీతిచేతనే వాతము వీచును. రవి ప్రకాశించును. చంద్రుఁడు వెల్గును. మహేంద్రుఁడు కాలభేదము ననుసరించి వర్షించును. వహ్ని దహించును. మృత్యువు జంతువులఁ జరించుచు గ్రసించును. వృక్షములు కాలము ననుసరించి పుష్పించి ఫలించును. వాయువు నిరాధారము. కచ్ఛపము వాయ్వాధారము. శేషుఁడు కచ్ఛపాధారుఁడు. పర్వతములు శేషాధారములు. పర్వతాధారములు పాతాళములు. అవి సప్తసంఖ్యగలవి. జలము నిశ్చలము. కావుననే వసుంధరజలములందుండును. సప్తస్వర్గములు వసుంధరాధారములు. జ్యోతిశ్చక్రమంతయు గ్రహాశ్రయము. వైకుంఠము నిరాధారము. అది బ్రహ్మాండోర్ధ్వభాగముననుండు.నిరుపమానము.దానిపైన గోలోకముండును. పంచాశత్కోటియోజనములు దాని విస్తృతి యని యెఱుంగుము. అది నవరత్నసారవినిర్మితము. నిరాధారము. నిరాశ్రయమునగు. సప్తద్వారములు సప్తసారములు. సప్తపరిఖలు దానికిం గలిగియుండు. ప్రాకారములు నియుతములు. విరజానది యందుఁ బ్రవహించు. దానిని రత్నశైల మావరించియుండు. ఆపర్వతమునకు శతశృంగములు గలవు. దాని

విస్తృతి పదివేలయోజనములు. అందొక్కశృంగము రత్నాలంకృతముగనుండు. ఆపర్వతమునెత్తు శతకోటియోజనములు. ఆపర్వతశృంగవరమునందే రాసమండల మలరుచుండు. ఆమండలమమూల్యరత్ననిర్మాణముగలది. చంద్రబింబమువలె వర్తులముగనుండును. దానింజుట్టి పుష్పితపారిజాతభూరుహసంతతినితాంతకాంతవనము గలదు. కల్పవృక్షములు వేనవేలుగనుండు. పుష్పోద్యానము లనేకములు. అందు వివిధమనోహర పుష్పవృక్షములు చూడ్కికి వేడ్కఁగూర్చుచుండును. మూఁడుకోటులు రత్నభవనము లందుండును. గోపికలు లక్షలకొలందిగనందుందురు. ఆభవనములఁ గాపాడువారు గోపికలే. రత్నప్రదీపములే యావ్వానిఁ బ్రకాశింపఁజేయుచుండు. రత్నమయతల్పము లం దమరియుండును. అందలివాపికలు సుధాపూరితములు.

నందరాజా! అట్టి గోలోకమును వర్ణించి దానిశృంగారమిట్టిదని తెల్పుటకు సమర్థుఁ డొక్కఁడును లేఁడు. దానితత్త్వ మెఱింగినవాఁ డొక్కవ్రజేశ్వరుఁడే. వేఱొకండు కానరాఁడు. ఆరత్నభవనములలో రమ్యమగుహర్మ్యము శ్రీరాధికాదేవికమర్పఁబడియుండు. ఆసౌధమునకు సువర్ణకలశములు మీఁద నమరియుండును. రత్నదర్పణము లాయుప్పరిగయందు వెలయుచుండును. రత్నస్తంభములు పంక్తులుగాఁ జూడఁబడును. దానిసౌందర్య మింతయని వర్ణింపఁదరముగాదు.

ఆసౌధమునరాధాంబికరత్నసింహాసనముననలరుచుండు.

గోపికాలక్షలు సేవింప శ్వేతచంపకవర్ణతనులత విరాజిల్ల సకలామూల్యభూషణముల నలంకరించు నవయవము లలరార, నమూల్యవసనమును దాల్చి మనోహరరత్నపద్మమును గాంచుచు, దాఁడిమీకుసుమాకార సిందూరబిందువు మోమున రంజిల్ల మృగమదపరిమళము మేన వెలయ శ్వేతచందనచర్చలు గలిగి మాలతీమాలికాజాలశోభితకబరీభారము తనర, మునీంద్రులకేని వర్ణింపఁదరముగాని మహత్త్వమున నొప్పారుచుండు. ఆదేవిని దాదృశసౌందర్యవిరాజమాన లగుగోపికలు చామరహస్తలై సేవింతురు. ఆగోపికలభూషణములే రత్ననిర్మితములుగాన వర్ణింపఁ దరముగాదన నిఁక వారికధీశ్వరియగు రాధాభూషణముల మాట యిటనేటికి ?

ఆరాధాంబిక సుదాముని శాపకారణమున నిపుడు వృషభానునకుఁ గొమరితయై జన్మించినది. మాకిరువురకు వియోగము శతవత్సరములు గలుగవలయుననియే యాశాపము. ఆదేవింగూడి భూభారమును హరించెదను. తండ్రీ! ఈమాట పదిలముగ మది నునుపుము. ఆవల నాదేవిని రాధాంబికనుగూడి గోలోకమునకేగెదను. ఇది సత్యము. నన్నుంగూడి నీవును యశోదాదేవియు, గోపికలు, గోపకులు, వృషభానుఁడు, కలావతీదేవియు, నితరబాంధవులు గోలోకమునకు రాఁగలరు. ఈవిషయమును యశోదకుంగూడ నెఱింగింపుము. మహానుభావా! శోకము వదలుము. గోపకులంగూడి గోకులమున కరుగుము. నేనే ఆత్మను. సాక్షిమాత్రుఁడను నేనే. నిర్లిప్తుఁడనయ్యు సర్వభూత

ముల హృదయమందుండును జీవుఁడు నాప్రతిబింబము. ఇది సర్వసమ్మతము. ప్రకృతి మద్వికారయే. ఆప్రకృతియు నేనే. పాలయందు ధావళ్యమున్నయట్లు నాకును బ్రకృతికిని సంబంధమవినాభావము జలమందు శైత్యము, వహ్నియందు దాహికాశక్తి, ఆకాశమున శబ్దము, భూమియందు గంధము. చంద్రునియందు శోభ, సూర్యునియందుఁ బ్రభ యెట్లో నాయందుఁ బ్రకృతియు నట్లే. ఆత్మనుగూడి జీవుఁ డుండునట్లు నన్నుఁగూడి రాధయు నుండును. ఆమెయందు గోపికాబుద్ధిని వదలుము. నాయందుఁ బుత్త్రత్వమును వదలుము. నేను సర్వకారణుఁడను. రాధ యీశ్వరియని మూలప్రకృతియనియుఁ బిల్వఁబడు నాయిచ్ఛాశక్తి.

నందమహీపాలకా! సుఖావహమనందగు నాపరమైశ్వర్యము నించుక యాలకింపుము. అవ్యక్తజన్మముగల బ్రహ్మదేవునకు మున్ను దెలిపినట్టి విషయము నే నీకిపు డెఱిఁగించెదను. దేవతలకుఁ బ్రభుఁడనై గోలోకమున ద్విభుజుఁడనై కృష్ణనామమునునుండును వైకుంఠమునఁ జతుర్భుజుఁడనై యుండును. శివలోకమున శివుఁడననుండుదు. బ్రహ్మలోకమున బ్రహ్మయనంబరఁగుదు. తేజోవంతులలో సూర్యుఁడను నేనే. పవిత్రవస్తువులలో నగ్నియనఁబడుదును. ద్రవములయందు జలము నేనే. ఇంద్రియములలో మనస్సును, శీఘ్రగాములలోఁ సమీరుఁడను, దండకర్తలలో యముఁడను, గణనచేయువానిలోఁ గాలము నేనే. అక్షరములలో అకారమును, సామవేదములలో సామమును పదు

నాలుగులోకములఁ బాలించువారిలో నింద్రుఁడును, ధనవంతులలోఁ గుబేరుఁడను, దిగీశులలో నీశానుఁడును, వ్యాపకములలో నాకాశమును, తైజసములలో సువర్ణమును, మణులలోఁ గౌస్తుభమణిని, అర్చ్యవస్తువులలో సాలగ్రామమను, పాత్రములలోఁ దులసిని, పుష్పములలోఁ బారిజాతమును, తీర్థములలోఁ బుష్కరతీర్థమును, వైష్ణవులలోఁ గుమారుఁడను, యోగీంద్రులలో గణాధిపతిని, సేనాపతులలో స్కందుఁడను, ధనుర్ధారులలో లక్ష్మణుఁడను, రాజేంద్రులలో రాముఁడను, నక్షత్రములలో శశిని, మాసములలో మార్గశీర్షమును, ఋతువులలో వసంతర్తువును, వారములలో నాదిత్యవారమును, తిథులయం దేకాదశిని, సహిష్ణువులలో భూమిని, బాంధవులలో మాతను, భక్ష్యవస్తువులలో నమృతమును, గవ్యములలో నాజ్యమను, వృక్షములలోఁ గల్పవృక్షమను, కామధేనువులలో సురభిని, సరిత్తులలోఁ గృతసకలపాపవినాశిని యనంబడుగంగను, పండితులలో వాణిని, మంత్రములలోఁ బ్రణవమును, విద్యలలో బీజరూపుఁడను సస్యములలో ధాన్యమను, ఫలవృక్షములలో నశ్వత్థవృక్షమను, గురువులలో మంత్రదుఁడను, ప్రజేశులలోఁ గశ్యపుఁడను, పక్షులలో గరుడుఁడును, నాగములలో ననంతుఁడను, నరులలో నరాధిపుఁడను, బ్రహ్మర్షులలో భృగువను, దేవర్షులలో నారదుఁడను, రాజర్షులలో జనకుఁడను, మహర్షులలో శుకుఁడను, గంధర్వులలోఁ జిత్రరథుఁడను, సిద్ధులలోఁ గపిల

మునిని, బుద్ధిమంతులలో బృహస్పతిని, కవులలో శుక్రుఁడను, గ్రహములలో శనిని, శిల్పులలో విశ్వకర్మను, మృగములలో సింహమను, వృషభములలో నందిని, గజేంద్రములలో నైరావతమను, ఛందస్సులలో గాయత్రిని, సర్వశాస్త్రములలో వేదమను, యాదసులలో వరుణుఁడను, అప్సరలలో నూర్వశిని, సముద్రములలో జలార్ణవమను, పర్వతములలో సుమేరువను, రత్నవంతములలో హిమాలయమను, ప్రకృతిస్వరూపములలో దుర్గను, దేవులలోఁ గమలాలయను, నారులలో శతరూపను, మత్ప్రియపత్నులలో రాధికను, సాధ్వులలో వేదమాతయగు సావిత్రిని, దైత్యులలోఁ బ్రహ్లాదుఁడను, బలవంతులలో బలిచక్రవర్తిని, జ్ఞానులలో నారాయణర్షిని, వానరములలో హనుమంతుఁడను, పాండవులలో ధనంజయుఁడను, నాగకన్యలలో మనసను, వసువులలో ద్రోణుఁడను, మేఘములలో ద్రోణమేఘమను, వర్షములలో భారతవర్షమను, కాములలోఁ గామదేవుఁడను, కాముకీజనములలో రంభను, లోకములలో గోలోకమను, మాతృకలలో శాంతికను, సుందరులలో రతీదేవిని, సాక్షులలో ధర్మమను, వాసరములలో సంధ్యను, దేవతలలో మహేంద్రుఁడను, రాక్షసులలో విభీషణుఁడను, రుద్రులలోఁ గాలాగ్నిరుద్రుఁడను, భైరవులలో సంహారభైరవుఁడను, శంఖములలోఁ బాంచజన్యమను. అవయవములలో మస్తకమను, పురాణసూత్రములలో భాగవతమను, ఇతిహాసములలో భారతమను, పాంచరాత్రములలోఁ

గాపిలమను, మనువులలో స్వాయంభువుఁడను, మునులలో వ్యాసుఁడను, పితృపత్నులలో స్వధాదేవిని, వహ్నిపత్ను లలో స్వాహాదేవిని, యజ్ఞములలో రాజసూయమను, యజ్ఞ పత్నులలో దక్షిణను, శస్త్రాస్త్రవేత్తలలో జమదగ్నిసుతుఁ డగు రాముఁడను, పౌరాణికులలో సూతుఁడను, నీతివేత్తలలో నంగిరసుఁడను, వ్రతములలో విష్ణువ్రతమను, బలవంతులలో దైవమను, ఓషధులలో దూర్వను, తృణములలోఁ గుశను, ధర్మకర్మములందు సత్యమను, స్నేహపాత్రులందుఁ బుత్రకుఁ డను, శత్రువులలో వ్యాధిని, వ్యాధిమంతులలో జ్వరమను, మద్భక్తులయందు దాస్యమను, వరములయందు వరస్వరూపుఁడ ను, ఆశ్రమములలో గృహస్థాశ్రమమను, వివేకులలో సన్న్యాసి ని,శస్త్రములలో సుదర్శనమను, శుభాశిషములలోఁ గుశలమను, ఐశ్వర్యములలో మహాజ్ఞానమను, సుఖములలో వైరాగ్యమను, ప్రీతిదవస్తువులందు మిత్రవాక్యమను, దానములం దాత్మదానమ ను, సంచయములయందు ధర్మకర్మమను, కర్మములలో మదర్చన స్వరూపుఁడను, కఠోరములయందుఁ దపస్స్వరూపుఁడను, ఫలము లందు మోక్షమను, అష్టసిద్ధులయందు ప్రాకామ్యమను,పురముల యందుఁ గాశీపురమను,నగరములందు గాంచీనగరమను,స్థూలస ర్వాధారములయందు మహావిరాట్టువును నేనే. మహాసూక్ష్మము లందుఁ బరమాణువను, వైద్యులయందు నశ్వినీకుమారద్వయము నేనే.ఓషధులయందు రసాయనము నేనే.మంత్రవేత్తలలో ధన్వం తరిని, క్షయకారులలో విషాదమను, రాగులలో మేఘమల్లార

రాగము నేనే. తత్ప్రియలలోఁ గామోదమును నేనే. మత్స్యవ కులయందు శ్రీదాముఁడను, నాబంధువులయం దుద్ధవుఁడను, పశుజంతువులయందు గోస్వరూపుఁడను, కాననములయందుఁ జందనవృక్షమనునది నేనే. పూతవస్తువులందుఁ దీర్థపూతమను నది నేనే. నిశ్శంకులయందు వైష్ణవుఁడను. మన్మంత్రోపాసకు లలో వైష్ణవునిమించినవాఁడు లేఁడని యెఱుంగునది. వృక్షముల యం దంకురరూపుఁడను. సర్వవస్తువులయం దాకారమాత్రుఁ డను. సర్వభూతములు నాయందుండును. సర్వమునందు నే నుండుదు. వృక్షములయందు ఫలములును, ఫలములయందు వృక్షాంకురములుండునట్లు నే నన్నింటియందును నాయం దన్నియు నుండును. సర్వకారణరూపుఁడను నేనే. నాకు వేఱు కారణములేదు. నేను సర్వేశ్వరుఁడను. నా కీశ్వరుఁ డొక్క రుఁడు లేఁడు. కారణకారణమనఁబడువాఁడను నేనే. నన్ను బుద్ధిమంతులు సర్వబీజములకుఁ గారణమని చెప్పుదురు. నా మాయచే మోహింపఁజేయఁబడుజనులు పాపులగుట నన్నె ఱుంగరు. పాపమలముకొన్నకారణముచేతను, దుర్బుద్ధిచేతను, విధి వంచించుటచేతను, జంతువులకాత్మ నగునన్ను నాద రింపరు. నీవు నన్నే యైతివి. నేనుండునంతదనుక తుష్టిపాసాదు లుండును. నేనువెడలఁగా నధిపతి ననుసరించుసేవకులభంగి నవి యును వెడలిపోవును.

వ్రజేశ్వరా! తండ్రీ! నందమహారాజా! నాయీవాక్య ములు జ్ఞానసారములని యెఱింగి వ్రజమున కరుగుము. యశో

దాదేవికి నారాధకు నీజ్ఞానమును దెల్పుము. అని శ్రీహరి తెల్పఁగా విని నందుఁడు మహానందమునఁ దనపరిచారకులు వెంటరాఁగదలి గోకులమున కరిగెను. అందు హరియానతి యశోదకు రాధకు నీయుపదేశసారమును దెల్పెను. వారు శోకమునువదలి మహానందభరిత లైరి. ఆలోచింపఁగాఁ గృష్ణుఁడు నిర్లిప్తుఁడు, మాయేశ్వరుఁడు, మాయారతుఁడు అని యశోద పురికొలుప నందుఁడు మరలివచ్చి మాధవుం గాంచి తననందనుఁ డనుభావమును మాని వినుతించెను. ఆస్తోత్రము సామవేదోక్తము. బ్రహ్మచే వినుతింపఁబడినది. కొడుకునెదుట నిలువంబడి కన్నీరు మున్నీరుగా విలపించెను. అశ్రువులు భక్తికరుణారసములఁ దెలుపుచు నిరంతరధారలుగాఁ గురియఁజొచ్చెను.

మహాశయులారా! ఈయుపదేశసార మీావఱకే పెక్కుతావుల వ్రాసితిని. మరలవ్రాయుట పిష్టపేషణమన్నట్లు గనఁబడును. ఈయుపదేశ మీాతరుణమున నేల చేయవలయును? అన్న ప్రశ్నమునకు సమాధానము వ్రాయవలసియున్నది. నందునకుఁ బుత్త్రప్రేమము మిక్కుటమైనది. దానికిందోడు వసుదేవునింటఁ దనకొడుకుఁ జిక్కునేయన్న పరితాపము కల్గినది. వసుదేవుఁ డేమిమాటలుచెప్పి వశపఱచునో యన్నయసూయయుఁ బొడసూపినది. ఇన్నియు నొక్కసారి తన్ను బాధింపఁగాఁ జింతించుచుండెను. ఇన్నిచిక్కులకుం గారణము తన్నుఁ బుత్త్రుఁడని భావించుటయే యని హరి యొఱింగెను. ఈవ్యామోహ మీాతనిమది నుండనీయక తొలఁగించినఁగాని తనచేయుపనులకు నవకాశము లేదని నిశ్చయించెను. అది వేఱుమార్గముచే శక్యము

కాదనియుఁ దలంచెను. మాయచే నాతనింగప్పి తనపైఁ బ్రీతి లేకుండఁ జేయరాదా యని మాత్రము ప్రశ్నింపకుఁడు. అది సముచితమగుప్రశ్నము కాదు. నందుని మోసపుచ్చుట సంసారమునందే పడఁద్రోయుట శ్రీహరికి సమ్మతములగు కార్యములగునా. కావుకదా! జ్ఞాన ముపదేశించి తనవాస్తవస్థితిని దెలిపి తరింపఁజేయవలయుననియే హరియుద్దేశము. కావుననే యాతని మదిఁగల శంకలన్నియుఁ బాపునట్లు, తద్వారా తనతల్లికిని రాధికకును వగపాయున ట్లుపదేశింప నిశ్చయించెను. అట్లే యుపదేశించెను దీనిచేఁ దన్ను నమ్మియున్నతల్లిదండ్రుల నుద్ధరింపనెంచెను. అదను దప్పక యొనరింపఁదగినదియే కదా. తాఁజేయఁబూనినపని కేయభ్యంతరములు గలుగకుండఁ జేసెను. తండ్రికిం గుమారుఁ డుపదేశింపనగునా యన్న ప్రశ్న మొకటికలదని తోఁచెడిని. కాని దానికి సమాధానము వ్రాయు టనవసరమని యూరక యుండరాదు. తండ్రికొడుకుల వావి నందకృష్ణులకుఁ బనికిరాదు. సామాన్యనియమములు భగవంతునివిషయమునఁ బనికిరావు. ఇదొక్కటియే యిట సమాధానము. పెంచివ్రాయక తరువాతికథను దెలుపఁబూనితిని.

## నందశ్రీకృష్ణసంవాదము.

*నారదమునింగాంచి తరువాతికథను జెప్పఁబూని నారాయణుఁ డిట్లు పల్కుచున్నాఁడు. నారదా! శ్రీకృష్ణుఁడు పరమా

---

* ఇది శ్రీకృష్ణజన్మఖండము డెబ్బదినాల్గవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది. ఇతరపురాణములయం దీగాథ కానరాదు. ఇది నారదనారాయణసంవాదరూప మనియుఁ జెప్పఁదగును.

నందుఁడు, పరిపూర్ణుఁడు, ప్రభువు, పరమాత్మ, భక్తానుగ్రహ కారకుఁడు భూభారహరణార్థ మవతరించెను. నిర్గుణుఁడు, ప్రకృత్యతీతుఁడు, పరాత్పరుఁడు, బ్రహ్మరుద్రశేషాదివందితుఁడు. అట్టి శ్రీహరి నందుఁ డొనరించిన స్తవము నాలకించెను. గోకులము నుండి యపుడేవచ్చిన నందునిం గాంచెను. విరహాజ్వరకాతరునిగాఁ దెలిసికొనియెను. పరమానుగ్రహమున నిట్లు పలికెను.

నందరాజా! గోకులమున కరుగుము. శోకమును వదలుము. భ్రమాత్మకమగు నీసంసారమును నమ్మకుము. శోకగ్రంథినికృంతనంబయి సత్యమై నిరుపమానము నగుజ్ఞానమును దెలిపెద. ఆలకింపుము. పృథివ్యప్తేజోవాయురాకాశములను నీయైదును బంచభూతములనంబడు. ఇది శ్రుతివితతిసంస్తుతము. సర్వదేహులశరీరములు పాంచభౌతికములు, మిథ్యాభ్రమాత్మికములు, కృత్రిమములు, స్వప్నమువలె మాయాసమన్వితములు. ఈపంచభూతములు సర్వప్రాణులదేహములను గ్రహించుచున్నవి. భ్రమాత్మకజ్ఞానముమాయాప్రపంచరూపమైనది. ఇట్లులుండ నెవ్వఁ డెవనికిఁ దనయుఁ డనఁబడు? ఎవ్వతె యెవ్వనికి భార్యయగును? కర్మముచేఁ జంతువు భ్రమించుచుండును. అనేకజన్మము లెత్తుచుండును. జంతువు కర్మముచే బుట్టును. కర్మముచేతనే లయించును. సుఖదుఃఖభయశోకములుకర్మముచేతనేకలుగుచుండును. వారివారికర్మములననుసరించిబ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రజాతులయందుఁ బుట్టుదురు. కొందఱతినీచజాతులయందు జనింతురు. కొందఱు కృమికీటకము లగుదురు. పశుపక్షిక్షుద్రజంతు

వృలై కొందఱు పుట్టుదురు. ఇట్లగుటకు వారికర్మమే కారణము కాని వేఱుకారణము కానరాదు. స్వకర్మము ననుసరించియే మరలమరలఁ బుట్టుచుఁ గిట్టుచుందురు.

నాభక్తుఁడు మత్ప్రియుఁడు నగువాఁడు కర్మమును నిర్మూలించును. సత్యత్రేతాద్వాపరకలియుగములని నాల్గువిభాగములు కాలమునకుఁ గల్పితములయ్యెను. ఇరువదియైదు వేలయుగములకు మనువు మృతినొందు. ఇంద్రునియాయువు మనుతుల్యమే యగు. పదునల్వురింద్రులు గతింపఁగా బ్రహ్మ కొకపగలగు. రాత్రియు దానికి సమానముగ నేయుండును. ఇది కాలవేత్తలు నిర్ణయించిరి. ఇట్లే మాసములు సంవత్సరములు నియమింపఁబడినవి. బ్రహ్మకుంగూడ నాయుస్సు తత్పరిమితిని నూఱువత్సరములే. అదియే పరమాయువనఁబడు. నానిమేషకాలము బ్రహ్మకు శతవత్సరములగు. అంత నతఁడు నశించు. బ్రహ్మాదితృణపర్యంతమగు నీవిశ్వము నాచే సృజింపఁబడినది. సత్యమన నేనే. పరమాత్మయన్నను బ్రహ్మానుగ్రహవిగ్రహుఁడన్నను నేనే. నామంత్రోపాసకుఁడు సత్యస్వరూపుఁడయి దేహమును ధనమును త్యజించి గోలోకమునకు రాఁగలఁడు. పురాతనకర్మములను భేదించినఁగాని నాలోకమునకు రాఁజాలఁడు. బ్రహ్మలసంఖ్యులు నశించినను నాభక్తుఁడు గోలోకమునుండి యధఃపతితుఁడు కాఁడు. అతనిదేహము నిత్యము. జన్మమృత్యుజరాపహమని యెఱుంగుము.

నందమహీపాలకా! నాభక్తులకు నమంగళ మించుకయేఁ

గలుగదు. ఒకానొకప్పుడును సంభవింపదు. నాసుదర్శన మాతని సదా పరిరక్షించుచుండును. నాకంటె నాభక్తుఁడు బలవంతుఁడు. నేను జింతించువాఁడను. అతనికిఁ జింతలే లేవు. అతనికి నేను స్వామిని. నాకు స్వామిగాని కన్నతండ్రిగాని లేఁడు. కావున నందా! నాయందుఁ బుత్త్రబుద్ధిని వదలి బ్రహ్మస్వరూపముగా నన్ను భజింపుము. ఈభ్రమనిగడమును భేదించి గోలోకమునకు నిశ్చింతుఁడవై యరుగుము. ఈవిషయము యశోదాదేవికి రాధికకు నుపదేశింపుము. గోపీగోపగణములకు నెఱింగింపుము. వారిం గూడి శోకమునందక మందిరమున సుఖముగ నుండుము. ఏచింతలను మనసునఁ బ్రవేశింపనీయకుము.

అనిపలికి శ్రీకృష్ణపరమాత్మ యూరకుండెను. ఆమాటల కలరి నందుఁ డానందసాగరమున నోలలాడుచు మరల నిట్లు ప్రశ్నించెను. ఏజ్ఞానమున నీపదమున కరుగఁగలనో యట్టిసాంసారికజ్ఞానము నింకనుం దెలుపుము. పరమానందస్వరూపా! నేను మూఢుఁడను. శ్రుతులకు జనకుఁడవన నీవేకదా! అన విని సర్వజ్ఞుఁడగు భగవంతుఁడు ఆహ్నికమును బోధించెను. అది శ్రుతిసంకుచితము, సకలవేదసారము నగు.

మహాశయులారా! ఈవిషయమునుగుఱించి తెలుపఁదగినవిషయములు లేవు. అన్నియు జ్ఞానసారములే. ఒక్కమాటతో లుతఁజెప్పినజ్ఞానమున నాతనిమనస్సు పరిపక్వముకాలేదనియే యీరెండవసారి యుపదేశము. నందునిచిత్తము సంసారసాగరనిమగ్నము. సంసారమే మహానందసాగరమని యాతనిభావము.

కావున దానిని మార్పవలెనన్న నొకట రెంటమూఁడింట నుపదేశింపవలయు. అప్పుడుగాని భ్రాంతిజ్ఞానము నశించి నిర్మలజ్ఞానము పొడసూపదు. ఏలయనఁగా వినుఁడు. కర్మములు ద్వివిధములు. దృఢమూలములు, అదృఢమూలములు అని పిలువంబడు. అదృఢమూలము లగుకర్మములు స్వల్పప్రయత్నముచే నశించును. దృఢమూలములగునవి యత్యధికప్రయత్నముచేసినను అనుభవింపక తప్పవు. చిన్నియితిహాసము కలదు. చిత్తగింపుఁడు.

పూర్వము విజయుఁడను రాజుండెను ఆతఁడు దాయాదులు రాజ్యము నపహరించి కానలపాలుచేయఁగాఁ బరితపించుచుఁ దపస్సుచేయఁబూనెను. ఏదేవత నుపాసింపఁదగు ననుసంశయ మాతనికిం గల్గెను. భగవదవతారములు చిరకాలమారూపమున నుండవు. కార్యముముగియఁగనే యవి నశించును వానింగూర్చి తపస్సుచేసినయెడల నాతపస్సును బరాత్పరుఁడెటింగి యారూపమున నాకు దర్శనమీవలయునుగదా ఆపని నెఱవేఱుటకుఁ జాలకాలముపట్టును. భగవద్భక్తశిఖామణియగు హనుమంతుఁడుజీవించియున్నవాఁడు.ఆమహాత్మునింబ్రార్థించెద.నావాంఛ చాలస్వల్పము. జీవించియున్నకతనఁ ద్వరగాఁ దోఁచి నాకాంక్షితములం దీర్చును. అని యూహించి నియతేంద్రియుండై సుందరహనుమన్మంత్రము జపించుచు నామారుతిని బ్రార్థించుచుండెను.

ఇట నొక్కమాట చెప్పక తప్పదు. తపస్సనఁగా

నుపాసించుట. ఒక్కదేవతనుఁ గూర్చి తపస్సుచేసె ననఁగా నాదేవత ప్రత్యక్షము కావలయునని యూహించి యుపాసించు టయే తపస్సు. ఇంద్రియముల శోషింపఁజేయుచు నాతఁడు నియతవ్రతుఁడై యుండు. దానికే మంత్రఖండమునందు ఆకర్షణ ప్రయోగమందురు. తన్నామచిహ్నితమంత్రమున నియతస్థలమున నాకర్షణబీజమును జేర్చి తదేకనిష్ఠజపించును. ఒక్కొక్కబీజమున కొక్కొక్కదేవతయుండును. దీని నావృత్తులుఁగా భావించుకొలఁది నది యాదేవతమది నుద్రేకమును బుట్టించును. చింతకాయను ద్రుంచఁగనే నోట నీరూరును. ఏల? దానిశక్తి యట్టిది. వాయువుద్వారా దానియందలిరసము సమీపముననున్న వాని జిహ్వను ద్రవింపఁజేయును. ఆశక్తి దానికి స్వభావముగాఁ గలిగినదే కాని యితరకారణములు లేవు. అట్లె బీజోచ్చారణమున దేవతాచిత్త ముద్రేకించును. అంత నాదేవత బీజాకృష్టమై తోఁచును. రావణాదులు తపస్సుచేయఁగాఁ దత్తపోవహ్ని దిక్కులబాధించె నన విందుముకదా. ఏల? ఆమంత్ర మంత తీవ్రరూపమును దాల్చెనని యూహింపఁదగును. అయాకర్షణప్రయోగము తపస్సనఁబడును. ఈబీజ మాదేవత నెట్టు లాకర్షించునని యడుగుఁ బూనుదురా. ఒక్కవిషయమును వినుఁడు. ఒక్కనక్షత్రము, వారము, తిథి కలిసినపు డొకమూలికను బూజించి తీసిన నది యాపనిని దప్పక చేయును. విధివిహితముగా కుండునట్లు తీసిన నిష్ఫలమగు. ఒక్కమూలికను బైనియమము ననుసరించి తీసి చూర్ణించి యుంచినచో నెట్టిసర్పము కఱచినను

బిగును. ఏల? ఆకాలమునఁ దదధిష్ఠాతృదేవత యామూలికయం దావేశించియుండును. అప్పుడు దానిశక్తి సంపూర్ణముగా దాని యందే యుండును. అట్లే బీజశక్తి దేవత నాకర్షించును. ఇఁకఁ బ్రకృతకథ నాలకింపుఁడు.

ఆవిజయుఁ డట్లు హనుమంతునిగూర్చి తీవ్రతప మొనరింపఁగా హనుమ ప్రత్యక్షమయ్యెను. విజయా వర మడుగుమనియె. నీతప మత్యుగ్రము. నాకు మెప్పుపుట్టించెను. కాన నరుదెంచితి. వరమీాయ నెంచితి. వేఁడుమనఁగా విని విజయుఁడు వినయ భయసంభ్రమములు ముప్పిరిగొన లేచి చేతులుజోడించి బాష్ప ములు ప్రవహించుచుండ.

"సత్యపి ప్రియబంధుత్వే విద్యాధిక్యే చ సత్యపి,
మైత్ర్యాంసత్యాంచహనుమన్ యచ్ఛాంతాబహుమానతా."

అనుప్రాచీనసూక్తి మదిఁదోఁపఁగా మహాత్మా! కరుణా కరా! మారుతతనయా! నీవంటి యిష్టదైవము ప్రత్యక్షము కాఁగా నొక్కవరమునుగోరిన నీతపస్సు నశించును. మరల నాపై నీకు విశ్వాసముండునా. కావున బహుమానతయా చ్ఛాంత యనఁదగు ననియె. హనుమ యాదరణమున నాతనిం జూచి వత్సా! వరము గోరుము. మోమోటమి వరదానమున నే నశింపదు. భయంపడకుము అనియె. విజయుఁడును బ్రమోదమున మహాత్మా! నీయమోఘకృపకుఁ బాత్రుఁడనైతని. నాకింకఁ గొదు వయుండదు. జ్ఞాతిజనాపహృతరాజ్యుఁడను. కానలపాలైతిని. మఱియు క్షత్రియకులోచితమర్యాదకు దూరుఁడనైతిని. కాన

నా కీకోఱంత వాయునట్లు వరమిమ్ము. నావుడు హనుమంతుఁ డాలోచించి యిట్లనియె. వత్సా! నీపూర్వజన్మకర్మము దృఢమూలము. కర్మము భగవత్స్వరూపము. దానిమార్ప నేనుగా దెవ్వరును జాలరు.తుదకుఁ బరమేశ్వరుఁడును మార్పఁబూనఁడు. కాన నీ కీజన్మమున మరల రాజ్యప్రాప్తి లేదు. వగవకుము. అని యతనిముఖలక్షణములం బరికించి పైజన్మమున నున్న నేమి లేకున్న నేమి? ఈయవమాన మనుభవింపవలసినదేకదా యనుభావము నీమది గదిరినదని యెఱుంగుదు. అట్లూహింపకుము. నీవీపేరుననే యుందువు. నీరథధ్వజాగ్రమున నేనుందును. నాదృష్టిపాటినమాత్రమున శత్రుబలము నశించుచుండును. అరి వీరుల మారణహోమము చేయుము. రాజ్యాపహృతిజనితావమానము నీ కపుడును గల్గును. తరువాత లోకోత్తరఖ్యాతింగాంతువు. అనిపలికి యాతని సంతుష్టాంతరంగుం గావించి యంతర్హితుఁడయ్యెను. ఆవిజయుఁడే పాండురాజకుమారమధ్యముఁడై పుట్టెనని యెఱుంగవలయు. హనుమద్ధ్వజ మాకారణముననే కలిగినది. తద్దర్శనమాత్రమున శత్రువీరులగుండెలు ప్రీలుచుండును.

మహానుభావులారా! ఈయితిహాసము దృఢమూలమగుకర్మఫల మనుభవింపక తప్పదని తెల్పుచున్నది. నందుని సంసారనివృత్తునిగాఁజేయ భగవంతుఁ డూహించి యతని దృఢమూలమగుకర్మమును దొలఁగింప రెండవపర్యాయముగూడ నుపదేశించెను. కళంకమునుదొలఁగించెను.నిర్మలాంతఃకరణునిగావించెను. వసుదేవునిపైగలయసూయరూపుమాయునట్లుచేసెను.కావుననే

కృష్ణపరబ్రహ్మమునందుఁ బుత్త్రభ్రాంతిమాని పరమేశ్వరభావన కుదురుపడఁగా నింకను జ్ఞానమును దెలుపుమా యని ప్రశ్నించెను. కాఁబట్టి యెవ్వఁడేని సాధుబోధము మదికెక్కకున్నను రెండవపర్యాయము దానివినఁ బ్రయత్నింపవలయు. అపుడును దెలియకయున్న మూఁడవతడవ దానిం బడయఁ బ్రయత్నింపవలయును. మానరాదు. క్రమముగా భగవద్భక్తి జ్ఞానములు పొడకొనకపోవు. ప్రయత్నమతిశయముగఁ జేయుటయే మంచిపని. ఇఁకఁదడవు చేయక తరువాతి కథను దెల్పెద. చిత్తగింపుఁడు.

## శ్రీహరి నందునకు జ్ఞానోపదేశము చేయుట.

* నందుని ప్రశ్నము సాధుసమ్మతము. భగవత్ప్రీతిని బడయఁజాలెను. ఆప్రశ్నమును విని హరి కర్మఫలము చక్కఁగా మాఱుచున్నది. నాయందుఁగల పుత్త్రవ్యామోహము తగ్గుచున్నది. క్రమక్రమముగా నీతఁడు సుజ్ఞానికాఁగలఁడు. శ్రద్ధగలిగినది. శ్రద్ధయే యతి పావని. అదిగలవాఁడే గౌరవజ్యేష్ఠుఁడు. అదికుదిరిన నన్నియుఁ గుదిరినట్లే. దానికి నీడగున దేదియుఁ గానరాదు. కానఁ దడవుచేయక యీతని కుపదేశించి గోలోకవాసార్హతను గల్పించెదను. అని యూహించి యిట్లు పలుకనారంభించెను. నందరాజా! పరమాద్భుతజ్ఞానమును, దెలిపెద వినుము. అవహితుఁడవు కమ్ము. ఇది గోపనీయము. పురాణ

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము డెబ్బదియైదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయు.

ములనుండి దీనిం దెలిసికొన శక్యముకాదు. స్త్రీల కిది యుపదే శింపరాదు. కులటల కిది సర్వథా తెలుపరాదు. మఱియు మోక్షమార్గార్గళదుష్కర్మముల నాచరించువారికిని భ్రమాత్మక జ్ఞానులకును,హరిభక్తి దబ్బఱ యని విరుద్ధమార్గమునఁ బ్రవర్తించు వారికిని, అసాధ్వులకును, నాశములకు బీజస్వరూపలగునారులకు నిది యుపదేశింపఁదగదు. అట్టివారి కెట్టితఱినే నుపదేశింపరాదని తలంపుము.

ప్రతిదినము ప్రాతఃకాలమున లేచి రాత్రికట్టుకొన్నవస్త్రమును వదలి యభీష్టదైవమును హృత్పద్మమునందును బ్రహ్మరంధ్రమున గురువును నిలిపి మనస్సున ధ్యానింపవలయు.తరువాతఁ గాల్యకృత్యములఁదీర్చి సునిశ్చితాంతఃకరణుండై ప్రాజ్ఞుఁడు స్నానము చేయవలయును. నిర్మలజలంబులఁ జేయుస్నానము సత్ఫలప్రదము. కర్మనికృంతనము చేయుట భక్తలక్షణము గాన సంకల్పము చేయరాదు. స్నానము చేసి హరిని స్మరించి సంధ్యావందన మొనరించి గృహమునకుఁ బోవవలయు. పాదప్రక్షాళనము పిదప నింటిలోః బ్రవేశింపవలయును. ధౌతవస్త్రములఁగట్టుకొని పరమాత్మను బూజింపవలయును. ఆపరమాత్మ నేనే. ముక్తికారణభూతుఁడను నేనే.సాలగ్రామమునందుఁగాని, మణియందుఁగాని, యంత్రమునందుఁగాని, జలములయందుఁగాని, విప్రునియందుఁగాని, గోవునందుఁగాని, విశేషించి గురువులయందుఁగాని, ఘటమునందుఁగాని, అష్టదళపద్మమునందుఁగాని, చందననిర్మిత పాత్రమునందుఁగాని, పరమాత్మ నావాహనము చేసి * మంత్రా

*మంత్రానురూపధ్యానేన ధ్యాత్వా మాం పూజయేద్వ్రతీ అని మూలము.

నురూపధ్యానము చేయవలయు. పిదప నన్నుఁ బూజింపవల యును. మూలమంత్రముచేతనే షోడశోపచారద్రవ్యముల నర్పింపవలయును.

తరువాత శ్రీదామ సుదామ వసుదామ వీరభాను శూర భానువులను గోపాలకపంచకమును బూజింపవలయు. వీరైదు గురు నాకంగదేవత లనఁబడుదురు. సునందనంద కుముదనామక పార్షదుని, సుదర్శనమును, లక్ష్మీసరస్వతులను, దుర్గారాధలను, గంగావసుంధరలను, గురువును, దులసిని, శంభువును, గార్తికే యుని, వినాయకుని, నవగ్రహములను, దిక్పాలకులను,నాచుట్టు నుండువారినిగాఁ దలంచుచుఁ బూజింపవలయును. తరువాత గణేశదినేశహుతవహవిష్ణుశంకరులను బార్వతిని బూజింపవల యును. ఈదేవషట్కము విఘ్ననివారకము. కావున నిత్యము వీనిం బూజింపవలయును. ఈషద్దేవతాపూజ యామ్నాయో క్తము. కర్మనికృంతనులు,మోక్షప్రదులు నగుదురు.గణేశుఁడు విఘ్ననివారకుఁడు.,దినేశుఁడు వ్యాధినివారకుఁడు వహ్ని శాంతి కారణుఁడు, శుద్ధిప్రదుఁడు. విష్ణువు మోక్షప్రదుఁడు. శంక రుఁడు జ్ఞానదాత. పార్వతి బుద్ధిముక్తికారణభూతురాలు. కావున నీదేవతల నాలుగురను బూజింపవలయును.

ఆమీఁదఁ బుష్పాంజలిత్రయము నిచ్చి మదీయస్తోత్ర కవచములఁ బఠింపవలయును. గురువునకు నమస్కరించి పూజించి వెనుక దేవతానమస్కారముచేయవలయును. ఆహ్నా

కక్రియలం దీర్చి స్వాత్మశుద్ధ్యర్థమై చెప్పఁబోవు వేదోక్తకర్మము నాచరింపవలయును. ప్రాజ్ఞుఁడు మలమును జూడరాదు. అది సకలవ్యాధిస్వరూపిణి యనంబడు. మూత్రము వ్యాధిబీజము, నరకకారణమునగు. లింగము యోనియుఁ బాపదుఃఖవ్యాధి దారిద్ర్యముల నొసంగునవి. కావునఁ బ్రాజ్ఞుఁడు వానింజూడఁ బ్రయత్నింపరాదు. స్త్రీలయురము,ముఖము,పాలిండ్లు,కటాక్షము హాస్యముననునివి వినాశబీజములు స్త్రీరూపమువిపత్కారణము. దివాభోగము స్వభార్యయందును నిషేధము, రోగకారణము, చక్షుస్సులకు శ్రోత్రములకు హానికరము. ఏకతారగల యంబరమునుబరికింపరాదు. అది రోగజనకము.అట్లు చూచినచో హరిని స్మరించి యేడువారములు నారదస్మరణము చేయవలయును.అస్తమయకాలమందు రవిని చంద్రుని జూడరాదు. అది వ్యాధికారణము ఉదయించుచున్న ఖండచంద్రునిగాంచిన వ్యాధిజనించును. నీటిలో రవిని జంద్రుని జూచిన శోకముగలుగును. పరమైథునమును జూచినం బంధువిచ్ఛేదము గలుగును. పాపాత్మునితోఁ గూడి శయనించుట భుజించుట నడచుట చేయరానిపనులు. అది నాశకారణము. పాపులతో సల్లాపములుచేయుట దేహస్పర్శముచేయుట శయనాశ్రయభోజనములుచేయుట మంచిదికాదు. పాపులందఱితో సహవాసముచేయఁ దలంతురు. నీటిలోఁ దైలబిందువుపడి వ్యాపించినట్లు వారు వ్యాపింతురు. హింస్రజంతుసమీపమున నుండుట దుఃఖకారణము. ఖలసంసర్గము శోకకారణము.

బ్రాహ్మణులకు గోవులకు విశేషించి వైష్ణవులకు హింస కలిగింపరాదు. హానియుఁ గల్గింపరాదు. దాన సర్వనాశము గలుగును. దేవతల, విప్రులయొక్క, వైష్ణవులయొక్కయు ధనమును హరింపరాదు. అది సర్వనాశమునకుఁ గారణము. స్వదత్తము గాని పరదత్తముగాని బ్రాహ్మణద్రవ్యమును హరించినచో నరువదివేలసంవత్సరములు మలమందుఁ బురువై యుండును. ఆమీఁద కోటిసహస్రజన్మములు గృధ్రమై నూఱుజన్మములు సూకరమై నూఱుజన్మములు శునకమై యేడుజన్మములు గండకమై సప్తజన్మము లశ్వమై యైదుజన్మములు కుంభీరమై పిదపఁ గులటలయోని కీటమై శతజన్మములుండి శతజన్మములు బ్రహ్మకీటమై యేడుజన్మములు గోపికయై సప్తజన్మములు గర్దభమై యేడుజన్మములు మార్జారమై మూడుజన్మములు నకులమై మరల శతజన్మము లుచ్చైశ్రవమై ఖరమై యన్నిజన్మములుండి క్రూరసర్పశార్దూలమహిషజన్మము లేడువారములెత్తి శతజన్మములు కప్పయైయుండి సప్తజన్మములు ఛాగమై శతజన్మములు భల్లూకమై సృగాలమై పెక్కుజన్మములుండి పిదప జలౌకమగును.

బ్రహ్మస్వము నపహరించినవాఁడు కుంభీపాకమునఁబడి యుండు. బ్రాహ్మణున కిచ్చెదనన్న దక్షిణనీయక యొకరాత్రిగడపినచో నాధ్యానము ద్విగుణమీవలయును, మాసము గడపిన శతగుణములగు. రెండుమాసములు జరపిన సహస్రగుణములగును. సంవత్సర మతిక్రమింప దాత నరకప్రాప్తుఁ డగును.

మూర్ఖుఁ డగువాఁడు దానముచేయను బ్రతిగ్రహింపను బనికి రాఁడు. ఎవఁడు మూర్ఖున కిచ్చునో ప్రతిగ్రహించునో వారిరు వురు నరకప్రాప్తులగుదురు. దాత విశేషించి వ్యాధిపీడితుఁ డగు. విప్రహింసయొనరించిన వంశహాని ఘుట్టిల్లును. ధనము పోయి సదా బిక్షుకుఁడగును. దేవుని బ్రాహ్మణుని గాంచి యెవఁడు నమస్కరింపఁడో వాఁడు తప్పక దుఃఖమునందు. గురువునందు భక్తియునుపనివాఁడు రౌరవనరకదుఃఖమునకుఁ బాత్రుఁడగును ఏవనిత దురాచారనిరతయై హరియాపుఁడగు నాథుని సాదరముగఁబరికింపక బెదటించునో యాచండి కుంభీపా కమునఁ బడఁగలదు. సాధువులను వాక్కున భయపెట్టినఁ గాక జన్మమెత్తును. హింసించిన సూకరమగు. కోపగించిన సర్పజన్మ మొందు. దర్పమున నవమానించిన గర్దభమగు. కుత్సితంపు మాటల సజ్జనుల నాయాసమొందఁజేసినఁ గుక్కురియగు. విష ముచూపి భయపెట్టిన గ్రుడ్డివాఁ డగు.

పతివ్రతయగు పురంధ్రి భర్తంగూడి విమానారూఢ యై వైకుంఠమున కరుగు. శివదుర్గాగణపతిసూర్యవిష్ణుభక్తవిప్ర విష్ణువులనిందించిన మూఢుఁడు రౌరవనరకమున వసించును. మాతృపితృపుత్రభార్యాగుర్వనాథభగినీకన్యాజనముల నిందిం చువాఁడు నరకకూపంబునం బడఁగలఁడు.విప్రభక్తివిహీనులగు వారు క్షత్రియవైశ్యశూద్రజాతులం దుద్భవించి హరిభక్తిలేక నరకమున కరుగుదురు.పతిభక్తిలేనితరుణులు నష్టేనరకమున కరు గుదురు. పాలగ్రామజలమును ద్రావి విష్ణుప్రసాదమును భుజిం

చువాఁడు తీర్థమువలెఁ బవిత్రుఁడగును. నూఱుతరముల తన పూర్వులను దరింపఁజేయును. పితరులను దేవతల నారాధించు పొంటె మాంసమును భుజింపవచ్చును. తనవాంఛ కొఱకు నెవ్వఁడు మాంసమును దినునో వాఁడు మహారౌరవమునఁ బడును. తినఁగోరి చేపలంగాల్చునాతఁ డుపవసింపఁదగు. పిదపఁ జాంద్రాయణ వ్రతరూపప్రాయశ్చిత్తము చేయందగు. ఆతఁ డశుచియని యెఱుంగుము. పురాతనపుణ్యమును గోల్పోవును.

బ్రాహ్మణుఁడు తినుకోర్కి మత్స్యమును దినినచో జ్ఞాన దుర్బలుఁడగు నాభూసురుఁడు అశుచియగు. మత్స్యమును మాంసమును దినక విష్ణువునుచ్ఛిష్టమును భుజించువాఁడు పలు మాఱు లశ్వమేధముల నొనరించినఁ గలుగుపుణ్యమును బడయఁగలఁడు. ఏకాదశీవ్ర మాచరించినను, శ్రీకృష్ణజన్మాష్టమీ వ్రతమును జేసినను శతజన్మకృతపాపములనుండి విముక్తుఁడై పరిశుద్ధుఁడగు. సందియమొందవలదు. ఆభక్తుఁడు బాల్యకౌమారయౌవనవార్ధకములందుఁ జేసినపాపములనుండి విముక్తుఁ డగును. ఎవ్వఁడు ఏకాదశియందునుఁ శ్రీకృష్ణజన్మాష్టమీదిన మందను భుజించునో సకలలోకములయం దొనరించుపాతకము లాతనింబొందును.ఇందులకు సందియములు లేవు. రోగాతురున కిట్టి నియమములు లేవు. బాలవృద్ధులకును లేవు. భక్తుఁడగుద్విజునకు దానమిచ్చిన ద్విగుణసుకృతము లభించును. ఏనరుఁడు శివరాత్రియందును, శ్రీరామనవమీతిథియందును భుజించునో వాఁ డుపవాసముచేయ సమర్థుఁడై యున్నయెడల మహారౌరవ

మునంబడును. అమావాస్యాపౌర్ణమాసీసంక్రాంతిచతుర్దశ్యష్టములయందు స్త్రీతైలమాంసముల సేవించినఁ జండాలయోని జనించును

మత్స్యమాంసమసూరకాంస్యపాత్రభోజనరక్తశాకార్ద్రికముల రవివారమున సేవింపరాదు. వర్జింపవలయును. వదలనిచో నరకకూపంబునఁ జిరకాలము పడియుండును. అందును గుంభీపాకముననే పడియుండును. రజస్వలాన్నమును, వేశ్యాన్నమును, మదిరాన్నమును మానవుఁ డెవ్వఁడు భుజించునో వాఁడు కుభోజనము చేయువాఁడగును. ఎవ్వఁడు పాపములఁ బగటిపూటచేయునో వాఁడు తాజేసినపుణ్యకర్మములఫలమును బొందకుండుటేగాక సదా యపరిశుద్ధుఁడై యుండు. దేహపతనాంతమాయశుచిత్వము నశింపదు. నల్వురుపురుషులతో సుఖించునారి వేశ్యయైపుట్టును. పితృదేవకార్యములం దామె పాకము చేయఁ బనికిరాదు. గ్రామపురోహితునియన్నము శూద్రశ్రాద్ధాన్నము నెవండు భుజించునో వాఁడు రవిచంద్రులుండునంతదనుక నరకమునఁ బడియుండును.

శూద్రు నింట శ్రాద్ధము సాగుచుండఁగాఁ దచ్ఛేషాన్నము నెవఁడు భుజించునో యాబ్రాహ్మణుఁడు కుంభీపాకమున దుఃఖములఁ గుడుచుచుండును. ఎవఁడు శూద్రునిచేఁ బిలువఁబడి యన్యునింట భుజించునో వాఁడు సురాపానముచేసినవాఁడని యెఱుంగవలయును. సర్వధర్మకార్యబహిష్కృతుఁడగు- కత్తులనమ్మి జీవించువాఁడును, మషీజీవియు, దేవలుఁడు, వృష

వాహకుఁడును, శూద్రశవదాహియు, శూద్రాపతియగువిప్రుఁడును, శూద్రతుల్యులని యెఱుంగవలయును. వానియన్నము మలసమానమే. విప్రకార్యములందు నియుక్తుఁడై పూర్వోత్తర కాలములయందు నిరాకరించువాఁడు శూద్రులకంటెఁ దక్కువయగు. ఎవ్వఁడు సంధ్యావందనముచేయఁడో వాఁడు సర్వకర్మానర్హుఁడగును. ఏపగలుచేసిన కర్మ మప్పుడే నశించును. పరబాధాకరము లగుమంత్రముల నుపాసించువానికిఁ దప్పక నరకము గల్గును.

నదినడుమ, గర్తమందు, వృక్షమూలమునందు, జలసమీపభాగమునందు, దేవతాసన్నిధిని, సస్యక్షేత్రమునందును, మలవిసర్జనము చేయరాదు. వల్మీకమునుండి మూషకబిలమునుండి, జలాంతర్భాగమునుండి, ఒకరు తెచ్చిపెట్టుకొన్న రాశినుండి, యింటినుండి, శౌచార్థము మృత్తికను గ్రహింపరాదు. నాగలిచేఁ ద్రవ్వఁబడినమృత్తికను గ్రహింపరాదు. ఆలవాలముల నుండి (చెట్లపాదులనుండి) సస్యములతోఁగూడిన భూముల నుండి, వృక్షమూలమునుండి, నదీగర్భమునుండి, శౌచార్థము మృత్తికను బరిగ్రహింపరాదు. ఎవ్వతె కూశ్మాండఘాతియగునో ఆవనితయు, దీపము నార్పుపురుషుఁడును, ఏడుజన్మములు సర్పస్త్రీరియై జన్మింతురు. పిదపఁ బ్రతిజన్మమునందును దరిద్రులగుదురు. ప్రదీపమును, సాలగ్రామమును, శివలింగమును, మణిని, బ్రతిమను, యజ్ఞోపవీతమును, సువర్ణశంఖములను, హీరకమును, మౌక్తికమును, గోమూత్రగోమయములను, ఘృతమును, సాలగ్రామశి

లాకోయమును, భూమియం దునుపరాదు. ఏదియో యాధా రముచేసియే యుంచవలయు. అట్లుచేయనిచో నధోలోకప్రాప్తి వారికిం గల్గును. అంతియగాక దరిద్రుఁడు, కుష్ఠురోగియుఁ, గృపణుఁడు, వంశహీనుఁడు, భార్యాహీనుఁడు, భూమిప్రజా బంధు విహీనుఁడు, కుత్సితుఁడు, గ్రుడ్డివాఁడు, కుంటివాఁడు, వామనుఁడు, ఖంజుఁడు, నంగహీనుఁడు వరుసఁగా నగుదురు.

పగటియందు సంధ్యాకాలములయందు నిద్రను స్త్రీసుఖ మును బొందువాఁడు సప్తజన్మములయందు రోగియు దరి ద్రుఁడునగు. సూర్యోదయానంతర మెవ్వఁడు దంతధావనముచే యునో యాపాపిష్ఠుఁడు భగవత్పూజానర్హుఁడగు. శివలింగమును మృత్తికచేతను, భస్మగోశకృత్పిండములచేతను, నిసుకచేతను, వీనిలో దేనిచేతనైనను జేసి యొక్కసారియైనఁ బూజించువాఁడు శతకల్పములు స్వర్గముననుండు. సహస్రవారములు పూజించిన వాంఛితార్థములు నెఱవేఱును. లక్షవారములు పూజించిన శివత్వమొందును. జీవన్ముక్తుఁడగును. శివపూజావిహీనుఁడగు బ్రాహ్మణుఁడు నరకమున కేగును. ఏమానవులు నాపూజ పరమ పవిత్రముగా భావించి శివుని నిందింతురో బ్రహ్మలు నూఱు మంది యాయుష్కాలమెంతయగునో యంతకాలము నరకకూప దుఃఖము ననుభవింతురు. శివలింగము పూజించునపుడు వెంద్రు కగాని యిసుకగాని యుండిన వాఁడు వాలుకచే నంధుఁడగు. వెండ్రుకచే యవనజాతిం బుట్టును. అంతియకాక క్షుద్రుఁడు, దరిద్రుఁడు, కృపణుఁడు, వ్యాధియుతుఁడు, కుత్సితుఁడు నగు.

అందఱికన్న మానహీనుఁడై నీచజాతియందుఁ బుట్టువును గాం చును. అందఱికంటె సద్బ్రాహ్మణుఁడు, ప్రీతిపాత్రుఁడగు ఆబ్రా హ్మణునికంటె లక్ష్మీ ప్రీతిపాత్రురాలగు. కాననే సదా వక్షమందు ధరించితిని. ఆలక్ష్మికంటె రాధ యధికురాలు. ఆమెకంటె భక్తులు నాప్రీతికింబాత్రులు. శంకరుఁడు వారికంటె నధికుఁడు. శంకరుని కంటె నధికప్రియుఁడు లేఁడు. మహాదేవ మహాదేవ మహాదేవ యని పలుకు మానవునకు వెనుక ఆనామశ్రవణాసక్తుఁడనై నేను బోవుచుందును. నామనస్సు భక్తమూలము. ప్రాణములు రాధా త్మకములు. ఇది సత్యము. ఆత్మ శంకరస్థానము. శివుఁడు నాకుఁ బ్రాణాధికుఁడు. నారాయణీశక్తియాద్యయగు. ఆమెయే సృష్టి స్థిత్యంతకారిణి యనంబడు. ఆమెచేతనే బ్రహ్మాదిదేవతలు సృజిం పఁబడుదురు. ఆమెంగూడి నేనును సృష్టికార్యమునఁ బ్రవర్తిం తును. ఆశక్తిమూలముననే విశ్వము వర్ధిల్లుచున్నది. సృష్టియుఁ గల్గుచున్నది. ఆమెలేకున్న జగమే లేదు. ఆశక్తిని శివునివశమం దునిచితిని. దయయు, నిద్రయు, క్షుత్తృష్ణాతృప్తులు, శ్రద్ధా క్షమాధృతులు, తుష్టిపుష్టిశాంతి లజ్జాదేవతాధిష్ఠాత్రియామూల ప్రకృతియే. ఆమె నతిక్రమించి నేఁజేయుప్రపంచకార్య మేదియు లేదని నమ్ముము. ఆశక్తి నాయిచ్ఛాశక్తి యనంబడు. మాకిరు వురకు భేదములేదు. ఈవిషయ మెఱుంగఁదగినది. భేదములేద నఁగా క్షీరశైత్యముల కభేద మెట్లో యట్టిదని యెఱుంగుము. * వైకుంఠమున ఆశక్తియే మహాలక్ష్మియనియు, గోలోకమున

---

* వైకుంఠే సా మహాలక్ష్మీ ర్గోలోకే రాధికా సతీ, మర్త్యే లక్ష్మీశ్చ

రాధికయనియు, మర్త్యలోకమున లక్ష్మియనియు, క్షీరసాగరమున దక్షకన్యయగు సతియనియు సర్వత్ర దైన్యదుఃఖవినాశిని యగుదుర్గాదేవియనియు, స్వర్గమున సంపత్తనియు, శక్రాదిదిక్పాలకులగృహములయందు రాజ్యలక్ష్మియనియుఁ, బేరుగాంచెను. ఆప్రకృతియే శారద, సావిత్రి, వహ్నియందు దాహికాశక్తి, భాస్కరునియందుఁ బ్రభాశక్తి, చంద్రునియందు శోభాశక్తి, జలములందు శీతతాశక్తి, సస్యములయందుఁ బ్రసవశక్తి, భూమియందు ధారణాశక్తి, విప్రుయందు బ్రహ్మణ్యశక్తి, సురలయందు దేవశక్తి, తపస్వులయందుఁ దపస్య, గృహస్థులకు గృహదేవత, మోక్షార్థులకు ముక్తిశక్తి, సాంసారికులం దాశాశక్తి, మద్భక్తులయందు భక్తిశక్తి, నృపులకు రాజ్యలక్ష్మి, వణిజులకులాభశక్తి, సంసారసాగరపరతీరమందుఁ దారిణి, సత్పురుషులకు సాధుబుద్ధిస్వరూపిణి యనియు విఖ్యాతినొందెను. మేధాశక్తి యనియుఁ బేరుఁగాంచెను. శ్రుతులయందు శాస్త్రముల యందు వ్యాఖ్యాశక్తి, దాతలయందు దాతృశక్తి, క్షత్రియాదులయందు విప్రభక్తినొంసగుచునుండును. పతివ్రతలకుఁ బతిభక్తి నొంసగును. ఇట్టి ప్రకృతిని శివున కర్పించితిని. ఇది సాంసారికధర్మపద్ధతి. దీనిఁ దెలిపితిని. ఇంకేమి వినఁగోరుదువు ? ప్రశ్న

---

క్షీరోదేదక్షకన్యా సతీచ సా, సాదుర్గా మేనకాకన్యా దైన్యదుర్గతినాశనీ, స్వర్గలక్ష్మీశ్చ దుర్గాసా శక్రాదీనాం గృహే గృహే, సా వాణీ. సాచ సావిత్రీ, విద్యాధిష్ఠాతృదేవతా, వహ్నౌ సా దాహికా శక్తిః ప్రభాశక్తిశ్చ భాస్కరే, శోభాశక్తిఃపూర్ణచంద్రే జలే శక్తిశ్చ శీతతా. అని మూలము.

మొనరించినచో సమాధానము వచించెద. అని నందునకుం దెలిపి శ్రీహరి యూరకుండెను.

మహానుభావులారా! నందనందనందనసంవాదమును జది వితిరి. ఇందలిసార మింతకుముందే పెక్కుతావుల వ్రాయఁబడి నదియే. ఐన నిందుఁ గొన్ని విశేషములు గలవు. కొలఁదిపంక్తులతో దెలిపెదను. ఇందు నందునకు భగవంతుఁ డుపదేశించినది సాంసారికజ్ఞానము. దీనివలన మన మెఱుంగఁదగినవిశేషము లెన్ని యో కలవు. తొలుఁదొలుత నిద్ర లేచినది మొదలు మనుష్యుఁడు చేయఁ దగినకృత్యములు భగవత్కథితములు. ఈధర్మములు విశేషించి భారతీయులకే యుపయోగించు ననరాదు. శుచిత్వ మందఱకుఁ గావలసినదియే. అందు విశేషించి కాయశుద్ధి తొలుతఁ జెప్పఁబడి నది. మనశ్శుద్ధి పిదపఁ జెప్పఁబడినది. కాయశుద్ధిచే నేమిలాభము కలదన్న ప్రశ్నము కొందఱు చేయుదురు. కాని యదియంతగా సమంజసమగు ప్రశ్నము కాదు. ఏలయనఁగాఁ గాయశుద్ధిలేక మనశ్శుద్ధి కలుగనేరదు. ఇది సిద్ధాంతము. కాయశుద్ధికర కర్మముల నాచరింపక కొందఱు నిర్మలాంతఃకరణులు కలరుకదా! అందుల కేమిసమాధాన మని యడుగవచ్చును. కాని యది సామాన్యధర్మము కాదు. విశేషధర్మము ఎట్టినియమమునకైనఁ గొన్ని పరిహారములు కలవు. ఒకానొకచోటనైన నన్వయింపక యేకరీతిగా సాగుధర్మ మొక్కండును బ్రపంచమునఁ గానరాదు. ఎట్టిధర్మములైనను గొన్నితావులననుష్ఠేయములు కావు. దేహము పరిశుద్ధమగుటకే పుణ్యతీర్థస్నానాదులు చెప్పఁబడినవి. అవి

యన్నింగను వ్యర్థములు కావు. అవి ముఖ్యములైనవని తెల్పిన శాస్త్రములును ప్రమాణములు కావనరాదు. అట్లనుట హఠవాదము. అనేక కారణముల నూహించియే మనవారు వానిని విధించిరి. జ్ఞానియైనపిదప నవి ముఖ్యములు కాకపోవచ్చును. సంసారతాపత్రయములుగలవారి కవి ముఖ్యములు.

"మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే,
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్."

అన్నసూక్తిప్రమాణమే కానిప్రకరణమునుబట్టియట్లుచెప్పవలసివచ్చినది. కర్మములన్నియుజ్ఞానముకలిగించుటకేయేర్పడినవి.తల్లాభమునఁ బూర్వము చేసినకర్మములు వ్యర్థములనరాదు. తీర్థస్నానముకూడ జలములను భగవంతునిగా భావించియే చేయవలయునని విధి విధించుచున్నది. భావన సమంచితముగాఁ గుదురుటకే తీర్థసేవ ప్రధానమని పెద్ద లాజ్ఞాపించిరి. ఆస్తికాభాసులు కొందఱది లాభకారి కాదందురు. వారలసులు. భగవంతునియందును దదారాధనవిధులయందును వారికి విశ్వాసము తక్కువ.

"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునన్త్యురుకాలేన దర్శనాదేవ సాధవః."

యనుభారతోక్తి వ్యర్థముకాదు. భక్తిలేక భగవంతునిగా నాజలముం భావింపక చేసినస్నానము ఫలవంతముకాదన్న నొసనవచ్చునుగాని మొదటికే మోసముతెచ్చినచో "తథాస్తు" అనఁజాలను. శాస్త్రము లట్టిమాటల కవకాశ మీయఁజాలవు.

"శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే"

యన్న భగవదుక్తియు వ్యర్థమగు.

"సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః.

ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ."

అన్న గీతోక్తియు వ్యర్థమనక తప్పదు. ఇన్నియుఁ దప్పులనుట కంటె మన కీవిషయము తెలియదనుట మంచిదని నాభావము. కాయము పరిశుద్ధముగనున్న నే మనస్సుకూడఁ బరిశుద్ధముగ నుండుననుట సాధారణనియమము. విశేషవిధు లుండవచ్చును. అవి యిట ననవసరములు. జనసామాన్యమునకు దేహము పరిశుద్ధముగా నుండవలయు నన్న సూత్రము సమంచితం బె యగును. దానిచే నాత్మ యించుక శుచితం గాంచును. సదాచారము, నియతపదార్థభోజనము, యుక్తప్రవర్తనము లోనగునవియు మనస్సును మంచిస్థితికిం దేఁగలవు. కాఁబట్టి శ్రీవారి నిత్యము చేయఁదగిన కృత్యములను దెల్పెను. ఈరీతి నాచరించువాఁడు కృతకృత్యుఁడు కాక తప్పదు. భక్ష్యపదార్థములు, నభక్ష్యపదార్థములును జెప్పఁబడినవి. అభక్ష్యపదార్థములు దుఃఖరోగములఁ బుట్టించును. కాననే వాని మానవలయునని శాస్త్రనియమము. మఱియు కృష్ణమూర్తి నందునకుఁ జేయఁదగు కార్యముల నొక్కి చెప్పెను. అన్ని కార్యములకంటె ముందుగా భగవంతుని ధ్యానించి పిదప నేకార్యమునకైనఁ గడంగుమని యుపదేశించెను. దీనింబట్టిచూడ నీయుపదేశరూపమున మానవులకం దఱికినన్శ్రేయము లగునన్న యూహాహారికిం గలదనిపొడకట్టెడు.

శివపూజామహిమము తెల్పఁబడినది. శివునకుఁ దనకు నభేదమని యుపదేశించెను. ప్రకృతి యన నెవ్వతయో తెల్పెను. దీనింబట్టిచూడ శక్తియన్నఁ బార్వతియే యనుమూఢభావమున శాక్తముందెగడు దురభిమానులవాదము నిస్సారమని తెల్లము కాకమానదు. ఆమె తనయవతారముల నన్నితావుల నిల్పెనని యిందువలన స్పష్టమగును. దీనింబట్టి గట్టిగాఁ బరికింప భగవంతుఁ డాయాలోకముల లోకపాలనముచేయ స్వమూర్తుల నానారూపంబుల నునిచెననియుఁ బ్రకృతియు భగవంతుని మనశ్శక్తియే గాన నాయారూపములకుఁ దగినరూపము నామము ధరించి భగవంతు నెడఁబాయకయుండి లోకవ్యవహారమును సాగించుచున్నదనియుఁ బరమేశ్వరుఁడు నిర్లిప్తుఁడై తనయిచ్ఛాశక్తి యగుప్రకృతి తనసాన్నిధ్యబలమున సకలకార్యములు చేయుచుండఁ దాను సాక్షిమాత్రుఁడై యుండుననియు స్పష్టముకాక తప్పదు. ఇట్లు భగవంతుఁ డుపదేశింపఁగాఁ గన్నులార నాగ్రంథములం జూచుచుండియు వ్యక్తిని బురస్కరించుకొని పక్షపాతముచూపుట దూషించుటయను నీక్రూరకార్యముల కన్నఁ జేయదగనికార్యము వేఱొకటిలేదని తోఁచెడిని. ఇట్లు మతాభిమాన మనుపాపమునఁ బరదైవమును దూషించుట యెట్టియసంగతమో యోజింపుఁడు.

ఒక్కతత్త్వముప్రపంచమున బహుధా వెలసినపుడు అందొక్కవ్యక్తిని భూషించి వేఱొక్కవ్యక్తిని దూషించిన నేమి పురుషార్థమో తెలియఁజాలకయున్నవాఁడను. వేదములుసకల

శాస్త్రములు పురాణేతిహాసము లొక్కరీతిగా సర్వవ్యాపియై యున్నవాఁడుచుఁడీ భగవంతుఁడని నెత్తిన నోరుపెట్టుకొని చెప్పుచుండఁగా మనకేల యీ తెలివితక్కువ కుదురవలయునో తోఁపకున్నది. పరమతముల దూషించుట స్వమతమును వినుతించుచుండుట యనునివి రెండును మతస్వరూప మెఱుంగనికుమతి యగునాస్తికాభాసుని లక్షణములని నెమ్మదినమ్ముచున్నవాఁడను. అంతియగాని దీనఁ బురుషార్థములేదు. ఇది ధ్రువము. దీనింగూర్చి పెంచి వ్రాయనేల? దానములవిషయ ముపదేశించుచు శ్రీహరి బ్రాహ్మణునికే దానము లిమ్మని తెల్పెను ఏలయను ప్రశ్నము రాక మానదు. భగవంతుని దృష్టియందు జాతిభేదములు లేవు. పక్షపాతములేదు. అట్టిభగవంతుఁ డేల దానములు బ్రాహ్మణునికే యీవలయునని విధించెను? అనఁగా నిందు రహస్య మేమియు లేదు. భగవదాజ్ఞారూపములగు శ్రుతిస్మృతులనునమ్మి వానింబఠించుచు, వాని లోకమున వ్యాపింపఁజేయుచు, వానియందుఁ జెప్పఁబడినరీతిఁ దానాచరించుచు, నితరుల నాచరింపఁ బ్రోత్సహించుచు, నిరంతర మాకృషియందే నిమగ్నుఁడగుట బ్రాహ్మణుఁడు తక్కినజాతులచేఁ బోషింపఁదగినవాఁడని భగవదుద్దేశమని తోఁచెడిని.

శ్లో. ఊర్ధ్వం నాభేర్మేధ్యతరః పురుషస్సంప్రకీర్తితః,
తస్మాన్మేధ్యతమం త్వస్య ముఖముక్తం స్వయం భువా. ౯౨.
ఉత్తమాంగోద్భవాజ్జ్యైష్ఠ్యాద్బ్రహ్మణశ్చైవ ధారణాత్,
సర్వస్యైవాస్య సర్గస్య ధర్మతో బ్రాహ్మణః ప్రభుః. ౯౩.

మనుస్మృతి. ౧ అధ్యా.

అని మనువు శాసించెను. అట్టివాఁ డితరుఁ డైన దానార్హుఁడు కాఁడా యన్నప్రశ్నమునకు నర్హుఁడే యని సమాధానము చెప్పక తప్పదు. విప్రుఁడు పైహేతువులంబట్టి పూజ్యుఁడే కాని వేఱుకారణములతోఁ గాదనియే సిద్ధాంతము. జాతిగౌరవము ప్రాచీనము కాదు. అది నవీనము. ప్రధానగౌరవము భూతహింసమానుట, మాంసభక్షణము వదలుకొనుట యనునీమొదలగుకారణములచే లభించినదనుట నిర్వివాదాంశము. అట్టివి లేక జాతిమాత్రముననే మర్యాదను బడయఁగోరినచో నది యతనిలోపమే యనవచ్చును. ఇట్టు లీభగవదుపదేశము సర్వప్రకారముల లోకమున కుపకరించుచున్నది. దీనిని శ్రద్ధమైఁ బఠించి యభ్యసించినఁ గృతార్థుఁ డగును.

ఇంక నీవిషయమును వదలి శ్రీహరి నందునకుఁ దర్వాత నేమి యుపదేశించెనో పఠింతము.

## దర్శింపఁదగువస్తువులనిర్ణయము.

* భగవంతుని యుపదేశవాక్యముల విని నందుఁ డానందపరవశుఁడై శ్రీకృష్ణా! ఏవస్తువులదర్శించినఁ బుణ్యమబ్బును? వేని దర్శించినఁ బాప మలవడును? సర్వేశ్వరా! ఈవిషయమును దెలిపి నన్నుఁ గృతార్థుం జేయుమా. అది వినవిన వేడుకయ్యెడిని. అన విని శ్రీకృష్ణుఁ డిట్లు తెల్పెను. సాధువులగు బ్రాహ్మణులను, తీర్థములను, విశేషించి విష్ణుభక్తులను దర్శించిన

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము డెబ్బదాఱవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినదని తెలియందగు.

మానవుఁడు దేవతాప్రతిమలను జూచినవాఁడును దీర్ఘస్నానము చేసినవాఁడునగు. భక్తిచే సూర్యునిగాంచినను, బతివ్రతలదర్శించినను, సన్న్యాసులను యతులను జూచినను,బ్రహ్మచారులంగనినను,నిరుపమభక్తిచే గోవహ్ని గురువులసందర్శించినను, గజేంద్ర సింహశ్వేతాశ్వశుకపికఖంజనహంసమయూరచాషశంఖపక్షులం గనుంగొనినను, దూడలతోఁగూడి యున్న ధేనువులఁ బొడఁగనినను, అశ్వత్థవృక్షములఁ బరికించినను, బతిపుత్రులం గలిసియున్న పురంధ్రులఁబరికించినను, తీర్థయాత్రలకరుగు నరులఁగనినను, ప్రదీపదర్శనముచేసినను; సువర్ణమణిముక్తాహీరకమాణిక్యతుల సీశుక్లపుష్పములను జూచినను బాపములు నశించును. పండ్లు, శుక్లవర్ణ ధాన్యములు, దధిఘృతములు, మధువు, పూర్ణకుంభము, పేలాలు, దర్పణము, జలము, తెల్లనిపూవులదండ, అనువీనిం జూచినఁ బుణ్యముగల్గును. గోరోచనము, కర్పూరము,రజతము, సరోవరము, పూవులుగలయుద్యానమును బ్రీతియు భక్తియుఁ బెనఁగొనుమదితో దర్శించిన సుకృతముగలుగు. శుక్లపక్షచంద్రుని, పీయూషమును, చందనమును, కస్తూరిని, కుంకుమమును గాంచిన మహాసుకృతముగల్గును. పతాకలను, అక్షయవటవృక్షమును, ఉత్సవార్థము వెడలినదేవతను, దేవాలయమును గనుంగొనఁ బవిత్రుఁడగు. దేవాశ్రితభూమిని, దేవఘటమును, పరిమళపవనుని, శంఖమును, దుందుభిని గాంచిన సుకృతము గలుగును.

ముత్తెపుఁజిప్పయు, పవడము, స్ఫటికము, కుశమూలము, గంగామృత్తికయు,కుశయుఁ,దామ్రము,పవిత్రతనొసంగుపదార్థ

ములు. పురాణపుస్తకము, పరిశుద్ధమై బీజసంయుతమగు విష్ణుయంత్రమును, స్నిగ్ధదూర్వాక్షతలును, రత్నములను జూచినవరుండు పవిత్రస్వాంతుఁ డగు. మునివరు లుపాసించిన సిద్ధమంత్రముగలపాత్రము, సముద్రము, కృష్ణసారము, యజ్ఞము, మహోత్సవము, ననునివి పరిశుద్ధవస్తువులు. మనోహరాంగమున నలరి న్యగ్రోధపరిమండలయై తగుపదాఱేండ్లయీడుగల పద్మినీజాతికాంతను, దర్శించి యామె వేషమును భూషణములను భక్తితోఁ గాంచిన శుభఫలము లలరు. ఇతరుల క్షేమములఁ గోరువేశ్యను, గంధమును, సుదూర్వాక్షతతండులములను, సిద్ధాన్నపరమాన్నములను దర్శించిన మేలుగలుగు. కార్తికపూర్ణిమాతిథియందుఁ బరమశుభప్రదయగు రాధాదేవీప్రతిమను దర్శించి పూజించి నమస్కరించినఁ బునర్జన్మము గలుగదు. ఆశ్వయుజ శుక్లాష్టమియందు శ్రీ దుర్గాప్రతిమను దర్శించిన జన్మదుఃఖము మరలఁ గలుగదు. శ్రీ కాశీనగరమున మహాశివరాత్రియందు శ్రీవిశ్వనాథుని దర్శించి యుపవసించి పూజించినవారికిఁ బునర్జన్మదుఃఖము కలుగదు. భక్తుఁ డెవ్వఁడు జన్మాష్టమీదినంబున బిందుమాధవుఁ డనఁబరఁగు నన్ను దర్శించి విధివిహితపూజలఁ నొనరించునో వానికిని బునర్జన్మము కలుగదు. పౌషమాసమున శుక్లపక్షమున రాత్రియందు నేయేస్థలములంగాని పద్మాప్రతిమను దర్శించిన జన్మము నొందఁడు. అంతియగాక యేడుజన్మములవఱకు నాతనియింటఁ శ్రీదేవి నివసించును. పుత్రపౌత్రు లలరుచుందురు.

ఏకాదశియం దుపవాసముచేసి ప్రభాతముననే స్నానముఁ జేసి ద్వాదశీదినమున శ్రీకాశియం దన్నపూర్ణాంబను దర్శించిన మరల జన్మము కలుగుననుట కల్ల. చైత్రమాసమునందుఁ జతుర్దశియందుఁ గామరూపములయం దుత్తమోత్తమమగు భద్రకాళిరూపమును గాంచి నమస్కరించినను మరల భూతలమున జన్మము లభింపదు. అయోధ్యానగరమున శ్రీరామనవమీ దినమునందు శ్రీరామచంద్రుని దర్శించి పూజించి నమస్కరించిన జన్మదుఃఖము లేదు బదరికాశ్రమమునఁ బుష్కరతీర్థమున స్నానమొనరించి యుపవసించి యేకరూపుఁడ నగునన్ను దర్శించి పూజించిన మరల నాభక్తుఁడు భూతలమున బుట్టువును గాంచఁడు. విష్ణుపాదమునందుఁ బితరుల నుద్దేశించి పిండముల నిడి యెవఁడు విష్ణువును బూజించునో వాఁడు మరలఁ బుట్టఁడు. ప్రయాగక్షేత్రమున క్షౌరముచేయించికొని యథాశక్తి దానమిచ్చినను నైమిశారణ్యమున నుపవాసవ్రత మూనినను జన్మము లేదు. బదరికాశ్రమమున నెవఁడు బదరీనారాయణుని బూజించి భుజించునో అందున్న నాప్రతిమను దర్శించునో వానికిఁ బునర్జన్మము లేదు.

బృందావనక్షేత్రమునందు డోలోత్సవమున నొప్పారు తఱి నన్ను దర్శించి నమస్కరించి పూజించిన జన్మము మరల లేదు. భద్రయోగమునందు మధుసూదననామమున నలరు నన్ను మంచస్థునిగాఁ గాంచినఁ బునర్జన్మము లేదు. కలియుగమున జగన్నాథక్షేత్రమున రథమునందున్న నన్నుం గాంచి నమస్కరించి

పూజించినభక్తునకు మరల జన్మముగల్గు ననుట యసత్యము. ఉత్తరాయణమునఁ బ్రయాగయందు స్నాన మాచరించి నన్ను భక్తిం బూజించి వందనమొనరించిన జన్మము వడయఁడు. కార్తిక కపూర్ణిమయందు సకలశుభముల నొసంగు నాప్రతిమను భక్తి భావమున సందర్శించి పూజించినను గృతకృత్యుఁడగును. చంద్రభాగచెంతనున్న నన్నును రాధాంబికను గాంచి పూజలఁ దన్పినను ముక్తి లభించును. ఆషాఢపూర్ణిమాదినమున సేతు బంధక్షేత్రమున రామేశ్వరుని బూజించి యొక్కదిన ముపవసించినను ముక్తి గలుగును.

స్వర్గలోకమున రాత్రులయందు విద్యాధరులు ప్రతి దినము వదలక నర్తనము చేయుచుందురు. వారిభక్తిం గాంచఁ గోరి విభీషణుఁ డచటికిం బోవుచుండును. గంధర్వులు కిన్నరులు రాత్రులయందు గానముచేయుచుందురు. వారికి నమస్కారము చేయఁబూన నతనిదగ్గరకు మాధవుఁడే యరుదెంచును. సాతా ద్వీపంతునిగా భావించి సర్వేశ్వరుండనగు నన్నేవఁడు దర్శించునో చంద్రశేఖరుని దర్శించి పూజించునో వాఁడు జీవన్ముక్తుఁ డగు. అంతమున హరిమందిరమున కరుగును. కోణార్కక్షేత్ర మున నుత్తరాయణమున నుపవసించి దీననాథుఁడగు దినకరుని దర్శించి యర్చించిన జన్మము మరలఁ గలుగదు. కృషికోష్ఠ, కల వింక, విస్పందక రాజకోష్ఠ నందకము లనునీక్షేత్రములయందుఁ బార్వతీప్రతిమను, కుమారగణనాయకులను నందికేశుని, శంక రుని దర్శించినఁ బునర్జన్మభయములేదు. పూర్వోక్తక్షేత్రముల

యం దుపవసించి పార్వతీపరమేశ్వరులను బూజించి పారణము నాఁడు దధిని గ్రహించిన జన్మదుఃఖము పాయును. త్రికూట మణిభద్రములందును బశ్చిమసముద్రతీరమందు నుపవసించి దధిని బారణమునాఁడు గ్రహించుమానవుఁడు నాయనుగ్రహమునకుఁ బాత్రుఁడై ముక్తినొందును.

నాప్రతిమలయందును బార్వతీప్రతిమలయందును జీవము నునిచి పూజించినఁ బునర్జన్మము లేదు. శివునకు దుర్గాదేవికి నాల యములు గట్టించి విశేషించి నాకు నాలయములు కట్టించి శివ లింగమును స్థాపించిన యాతఁడు పృథ్వియందు మరలఁ బుట్టఁడు. పుష్పోద్యానమును శంకువును సేతువును ఖాతమును సరోవర మును విప్రబాలునకు నుపనయనమును జేయువారు జన్మమును మరల నొందరు. వేదములు పురాణములును బ్రహ్మసంస్థాపన ఫలమును దెలియఁజాలవు. ఇఁక మునులు లోనగువారు తెలియఁ గలరనుట నిక్కమా. తత్పుణ్యము గణింప శక్యముకానిది. బ్రాహ్మణునకు జీవనము కల్పించిన ముక్తినొందును. అచలమగు నైశ్వర్యమును బొందును. తుదకు మద్దాస్యమును బొందఁ జాలును. వైకుంఠమునుండి మరలఁ బాతములేదు. నారూప మెట్లు శాశ్వతమో యట్లు శాశ్వతముగా నాతనిరూప ముండును.

ఎనిమిదియేండ్లప్రాయముగల కుమారిక నెవ్వండు సద్విప్రున కొసంగునో శక్తికను రూపముగా నాకన్యక కలంకారము లిడునో వాఁడు దుర్గాదానఫలమునొందు. అంతియగాక వాఁడు

స్వర్గలోకసుఖముల ననుభవించి బ్రహ్మలోకములం బూజితుఁడై తుదకు నాదాస్యము లభింప వైకుంఠమునఁ జిరకాలముండును. అట్టివివాహమును బ్రీతిమీఱ దర్శించినను మహాపుణ్యఫలము లభించును. నిశ్చలశ్రీని బడయును. సద్బ్రాహ్మణుఁడై యనాథుఁడై దరిద్రుఁడై పండితుఁడగువానిం గాంచి వివాహము చేసిన ముక్తిలభించుట యరుదా. ఛత్రమును, పాదుకలను, సాలగ్రామమును, గన్యకను, బవిత్రదినమున దానమిచ్చిన సకల భూదానఫలము లభించును. గజమును దానమిచ్చిన దానిలోమ సంఖ్యాసమానవర్షములు నామందిరముననుండును శ్వేతతురగ దానము గజదానఫలార్ధమని పెద్దలు పరిగణింతురు. తక్కిన రంగులుగల గుఱ్ఱముల నిచ్చిన నం దర్ధఫలము లభించును. నల్లని యావును దానమిచ్చిన గజదానతుల్యఫలము గల్గును ధేను దానము తత్తుల్యము. సామాన్యగోదానముచేసినఁ దదర్ధ ఫలము గల్గును. సవత్సలగుగోవుల దానమిచ్చిన ఫల మధిక మగుచుండును. భూదానముచేసిన రేణువులసంఖ్యకు సమాన వర్షములు నాలోకమున నుండఁగల్గును. జ్ఞానదానము మహాపుణ్యము. స్వర్ణదానమున నైశ్వర్యము లభించును. రజత దానమున రాజత్వము గల్గును. అన్నదానమునఁ గలుగుఫలము నింతయని వచింప నాకే శక్యముకాదు. అందును బ్రహ్మజ్ఞాన సంపన్నుల కన్నమిడిన సర్వదానఫలము లభించును. అన్నదానమునకంటె నధికతరదానము భూతభవిష్యద్వర్తమానకాలములలో లేదు, లేదు, లేదు. అన్నదానమున వీఁడు పాత్రుఁడని

పీఁడపాత్రుఁడని యెన్న నవసరము లేదు. కాలనియమ మక్కఱ లేదు. అన్నదానమునకుఁ బాత్రుఁడు పాపకార్యములఁ జేయని వాఁడే. అన్నదాతయే ధన్యుఁడు. వైకుంఠవాసమున కర్హుఁడు. విప్రునకు వస్త్రదానముచేసిన మేలు. అందును దరిద్రుఁడై కుటుంబియగువాని కిచ్చిన వైకుంఠము లభించును నిర్మలచంద్ర లోకము వరుణలోకము కల్గును.

లోహపాత్రమున బంగరువత్తి నునిచి దీపదానము చేసినను, అందు గోవునెయ్యి యిడినను హరి పరమేశ్వరుఁడు తృప్తి నొందును. అంధకారగృహము యమలోకము నాతనికిం గానరాకయుండును. ఆతఁడు యమునిజూడకయే నామందిరమున నుండఁజను. అది బ్రాహ్మణున కిడినచో యమయాతనల నెప్పటికిని బొందఁడు. శక్రమందిరమున నుండును. తాంబూలదానము భోగప్రదము. పుష్పమాలాదానము స్వర్గప్రదము. ఫలదానము నాకసుఖప్రదము. సామాన్యశయ్యాదానము నూఱువర్షములు స్వర్గమును దాతకుఁ గల్పింపఁగలదు. సుఖకరశయ్యాదానము చతుర్గుణఫలము నీఁజాలు. విలక్షణశయ్యాదానము లక్షగుణ ఫలము నొసంగు. దిక్కులేనిబీదబ్రాహ్మణునకు గృహదానము చేసిన నసంఖ్యవత్సరములు శక్రలోకముననుండు. ఆఁకలిగొన్న ద్విజునకుఁ బ్రీతిమీఱ నన్నముపెట్టిన నిశ్చలలక్ష్మి గలుగును. పుత్రపౌత్రసంపత్తు లభించును.

అనిపలికి శ్రీహరి నందునిం గాంచి కరుణారసభరితాంతఃకరణుఁడై యిట్లనియె. వ్రజనాథా! వ్రజమున కరుగుము. వ్రజ

మున సద్విప్రులకు నన్నదానముచేయుము. సకలదానములు వ్రజాంగణమున నొనరింపుము. నిరాకులమగు గోపకులమున నివసింపుము. గోకులము వ్యాకులము గాకయుండఁ గాపాడుము. నందభూమిపాలకా! పుణ్యవర్ధనమగు నీచరిత్రమును దెల్పితిని. సుస్వప్నముగలిగినపుడు నీచులకు దానిం దెల్పక జ్ఞానకిం దెల్పవలయును. మఱియు సుస్వప్నమున దేవాలయమునందును వాపికయందును నశ్వత్థవృక్షముకడ, తులసీవృక్షమునందును వటవృక్షముచేరువ నెవ్వరు వినకుండఁ దెల్పిన దాని ఫలము ద్విగుణమగును. ఎవ్వరికిం దెలుపక మదినుంచిన నాల్గింతలుగా ఫలము కల్గును. సుస్వప్నము గంగాస్నానఫలము నిచ్చును. సకలశుభము లాతనికిం గల్గును. తండ్రీ! నీవు కోరిన విషయమును దెల్పితిని. ఇంక నేమి వినఁగోరెదవో తెల్పుమని హరి యడిగిన నందుఁ డిట్లనియెను.

ఆర్యులారా! చూడఁదగినపదార్థము లెవ్వియను నందుని ప్రశ్నమునకు శ్రీహరి చెప్పినసమాధానమును బరికించితిరి కదా. దీనిసార మింతకుముందే చెప్పఁబడినది. విశేషించి పెంచివ్రాయ నక్కఱలేదు. కాన యిన్నితావులలో దేనిని దర్శించినను మహాఫలము గలదనఁగా భావమేమన్న ప్రశ్నము రాకమానదు. ఇన్నిపవిత్రస్థానములలోఁ బెక్కుమంది దేవతలప్రతిమలు కలవు. అందు దేనినిగాంచినను జాలునని పలుతావులఁ జెప్పఁబడినది. ఇదియే భగవంతునిసర్వభూతదయాళుత్వమును దెలుపువిషయము. సర్వరూపముల, సర్వనామ

ముల సర్వస్థలముల నిండియుండువాఁడను నేనే యని తెలిపెను. ఇది సర్వసమత్వమును దెలుపుటలేదా. ఇంతకన్న భగవంతుఁ డేమి తెలుపవలయును? సర్వమతసార మిదియే. ఏభక్తుఁడే దేవత నేస్థలమున దర్శించి భక్తిపూర్ణహృదయుఁడై పూజించిన విను తించిన నమస్కరించిన నాలోకమున వసించుభాగ్యము కలుగు నని శ్రీకృష్ణుఁడు తెలిపెను. వేఱొక్కవిధమున శ్రీహరి తెలు పఁబూననా.

శ్లో. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్. ౩౯
నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ౪౦
యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్. ౪౧
అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. ౪౨

భగవద్గీత. ౧౦ అధ్యాయము.

అని భగవంతుఁడే తెలిపెనుగదా. సర్వరూపములు, సర్వనామ ములు, నావియే యనఁగా మద్భిన్నము లోకమున వేఱొండు లేదనికదా తాత్పర్యము. ఇట్టులుండగా నేభక్తుఁ డేమూర్తి నారాధించిన నేమి? ఉత్తమమధ్యమాధమభావములు కల్పిత ములు కాని వాస్తవములు కావనియు, నట్టికల్పన మంచిది కాదనియు నమ్మఁదగును. ఇట్టులుండఁగా మాదైవ మెక్కుడు

మీాదైవము తక్కువ యను కువాదము లేటికో తెలియఁ జాలకున్నాఁడను. శ్రీకృష్ణపాదారవిందముల విడువక భక్తి మై సేవించువైష్ణవుఁడు, శంకరచరణాంభోరుహముల సదా భజించుశైవుఁడు, త్రిపురాంబికాపదసరసిజముల శిరమునఁ దాల్చుశాక్తుఁడు, గణనాథునియంఘ్ర్యంబుజముల నమ్మినగాణాపత్యుఁడు, భాస్కరుపాదపద్మముల నెమ్మది నమ్మి సన్నుతింబూజించుసౌరుఁడు, భైరవపదంబుజాతముల నారాధించుకాపాలికుఁడు నీయాఱుగురును నిష్కపటభక్తిభావము కలవారే యైనచో సమానఫలములఁబొందుదురు. ఏలయనఁగా నీయాఱు నిట్టివి కోటులుగా నుండు నామరూపముల వెలసినవాఁ డొక్క భగవంతుఁడే కనుక నందఱును సమముక్తిని బొందుదురు. ఇది నిశ్చయము. భగవంతుఁడు సర్వాంతర్యామి కాఁడన్న వా రుండిన నపుడు వేఱురీతిగా సమాధానము చెప్పవచ్చును. కాని యావాదముచేయుమహాత్ములు కానరారు. కావున నింకొక్క సమాధాన మనవసరము. ఒక్కమాట: శంకరనామమున భక్తరక్షణార్థము సగుణరూపమున్న యాపరాత్పరుఁడు నన్ననుగ్రహించుఁగాక యనిమాత్ర మాభక్తుఁడు ధ్యానింపవలయు. అట్లుగాక త్రిమూర్తులలో నధికుఁడగు శంకరుని సేవించెదనని ధ్యానించిన నాతనికి ముక్తిదొరకదు. దేవతాతారతమ్యము పనికిరాదు. అది స్వక్షేమభంగకరము కాని సుఖకరముకాదు. మాఁటికి మున్మాటికిని గాదు, కాదు, కాదు, కాదు. దేవతాద్వైతము మది నెలకొన్నవాఁడు తరించువాఁడు. అట్టివానికి

మతభేదములు మంచివని తోఁపవు. స్వమతమే యుత్తమము. పరమతము తుచ్ఛము. అని యెవనిమదినుండునో వాని కేనాఁటి కిని ముక్తిలేదు. భగవత్కృప యాతనిపైఁ బ్రసరింపదు. ఈతఁడు పరిపక్వజీవుఁడు కాఁడని భగవంతుఁ డెఱుంగును. కావున మహాత్ములారా! మతవైషమ్యముల మాని వానిద్వారా అలవడిన దేవతాదూషణ మొనర్చుపాపకార్యమును మాని యేదేవతయందు భక్తికుదురునో ఆదేవతనే నమ్మి యితరదైవముల దూషింపక భగవదనుగ్రహమును బడయఁ దత్ప్రియత్న మొనరింపుఁడు. ఊరక లేనిపోనివాదములఁ బ్రొద్దుపుచ్చుచుఁ గాలమును వ్యర్థము చేయకుఁడు శ్రీకృష్ణపాదారవిందముల నెఱనమ్మి సేవింపుఁడు. శ్రీకృష్ణపరబ్రహ్మనామమును స్మరింపుఁడు. మాఁటికి మాటికి స్మరింపుఁడు. ఇంతకంటె మించినపూనికఁ బెంచిన్రాయ నుంకింపక తరువాతికథను విన్నవించెదను.

## స్వప్నఫలనిరూపణము.

* భగవంతుఁడగు శ్రీకృష్ణుఁ డిట్లు వివరింపఁగా విని నందుఁ డానందపరవశుండై వాసుదేవుం గనుంగొని యెట్టిస్వప్నమున నెట్టిఫలము కలుగును? ఎట్టిపుణ్యము లభించును? ఏస్వప్నము సుఖదాయకము? సుస్వప్నమనున దెట్టిది? వివరించి నన్నుం గృతకృత్యుంజేయుమా యన నాతనిప్రశ్నమునకుఁ దగినసమాధానమును జెప్పఁదలఁచి శ్రీకృష్ణుం డిట్లు పలికెను. వేదముల

* ఇదియుం శ్రీకృష్ణజన్మఖండము డెబ్బదియేడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపందగు.

యందు సామవేదము సర్వకర్మములయందును ప్రశస్తము. కణ్వ శాఖయందు మనోహరమగు పుణ్యకాండము కలదు. అందు దుస్స్వప్నము లేవియో సత్ఫలముల నొసంగుసుస్వప్నము లేవియో వివరింపఁబడినవి. ఆవిధమంతయు నెఱింగించెద. సావధానముగా వినుము. మిగులఁ బుణ్యఫలముల నొసంగుస్వప్నాధ్యాయమును వివరించెదను. దీనిని వినుమానవుఁడు గంగాస్నానపుణ్యము నొందును.

స్వప్నము ప్రథమయామమునందు వచ్చిన నాఫలము సంవత్సరమువఱకుండు. రెండవజామునఁ దోఁచినచో నెనిమిది నెలలవఱకు ఫలము గలుగును. మూఁడవజామున వచ్చిన స్వప్నము మూఁడునెలలదనుక ఫలము నీయఁజాలు నాల్గవజామున స్వప్నమువచ్చినది పదునైదుదినముల దనుకఁ దన ఫలము నీయఁగలదు. అరుణోదయకాలమున వచ్చిన స్వప్నము పదిదినములవఱకు ఫలము నీఁజాలును. ప్రాతఃకాలమునఁ గల వచ్చిన నప్పుడే ఫలించును. పగటిపూట స్వప్నముతోఁచినచో నది తప్పక ఫలించును. ఏమనుజుఁడు చింతావ్యాధిసమాయుక్తుఁడై స్వప్నమును గాంచునేని తంద్రీ! యది నిష్ఫలమగును. సంశయములేదు. జడుఁడు, మూత్రపురీషపీడితుఁడు, భయాకులుఁడు, దిగంబరుఁడు, తలవిరియఁబోసికొనినవాఁడు స్వప్నమును గాంచిన నాస్వప్నము ఫలవంతము కానేరదు.

ఎవఁడు స్వప్నమును గాంచి నిద్రాతురుఁడై మరల నిద్రించునో, లేక మూఢుఁడై ఆరాత్రియందే నాకిట్టి కలవచ్చిన

జని చెప్పునో వాఁడు దానిఫలమును గాంచలేఁడు. కాశ్యపగోత్ర మునుజెప్పిన విపత్తునొందును. దుర్గతియందున్న వాఁడు మిగుల దుర్గతినొందును. నీచుఁడు వ్యాధిపీడితుండగును. శత్రుభయ ము గల్గును. మూర్ఖునియందది లభించినఁ గలహముగును. కామి నియందు ద్రవ్యహాని గల్గించును. రాత్రియందుఁ జోరభయ మును గల్గఁజేయును నిద్రయందు శోకమును గల్గించు. పండితు నందది వాంఛితఫలముల నీఁగల్గును. స్వప్నము బయలుపఱుప రాదు. పండితులతోడను జెప్పరాదు.

నందరాజా! గోకులమున కరుగుము. గోవులను, గుంజ రములను, హయములను, ప్రాసాదములను, పర్వతములను, వృక్షములను, ఎక్కినట్లు కలగాంచినయెడలను, భోజనముచే యుచున్నట్లు చూచినను, రోదనముచేసినను, వీణియను బ్రతి గ్రహించినను, సస్యసంపూర్ణయగు భూమిని బడయఁగలఁడు. శస్త్రాస్త్రములచే బాధితుఁడై వ్రణపీడితుఁడై, కృమిబాధితుఁడై రుధిరముచేతను మలముచేతను బాధితుఁడై నట్లు కలగాంచినఁ దప్పక ధనలాభము గలుగును. స్వప్నమున నగమ్యాగమనము చేసినను, భార్యనుబడసినను, మూత్రములో మునిఁగినను, శుక్ల ముత్రాగినను, నరకమునఁ బ్రవేశించినను, నగరమునుజొచ్చినను, రక్తములో మునిఁగినను, సముద్రప్రవేశము చేసినను, సుధా పానముచేసినను, శుభవార్తను వినఁగలఁడు. ద్రవ్యలాభ మా తనికిం దప్పక కల్గును. గజమును, రాజును, సువర్ణమును, వృష భమును, ధేనువును, దీపము, నన్నమును, బుష్పఫలములను,

కన్యకను, ఛత్రమును, రథమును, ధ్వజమును స్వప్నమునఁ జూచినచో మంచిభార్య లభించును. మంచికీర్తి గల్గును. ఐశ్వర్యము గల్గును.

నిండుకుండను, ద్విజుని, వహ్నిని, పుష్పతాంబూలమందిరములను, తెల్లనిధాన్యమును, నటుని, వేశ్యను స్వప్నమునఁ జూచిన భాగ్యముకలుగును. ఆవుపాలు, నెయ్యినిజూచిన ద్రవ్యమును బొందును. తామరపాకునందుఁ బరమాన్నమును, పెరుగు, పాలు, నెయ్యి, తేనె, మిష్టాన్నము ననువీనిలో దేనినేని భుజించినట్లు కలగాంచినచో వాఁడు రాజగును. సత్యము. పక్షిమాంసమునుగాని మనుష్యమాంసమునుగాని దినినట్లు కలగాంచినయెడల మహాద్రవ్యలాభము, శుభవార్తాశ్రవణము, సకలేష్టములు లభించును. గొడుగును, పాదుకలను, ధాన్యమును బడసినట్లు కలయందుఁ దోఁచినను, దీక్ష్ణమయి నిర్మలమగుఖడ్గము దొరకినట్లు తోఁచినను దత్ఫలమట్లే కలుగును. విలాసముమీఱ నదిని దాఁటినట్లు కలవచ్చిన వాఁడు మంత్రియగును. ఫలములతోనిండిన వృక్షమును గాంచిన నిశ్చయముగా ద్రవ్యలాభముగలుగును. పాముతన్నుదినినట్లు కలయందుఁ దోఁచిన ద్రవ్యలాభము కలుగును. స్వప్నమున రవిచంద్రులలో నెవరిని గాంచినను వ్యాధిబాధితుఁడు కాఁడు. ఆఁడుగుఱ్ఱమును, ఆఁడుకోడిని, ఆఁడుకొంగను దర్శించినఁ జక్కనిభార్య దొరకును. సంకెళులు తన్ను బంధించినట్లు కలగాంచినయెడలఁ బ్రతిష్ఠను బుత్రులను బడయును. నదీతీరమునందుఁ గూరుచుండి పద్మపత్రమునందు దధ్యన్నమునుగాని పాయసమునుగాని భక్షిం

చినయెడల, ఆపద్మము ప్రాఁతదియైయున్నయెడల నాతఁడు తప్పక రాజగును, జలౌకమును (జెలఁగ) తేలును, సర్పమును జూచిన ధనపుత్రవిజయప్రతిష్ఠలు వానికిం గల్గును. శృంగముగలజంతువుల చేతను, కోఱలుగలజంతువుల చేతను, పందుల చేతను, కోఁతుల చేతను, బీడింపఁబడినట్లు కలగాంచిన మానవుఁడు రాజగును. ద్రవ్యలాభమువిశేషించికల్గును. మత్స్యమాంసమౌక్తికములను, శంఖమును, జందనహారకములను స్వప్నము తుది నెవఁడు చూచునో వాఁడు విశేషభాగ్యవంతుఁడగును.

తనయుని రక్తమును సువర్ణమును మలమును భక్షించినట్లు కలగాంచిన ధనము దొరకును. దేవతాప్రతిమ, శివలింగము దనకు దొరకినట్లైన జయము ద్రవ్యము కల్గును. ఫలవృక్షమును దేనింగాని, బిల్వచూతవృక్షములనుగాని చూచిన యెడల నైశ్వర్యవంతుఁడగును. మండునగ్నిం జూచిన సకలభాగ్యములు లభించును. ఉసిరికము, ధాత్రీఫలము, నల్లగలువ కనఁబడిన ద్రవ్యము దొరకును. దేవతలు, ద్విజులు, గోవులు, పితరులు, లింగధారులు స్వప్నమునఁ గనఁబడి యేవస్తువు లిచ్చినట్లుండునో ఆయావస్తువులు దొరకును. శంకింపఁబనిలేదు. శుక్లవస్త్రములఁగట్టుకొని శుక్లమాల్యానులేపనములు గలిగియున్న నారీమణులు స్వప్నమున నాలింగనముచేసికొనినట్లైవనికిఁ దోచునో యాతనికి శ్రీసుఖములు గల్గును. పీతమాల్యానులేపనములు గలిగి పీతాంబరమును ధరించిన నారీతిలకము నెవఁడు కాఁగిటఁ జేర్చినట్లు కలగాంచునో వానికిఁ గళ్యాణములు గలుగును.

తెల్లనిపదార్థము లెల్ల శుభమును గలుగఁ జేయును. అందు బూడిద ఎమ్ముకలు ప్రత్తి యీమూఁడును బనికిరానివి. నల్లనివస్తువు లెల్ల నిందితము లే. అందు గోవులు, గజములు, గుఱ్ఱములు, ద్విజులు దేవతలు మంచిఫలము నొసంగునని పెద్దలు చెప్పిరి.

దేవతాస్త్రీ రత్నభూషణములు ధరించి చిఱునవ్వున నెవని యింటికి స్వప్నమున వచ్చునో వానికి వాంఛితములు సమకూరును. బ్రాహ్మణుఁడు, దేవత, బ్రాహ్మణస్త్రీ దేవకన్యక, విప్రదంపతులు చిఱునవ్వు కనంబడుచుండ స్వప్నమున నెవనికి ఫలమునిత్తురో వాని కిర్వురుకొడుకులు కల్గుదురు. ఎవ్వనికి స్వప్నమున బ్రాహ్మణజాతిస్త్రీ కనఁబడి శుభాశిషముల నిచ్చునో యేమిమాటలాడునో ఆరీతిగా ఫలము కల్గును. పరితుష్టుఁడగు బ్రాహ్మణశ్రేష్ఠుఁ డెవ్వనియింటికి వచ్చునో నారాయణమూర్తి శివుఁడు బ్రహ్మయు నెవనియింటఁ బ్రవేశింతురో వానికి సంపత్తి కీర్తులు కల్గును. పలుసారులు విజయము గల్గును. శాశ్వతసుఖము గలుగును. ఆకస్మికముగా స్వప్నమున సురభినిజూచిన భూలాభము తప్పక కల్గును. పతివ్రతయగుభార్య లభించును.

ఏనుఁగు తొండముచే నెవనిని బట్టుకొని మస్తకమున నునుచుకొనునో వానికి రాజ్యలాభము కల్గును. తప్పదు. ఇది సామవేదమునఁ జెప్పఁబడినది. ఎవనిస్వప్నమునఁ బరితుష్టుఁడగు బ్రాహ్మణుఁడు కౌఁగిలించుకొనునో వానికిఁ దీర్థయాత్ర చేయుభాగ్యములభించును. స్వప్నమున నేసరుఁడు పుణ్యాత్మునకుఁ బుష్పమిచ్చునో వాఁడు జయముగలవాఁ డగును. ధనము సుఖము

వానికిం గల్గును. కలలోఁ దీర్ఘములను సౌధములను రత్నగృహములను జూచినయెడల జయము, తీర్థయాత్ర, ధనము వానికి లభించును. పూర్ణకలశమును స్వప్నమున నెవ్వఁ డెవ్వని కిచ్చునో ప్రతిగ్రహీతకుఁ బుత్రలాభము కల్గును. సంపత్తియుఁ జేకూరును వారవనిత తాంబూలపేటికను ఆథకమును జేతనునుచు కాని యెవ్వనియింటికింబోవునో వానికి లక్ష్మీప్రసన్నురాలగును. దేవతాస్త్రీ యెవనియింటికింబోయి యందు మలవిసర్జనము చేయునో వాఁడు దరిద్రుఁడు కాక ధనవంతుఁ డగును. బ్రాహ్మణుఁడు భార్యంగూడి యెవ్వనియింటికి వచ్చునో, పార్వతీపరమేశ్వరు లెవ్వనియింటికిఁ జేరుదురో, లక్ష్మీనారాయణు లెవ్వనిమందిరమును బ్రవేశింతురో, బ్రాహ్మణుఁడునుగాని బ్రాహ్మణికాని యెవని కేమియిత్తురో వానికి సకలైశ్వర్యములు కలుగును. ముక్తాహారపుష్పమాల్యములను జందనమును స్వప్నమున విప్రుఁడిచ్చినట్లు తోఁచిన నాతనిసిరి శాస్వతస్థితిం గాంచును. గోరోచనము, పతాకయు, హరిద్రాపుండ్రేక్షుదండములు, సిద్ధాన్నము స్వప్నమున దా గ్రహించినట్టులైన శ్రీదేవి వాని యిల్లు విడనాడక యుండును. బ్రాహ్మణుఁడు వానిభార్యగాని శిరస్సున ఛత్రమునో శుక్లధాన్యమునో యునిచినట్లు కలఁగన్నవాఁడు రాజగును. స్వప్నమున నరదముపైఁ గూరుచుండి తెల్లనిమాల్యములు చందనము నలంకరించుకొని యందే దధిభక్షణము చేసినట్లు కలతోఁచినచో లేక పాయసము దిన్నట్టులైనను రాజే యగును. ఎవనిస్వప్నమున విప్రుఁడుగాని

తత్పత్ని గాని సుధనుగాని దధిగాని ప్రశస్తపాత్రమున నునిచి యెవ్వాని కిత్తురో వాఁడు భూపాలకుఁ డగును. ధ్రువము.

ఏనిమిదియేండ్లయీడుగలకుమారిక రత్నభూషణభూషితయై యెవనికిఁ దనసంతోషమును దెలుపునట్టిచిహ్నమును గనఁ బఱచునో వాఁడు కవియుఁ బండితుఁడు నగును. స్వప్నమునఁ బుస్తకము నేపుణ్యమతికిఁ గన్యకచే నీయఁబడునో వాఁడు విశ్వవిఖ్యాతకవియుఁ బండితేశ్వరుఁడు నగు. ఎవ్వనికిఁ దల్లికుమారునకుఁ జెప్పినట్టివిధమునఁ బాఠముచెప్పునో వాఁడు సరస్వతీకుమారుఁడే యగు. తత్సమానుఁడు లోకమున నుండఁడు. తండ్రివలె బ్రాహ్మణుఁడు కలలో నెవ్వని జదివించునో ప్రీతి చేఁ బుస్తకమునిచ్చునో వాఁడు విద్యావంతుఁడగును. స్వప్నమునఁ గాని మార్గమునందుఁగాని పుస్తకమును బడసినట్లైనఁ బండితుఁడు యశస్వియు నాతఁ డగును. కలలో నొకవిప్రుఁడు మహామంత్రమునుపదేశించినట్టులైన వాఁడు ప్రాజ్ఞుఁడును, ధనవంతుఁడు, గుణవంతుఁడునగు. కలలో విప్రునిగాని పాషాణమయప్రతిమనుగాని యెవ్వని కొసఁగినవాఁడు మంత్రసిద్ధుఁడగును. విప్రు లిద్దఱుగాని పెక్కుమందిగాని తా నమస్కరింప నాశీర్వదించిన ట్లెవనికిఁ దోఁచునో వాఁడు రాజేంద్రుఁ డగును. పండితుఁడు కవియునగును. శుక్లధాన్యముతోఁగూడిన భూమి నెవ్వఁ డెవ్వని స్వాధీనముచేయునో పరితుష్టుండగు నాతని దర్శించిన ట్లైన భూపాలకుఁ డగును. కలలో నొకనిని రథముపైఁ గూరుచుండఁ బెట్టుకొని విప్రుఁడు నానాస్వర్గస్థలములఁ జూపించి

నట్టులైన వాఁడు చిరంజీవియు ధనవంతుఁడు నగును. ఒక విప్రుఁడు పరితుష్టుఁడై వేఱొకవిప్రునకుఁ గన్యకనిచ్చినట్లు కలగన్నవాఁడు ధనాఢ్యుఁడగు భూపతి యగును. స్వప్నమున సరోవరమును జూచినను, సముద్రమును నదిని నదమును దెల్లని పామును దెల్లనికొండను జూచినను భాగ్యము లభించును. మృతుఁడగుమనుజునిఁ గలలోఁ జూచిన వాఁడు చిరంజీవి యగును. ఆరోగ్యవంతుఁడు రోగిని గాంచినను, దుఃఖవంతుఁడు సుఖిజూచినను, మేలుగల్గును. దేవతాకాంత యొవ్వనిం గాంచి నీవు నాప్రియుఁడవై తివని పల్కినట్లు కలగాంచి మేల్కాంచిన నాతఁడు భూపతియే యగును. కలలోఁ గాళికాంబను గాంచి స్ఫటికమాలను గైకొనినను, ఇంద్రచాపమును వజ్రాయుధమును గ్రహించినను మహాప్రతిష్ఠను బడయును. విప్రుఁడు కలలో నెవ్వనిజూచి నీవు నాదాసుఁడ వనిపలుకునో వాఁడు హరిభక్తుఁడగును. నాదాస్య మాతనికి లభించును. వైష్ణవుఁడగును. స్వప్నమునఁ దోఁచినవిప్రుఁడు హరిహరస్వరూపుఁడు. బ్రాహ్మణి కమలాదేవి, పార్వతియునగు. శుక్లవర్ణస్త్రీ దేవమాతగాని, జాహ్నవిగాని, సరస్వతిగాని యగును. గోపాలికావేషధారిణియగు బాలిక నాదేవియగురాధికయేయగు. బాలకుఁడు బాలగోపాలుఁడే యగును. అని స్వప్నవేత్తలు పలుకుదురు.

### పాపము గల్గించువస్తువులు

*నందరాజా! సుస్వప్నవృత్తాంతము నెఱింగించితిని. ఇంక

---

* ఇది శ్రీకృష్ణజన్మఖండము డెబ్బదియెనిమిదవ యధ్యాయము నుండి ప్రతిగ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

నేమి వినఁగోరెదవు? నేనేమిచెప్పవలయును? అని శ్రీహరి పలికి యూరకుండెను. నందుఁ డావిచిత్రవాక్యముల కానందమంది నందనుని భగవంతునిగా భావించి యిట్లు ప్రశ్నించెను. శ్రీకృష్ణా! లోకనాథా! సుస్వప్నవృత్తాంతమును వింటిని. ఇది సామవేదసారము, నీతిసారము. లౌకికము వైదికమునగు. ఇపుడు నేను వినఁగోరునది వేనిదర్శనమునఁ బాపము గల్గుననునదియే. ఏకర్మమున నెట్టియెట్టిపాపముగలుగును? అట్టికర్మములవృత్తాంతమును వినఁగోర్కిగలదు. నీవాక్కు సకలవేదశాస్త్రసారము. కానఁ ద్వరపడి విన వేఁడువాఁడను. నామది పరితపించుచున్నది. ఈ తాపము వాయునట్లు నాకావిషయమును దెల్పుము. నీవు వేదజనకుఁడవు. వైదికులగు సత్పురుషులకుఁ దండ్రివి. బ్రహ్మాదిదేవాధీశులకు మునులకు యోగులకును జనకుఁడవు. జగజ్జనకుఁడవు. నీముఖకమలవినిస్సృతవచనామృతము దుర్లభము. దానిచే నభిషిక్తుఁడనగు నాకు సంసారతాపములు మాయకుండునే. ఏ నీచరణాంభోజము సర్వకామఫలప్రదమగునది బ్రహ్మాదులకు స్వప్నమునందుఁగూడ దుర్లభమో యది నాదృష్టికిం గోచరించుచున్నది. నాకన్న నితరుఁడగు నెవ్వాఁడు నీపాదకమలముల దర్శింపగలఁడు? విణ్మాత్రధారియగు నీదేహము స్వకర్మవశమున నిబద్ధమైనది. ఇట్టిసుదినము మఱెన్నఁడు నాకు లభించును? బ్రహ్మాదులకు నాథుఁడవగు నీవు మహాపాపాత్ముఁడనగు నాతో సంవాదము సాగించుచున్నవాఁడవు. కృపాకరా! కృపయుంచుము. నాదోషముల నెడఁబాపుము. వత్సా!

దుర్బుద్ధినై దుర్నీతిని దేని నాచరించితినో దానినిఁ దొలఁ గింపుమా. ఏపదాంబుజమును బ్రహ్మేశానంతులు సేవింతురో, సరస్వతియు వేదములు దేనిని స్తుతింపఁజాలక యున్నవో, ఆనీపాదారవిందమును సేవించెద. అనిపలికి నందుఁడు దుఃఖార్తుఁడై విలపించుచు మూర్ఛిల్లెను. పుత్రవియోగదుఃఖ మింకను ఆతనిమదిని బాధించెను. ఆతనింగాంచి యించుక భీతి నొంది కరుణాకరుఁడుగాన శ్రీహరి ప్రయత్నపూర్వకముగా బోధింపసాగెను. ఇఁకఁ బరమాధ్యాత్మికజ్ఞానము నుపదేశించినఁ గాని యీమోహము పాయదని యోజించి యిట్లు పలికెను.

వ్రజేశ్వరా! జనకా! మూర్ఛిల్లిన లాభమేమి? బుద్ధి బలము గలిగియుండుము. శ్రద్ధధానుఁడవగుము. పరమజ్ఞానము నుపదేశించెద. ఆలకింపుము. నాయుపదేశించువిషయ మాధ్యా త్మికము. అది నిరుపమానము. జ్ఞానులకే నెఱుఁగ శక్యము కానిది. శ్రుతిస్మృతులయందు నతిగోప్యముగా నుండునది. నీకొ ఱకే యుపదేశించెదను. ఆనందమున నాలకింపుము. ఆజ్ఞానము నభ్యసించిన జన్మమృత్యుజరావ్యాధిభయములు గలుగవు. స్థిర మతి వగును. ఈజ్ఞానమునుబడసి వ్రజమునకుం బొమ్ము. దానిని వింటివేని శోకమోహములు నీమది నుండఁజాలవు. సచరాచర మగు నీసంసారము జలబుద్బుదప్రాయము. ప్రభాతకాలమున స్వప్న మెట్లు మిథ్యగాఁదోచునో అట్లే యీసంసారము మోహ కారణముగాని యిందేమియు సారము లేదు. మిథ్యయుఁ గృత్రి మమునగు నిర్మాణహేతువుగలది. పాంచభౌతికము. మాయచే

నాచ్ఛాదితుఁడౌట సంసారము సత్యమనుబుద్ధి గలిగి పురుషుఁ డిందుఁ బ్రవర్తించుచుండు. కామక్రోధలోభమోహములు చుట్టుకొనియుండును. సర్వకర్మములందును నివి యావరించియే యుండును. పలుభంగుల మాయ తన్నుఁగప్పగా జ్ఞానహీనుఁడై దుర్బలుఁడు నగు. నిద్రాతంద్రాక్షుత్పిపాసాక్షమాశ్రద్ధాదయాదులు లజ్జయు శాంతియు ధృతియు నరుని సదా యావరించియే యుండును. మనోబుద్ధిచేతనలు ప్రాణముననువానిచే సంసక్తుఁడై సర్వదేవతలు తన్నావరింపఁగా వాయసపమాచ్ఛాదితవృక్షము వలె నరుఁ డుండును.

నందరాజా! నే నాత్మను. సర్వేశ్వరుఁడను సర్వజ్ఞానాత్మకుఁడను. బ్రహ్మమనస్స్వరూపుఁడు. ప్రకృతి బుద్ధిస్వరూపిణి. సనాతనియునగు. ప్రాణములు విష్ణుస్వరూపము. చేతన లక్ష్మీస్వరూపము. నేనుండిన వీరెల్ల నుందురు. నేను బ్రవృత్తినుండి విరమించిన వీరెల్ల నగపడఁజాలరు. ఆత్మలేకున్న శరీర మాక్షణముననే పడిపోవునుగదా! శరీరము పాంచభౌతికము. కానఁ బంచభూతములయందు లీనమగు. నామసంకేతరూపమగు నీశరీరము నిష్ఫలము,మోహ కారణమునగు.అజ్ఞానులకుశోకముగాని జ్ఞానులకు శోకము సుంతయే నుండదు. నిద్రాదులగుశక్తులన్నియుఁ బ్రకృతికళలుగాని వేఱొండు కావు. లోభాదు లధర్మాంశములు. అహంకారమం దైదవది. సత్వరజస్తమస్సులను మూఁడుగుణములు బ్రహ్మవిష్ణురుద్రాంశములు. శివుఁడు జ్ఞానాత్మకుఁడు. నేను జ్యోతిస్స్వరూపుఁడను. ఆత్మయనఁబడువాఁడను నేనే. నిర్గుణుఁడను.

బ్రకృతియం దేసమయమునఁ బ్రవేశింతునో యపుడు సగుణుఁడ నగుదును. బ్రహ్మావిష్ణురుద్రులు సగుణవిషయులు. ధర్ముఁడు మదంశమే. అనంతుఁడు మదంశసంభూతుఁడే. సూర్యచంద్రులు నట్లే యని యెఱుంగవలయును. ఇట్టులందఱు నాకళవలనఁ గల్గినవారలేకాని వేఱుకారు. మునులు మన్వాదులు దేవతలు వారువీరననేల? అందఱు మదంశసంభూతులే. ప్రతిదేహమునందు నేను బ్రవేశించియే యుందునుగాని యేకర్మము నన్నంటదు.

నాభక్తుఁడు జీవన్ముక్తుఁడు. జన్మమృత్యుజర లాతని బాధింపవు. సర్వసిద్ధు లాతనికి లభించును. శ్రీకీర్తు లాతనికంగలుగు. పండితుఁడని కవియనియుఁ బిలువంబడును. ముప్పదినాలుగువిధములగు సిద్ధులుగలవు. నాభక్తుఁడు నన్నుఁ దప్ప మఱిదేని నాశ్రయింపఁడు. సిద్ధుఁడగుభక్తుని నే నాశ్రయించియుందును. ఇరువది రెండువిధములగుసిద్ధులు గలవు. అవి సిద్ధిసాధనకారణములై యుండు. నందా! నావచించుసిద్ధమంత్రము నాలకింపుము. దానిని బడసితివేని అణిమయు, లఘిమయుఁ, బ్రాప్తియుఁ,బ్రాకామ్యము, ఈశిత్వము,వశిత్వము,మహిమయు,గరిమయునను నెనిమిదిసిద్ధులు, దూరశ్రవణము, పరకాయప్రవేశము,మనోయాయిత్వము,సర్వజ్ఞత్వమును గలుగును. అగ్నిస్తంభము, జలస్తంభము, చిరంజీవిత్వము, కాయవ్యూహము, వాక్యసిద్ధియు, మృతానయనము, సృష్టికరణము, ప్రాణాకర్షణము నమునివి దాన లభించును.

సర్వేశ్వరేశ్వరపదము చతుర్థీవిభక్తిగా నుచ్చరించి సర్వవిఘ్నవినాశిపదమునట్లే యుచ్చరించియగ్నిభార్యను,చివరనఁజేర్చి

విరాడ్బీజమును దోలుదొ_ల్త నతికించిన మంత్రమగును. ఈమంత్రము మహాగూఢము. సర్వవాంఛలకుఁ గల్పవృక్షము. సామవేదప్రతిపాదితము. సిద్ధికాములకు సర్వసిద్ధిప్రదము. ఈమంత్రముచే యోగులు మునులు సిద్ధులు దేవతలు సర్వవాంఛితములం బడసిరి. ఇది కోటిజపముచేసిన మంత్రసిద్ధి యగునని యెఱుంగుము. నారాయణక్షేత్రమును హవిష్యాన్నమును దినుచు జపించినఁ ద్వరగా సిద్ధియగు. కాశీనగరమున మణికర్ణికయందు జపింపుము. నారాయణక్షేత్రము జలాధఃప్రదేశమున నుండునదియే. అందు నారాయణుఁడు స్వామియై యుండు. వేఱొకండు స్వామి కాఁడు. ఇందు మరణించిన జ్ఞానముగలుగు. మంత్రప్రభావమున జీవన్ముక్తుఁడునగు. సంశయము లేదు.

ఇఁక నేపదార్థములంగాంచిన పాపముకల్గునో వానిని వివరించెద. వినుము. దుస్స్వప్నము పాపకారణము. సర్వకార్యవిఘ్నకారణము. గోవులను, బ్రాహ్మణులను, వధించుట మహాపాపము, చేసిన మేలు మఱచుటయు నట్టిదే. కుటిలప్రవర్తన మట్టిదే. దేవతలను, మాతృపితరులను విశ్వాసముంచినవానిని హింసించుట మహాపాపము. మిథ్యాసాక్షియు, అతిథివంచకుఁడు మహాపాపులు. వీరినందఱిని దర్శించిన మహాపాపము గలుగకతప్పదు. గ్రామపాచకునిగాంచినను దేవబ్రాహ్మణద్రవ్యాపహర్తను, అశ్వత్థవృక్షఘాతుకుని, దురాత్మకుని, శివవిష్ణుదూషకుని, మంత్రదీక్షలేనివానిని, దురాచారుని సంధ్యావందన మాచరింపనిభూసురుని గనుంగొనినఁబాపము కలుగకపోదు దేవలుని, కర్మభ్రష్టుని,

శూద్రశవమును మోయువిప్రుని, శూద్రులకు వంటచేయువానిని, శూద్రశవదాహకుని, శూద్రశ్రాద్ధాన్నమును భుజించువానిని, గాంచినఁబాపము సంభవించు. శూరునికుమారునిగాఁ గాంచని క్షత్రియాంగనను, నాసిక లేనిదానిని, దేవబ్రాహ్మణనిందకురాలిని, చాండాలిని, పతిభక్తిలేనిదానిని, విష్ణుభక్తివిరహితను, శూద్రవిధవను, వ్యభిచారకృత్తినిరతను, జూచినఁ బాపము రాకతప్పదు. పలుమాఱు కోపమును దెచ్చుకొనువానిని, దుష్టమృగగ్రస్తుని, జారజుని, దొంగను, సదా మిథ్యావాదిని, శరణార్థ మితరుల యొద్దకుం బోవువానిని, మాంసము దొంగిలు బ్రాహ్మణుని, వృషలీపతిని, బ్రాహ్మణస్త్రీని గామించు శూద్రుని, వడ్డివ్యాపారముచేయువిప్రుని, అగమ్యాగమనుని, దుష్టుని, గనుఁగొనిన నఘము కలుగకపోదు.

తల్లి, చవితితల్లి, పిల్లనిచ్చినయత్త, తోఁబుట్టువు, గురుపత్ని, కోడలు, సోదరునిభార్య, పినతల్లి, మేనయత్త, మేనల్లునిభార్య, మేనమామభార్య, క్రొత్తగాఁ బెండ్లియైనకాంత, పినతండ్రిభార్య, రజస్వల, యనువీరెల్ల నగమ్యలని కీర్తింపఁబడుదురు. సామవేదమున వీరు పరిగణింపఁబడిరి. వీరెల్ల మర్యాదమీఱఁ బాలింపఁదగినవారు. వీరిని గామదృష్టింజూచినను స్పృశించినను బ్రహ్మహత్య కలుగును. దైవవశమున నట్లు జరగెనేని సూర్యుని గాంచి శ్రీహరిని స్మరించిన నఘముంటదు. కామాతిరేకమునఁ జూచినను స్పృశించినను నింద్యులగుదురు. కావుననే సత్పురుషు లిట్టివారిని జూడరు. శాపమువలన వారు భయంపడుదురు. రాహుగ్రస్తుఁడగురవిని చంద్రుని సజ్జనులు చూడరు.

జన్మాష్టసప్తద్వాదశనవమదశమస్థానముల రవియుండినను, జన్మరాశియందును, నాల్గవయింటను జంద్రుఁడుండినను, వారిని దర్శింపరాదు. నష్టచంద్రుని జూడరాదు. భాద్రపదమాసమున శుక్లకృష్ణపక్షములయందుఁ జంద్రుని జూడరాదు. చతుర్థీచంద్రుఁడు దర్శింపఁదగఁడు. చంద్రుఁడు తారను హరించుటఁ గలంకయుతుఁడయ్యెను. అది యతిదుష్కరము. ఎవ్వఁడే నష్టిశీతాంశుని గామమునఁజూచినఁ బాపము కలుగును. ఆకస్మికముగఁ గాంచిన మంత్రపూతజలము త్రాగవలయును. శుద్ధుఁడగును.

* సింహము ప్రసేనుంజంపెను. దానిని జాంబవంతుఁడు వధించెను. కుమారా! యేడువకుము. నీకిదే స్యమంతకమణి నిచ్చెదను. అను నీమంత్రమున జలము నభిమంత్రించి త్రాగిన, చతుర్థీచంద్రదర్శనకళంకము నశించును. నందమహీపాలకా! నీవడిగినప్రశ్నమునకు బదులు వచించితిని. ఏయేవానింజూచినఁ బాపముగల్గునో ఎవ్వరెవ్వరు పాపాత్ములో ఆవిధమెల్ల దెలిపితిని. ఇంకనేమి వినఁగోరుదువు? అని శ్రీహరి నందునిం గాంచి ప్రశ్నించెను.

ఆర్యమహాశయులారా! పాపమును గల్గించుప్రాణికోటియుఁ బదార్థములేవియో యనువిషయము దీనిని బఠించితిరి. దీనిం గూర్చి పెంచివ్రాయఁదగినవిషయములు లేవు. కాని యింకొక

---

* సింహః ప్రసేన మవధీత్సింహో జాంబవతా హతః, సుకుమారక మారోదీస్తవ హ్యేష స్యమంతకః. ఇతి మంత్రేణ పూతంచ జలం సాధు పిబేద్ధ్రువమ్. అని మూలము.

రహస్యము కలదు. ఎవ్వరెవ్వరిని జూచినఁ బాపముకల్గునో ఆవిషయమును లోకమున ననుభవమునకుఁ దే వీలున్నదా యని మీరడుగవచ్చును. కాని సమాధానముకూడ మీ రెఱుంగనిదికాదు. ఇందుఁ జెప్పఁబడినవారిని జూచినఁ బాపము కలుగుననుటచే వీరిని జూడకుండఁ బ్రపంచమున నుండ వలనుపడదు గాన నందఱు పాపాత్ములే యగుదురు కదా. ఇంకఁ బుణ్యాత్ము లెవ్వరనఁగా నీవిషయమునఁ గలసారము శ్రీకృష్ణోక్తిప్రకారము మీయీకార్యములు చేయరాని వనుటయే. వీరిని దర్శించినంతమాత్రమున సకలసుకృతములు నశించి మహాపాపములు రావు. కాని యీకార్యములు చేయరానివని యెఱింగినఁ జాలును. ఇట్టివారు పాపాత్ములు అనువిషయము చక్కఁగా నెఱుంగుట, ఇట్టికార్యము చేయకుండుట యీయుపదేశశ్రవణమునకు ఫలము. ఒకప్పు డిట్టివారిని జూడఁగాఁ గలిగిన పాపములకు.

"కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః,
సద్యః ప్రళయమాయాంతి మహాదేవేతి కీర్తనాత్."

అనునదియే ప్రాయశ్చిత్తము. అనఁగా స్వల్పదోషము లెన్నియో చేయుచుందురనియే యొక్కమాఱు భగవన్నామము స్మరించినఁ జాలునని పెద్దలు వచించిరి. కావున శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించినప్రకారము పాపములని చెప్పఁబడిన వాని నెఱింగి వాని నాచరింపక ప్రమాదమున నట్టివారిని జూచినపుడు శ్రీహరినిస్మరించుచు సదా యివి పాపము లని మనసున

స్మరించి తానిట్టికార్యములు చేయకుండ నుండుటయే పరమ ధర్మము. ఇదియే యీకథనుండి గ్రహింపఁదగిననీతి. ఇఁక ననంతర కథ నాలకింపుఁడు.

## సూర్యశీతాంశుదర్శననిషేధహేతువులు.

* అని యిట్లు శ్రీహరి వచింప విని నందుఁ డానంద సాగరనిమగ్నస్వాంతుఁడై మరల నిట్లు ప్రశ్నించెను. శ్రీకృష్ణా! రాహుగ్రస్తులగు సూర్యుఁడు చంద్రుఁడు చూడఁదగ రంటివి కదా. ఏల? భాద్రపదమాసమున శుక్లకృష్ణపక్షముల రెండింటి యందును జతుర్థీచంద్రుని జూడఁదగదనుటకు హేతువేమి? దాని వచింపుము. నీవెఱుంగనియర్థములు లేవు. సకలవేదశాస్త్ర పురాణాదుల నంద తెఱుంగఁజాలరు. అన్నింటి నీవెఱుంగు దువు. అని పలుక విని శ్రీకృష్ణమూర్తి యిట్లు బదులుచెప్పెను. నందరాజా! ఈవచనము సత్యము కాదు. వైదికులు నిషేధింతురు. పండితులకు సకలవిషయములు తెలియవంటివే. అది న్యాయమా. తాను నమ్మియున్నమాటను బయలుపఱుపరాదు. అట్లు బయలుపఱుచుచో విఘ్న మొదవును. సత్పురుషులలోపములు. అభీష్టదేవతయు నొరులకుం దెలుపరాదని విధి గలదు. కాన నూహించి ప్రశ్నింపుఁ మనఁగా నందుఁ డిట్లు ప్రశ్నించెను. మహానుభావా! జగన్నాథా! భక్తునకుం దెలుపకుండ దాఁపఁ దగినవిషయము లుండవు. అనుగ్రహించి నాప్రశ్నమునకు

---

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము డెబ్బదియెనిమిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుఁగఁదగు.

బదులుచెప్పుము. పుణ్యము నొసంగుసూర్యచంద్రులు గ్రహణ కాలమునఁ జూడఁదగనివారేలరైరి? అని ప్రశ్నింపహరి యిట్లు పలికెను. నందమహారాజా! పురాతనగాథ యొకటి కలదు. దాని సావధానముగ నాలకించిన నిష్కళంకుఁ డగును. తీర్థస్నాన పుణ్యము లభించును. సర్వపాతకములు చేసినవానిని జూచిన నేపాపము గలుగునో ఆపాప మీకథాశ్రవణమున నశించును.

ఒకానొకప్పుడు జమదగ్నిమహాముని మహాకౌతూహల ముకలవాఁడై రేణుకాదేవిం గూడి నర్మదానదితీరమున కరిగెను. రేణుకాదేవి యాయదనునఁ జక్కనివేషమును దాల్చి చిఱునవ్వు కనఁబడ రత్నభూషణము లొప్పాఱ యించుక వంగి మందగతి కనఁబడఁగా భర్తవెంటఁబోయెను. ఆసమయమున నారేణుక నారీమణులలో నుత్తమరా లనందగి శ్వేతపద్మ చ్ఛాయ గలిగి సంపూర్ణచంద్రబింబమును గ్రిందుసేయుమోము తనరఁ గటాక్షవీక్షణములు నలుదెసలఁ బర్వఁడ మిగుల జిలుగు వలువం గట్టి కామబాణప్రపీడితరైయినట్లు పులకాంచితసర్వాంగియై యలరారెను. పురుషకోకిలములు రొదలుసేయ మధుకరములు ఝుంకారములఁ జెవులమ్ముంపఁ బరిమళమిళితపవనుఁడు వీవఁ బూలపాన్పులు చూపట్టు నుండుమనోహరస్థలమును వారు చేరిరి. జమదగ్నియు సుగంధిచందన మలంది వస్త్రమాల్యములఁ దాల్చి యుండెను. అమ్మునిం గాంచి భాస్కరుఁ డిట్లు పలికెను.

వేదకర్తకు మునిమనుమఁడవు. చతుర్వేదప్రతిపాదిత కర్మాచరణమున నిష్ణాతుఁడవు, సదా పరిశుద్ధుఁడవు. వేదాంగ

కర్తవు ధర్మజ్ఞుఁడవు. వేదవిద్వరుఁడవు. మహాతపస్వివి. తేజశ్శాలివి. బ్రహ్మచారివి. సువ్రతాచరణపరాయణుఁడవు మీ౯బోంట్లకుఁ దగినశాస్త్రములఁబఠించి పండితుఁడవైతివి. వేదవిహితమగునదియే ధర్మము. తద్విపరీత మధర్మము. ధర్మజ్ఞుఁడవగు నీవు ధర్మమును వదలి యధర్మము నాచరింపఁబూనితివి కదా. ఏల? పగటియందుఁ బత్నిఁగలయిక నలరించుట దోషమని విశేషించి వేదము తెలుపుచున్నది. నేనో ధర్మాత్ములకు సాక్షిని. కావుననే నిన్నడుగుచున్నవాఁడను.

అని సూర్యుఁడు ప్రశ్నింపఁగా నమ్ముని యానవయువతీసంగమమున వాంఛ వదలెను. తనముందు విప్రవేషమూని నిలుచున్న తేజశ్శాలిని భాస్కరుం దిలకించెను. కోపంబున ముఖము రక్తకాంతి నీనుచుండ లజ్జయుఁ గోపమునకు సహాయపడుచుండ నిట్లు పలికెను. రేణుకయు లజ్జచేఁ దలవంచి వస్త్రమునడ్డముపెట్టుకొని నిలుచుండెను. ఆభార్యలనుఁ జూచుచు ముని యిట్లుపల్కెను. నీ వెవఁడవు ? పండితుఁడనని యనుకొనుచున్నవాఁడవు ? నీకంటె లోకమునఁ బండితుఁడే లేఁడా? నేను భృగుమహర్షికి శిష్యుఁడను. నీవు కశ్యపుని శిష్యుఁడవు. నాల్గువేదములం జదివితిని. ధర్మాధర్మనిరూపణమునందు సమర్థుఁడను. వేదవిహితము ధర్మమనియు, దానికి విపరీతమగునది యధర్మమనియు నేనెఱుంగుదును. అజ్ఞానియగువాఁడు పలుమాఱులు స్వకర్మమునుండి భ్రష్టుఁడగును. తేజశ్శాలురకది దోషము కాదు. అగ్నియందు నెట్టి

పదార్థము వైచినను భస్మమగుటయె గాని దాని నపవిత్రముగాఁ జేయఁజాలవు. నీతనయుఁడగు యముఁడు సర్వకర్మసాక్షియు, ఫలప్రదాతయు, శాస్త్రజ్ఞుఁడును నగు. విష్ణుభక్తుల శాసించు వారు లేరు. మమ్ము శిక్షించువారు లేరు. వాసుదేవభక్తుల కశుభ మెుకానొకప్పుడును గలుగదు. విష్ణుభక్తులను శ్రీహరి సుదర్శనచక్రము సదా రక్షించుచుండును. భగవంతుఁడగు శ్రీమన్నారాయణమూర్తి భక్తులను గాపాడును. ఆయనయే బ్రహ్మ, శంకరుఁడు నగు. దివాకరా! యముఁడు మమ్ముశిక్షింపఁ జాలఁడు. తనరాజ్యమందు రాజపుత్రుఁ డెట్లు స్వచ్ఛందగామియో మేము నట్లే సర్వస్థలములందును స్వచ్ఛందగాములము. యముని సర్వదేవతలను భస్మము చేయఁజాలుదును. మహేంద్రప్రభృతులను నిమేషమాత్రమున భస్మ మొనరింపఁజాలుదు. ఆకార్యము విలాసమేగాని శ్రమముకూడఁ గాదు. ధర్మమును వచింప నీవెవఁడవు? స్వస్థానమున కరుగుము. నాకు శాస్త్ర ప్రకృతి పరుండగు శ్రీకృష్ణుఁడే యని యెఱుంగుము. ఈనిర్జనవనమునందును నీచే రసభంగమూ చేయఁబడినది. కావున నాశాపమున పాపాత్ములచేఁ జూడఁబడుచు రాహుగ్రస్తుఁడ వగుము. రాహుగ్రస్తుఁడ వగు నిన్నుఁ జూడక యెవ్వారు దూరముగఁ బోవుదురో వారే నిన్నాచ్ఛాదింపఁగలరు. వారిని వాయువు ప్రోత్సహించును. నీవు గర్వించి నాకుపదేశించితివి. కావున హతతేజుఁడ వయ్యెదవు. మేఘము లావరింప నల్పతేజుఁడవగుటయే గాక రాహుగ్రస్తుఁడ వగుదువు.

అని జమదగ్ని శపింపఁగా విని భగవంతుఁడగు భాస్కరుఁడు కరములు జోడించి మునిపుంగవుని వినుతించెను. మహాత్మా! మీవంటిభక్తు లవధ్యులు. సర్వధర్మజ్ఞులు. మాన్యులు. ధన్యులు. భగవంతుఁడగు నారాయణుఁడు బ్రహ్మాశంకరమయుఁడు. గణేశుఁడు, శేషధర్ములు తత్స్వరూపులే యగుదురు. విప్రరూపుఁడు జనార్దనుఁడని యెల్లరు నారాయణమూర్తిని వినుతింతురు. మహానుభావా! విష్ణుభక్తుఁడవు, పరిశుద్ధమానసుఁడవు, ధర్మజ్ఞుఁడవు. నన్ను క్షమింపుము. నీధర్మము నాచరింపుము. వైష్ణవులపై నాగ్రహించువారిని భగవంతుఁడోర్వఁడు. మాచే విప్రులు పూజింపఁబడుదురు. మీచే దేవతలు పూజితులు. పరస్పరముగా నిది స్నేహధర్మముగానున్నది. నీచే నేను శపింపఁబడితిని. నీవు నాచే శపింపఁబడితివి. నేను నిస్తేజుఁడ నగుట యెట్లు? నీవు నాశాపవశముఁనక్షత్రియపరాభూతుఁడ వగుదువు. నీకు క్షత్రియాస్త్రమున మరణము సంభవింపఁగలదు. అనిసూర్యుఁడు పలుక జమదగ్నిమరల నాగ్రహించెను. అతిరక్తాస్యుఁడై కోపమున మరలనిట్లు శపించును. భాస్కరా! నీవీశ్వరునిచే నిర్జింపఁబడుదువు.

ఇట్లిరువురు శాపప్రతిశాపములఁ గలహించుచుండఁగా దివ్యజ్ఞానమున నెఱింగి సకలలోకసృష్టికర్తయగు బ్రహ్మ కశ్యపునిం గూడి యరుదెంచెను. శాపభీతుఁడగుభాస్కరుని బోధించెను. ధర్మజ్ఞుఁడైన జమదగ్నిని జ్ఞానోపదేశమునఁ దేర్చెను. భాస్కరా! నీవు సాక్షాన్నారాయణస్వరూపుఁడవు. కాన క్షమిం

పుము మీచే విప్రులు రక్షింపఁదగినవారు. నేను నీకు విప్రశాపమునుండి మరలునుపాయమును దెల్పెదను. భృగుమహర్షి ప్రేరేపింప నేనిచ్చటికి వచ్చితిని. కశ్యపమహర్షియు నన్నుఁబురికొలిపెను. సురశ్రేష్ఠా శాంతుఁడవు కమ్ము. నీవు సర్వకర్మసాక్షివి కదా! భాస్కరా! ఒకానొకదినమున నొకానొకక్షణమున మేఘచ్ఛన్నుఁడవు కాఁగలవు. వెంటనే ముక్తుఁడ వగుదువు. ఇంచుమించుగా వర్షమున కొకతూరి రాహుగ్రస్తుఁడ వగుదువు. కొందఱకు దదృశ్యుఁడ వగుదువు. కొందఱకు దృశ్యుఁడ వగుదువు. సర్వస్థలములయందు రాహుగ్రస్తుఁడవు కాకుందువు గాక. సర్వదా పుణ్యాత్ములు నీదర్శనమును గాంక్షింతురు. నిన్ను దర్శించి యెవరు నమస్కరింతురో వారు పాపరహితులగుదురు జన్మసప్తమవ్యయషష్ఠనవమచతుర్థదశమస్థానములయందును, జన్మనక్షత్రమునందును నీవుండ నపమృత్యువు జనులకుఁ బాటిల్లును. అస్తమయకాలమునందును, మేఘములావరించునపుడును, మధ్యాహ్నమునందును, జలములయందును, సగముదయించునపుడును, నిన్నుఁ బాపాత్ములే చూడఁబూనుదురు భార్యాదుఃఖనిమిత్తముచేతను, హేతుభూతురాలగు భార్యచేతను, గన్యాదాతయగుమామచేతను, బావమఱదిచేత నొకానొకప్పుడు హతతేజుఁడవుగాఁ జేయఁబడుదువు అట్లుగాకపోయినచో నీతేజస్సును సంజ్ఞాదేవి భరింపఁజాలకుండును. మాలిసుమాలియనువారితో యుద్ధముపొసఁగుతఱి నీవీశ్వరునిచే నోడింపఁబడుదువు. అని యిట్లు పలికి సూర్యునిచింతఁ బాపి బ్రహ్మ

జోత్తముని గాంచి యిట్లు పలికెను. అత్తటి జమదగ్ని శాప భీతుఁడై సిగ్గుచేఁ దలవంచి యుండెను.

బ్రాహ్మణోత్తమా! స్వగృహమునకుం బొమ్ము. యథా సుఖముగా నరుగుము. నీతేజఃప్రభావమున జగమెల్ల క్షణ మాత్రమున భస్మము కాఁగలదు. సూర్యుఁడు నీచేఁబాలింపఁ దగినవాఁడు. నీవు నాతనిచేఁ బరిపాలింపఁబడ నర్హుఁడవు. మీ యిరువురకుఁ బరస్పరము పోష్యపోషకసంబంధము కలదు. హార్యంశసంభూతుఁడగు కార్తవీర్యార్జునునిచే నీకవమానము కలుగఁగలదు. పురాకృతమగు నీకర్మము శేషించియుండెడిని. శ్రీమన్నారాయణుఁడు స్వాంశమున నీకుఁ బుత్త్రుఁడు కాఁగ లఁడు. ఇరువదియొక్కమాఱులు భూతలమును క్షత్త్రియవిహీ నముగాఁ జేయఁగలఁడు. నీకు మృత్యువు కీర్తిబీజముగాఁ గాఁ గలదు. అని పలికి వారిని శాంతచిత్తులనుగాఁ జేసి బ్రహ్మ తన స్థానమున కరిగెను. జమదగ్నియు భాస్కరుఁడును దమతమనెల వుల కరిగిరి. తండ్రీ! నందరాజా! పుణ్యకారకమగునాఖ్యాన మును వివరించితిని. ఏహేతువుచేత సూర్యుఁడు రాహుగ్రస్తుఁ డగునో మేఘచ్ఛన్నుఁడగునో యావిధమంతయు వివరించితిని. భాద్రపదమాసమున శుక్లకృష్ణపక్షములయందుఁ జతుర్థీతిథి యందుఁ జంద్రుఁ డదృశ్యుఁడు నష్టరూపుఁడు నేల యయ్యెనో దానికి హేతువును వచించెద. మున్ను నేనాతని శపించితిని. దానికిం దగుకారణమును దెలుపునట్టికథ నెఱింగించెదనని శ్రీహ రి యిట్లు పలికెను.

ఆర్యమహాశయులారా! సూర్యునకు జమదగ్నికి నైనసంవాదము, శాపము, బ్రహ్మసమాధానము వింటిరి. దీనినుండి కొలఁదివిషయములు గ్రహింపవలసియుండును. మహాముని భార్యంగూడి కామప్రేరణమున విహరింపఁబోయెను. అది నిర్జనారణ్యము. ఎన్నఁడెఱుఁగని చందనచర్చల దేహమును గై చేసికొనియెను. పగటిపూటనే విహరింపఁదలంపుకొనియె. నిరంతరము తపంబొనరించుమహర్షి కీబుద్ధి యేలపుట్టెనో భగవంతుఁడెఱుంగును. ప్రాయశః ఇట్టివి లోకోపకారహేతువులే యగును. నన్నెదిరించువారు లేరనుగర్వము నున్మూలింపఁబూనుట భగవంతునకు నైజము. సకలధర్మముల నెఱింగియుండియు జమదగ్ని తా దివాసురతము చేయ మనస్సున నూహించెను. పతివ్రత యగురేణుక యందుల కంగీకరించెను. అస్వతంత్రురాలు గదా! ఇంతటితపోధనున కీకుబుద్ధి యేల కలిగెనో యని యూహించిన నదియొక లోకోపకారమునకే కలిగెనని చెప్పక తప్పదు. ఈస్వల్పపాపకార్యముననే యాయనకు ముందు దుష్ఫలము కలుగఁగలదు. అని లోకులకు: దెలుపుటకే భగవంతుఁడు సంకల్పించెను. స్వల్పదోష మామహాత్మునకు ఫలము నీయక విడువలేదు కదా. ఇఁకఁ దక్కినవారిని వదలునా యను నీతి లోకు లెఱుంగుదురు గాక యని పరమాత్మయుద్దేశమని యూహింపవచ్చును. నిర్జనమున నేనేకార్యముచేసినను జూచువా రెవ్వరు గలరనునూహ దురూహాయని తెలియఁజేయుటకే భగవంతుఁడు సూర్యుని బ్రోత్సహించెను. దాన నాతఁడు బ్రాహ్మణరూపమునఁ

ప్రత్యక్షమయి యిది యకార్యముకాదా యని యుద్బోధిం చెను. దీనిచే దుష్కార్యము చేయఁబూనుటయుఁ గూడ మేలు గాదని తోఁచెడిని. దాన నిరువురు కోపావేశమున శపించుకొ నిరి. ఏల? ఇరువురకు గర్వశాంతి కావలసినవిధి యున్నది. ఈ యిరువురివలనం గూడ లోకముల కుపకారము కలదు. అందు లకే విధి బ్రహ్మను బ్రోత్సహింప నాతఁ డచ్చటికి వచ్చి వారిని శాంతినొందఁజేసెను. దాన వారింకను శపించుకొనకయుండ మానిరి.

దీనింబట్టి గట్టిగా నాలోచింపఁగాఁ గర్మము బలవత్తర మనియు దానినిమీఱ నెట్టివారికే నశక్యమనియు దానిపోక డలు తెలియఁదరముగానివనియు మనమెఱుంగవలయు.

"కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః."
అని భగవద్గీతోక్తి కలదు కదా! ప్రకృత్యతీతుఁ డొక్కభగ వంతుఁడే. తక్కినవారందఱు ప్రకృతిబద్ధులే. దానిని మీఱి ప్రవర్తింపఁజాలరు. త్రిమూర్తులమాట యిట్లుండ నిఁక జఘ్ను దగ్నిప్రభృతులమాట యిటఁ జెప్పనేటికి? దానికి లోఁబడియే యిట్టిపని చేయఁదలఁచిరి. దానిఫలమును గాంచిరి. కాన నేకా ర్యమైనను మనలఁ బరికించువా రెవ్వ రనుగర్వమున శాస్త్రము మీఱి చేయరాదు. చేసినచో దానిం గనుఁగొనువా రుండక పోరు. ప్రతిఫలము కలుగక మానదు. భగవంతుఁ డెఱుఁగని విషయములు లేవు. మనము రహస్యముగాఁ జేయుపాతకము లకుఁ బ్రతిఫలము కలుగకపోదు. కాఁబట్టి యితరులను మోస

పుచ్చితిమని గర్వింపరాదు. ఆమోసము తనబ్రదుకునకుఁ దాఁ జేసికొన్నట్లే యగును. అది యెఱుంగక యితరుల మోసపుచ్చఁ జాలితిమని కొందఱు గర్వింతురు కాని తమకు రాఁగలదుర్గతి నెఱుంగరు. వారికన్న మూర్ఖు లుండరని తోఁపక మానదు.

ఇంక రవినిజూడఁదగనికాలములనుగుఱించి యించుక వ్రాసెదను. సూర్యగ్రహణమునకు రాహుకేతువులనువారు కారకులు గారని జ్యోతిస్సిద్ధాంతము ఘోషించుచున్నది. పురాణములు మాత్రము దేవతలను బ్రోత్సహించిరనుకారణమున రవిచంద్రులపై రాహుకేతువులకు విరోధము గలదనియు దాని నపుడపుడు సాధించుచుందురనియుఁ జెప్పఁబడినది. జ్యోతిస్సిద్ధాంతమున నసత్యము కనఁబడదు. పురాణాభిప్రాయము తప్పని సామాన్యదృష్టికిం గోచరించును. కాని యంత మాత్రమునఁ బురాణాభిప్రాయము తప్పనుట న్యాయము కాదు. ఏలయనఁగా.

"యద్యదుద్దేశేన ప్రవృత్తస్తత్తదంశ ఏవ ప్రమాణమ్."

అనున్యాయము కలదు. గ్రంథ మేయుద్దేశముతో నారంభింపఁబడినదో యందావిషయమే ప్రమాణము గాని తదితరవిషయములు ప్రమాణములు కావని పైసూత్రాభిప్రాయము. పురాణములు కథారూపమున నీతుల నుపదేశించుటకై యేర్పడినవి కాని ఖగోళమును జెప్పుటకుఁ గాదు. కావున నాయాసందర్భముల నితరశాస్త్రవిషయములు చెప్పవలసివచ్చినపుడు కథకనుబంధముగా దానిం జెప్పుచు నందుండి నీతులను బయలుపడు

నట్లు చేయుచుంట పురాణపద్ధతి. అసత్య మేల చెప్పవలయును? అనున దొకప్రశ్నము. సమాధాన మేమనఁగా రవిచంద్రుల కేదో యొక ఛాయ యడ్డుపడుట సత్యము. రవికి నాచ్ఛాదకుఁడు చంద్రుఁడని, చంద్రునాచ్ఛాదించునది భూచ్ఛాయయని మాత్రము చెప్పఁబడలేదు. ఈ విషయమునే చెప్పినచో నొకానొకనీతిని దెల్పుట కవకాశము లేదు. కాన నీతిని బ్రధానముగాఁ దెల్పుగ్రంథములుగావున నించుకమార్పుతోఁ దెల్పిరి. ఈ విషయమును సిద్ధాంతము చేయఁబూని భాస్కరాచార్యులు గారు

రాహుఃకుభామండలగశ్శశాంకంశశాంకగశ్ఛాదయతీనబింబం,
తమోమయశ్శంభువరప్రదానాత్సర్వాగమానామవిరుద్ధమేతత్.

అని నిర్ధారణము చేసిరి. పురాణములలో మార్పుచేసినందునఁ గలుగు లాభ మేమనఁగా వినుండు. ఆపద్విధుల ననుసరించి యొకనిమఱుఁగుచొచ్చినవానిని వెలిపుచ్చరాదు, కుడువఁబోవుచున్న నాహారమును దీయరాదు, అను ప్రాచీనన్యాయము ననుసరించి యెవ్వఁడే నొకని కట్టితఱి నపకారము చేయరాదు. చేసినచో నాపాపమాతనిఁ బ్రతిజన్మమునను బాధించును. అన్న నీతిని లోకులకుఁ దెలుపుటకై యిట్టిమార్పు చేయఁబడినదనవచ్చును. శత్రువైనను దనను బాధింపనివానిని బాధింపఁ బ్రయత్నింపరాదు అనునీతులను రెండింటిని దెలుపుటకై యిట్లు కథను దాఱుమాఱుచేసి రనవచ్చును. కావున పురాణముల నాక్షేపింపరాదు. ప్రకృతకథావిషయ మేమనఁగా

సూర్యశశాంకులను జూడరాదనుట. మేఘమాచ్ఛాదించున పుడు, ఉపరాగము (గ్రహణము) పట్టునపుడు, రవిని, చంద్రు నింగూడఁ జూడరాదనఁగా లోకమున నెవ్వఁడే నొకవిపత్తులో నున్నపుడు సాయపడవలయుననియు, ఆ పనికి నశక్తుఁడైనచో వాని ప్రక్క దృష్టి నిగిడించి యతనికిఁ జింత గల్గింపక తొలఁగవ లయుననియు గ్రహింపవలయు ననుభావము గ్రహింపవలయు నని దెల్పుటకే యని యెఱుంగునది. ఇట్టినీతులను భగవం తుఁడే తెలిపెనుగాన నావాక్యము ననుసరించి యట్టియకార్య ములు చేయక యుండవలయును. ఇఁక నీ విషయమును దడవక తర్వాతికథను దెలిపెదను.

### చతుర్థీచంద్రదర్శననిషేధము.

* నందరాజా ! నావచియించుకథ నాలకింపుము. నేనేల చంద్రుని శపించితినో యాహేతువును దెల్పెద. దేవేంద్రుని పురోహితుఁడు బృహస్పతియనుట సర్వజనవిదితమే కదా ! ఆగురువుభార్య తారాదేవి. నవయౌవనస్ఫురితురాలు. రత్న భూషణభూషితాంగి. నిరుపమానమృదులాంబరమును గట్టు నది. సుస్మితమున మోము వెలయుచుండ మనోహారిణి యైయుండు సాధ్వి. మాలతీమాల్యములయం దామెకుఁ బ్రీతి మెండు. సిందూరతిలకమామెమోమున కొకవింతచెలువమును దెచ్చుచుండును. ఆతరుణీమణి యొకానొకసమయమున మందా

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁ బడినదని యెఱుంగవలయును.

కినీతీరమున కేగి స్నానకృత్యము సల్పి స్నిగ్ధాంబరమును ధరించి గురుపాదద్వంద్వమును ధ్యానించుచు నింటికిం బోవఁ బయన మగుచుండును. ఆసమయమున నటనున్నచంద్రుఁ డాతరుణిం జూచెను. నాఁడు భాద్రపదశుక్లచతుర్థియు నైయుండెను. తద్దర్శనమాత్రమునఁ గామబాణప్రపీడితాత్ముఁ డయ్యెను. మూర్ఛిల్లెను. మరలఁ దెలివి రాఁగాఁ దనమది యోజించెను. ధైర్య మవలంబించెను. కాని యాతనివిజ్ఞానము కామబాణపీడను మరలింపఁజాలకపోయెను.

అంత నాతఁడు రసికుఁడు గావున నామెను గరమునఁ బట్టుకొని యరదముపైఁ గూరుచుండఁ బెట్టుకొనియెను. ఆమెయుఁ గాముకురాలని యెంచిఁగియే యట్లొనర్చెను. కామమున నాతనినయనము లంధమ్ము లయ్యెను. ఆమెయు నట్టియవస్థనే పొందెను. కాన నాతనిచర్యలకు వలదని వచింపఁ జాలకపోయెను. ఆవల శృంగారచర్యలఁ జూపనారంభించు శీతాంశునితో నాతార జ్ఞానము గలిగి యిట్లు పలికెను. *చంద్రా! నన్ను వదలుము. వదలుము. సురకులపాంసనుఁడా! ఈపని

---

* త్యజ మాం త్యజ మాం చంద్ర సురేషు కులపాంసన, గురుపత్నీం బ్రాహ్మణీం చ పాతివ్రత్యపరాయణాం, గురుపత్నీసంగమనే బ్రహ్మహత్యాశతం భవేత్, గురుపత్నీ విప్రపత్నీ యది సా చ పతివ్రతా, బ్రహ్మహత్యాసహస్రం చ తస్యాస్సంగమనే లభేత్. పుత్రస్త్వం తవ మాతాహం ధైర్యం కురు సురేశ్వర, ధిక్త్వాం శ్రుత్వా సురగురుర్భస్మభూతం కరిష్యతి. అని మూలము.

చేయరానిది. గురుపత్నిని. అందును బ్రాహ్మణిని. పాతివ్రత్య నియమమునకాసక్తురాలను. చంద్రా ! గురుపత్నితోఁ గలయిక సాగించినయెడల నూఱుబ్రహ్మహత్యలు చేసినంతపాపము గలుగును. గురుభార్య విప్రకులసజనితయై పతివ్రతయయ్యెనేని అట్టి సాధ్విని గోరిన వేయిబ్రహ్మహత్యలు చేసినపాపము లభించును.

చంద్రా ! నీవు నాకుఁ బుత్త్రసమానుఁడవు. నేను నీకుఁ దల్లిని. ఇంచుక ధైర్య మవలంబింపుము. ఛీ ఛీ నిన్నిట్టివానిగా నెఱింగినచో గురువు నిన్ను భస్మీభూతశరీరుం గావించును. శిష్యుఁడు పుత్త్రునికంటె నధికుఁడు. నా ప్రాణనాథునకు నీపైఁ గూర్మి మెండు. పాపిష్ఠా ! స్వధర్మమును గాపాడుము. నీకుఁ దల్లినగు నన్ను వదలుము. వదలవేని స్త్రీహత్య నీ కంటఁగట్టెదను జుమీ. అని తార యెంత యొత్తిచెప్పినను వినక యామె బలవంతముమీఱఁ బట్టి కలయికను గోరెను. అత్తఱి నామె తొలుతఁ గామబాణపీడితయయ్యును విజ్ఞానసంపన్నురాలై నిష్కామయై పతివ్రతయు నగునా తార కోపాతిరేకమునఁ జంద్రుని నిట్లు శపించెను. చంద్రా ! కన్నుమిన్నెఱుంగక నన్నుఁ గవయఁ బ్రయత్నించితివి కావున నీవు రాహువుచేతను మేఘములచేతను గ్రసింపఁబడుదువు. పాపాత్ములే నిన్నపుడు చూతురు. కళంకివగుము. క్షయరోగము నిన్నలముకొనును గాక. ఇందులకు సంశయములు లేవు.

అని శీతాంశుని శపించి మన్మథునిం దలంచి యిట్లు శపించెను. కామా ! యుక్తాయుక్తము లెఱుఁగక నెల్లకడల

నీప్రతాపమునే చూపఁబూనితివి. కాన నొకానొక తేజస్విచే భస్మము చేయఁబడఁగలవు. అని యిట్లు శపించుచున్న తారను దొడపైనిడుకొని పోయెను. తార విలపించెను. అత్యంతశోకాక్రాంతస్వాంత యయ్యెను. ఐనను శీతాంశుఁ డామెను వదలక తనమదికి నింపుగల్గించు తావుల నామెంగూడెను. మనోహరోద్యానములకుఁ బోయెను. తాఁజూచియున్న తావులనెల్లఁ జూడఁబోయెను. అందందామెను గూడెను. వారుణియనంబడు మదిరను ద్రాగి వరుణానింగూడి వరుణుఁడు విహరించినతావుల నామెను ప్రేమించెను. క్షీరార్ణవతటమునఁ దారాంగనాసహితుఁడై శీతాంశువుండఁగా శుక్రుఁడు వారిం గాంచెను. శుక్రుఁడత్తఱి బలిచక్రవర్తిగృహమునుండి వచ్చుచుండెను భార్గవుని గాంచినంతనే యించుక విజ్ఞానమంకురింపగాఁ జంద్రుఁడు జరిగిన వృత్తాంతమంతయుం జెప్పి శరణుజొచ్చెను. నీతియుక్తముగా శుక్రుఁడాతనికి హితముపదేశించెను. భృగువంశపయోరాశిచంద్రుఁడగునాశుక్రుఁడు వేదవేదాంగపారగుఁడు. నిరపేక్షుఁడు. మునిశ్రేష్ఠుఁడు. కాన శాస్త్రసారముగా నిట్లుపదేశించెను.

వత్సా! నామాట యాలకింపుము. ఈతారను గురువునకొసంగుము. బృహస్పతిబ్రహ్మకుం బౌత్రుఁడు, దేవతాపూజితుఁడు. కాన నామహాత్మునకుఁ దార నొసంగుము. ఆముని తారయందెక్కువ మక్కువ గలవాఁడు. కావున నాయనకు నొసంగి శరణుగోరుము. చంద్రా! గురుపత్ని మాతృతుల్యయగు. కాన నామాటం జేకొని యీామెను వదలుము. ఈపాపమునకుఁ బ్రాచితమొ.

నరుఁడ ప్రయత్నింపుము. పాపకార్యనివృత్తియు మహాఫలమే. గురుపత్నినందునుబతివ్రతను బలవంతముగా గ్రహించుట బ్రహ్మ హత్యచేసినట్టిదియే. మహాపాపాత్ముఁ డాతఁడగు. నూఱుగురు బ్రహ్మలుకాలముపుచ్చినంతదనుక యాతఁడు కుంభీపాకనరక మున యాతన లనుభవించుచుండును. లోకములయందు నారాయణస్థానమునకు సాటియగు చోటు లేదు. తృణమునకుఁ బర్వతమునకు నెంతయంతరమో యంతయంతర మితరపాపము లకు నీపాపమునకుఁ గలదు. దీనినిమించినపాపము లేదని గ్రహింపుము. ఈయది శ్రీహరిస్థానము. ఇందు నీవు విహరింప నెవ్వఁడవు? మహాపాపము రాదా !

శ్రీమన్నారాయణభక్తులు మూఁడు విధముల నుందురు. వారిమార్గముల ననుసరించిన నీపాపము చేసియుండవు. ఇది మహాపాపకార్యము. అందును నారాయణాశ్రమమునఁ జేయుట యంతకంటె మహాపాపము. అట్టికార్య మొనరించి నాశరణు చొచ్చినను లాభముండఁబోదు. కావునఁ దారనప్పగించి బృహ స్పతిఁ బ్రార్థింపుము. ఆతఁడు మహాత్ముఁడు, కరుణాళువు, ఆశ్రి తులను ద్రోయఁజాలఁడు. కావున నామాటను బాటించి యా కార్యమున జాగరూకుఁడవై మెలంగుము. అని నీతిశాస్త్రసార జ్ఞుఁడుగావునఁ దత్కాలహితమగుకార్యము ననువదించెను.

## తారానిమిత్తము దేవదానవులు యుద్ధము చేయుట.

* అనిపలికి నందునకు మరల శ్రీకృష్ణుఁ డిట్లు తరువాతి

---

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదొకఁడవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినదని తెలియందగు.

వృత్తాంతము చెప్ప నారంభించెను. అంత శుక్రుఁడు వియ న్మార్గమునుండి వచ్చుచున్న దేవతాబృందములఁ గాంచెను. ఆదే వతలెల్ల సకలశస్త్రాస్త్రములం దాల్చి యుద్ధముచేయ వచ్చుచుం డిరి. పతాకలెన్నియో యెగురుచుండెను. రథము లసంఖ్యా కములై కనఁబడుచుండెను. గజములు హయములు వర్ణింప లెక్కింప నలవిగాక యుండెను. పదాతివర్గ మిసుకవలె గణన చేయ నశక్యమై యుండెను. ఆచతురంగబలము లరుదెంచుచుండ రణవాద్యములు మ్రోయుచుండ నాదేవతాసైన్యములు చూచ భయమును గల్గించుచుండెను. వారివెనుక దేవేంద్రుఁడు శ్వేతాశ్వము నారోహించి వచ్చుచుండెను. ఆతనిం గూడి యముఁడు, కుబేరవరుణులు, హుతవహుఁడు, పవమానుఁడు వచ్చుచుండిరి. యముఁడు మహిషాధిరూఢుఁడై యుండెను. దివాకరుఁడు స్యందనమున నలరుచుండెను. ఈశానుఁడు వృషభ వాహనమున నొప్పారుచుండెను. అనంతుఁడు నాగవాహనము నెక్కియుండెను. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, సిద్ధగంధర్వులు కిన్నరులు, కింపురుషులు, సూర్యతేజస్సులధిక్కరించు బ్రహ్మతేజ స్సుల నలరుమహర్షులు వచ్చుచుండిరి.

శుక్రుఁ డావచ్చుబృందారకులం గాంచి భీతినొందక చంద్రు నాశ్వాసించి దేవతాసైన్యద్విగుణసైన్యమును రాక్షసులనుండి పిలువ నూహించి స్మరించినంతనే పాతాళమునుండి భూమికనిసట్టు లరుదెంచి రాక్షసవీరులు శుక్రు నాశ్రయించిరి. రత్నమాలానదీతీరమున రాక్షసవీరులు విడిసిరి. ఆనది పాలకడలి

చెంత నుండెను. ఆచోటనే యగ్నిహోత్రునాశ్రమమున్నది. అట్టిసమయమున సరస్తటముననుండి యక్షయవటము చెంతనుండి వృషభవాహనము నెక్కి వచ్చుచున్న శంకరుని శుక్రుఁడు చూచెను. శంకరుఁడును త్రిశూలపట్టిసముల ధరించి వ్యాఘ్రచర్మమును గట్టి తేజస్స్వరూపుఁడై భక్తానుగ్రహవిగ్రహుఁడై సనాతనుఁడై, శరణాగతదీనార్తపరిత్రాణ పరాయణుఁడై, సర్వసంపత్ప్రదుఁడై సర్వకారణుఁడై, సర్వజ్ఞుఁడై, సర్వేశ్వరుఁడై, సర్వపూజ్యుఁడై, సర్వరూపుఁడై యుండెను. ఆమహాత్ముని మోమున సుస్మిత మొప్పుచుండెను. తేజస్సు మోమునుండి వెడలుచుండెను.

ఆమహామహుని గాంచినంతనే శుక్రుం డతిభీతుఁడై లేచి సాష్టాంగనమస్కారము లొనరించెను. పాదారవిందములపైఁ బడి లేవకుండెను. పరమేశ్వరుఁ డాశుక్రునకు శుభాశిషము లొసంగి కూరుచుండ నియోగించెను. అంతలో శుక్రుఁడు పరమేష్ఠిం గాంచెను. ఆతఁడు శాంతస్వరూపుఁడు,లోకకర్త, రత్నస్యందనారూఢుఁడు. సకలరత్నభూషణభూషితుఁడు. ప్రసన్నముఖపంకజుఁడు. జగదీశ్వరుఁడు. సర్వకర్మఫలప్రదాత. తపస్స్వరూపుఁడు. తపస్వినాయకుఁడు. వేదజనకుఁడు. మనోహరాంగుఁడు. అట్టిబ్రహ్మను గాంచినంతనే శుక్రుఁడు భీతుఁడై లేచి నమస్కరించెను. బ్రహ్మయు నాతనిం గూరుచుండ నియోగించెను. శుక్రుఁడాశంకరపంకజాసనుల పాదారవిందముల కతిభక్తితోఁ బూజలు సమర్పించెను. వారిని గుశలప్రశ్నములచే నాదరించుట యనుచితము కదా.

బ్రహ్మయుఁ దనయెదుట నున్నశుక్రుని సకలనీతిసార వేత్తను గాంచి శంకరుననుమతిం గైకొని యిట్లు పలికెను. శుక్రాచార్యా! చంద్రుని దుర్నీతిని వివరింతు. ఆలకింపుము. అది మూఁడులోకములకు సిగ్గును గల్గించునది. వేదవిరుద్ధము. తార స్నానముచేసి యింటికింబోవ నుద్యుక్తురా లగుచుండెను. చంద్రున కామె గురుభార్య. అందును బతివ్రత. ఆమెను బలవంతముగాఁ బరిగ్రహించి యిపు డీపాపాత్ముఁడు నీమఱుగుచేరి యున్నవాఁడు. వత్సా! శుక్రా! సురసైన్యము యుద్ధోన్ముఖముగ నున్నది. చూడుము. నేనును శంకరుఁడు నీకార్యార్థము నీచెంత కరుదెంచితిమి. అనునంతలో శంకరుఁ డిట్లనియె. భార్గవా! నీక్షేమము నాశించితివేని చంద్రుని బిలుపింపుము. పాపాత్ముఁడగునాతనిమస్తకము నీత్రిశూలమున ఖండించెద. లేకున్న రాక్షసులనందఱ నిపుడే ఖండించెదను. ఈకార్యమొకక్షణమున సాగునని నమ్ముము. విప్రా! నేను గోపమూన రాక్షసుల రక్షించువాఁ డెవ్వఁడు? పాశుపతము, వాయవ్యాస్త్రమును బ్రయోగించి యిపుడే దేవతావైరుల నిర్మూలించెదను. ఇది నాకు విలాసకార్యము. మదంశసంభూతుఁడు దుర్వాసుఁడు. ఆతనిగురువు బృహస్పతి. ఈసంబంధమును బరికింప బృహస్పతి నాకుం బూజ్యుఁడు. తేజస్వియగుబృహస్పతి యీచంద్రుని భస్మము చేయఁజాలును. కృపాళువై యాపనిచేయఁ బూనఁడయ్యెను. ప్రియశిష్యుఁడనునదియు నొకహేతువే యగును. ఉతథ్యమునిపత్నిం జూచి మున్నీగురువు కామించెను. ఆమునిశాపమున నీతనిపత్ని

పరగృహీత యయ్యెను. కావున గురుపత్నియగు తారను బృహస్పతి కిప్పింపుము. భార్తృపత్నిని హరించి నాకువిరోధియై పాపాత్ముఁడగుచంద్రుని శరణాగతుఁడు దీనుఁడునన్నకారణమున రక్షింపఁబూనను. పదునల్వురింద్రులుండుదాఁక నీ చంద్రుఁడు నరకమునఁబడియుండవలయును. శరణాగతుఁడు పాపాత్ముఁడు కావున నిచ్చట విచారింపవలసినపని లేదు. ఏపాపాత్ముఁడు శరణుచొచ్చునో వాఁడు రక్షింపఁదగఁడు. మాతృగామియగు నా చంద్రుని బిలువనంపుము. భస్మమొనరించెదను. వాని నీయాశ్రమమునుండి తారతోఁగూడ బహిష్కరింపుము. అని శంకరుఁడు పలుక శుక్రుఁ డిట్లనియె.

మహాప్రభూ! సురాసురులకును సకలలోకములకును శిక్షకుఁడవన నీవే. ఇంకొకఁ డెవ్వఁడు కలఁడు? సాక్షాత్పరమేశ్వరుఁడవు. ఇట్టి నీవు దేవతలకు సాయమొనరించి రాక్షసుల నెట్లు వధింతువు? సకలలోకసంహర్తవగు నీకు రాక్షసులయందు మాత్రము పౌరుష మేటికి? శంకరా! నీవు జ్యోతిస్స్వరూపుఁడవు. పరబ్రహ్మమవు. సగుణనిర్గుణభేదముల నలరుచుందువు. గుణభేదములనుబట్టి బ్రహ్మవిష్ణుశివాత్మకముగ రూపభేదము గల్గినది కాని వేఱుకాదు. బలివాకిట గదాపాణియై యుండు వాఁడవు నీవే కదా. దేవేంద్రునకు నైశ్వర్యము నీవే యొసంగితివి కదా. శంకరా! క్షమింపుము. కోపమూపకుము. నీకీతుచ్ఛుల విషయమై పౌరుష మేల ? బ్రాహ్మణహింస కేలపాల్పడియెదవు? నేను జీవించియుండి చంద్రు నీయఁజాలను. చంద్రుఁడు శరణాగ

తుఁడు. దీనుఁడు. ఆర్తుఁడు. లజ్జాసంక్రాంతుఁడు. పాపయుక్తుఁడు. నేనో శంకరా! నీ పాదారవిందముల నాశ్రయించితిని. శరణాగతుఁడను. నన్ను రక్షింపుము. ఆ మీఁద నీకు నేదియుచితమని తోఁచునో యట్లు చేయుము. జగంబుల నన్నింటిని గాపాడను హింసింపను నీకు శక్తిగలదు. అని శుక్రుఁడు పలుకఁ బ్రసన్నుఁడై శంకరుఁ డిట్లు పలికెను. భార్గవా! నిశానాథునిఁ బిలిపింపుము. ఆతనికి మేలు గలుగు. అనునంతలో బ్రహ్మ శుక్రుని బురికొలుప తారకాసహితముగా నిశానాథునిఁ బిలిపించెను. శంకరుచరణారవిందములపైఁ బడవైచెను.

ఈశ్వరుఁడు ప్రీతుఁడై శీతాంశువును జేరదీసికొనియెను. పాదరేణువును జంద్రుని శిరముపై నునిచి నిష్పాపుఁడవైతివనెను. తనకరకమలమును జంద్రునిశిరమున నునిచి యభయదాన మిచ్చెను. క్షీరసాగరమున స్నానముచేయించి ప్రాయశ్చిత్తము చేయించి నిష్పాపునిగా నొనరించెను బ్రహ్మయు నీవు నిష్పాపుఁడవని చంద్రు నూఱడించెను. ఈశ్వరుఁడు యోగశక్తిచే నాతని రెండుఖండములుగా నొనరించి లలాటమున నర్ధభాగము నునుచుకొనియెను. పరమేష్ఠియు నందుల కాశ్చర్యపడియెను. ఈ హేతువును బట్టియే చంద్రుఁడు చంద్రశేఖరుఁడయ్యెను. చంద్రుఁడు లజ్జితుఁడై దేవసభయందుఁ గళంకియయ్యెను. స్వయోగముచే లజ్జితుఁడై దేహత్యాగ మొనరించెను. ఆతనువు పాలసంద్రమునఁ బరమేష్ఠి యునిచెను. అత్రిమహర్షి పుత్రమృతికై క్షీరోదధితీరమున విలపించెను. అత్రిముని నేత్రోదక మాజలములఁ గలిసెను. దాన దేవసభయందున్న

చంద్రుఁడు నిష్పాపుఁ డయ్యెను బ్రహ్మయు శంకరుండును గరుణాజలంబుల నాతనిం దడిపిరి. మహాదేవుఁ డంత నాతనిం గని నిర్భయుఁడ వగుమని మఱియు నిట్లు పలికెను.

పుత్రకా! స్వస్థానమునకుం బొమ్ము. నీ చేయుచున్న కృత్య మొనరించుచుండుము. తారాశాపమున రాజయక్ష్మరోగ గ్రస్తుఁడవు కాఁగలవు. పతివ్రతాశాపమును వ్యర్థముచేయ నెవ్వఁడు సమర్థుఁడు గలఁడు? నాయనుగ్రహమున క్షయరోగ మునకుఁ బ్రతీకారము గల్గును. ఏకారణమున భాద్రపదశుక్లచ తుర్థిదినమున నీవు గురుపత్నీవ్రతక్షతి నొనరించితివో ఆకారణ మున నా తిథియందుమాత్రము పాపులచేఁ జూడఁదగియుం డుము. కర్మము భుజింపఁబడక నశింపదు. ఎన్నికల్పములకైన నది భుజింపఁబడవలసినదియే యగు. కాన శుభాశుభకర్మము నవశ్యము భుజింపవలయును. దేహత్యాగమునఁ గర్మభోగము నశింపదు. తగినప్రాయశ్చిత్తమున నది నశించును. ఇది సత్యము. తారాపహరణపాపమునఁ జంద్రమండలమునఁ గళంక మొద వును. అది మృగాకారమున వ్రేలాడఁ గలదు. ఇదియు నొక రీతి నీకలంకారము కాఁగలదు.

అని పలికి తారను జేరఁబిలిచి పతివ్రతా! నావాక్యము నాలకింపుము. సత్యముమాత్రము చెప్పుము. ఎవనివలన నీకు గర్భము గలిగెను. దానిని వానికి వదలుము. పరిశుద్ధురాల వయ్యెదవు. జారుఁడు బలవంతపఱుపఁగా నకామమున నతనికి లోఁబడెనేని దోషము గలుగదు. కామమున వ్యభిచరించిన

నరకమునఁ బడును. అనిపలుక బ్రహ్మను గనుంగొని శంకరుఁడు వినుచుండఁ దారాదేవి యీగర్భము చంద్రునిదే అన విని దేవతలు నవ్విరి. శంకరుఁడు మునులును నవ్విరి. అంత బ్రహ్మయు లజ్జనొందియుండు బృహస్పతికిఁ దార నిచ్చెను. పతివ్రతయని నిర్ధారణమొనర్పఁబడిన యాతారను గైకొని యింటికిం బోయెను.

చంద్రుఁడాతారాగర్భమునుండి కలిగినకుమారుని సుందరాకారుని గనకవర్ణుని గైకొని దేవతలకుఁ బరమేష్ఠికి శంకరునకు నమస్కరించి తనస్థానమునకుఁ బోయెను. దేవతలు మునులు శంకరకమలాసనులును దమతమనిలయంబుల కరిగిరి. మహోవార్షమున శుక్రుఁ డసురగణంబులంగూడి తననెలవునకుం బోయెను. నందరాజా! ఈయితిహాసమును జెప్పితిని. దీనిం జదివిన నిష్కళంకుఁడు నిష్పాపుఁడు నగును. సర్వలాభములు దీనం గలుగును. నీవింక శోకమును వదలుము. ఆనందమున గోకులమున కరుగుము. ఈవిషయములన్నియు యశోదాదేవికిని గోపికాగణములకు నుపదేశింపుము. శోకార్తులగు గోపికాజనములకుఁ జక్కఁగా బోధింపుము. నాయీయుపదేశమున హర్షయుక్తుఁడవగుదువు. అని పలికి శ్రీకృష్ణపరమాత్మ యూరకుండెను.

ఆర్యమహాశయులారా! భాద్రపదశుక్లకృష్ణపక్షచతుర్థిదినచంద్రదర్శననిషేధమును జెప్పుచు భగవంతుఁడు చెప్పిన తారాచరిత్రమును బఠించితిరి. తారాశశాంకకథ యపవిత్రమని దుర్నీతిదాయకమని లోకమున వాడుకకలదని నేఁజెప్పఁబనిలేదు.

అవి యందఱకుఁ దెలిసినవిషయము. కాని యిట్టికథను దెలిపిన పిదప శ్రీకృష్ణుఁ డీకథ పరమపవిత్రమైనది. పాపక్షయము దీనిఁ బఠించినఁ గలుగును. సర్వసంపదలు లభించును అనియెను ఇట్టి దుర్నీతిని బోధించుకథ పరమపావనమని తెల్పఁ గారణముం డియే తీఱవలయుఁ గదా. వినుఁడు. ఉష్ణోదకము పోయుట వలన నిండ్లు కాలిపోవునని భయంపడినట్లు మనవారిలోఁ గొం దఱు తారాశశాంకము లోనగుకథ లనర్థదాయకములని చదు వరాదనియు ముఖ్యముగా స్త్రీలు నవయౌవనవంతులగుపురు షులు చదువరాదనియు నుపన్యసించుచుందురు. ఈకథను బఠిం చినందున నట్టిచెట్టలుగలుగునా యని విచారింతము. భగవం తుఁడు బుద్ధిబలమునందఱ కిచ్చియున్నాఁడు గాని కొందఱకు మాత్రమే కాదు. ఇచ్చినబుద్ధిని గొందఱు దుర్వినియోగము చేయుదురు. కొలఁదిమంది సద్వినియోగము చేయుదురు. మఱి కొందఱద్దాన నేపనియుఁ జేయక యూరక యుందురు. నందునకు శ్రీకృష్ణపరమాత్మ తత్త్వముపదేశించుచుఁ గొన్ని పదార్థములఁ జూడరాదని తెల్పుచు నీయుపాఖ్యానమును దెల్పును. చదువఁ దగనిగాథలు పురాణములయందుఁ జేర్పఁబడియుండవు. అన్ని యు నీతిదాయకములయియే యుండును. ప్రకృతతారాశశాం కగాథ యెట్టిదని విచారింపక తప్పదు. "స్థితస్య గతిశ్చింతనీయా" యనున్యాయము ననుసరించి యీపురాణగాథ యెట్లున్నదో యోజింపుఁడు. ఇతరగ్రంథస్థమగు నీగాథనే స్మృతికిఁ దెచ్చు కొనక దీనినిమాత్రమే విమర్శింతము.

తార మందాకినీస్నానార్థ మరుదెంచి కృత్యముం దీర్చి యింటికిం బోవ నుద్యుక్తురాలయి యుండెను. చంద్రుఁడు తారాంగనామణిని గాంచి కామపరవశుఁ డయ్యెను. ఖగోళ మందున్నచంద్రుఁడే రథారూఢుఁడై యరుదెంచి యెట్లు మోహించెనని ప్రశ్నించువారును గలరు. ఖగోళమందగపడునది చంద్రమండలము. అదియొక గోళము. అనఁగా నొక లోకము. అంతియ కాని యొకపురుషుఁడు కాఁడు. గోళోపాధికజీవులు గలరు. గోళాధిష్ఠాత గలఁడు. అతఁడే యీతఁడన్ననవచ్చును గాని పరిదృశ్యమానముమాత్రము గోళము. ఆగోళము జలమయము. సూర్యతేజస్సు ప్రసరించినతావుమాత్రము ప్రకాశించును.

"సలిలమయే శశిని రవేర్దీధితి......"

"తేజసాంగోళకస్సూర్యో గ్రహర్క్షాణ్యంబుగోళకాః."

అను ప్రమాణములు సిద్ధాంతమునఁ గలవు. భూగోళమున కెట్లు భూదేవి యధిష్ఠాతృదేవతయో చంద్రలోకమునకు నట్లే యని యెఱుంగవలయు. ఇటఁ జంద్రుఁడే యర్థము కాని చంద్రగోళము కాదు. ఆచంద్రుఁడు మోహపరవశుఁ డయ్యెను. ఆకారమునుబట్టిచూడఁగాఁ దారయు నవయౌవనస్ఫురితయగుట కాముకివలెఁ దోఁచును. బలాత్కారమునఁ జంద్రుఁ డామెను రథమున నిడుకొనియెను. అత్తఱిఁ దార పల్కినపల్కు లెట్టివో యోజింపుఁడు.

"త్యజ మాం త్యజమాం చంద్ర సురేషు కులపాంసన."

అనుమొదలగు పల్కులం బల్కెను. గురుపత్నిని. నీకుఁ దల్లిని. మాతృగమనము మహాపాపకార్యము. అనులోనగు నీతుల నెన్నింటినో తెలిపెను. ఇరువురు కాముకులే యైనచో వారి మాటలు వేఱు. ఇందుఁ దార పతివ్రత. కానఁ బుత్త్రునితోఁ దల్లిపల్కినట్లే పల్కెను. మన్మథభ్రాంతుఁడు కాన శీతాంశుఁ డామెను బలాత్కరించెను. ఇష్టానుసారమాయాయి తావులకుం దోడుకొని పోయెను. కొలఁదికాల మా తారం గూడి యుండెను. ఇంతదనుకఁ గలకథనుబట్టి యూహించినచోఁ దార పతివ్రత కాదని కాని చంద్రునియందుఁ బ్రీతికలదని గాని యూహింప నవకాశమే లేదు. వారిరువు రుండుతావునకు శుక్రుఁ డరుదెంచెను. శుక్రునిపాదములపైఁ బడి చంద్రుఁ డున్నదున్నట్టు తెలిపి శరణుచొచ్చెను. అంత శుక్రుఁ డేమిచెప్పెనో యించుక యోజింతము. తారయుఁ గామాతురయే యైయున్నచో శుక్రుఁ డిట్టిమాటలు పల్కునా యనియు నూహింతము.

"ప్రియాయ తత్ప్రియాం దత్వా శీఘ్రం త్వం శరణం వ్రజ
గురుపత్నీం మాతృతుల్యాం త్యజ మద్వచనాద్విధో.
కురు పాపక్షయం పాపనివృత్తిస్తు మహాఫలా
సతీనాం గురుపత్నీనాం గ్రహణే చ బలేన చ
బ్రహ్మహత్యాసహస్రాణాం పాతకం లభతే జనః."

అని పెక్కురీతుల నుపదేశించెను. తనకు విరోధియగు బృహస్పతిభార్య నెవరేమిచేసిన మేలే యనుదురూహ గలవాఁడు

శుక్రుఁడని వచింప నవకాశములేదు. నీతిశాస్త్రవిద్వరిష్ఠుఁడు గావునఁ జెప్పఁదగునీతుల నుపదేశించెను గురువును బొగడెను. ఆయనశక్తిని దెలిపెను. తత్పత్ని మాతృతుల్యయని తేటపఱచెను. ఇట్లు తెలిపి గురువునకుఁ దత్పత్ని నర్పించి శరణువేఁడుమని తెలిపెను. ఇంతవఱకుఁ గలకథను బట్టి యూహించినను దార దుర్వృత్తి గలదని తేలదు. తనపాతివ్రత్యమహిమమునఁ జంద్రుని భస్మముగా నేల చేయలేదన్న ప్రశ్నము కలదు. కాని తార మహాగ్రహముతో శీతాంశుని శపించెను. కాని యేమైనను సరే యని యాతఁడామెను బలవంతము చేసెను. కావునఁ దార కాముకురాలైన శపించి యుండదు గదా. ఎన్నివిధముల నీకథనుబట్టి యాలోచించినను దార దుర్వృత్తిసంపన్నురా లనుభావ మేమాత్రము తోఁపకున్నది.

ఆవల దేవపురోహితునకుఁ గల్గినయవమతి నోర్వక దేవతలు యుద్ధమునకేతెంచిరి. శంకరవిరించు లరుదెంచిరి. మహర్షులు ధర్మము నుపదేశింప నరుదెంచిరి. శుక్రునియానతి రాక్షసు లరుదెంచిరి. ఆవల శంకరుఁడు బ్రహ్మయు శుక్రునిచెంతకు వచ్చిరి. ఏల? ధర్మమేదియని నిశ్చయించుటకు. శుక్రుఁడు సకలశాస్త్రపారంగతుఁడయ్యు నేల చంద్రునిఁ జేపట్టెనని యెఱుంగుటకు వచ్చిరి. సంవాదము సాగెను. శంకరుని క్రోధము చల్లారెను. చంద్రుని గరుణించెను. తారను బ్రశ్నింప సత్యము దాఁపక చెప్పెను. అపుడు కూడ బొంకినది కాదు. దీనింబట్టి యూహిం

చినను దార శీలమున నించుకయు లోపము గలదని వచింప వలనుపడదు. సత్యము తప్పనితారను దుశ్శీల యనఁదగునా. చంద్రునకు శాపమిచ్చినందునఁ గామమోహిత యనవచ్చునా. ఆమెయందు దోషముండిన బ్రహ్మయు శంకరుఁడును బృహస్పతితో మరలఁ దారను బరిగ్రహింపుమని పలుకుదురా. ఇందఱుండినమహాసభలో నిది చర్చింపఁబడునా. కావునఁ దారయం దించుకంతయు నీకథనుబట్టి యూహింప దోషమున్నట్లగ పడదు.

పరపురుషుఁ డంటిన నారిని బరిహరింపక పరిగ్రహింప వచ్చునా యనుప్రశ్న మొక్కఁడు కలదు. దానికి స్మృతికర్తలే సమాధానము తెల్పిరి. ఆవిధము నిట వ్రాసెదను.

శ్లో. చాతుర్వర్ణ్యస్య నారీణాం కృచ్ఛ్రం చాంద్రాయణం స్మృతం
యథా భూమి స్తథా నారీ తస్మాత్తాం న తు దూషయేత్
బందీగ్రాహేణ యా భుక్తా హత్వా బధ్వా బలాద్భయాత్
కృత్వా సాంతపనం కృచ్ఛ్రం శుద్ధిం పారాశరోఽబ్రవీత్
సకృద్భుక్తాతు యా నారీ నేచ్ఛంతీ పాపకర్మభిః
ప్రాజాపత్యేన శుధ్యేత ఋతుప్రస్రవణేన చ.

పరాశరస్మృతి. ౧౦ అధ్యాయము. ౨౬ శ్లో.

తెలియకయో విధిలేకయో చేసినదోషములకుఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడినది. తార తానబలగావునఁ • దాఁజేయునది లేక యుండినది. కావుననే త్రికాలజ్ఞు లందఱును జేరి తార యందు దోషములేదని యొతింగించిరి. అట్టితారను బలవంత

పఱచినందులకే చంద్రుఁడు శాశ్వతముగాఁ బాపమనుభవించు వాఁ డయ్యెను. ఏదినమున నిట్టిపాపము చేసెనో ఆదినమునఁ జంద్రునిఁ జూడరాదని నిషేధించిరి దీనింబట్టి యూహించినచోఁ బాపాత్మున కపకీర్తి తప్పదనియు నదొక్కనాఁడు క్షీణించునది గాక చిరకాలము బాధించున దనియు స్పష్టమయ్యెడి. కావున బృహస్పతిపత్నియందు మనమారోపించుదోషములు వాస్తవముగా లేవనియు భ్రాంతిచేఁ గల్పింపఁబడినవనియు నామెపతివ్రతయే యనియు మన మెఱుంగవలయును. అట్టి పురంధ్రిని మోహించిన చంద్రున కపకీర్తి శాశ్వతముగాఁ గలిగినది. కాఁబట్టి యీకథను జదివి నేర్చుకొనఁదగిననీతి యేమనఁగా విచారములేక తారతమ్యము తెలియక పరకాంతలఁ గోరినవారికిఁ దత్పాపము సదా బాధించునది యగుననియు నపకీర్తి కలుగుననునదియే. ఈనీతిని లోకులకుం దెలుపుటకే భగవంతుఁ డీకథ నుపదేశించెను. ఇట్టిధర్మములను దెలుపుగాథ పరిశుద్ధము గాక మఱెట్టిదగును. ఇంక నీవిషయమును దడవుగఁ దడవక తరువాతిభగవత్కథను వ్రాసెదను.

## దుస్స్వప్నప్రాయశ్చిత్తములు.

* ఇట్లు శ్రీకృష్ణమూర్తి పలుక నందుఁడు శ్రీకృష్ణా! నీవువచించినగాథను వింటిని. దుస్స్వప్నములకుఁ బ్రాయశ్చిత్తము, దుస్స్వప్నములను వివరింపుమా. యని యడుగ శ్రీహరి

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదిరెండవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపవలయును.

యిట్లు పలుక నారంభించెను. నందరాజా! వినుము. స్వప్నమున నవ్వినను, వివాహమును సంతసమునఁ జూచినను నృత్తము గానము చేయుటను గాంచినను వానికి విపత్తి కలుగక మానదు. స్వప్నమున నెవనికిఁ దనదంతములు ఛేదింపఁబడినట్లగపడునో దాను దిరుగుచున్న ట్లెఱుంగునో ధనహానియు శరీరపీడయు వానికిఁ గల్గును. ఎవఁడు నూనెతోఁ దలయంటుకొని దక్షిణ దిశకుఁ దాఁబోయినట్లు కలగాంచునో అందును ఖరోష్ట్రమహిష ముల నెక్కినట్లు గాంచునో వానికి మరణము శీఘ్రకాలమునఁ గలుగును. కలలో నెవఁడు తనచెవిలో జపాకుసుమము, నశో కమును, గన్నేరుపూవును బెట్టుకొన్నట్లు చూచునో వానికి విపత్తి తప్పదు. తైలలవణములను గాంచినను విపత్తికల్గును. వివస్త్రయై నల్లనిరంగుగలిగి నాసికలేకయుండు శూద్రవిధవను గాంచినను, గవ్వలు, తాటిపండు, కనఁబడినను శోకముగలు గును. కోపముతో నున్నవిప్రుని, విప్రపత్నినిగాని చూచిన నాపద తప్పక కల్గును. వానియింట నుండనొల్లక లక్ష్మి వెడలి పోవును. వనపుష్పము, రక్తపుష్పము, మోదుగుపూవు, పత్తి, శుక్లవస్త్రమును గాంచిన దుఃఖము కల్గును. నల్లచీరనుగట్టుకొని నీలదేహము గలిగినవిధవ సంగీతముపాడుచు నవ్వుచుండఁగాఁ జూచినయెడల మృతి గల్గును. దేవత నృత్తముచేయుచుఁగాని, పాడుచుఁగాని, నవ్వుచుఁగాని, భుజము లప్పళించుచుఁగాని, పరుగెత్తుచుఁగాని కనఁబడినచో వానిదేహ మీభూతలమున నిలువదు. వాంతిచేసికొనునట్లుగాని, మూత్రపురీషములనుగాని,

వైదూర్యనిగాని, వెండినిగాని, బంగారమునుగాని గాంచినవాని జీవితము పదిదినములకంటె నెక్కుడుకాల ముండదు. కృష్ణవస్త్రమునుదాల్చి కృష్ణమాల్యానులేపనముల ధరించియున్ననారి యొవనిఁ గౌఁగిలించుకొనునో వానికి మృతి త్వరగా లభించును. మృతశిశువును, ముండమును, మృగసంబంధముగాని, మనుష్యసంబంధముగాని చూచినను, ఎమ్ముకలహారమును ధరించినట్లు కలగాంచినను శీఘ్రమరణము కల్గును. ఖరములనుగాని, ఉష్ట్రములనుగాని కట్టినరథము నొంటిరిగా నెవ్వఁ డెక్కినట్లు కలగనునో మేల్కొనినవెంటనే మృతినొందును

హవిస్సు, క్షీరములు, తేనె, మజ్జిగ, బెల్లముఁ నను వీనిలో దేనిచేతనైనను దేహమంతయుఁ దడుపఁబడినట్లు కలగాంచిన వానికి శరీరపీడ కల్గును. రక్తాంబరమును ధరించి రక్తపుష్పహారములను దాల్చి రక్తచందన మలందియున్న కాంతను నెవ్వఁడు కౌఁగిలించుకొనినట్లు కలగాంచునో వానికి మహాత్తరవ్యాధి తప్పక కల్గును. కేశములు గోళ్లు పడిపోయినట్లుగాని, నిర్వాణాంగారమును గాంచినట్లుగాని, భస్మముచే నిండినచితిని గాంచినట్లుగాని, కలవచ్చిన మృతి శీఘ్రమునఁ గల్గును శ్మశానము, శుష్కకాష్ఠము, తృణములు, లోహము, శమీవృక్షము, కృష్ణవస్తువులు ననునివి దుఃఖదాయకములు. పాదుకయు, ఫలకము, భయమును గల్గించుపుష్పమాల్యము, మాషమసూరముద్గములు కనఁబడిన నప్పుడే వ్రణబాధ యంకురింపక విడువదు. కటకము, సరటము, కాకము, భల్లూకము,

వానరము, కొండముచ్చు, కంపుగొట్టుదేహమలము కలఁ గనఁబడిన వ్యాధి గల్గును. పగిలినకుండ, దెబ్బదిన్నశూద్రుఁడు, కుష్ఠరోగపీడితుఁడు, రక్తవస్త్రము, సన్యాసి, పంది, మహిషము, గార్ధభము, కటికచీకటి, మృతజంతువు, నసువీనిలో దేనిని జూచినను విపత్తి కల్గును. కుత్సితవేషము గలమ్లేచ్ఛుఁడు, భయంకరరూపముగల్గి పాశహస్తుఁడైయుండుయమదూత కనఁబడినచో మృత్యువు కల్గును. విప్రుఁడు, విప్రస్త్రీ, బాలిక, బాలకుఁడు, బ్రాహ్మణపుత్రికాపుత్రులు కోపమున విలపించుచున్నట్లు కలగాంచిన దుఃఖము కల్గును. కృష్ణపుష్పమాల్యములు, కృష్ణసస్యము, శస్త్రాస్త్రధారియగుపురుషుఁడు, వికారరూపముగలమ్లేచ్ఛస్త్రీ కలఁదోఁచిన మృత్యువు కల్గును. ప్రాణములు పోవుచున్నవానిం గాంచిన సద్యోమృతి కల్గును. చేఁపలుమొదలగువానిని మోసినట్లైన నట్టికలగన్నవానిభార్యత మృతినందును. వాద్యనర్తనగీతములు, రక్తవస్త్రమును దాల్చి పాడుచున్నగాయకుఁడు, వాయింపఁబడుమృదంగము, కనఁబడిన దుఃఖము కల్గును. ఛేదింపఁబడినశరీరము, శిరస్సులేనిదేహము, వెంద్రుకలు విరియఁబోసికొని నృత్యమొనరించుపురుషుఁడు కలలోఁ దోఁచిన మృతి గల్గును. మృతినొందిన పురుషుఁడుగాని స్త్రీగాని, వికారరూపముగలమ్లేచ్ఛస్త్రీగాని తన్ను నాలింగనముచేసికొన్నయట్లు కలదోఁచిన మృత్యువు కల్గును. తప్పదు.

ఎవ్వనిదంతములు భగ్నములై పడునో, ఎవ్వనికేశములు రాలిపోవునో వానికాస్వప్నము ధనహానిం గూర్చును. కొమ్ములు

గల జంతువులు కాని,కోఱలుగలజంతువులుగాని యెవనికుపద్రవ మును స్వప్నమునఁ గల్గించునో వానికి రాజభీతి గల్గును. బాల కుఁడుగాని మానవులు గాని యుపద్రవమును గల్గించినను రాజ భయము తప్పదు. వృక్షము ఛేదింపఁబడిపడుచున్నట్లు, శిలా వృష్టి కురియుచున్నట్లు, తుషారవృష్టి కురియుచున్నట్లు, కత్తిని బట్టుకొన్నట్లు, రక్తాంగారమును భస్మవృష్టిని జూచినట్లు కల వచ్చినఁ దప్పక దుఃఖము కల్గును. గృహము, పర్వతము, ధూమ కేతువు, భుజములు తెగినపురుషుఁడు కలలోఁ దోఁచిన దుఃఖము గల్గును. రథమునుండి, గృహముపైనుండి, కొండనుండి, వృక్ష మునుండి, గోవునుండి, ఏనుఁగునుండి, గుఱ్ఱమునుండి, ఆకాశ మునుండి, భూమిపైఁబడినట్లు కలగాంచినవాఁడు విపత్తినొం దును. భస్మము, నిప్పులు, పొట్టునిండియున్న గర్తమునుండి పడి నట్లుగాని, క్షారకుండములంబడి చూర్ణమైనయట్లుగాని, కలగాం చినవాఁడు వెంటనే మృతినొందును. సంశయము లేదు. దుష్టుఁ డెవనిమస్తకమునుండి బలవంతముగా ఛత్రమును లాగికొనునో వాఁడు తండ్రి గురువు రాజునను వీరిలో నొకరిచావును వినఁ గలఁడు. ఎవనియింటనుండి సవత్సకముగా గోవు భీతిచే వెడలి పోవునో వానియింట నుండనొల్లక లక్ష్మి పరుగిడును. భూదే వియు నాపాపాత్మునింట నుండదు. యమదూత లెవనిని పాశ ములఁగట్టి తీసికొనిపోవుదురో మ్లేచ్ఛులుకూడ నష్టే చేయు దురో వానికి మృతితప్పదు గణకుఁడుగాని బ్రాహ్మణుఁడుగాని బ్రాహ్మణస్త్రీగాని గురువుగాని పటుతరరోషమున నెవనిని శపిం

తురో వాఁడు విపత్తినొందును. శత్రువులు, కాకములు, కుక్కుటములు, భల్లూకములు, తమంతనవచ్చి యెవనియొడలిపైఁ బడునో వాఁడు త్వరగ మృతినొందును. దున్నపోతులు, ఎలుఁగుబంట్లు, ఒంటెలు, పందులు, గాడిదలు రోషంబున నెవరిని దరిమినట్లు కలవచ్చునో వాఁడు రోగబాధితుఁ డగును.

## దుస్స్వప్నశాంతులు

రక్తచందనదారువులు నేతితోఁదడిపి సహస్రవారములు గాయత్రిమంత్రముతో హోమము చేసిన దుస్స్వప్నశాంతి యగును. భక్తిచే సహస్రపర్యాయములు మధుసూదనునిఁ ధ్యానించుచు మంత్రజప మొనర్చిన నిష్పాపుఁడగును. స్వప్నదోషములు నశించును. అచ్యుత కేశవ విష్ణు హరి సత్య జనార్దన హంసనారాయణనామాష్టకము దీనిని బఠించిన శాంతియగు. పరిశుద్ధచిత్తుఁడై ప్రాఙ్ముఖుఁడై పదిపర్యాయము లీనామాష్టకమును బఠించిన దుస్స్వప్నము సుస్వప్నఫలము నీఁజాలును. విష్ణు నారాయణ కృష్ణ మాధవ మధుసూదన హరి నరహరి రామ గోవింద దధివామన నామదశకమును నూఱుపర్యాయములు జపించిన భక్తునకును దుస్స్వప్నము సత్ఫలమొసంగును. రోగశాంతి యగు. ఈదశనామములను లక్షపర్యాయములు జపించిన బంధముక్తుఁ డగును. దశలక్షపర్యాయములు పఠించిన వంధ్య సంతానవతి యగును. హవిష్యమును దిని దరిద్రుఁడు జపించిన ధనవంతుఁ డగును. కోటివారములు జపించిన జీవన్ముక్తుఁడగును. "ఓం నమః" అనువర్ణముల నాదియందు నిలిపి శివదుర్గాగణపతి

కార్తికేయదినేశ్వరధర్మగంగాతులసీ రాధాలక్ష్మీసరస్వతీనామ మంత్రమును జలములనుండి యెవఁడు జపించునో వాంఛిత ములు ఫలింప దుస్స్వప్నము సుస్వప్నమగును.

విరాడ్బీజమును, మాయాబీజమును, లక్ష్మీబీజమును, కామరాజబీజమును దొలుతఁజేర్చి "పూర్వదుర్గతినాశిన్యై మహా మాయాయై స్వాహా" యనుమంత్రమును బదునేడక్షరములు గలదానిని నియతిమైఁబదిపర్యాయములుజపించిన దుస్స్వప్నము శుభఫలముల నొసంగును. ఈమంత్రమును గోటివారములు జపించినమంత్రసిద్ధియగును అది సర్వసిద్ధుల నొసంగు. ప్రణవము నాదినునిచి నమశ్శబ్దము దానిపిదపఁ బఠించి "మృత్యుంజయాయ స్వాహా" అనిపలికి యీమంత్రమును లక్షపర్యాయములు జపించినచో దుస్స్వప్నము మృతినిగల్గించునదైనను శతాయుష్యము నొసంగును. పూర్వోత్తరముఖుఁడై స్వప్నమును బ్రాజ్ఞుఁడు వచింపవలయు. కాశ్యపునందును, దుర్గతిగలవానియందును, నీచునియందును, దేవబ్రాహ్మణుల నిందించువానియందును, మూర్ఖునందును, అనభిజ్ఞునందును స్వప్నము వినివేదింపరాదు. అశ్వత్థవృక్షముచెంతను, గణకునిచెంతను, విప్రుసన్నిధిని, పితృ దేవాసనములయందును, పూజ్యునియొద్దను, విష్ణుభక్తునిపరిసర మునను పగటిస్వప్నమును జెప్పవలయును. నందమహీపాలకా! దుస్స్వప్నవిషయము తచ్ఛాంతియుఁ దెలుపు నీవిషయమును దెల్పితిని. ఇది పాపనాశనము. ధన్యము. యశస్కరము. ఆయుః ప్రదము. ఇంక నేమి వినఁగోరుదువో తెల్పుమా యనిపలికెను.

మహాశయులారా! దుస్స్వప్నములను, వానిఫలములను, వానిశాంతులను భగవంతుఁడు నందునకుఁ దెలిపెను. ఆగాథను వింటిరి. దీనిసారము నవధరింపుఁడు. ఇంతకుముందే రోగికి, సదా చింతాపరాయణునకు స్వప్నములు ఫలమునీఁజాలవని చెప్పఁబడిరెు. స్వస్థచిత్తునకు నాకస్మికముగా నిట్టి వేల రావలయును? అని యోజింపుఁడు. మనకు భవిష్యత్కాల ఫలముల నిట్టిదుశ్చిహ్నములు తెలుపును. కల కల్ల యనుపామరులాడుమాటల నమ్మకుఁడు. ఫలములు స్వప్నములవలన గల్గియే తీఱును. తప్పదు. భవిష్యత్ఫలములను స్వప్నములు దెలుపుచో నిఁక వానికి శాంతియేల? రానున్న ఫలములు రాకమానవు కదా. యని మాత్రము ప్రశ్నింపకుఁడు. అది మోటుప్రశ్నము. ఏలయనఁ బ్రతిప్రాణికిఁ గాలమృత్యువనునది, అకాలమృత్యువనునది యుండును. శాంతులు లోనగునవి యన్నియు నకాలమృత్యువునకే కాని కాలమృత్యువునకుఁ గాదు. ఎట్టి దుష్ఫలములను ధర్మము తొలఁగించును. ధర్మమే భగవత్స్వరూపము కదా! మంత్రము భగవన్నామములలో నొకటియని నాభావము. ఇన్నిపద్ధతు లేల! ఒక్కపద్ధతి చాలదా యని యడుగకుఁడు. ప్రాణికోటు లసంఖ్యాకములు. తత్కర్మ ము లసంఖ్యాకములు. అవియనుభవించుపద్ధతు లసంఖ్యాకములు. కొందఱకు మంత్రములయందు విశ్వాసము. మఱికొందఱకు భగవంతుని బూజించుటయం దాదృతి. ఇంకను గొందఱకు భగవన్నామపారాయణమున నమ్మకము. మఱియుఁ గొందఱకు భగవద్భక్తసేవ

యందుఁ బట్టుదల. ఒక్కకొందఱకు భగవత్కథాశ్రవణమునఁ బ్రమోదము. ఇట్లెన్నియోరీతుల భగవదారాధన మొప్పుచుండును. కావున శాంతులు పలువిధములుగాఁ జెప్పఁబడియెను. ఎన్నివిధముల నూహించినను బరిశుద్ధచిత్తుఁడై భగవన్మంత్రమునో భగవన్నామమునో ఉచ్చరించినఁ బాపఫలములు కలుగవని చెప్పఁబడినదికదా. ఇదియే సారము. ఇందుఁ బ్రధానము చిత్తశుద్ధి. ఆవలిపని భగవంతునియందు భక్తి. తర్వాతికార్యము నాకీదుష్ఫలము ఈప్రాయశ్చిత్తమునఁ దొలఁగినదన్నవిశ్వాసము. ఈమూఁడును గల్గినచో నేస్వప్నములు ఫలము నీఁజాలవు. ఇవి లేకున్నఁ దప్పక ఫలము నిచ్చును. స్వప్నమున మాకు నమ్మకమే లేకయున్న ఫల మేలాగున నది ఇచ్చునని ప్రశ్నింపరాదు. తెలిసియేని తెలియకయేని అగ్నిని స్పృశించినఁ గాలునట్లు మనకు నమ్మకమున్నను లేకున్నను ఫలము గలుగును. తప్పక కలుగఁదగినఫలమును శాంతిచేసిన నది యెట్లు మాన్పునని ప్రశ్నింపకుఁడు. భగవంతునివిషయ మన్నింటితో సమానమని చెప్పుట మందబుద్ధి. సర్వసమర్థుఁడు భగవంతుఁడు. అట్టిభగవంతునియందు దృఢవిశ్వాసము కలుగుటకే సకలసత్కర్మములు సకలతపస్సులు సకలయోగములు చెప్పఁబడినవి. ఈదుస్స్వప్నఫలములు గలుగునన్నభీతిచేతనైన నది గలిగినఁ బరమానందమే యని సాధువులభావము, అప్పటికి నది కలుగకయున్నఁ బ్రతికర్మము తనతనఫలము నీయకమానదు. పర్వతములవంటి దుష్కర్మములకు భగవద్భక్తి కులిశము. పదిమాఱు లుచ్చరిం

చిన నది ఫలమునిచ్చునా యని యడుగకుఁడు. పరిశుద్ధచిత్త మునఁ బదిపర్యాయము లుచ్చరించినను జాలునని భావము. చిత్తను శుద్ధము కావలెనన్న సత్కర్మముల నెన్నింటినో చేసి యుండవలయు. అట్టివానికి భగవన్నామము ఫలము నీయక పోవునా. కావున భక్తులారా! దుస్స్వప్నములు దుష్ఫలముల నిచ్చునవియు భగవన్నామము వానికి శాంతి యనియు గ్రహింపుఁడు.

మఱొక్కమాట ఈ చెప్పిన శాంతిభేదములలో ద్రవ్య వ్యయముగలదా? లేదుకదా. ఇఁక మహర్షుల భావమేమి? భక్తి కుదురవలయుననియే. అదియున్న నకాలమృత్యువు దనపౌరుష మును జూపఁజాలదు. ఒకానొకప్పుడు భక్తి కాలమృత్యువును గూడఁ దిరస్కరించును. మార్కండేయునకుఁ జిరంజీవిత్వము భక్తిగదా ప్రసాదించెను. యమబాధయే లేకుండఁజేసిన భక్తి తుచ్ఛములగు దుస్స్వప్నఫలముల మార్పలేకపోవునా యోచింపుఁడు. మార్కండేయచరిత్రమే యబద్ధమన్నవారి కీసమాధానము పనికిరాదని నేనెఱుంగుదును. కాని వారిమతమున నేదియుఁ బ్రమాణము కాదు హరిమాట యొక్కటియే. ఆయొక్కమాటయు నితరులకుఁ బ్రమాణము కాదని వారే యంగీకరింపవలయును. కావున భగవన్మహిమము విషయమున విశ్వాస ముండక తప్పదు. అది యుండువారి కీఫలములు గలుగవలయు ననునంగీకారము కావలయును. కావునఁ బెతమార్గ ములఁ ద్రొక్కక సాధుసమ్మతమగు భక్తిమార్గమునఁ బ్రవర్తిం

చుట సజ్జనులకు ధర్మము. ఇంక నీవిషయమును విశేషించి చర్చిం పక తత్ఖ్యాతికథను విన్నవించెద. అవహితుల రగుఁడు.

## విప్రవైష్ణవక్షత్రియాదులధర్మములు.

* శ్రీహరి యిట్లు పలుక విని నందుఁడు ప్రమోదాంతః కరణుఁడై కృష్ణమూర్తిం గాంచి యీరీతిఁ బలికెను. మహాత్మా! నీవు వేదములకెల్లఁ గారణభూతుఁడవు. బ్రహ్మాదులకు నీవే కార ణమవు ఇట్టి నిన్ను నేను బుత్రకుఁడవని భావించుచున్నవాఁ డను. నీకు మంగళమగుఁగాక. నిన్ను వదలి మఱెవ్వరి నడుగు దును? నాసంశయములన్నియు నివర్తించునట్లు బదులుచెప్పుము. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులయొక్కయు, సన్న్యాసులయొక్క యు, యతులయొక్కయు, బ్రహ్మచారులయొక్కయు, విధవ లగు స్త్రీలయొక్కయు, విష్ణుభక్తులగు సత్పురుషులయొక్కయు, పతివ్రతలగు కాంతలయొక్కయు ధర్మములెట్టివి? ఇంతియగాక గృహస్థులయు, గృహిణులయు, విశేషించిశిష్యులయు, పుత్రికా పుత్రులు తల్లిదండ్రులవిషయమున నడుచుకొనఁదగుమర్యాద లయు పద్ధతులెట్టివి? ప్రభూ! స్త్రీజాతి యెన్నివిధములు? భర్త లెన్నివిధములుగా నుందురు? బ్రహ్మాండ మెన్నిరీతుల నుండును? తత్సుఖము యదాత్మకము? ఏది నిత్యము? కృత్రిమమేది? వరుసగా

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదిమూఁడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని తెలియందగు. ఇతరపురాణములయం దీనందకృష్ణసంవా దము విస్తరించి కానరాదు.

నాసంశయములు దొలఁగునట్లు వచింపుము. నావిని సుస్మితాననుఁడై శ్రీకృష్ణుఁ డిట్లు పల్కెను.

విప్రుఁడు సంధ్యావందనముననే పవిత్రుఁడు కాఁదగు. ఎవ్వఁడు సంధ్యానుష్ఠానరూపముగా నన్ను సేవించునో వాఁడు విప్రుఁడు. ఆవిప్రుఁడు నాకు నివేదించినప్రసాదమునే భక్షింపవలయు. నాకు సమర్పింపక భుజింపరాదు. విష్ణువునకు నివేదింపనియది యెట్టిపదార్థమైనను మలతుల్యము. జలము మూత్రసమానము. విష్ణుప్రసాదమును భుజించువాఁడు జీవన్ముక్తుఁ డనఁబడును. సదా తపస్సుచేయుటయం దాసక్తుఁడై శుచియై, శాంతుడై, శాస్త్రములనెఱిఁగి, వ్రతము లాచరించి, తీర్థములసేవించి, ధర్మముచేయుచు, ననేకవిద్యల నభ్యసించి విష్ణుమంత్రము నుపదేశరూపమున గ్రహించి గురువును సేవించుచు, వారిచే ననుజ్ఞాతుఁడై పిదప గృహస్థాశ్రమము నొందవలయు. నిత్యపూజ్యుఁడగు గురువునకు దక్షిణ నొసంగవలయు. అంతటితో వారిని వదలక సదా వారిని యథాశక్తిఁ బోషింపవలయును. ఇందులకు శంకింపఁ బనిలేదు. నమస్కరింపఁదగు పెద్ద లందఱికంటెఁ దండ్రి మహాగురువు. ఆతండ్రికంటెఁ దల్లి నూఱుమడుంగు లెక్కుడు. ఆతల్లికంటె దేవత శతగుణమధికము. మంత్రము నుపదేశించువాఁడు, దాని నుపాసించునట్టిపద్ధతులఁ దెలుపువాఁడు నాదేవతకంటె నాల్గుమడుంగు లధికుఁడు. గురువు సాక్షాత్కరించిన శ్రీమన్నారాయణమూర్తియే. ఈశ్వరుఁడనఁగా గురువే తదుద్దేశముగ సమర్పించునది దేవతలకందును. అని వేదము లంగీ

కరించినవి. గురువున కిడినపదార్థము మనుష్యవేషమున భగవం తుఁడే యనుభవించును. గురువే బ్రహ్మావిష్ణుమహేశ్వరులు. సర్వదేవతలు గురువునందే యుందురు. గురువు తృప్తినొందిన హరియుఁ దృప్తినొందును. హరి తృప్తినొందిన దేవతలు తృప్తు లగుదురు.

ఏగురువు తనశిష్యునియందుఁ బుత్త్రస్నేహము నునుపఁ డో యాగురువునకు బ్రహ్మహత్యాతుల్యపాపము గల్గును. ఆతని యాశీర్వాదము నిష్ఫలమగును స్వధర్మనిరతుఁ డగువిప్రుఁడు సదా పరిశుద్ధుఁడే యగును. విష్ణువును సేవించువిప్రుఁడును సదా శుచియనంబడును. తదన్యుఁడశుచి యనంబడును. వృషభ వాహనము నెక్కినవిప్రుఁడు, శూద్రులకు వంటచేయుభూసు రుఁడు, దేవాలయమునఁ బూజచేయ నంగీకరించినధారణీసురుఁ డు, సంధ్యాహీనుఁడగుబాడబుఁడు వీరందఱు దుర్బలులు. పగలు నిద్రించుభూసురుఁడు,శూద్రశ్రాద్ధాన్నభోక్తయు,శూద్ర శవదాహియును శూద్రతుల్యులగుదురు. సాలగ్రామమును విధి విహితముగఁ బూజించి నైవేద్యముపెట్టి తచ్ఛేషమును భుజించి తత్పాదోదకమును ద్రాగవలయును హరిపాదోదకమును ద్రావినఁ దీర్థస్నానపుణ్యము గల్గును. సర్వపాపములు తొలఁ గును. విష్ణులోకప్రాప్తి గలుగును. ఎవ్వఁడు సాలగ్రామశిలాతో యము శిరమునఁ జల్లుకొనునో వానికి సకలతీర్థముల మునిఁగిన ఫలము, యజ్ఞములన్నియు నొనరించినఫలము గల్గును. సాల గ్రామజలము గంగాజలమునకంటెఁ బదిమడుంగు లెక్కుడు

ఫలము నిచ్చును. ప్రతిదినము సాలగ్రామనైవేద్యశిష్టాన్నమును, భుజించిన జీవన్ముక్తుఁడగును. దేవతుల్యుఁడగును.

విప్రులకు విష్ణునైవేద్యశేషాన్నభోజనము నిత్యకృత్యము. యత్నమున విష్ణుపూజ చేయవలయును. విష్ణుపాదోదకసేవనము ముఖ్యములు. ఎవఁడు ప్రతిదినము త్రికాలములయందు నన్నుఁ బూజించునో, ఏకాదశియం దెవ్వఁడు భుజింపఁడో, నాజన్మదినమున నెవ్వఁ డుపవసించునో శివరాత్రియందును శ్రీరామనవమియందు భుజింపకుండునో వారెల్ల జీవన్ముక్తు లనంబడుదురు. లోకమునఁ గలతీర్థములన్నియు విప్రునిపాదములందుండును. అట్టి విప్రపాదోదకమును గ్రావినఁ దీర్థస్నానపుణ్యము లభించును. విప్రపాదోదకమున నెంత భూమి తడుపఁబడునో అది యెంతకాల ముండునో అంతదనుకఁ బుష్కరపాత్రములయందుఁ బితరులు జలమును గ్రాగుదురు. విష్ణుప్రసాదమును భుజించునాతఁడు భూమిని బవిత్రము చేయును. సకలతీర్థములను బావనములనుగా నొనర్చును. ఆతఁడు జీవన్ముక్తుఁ డనంబడు. సకలతీర్థస్నానఫలము సకలవ్రతముల నాచరించినఁ గలుగుఫలము నాతనిం బొందు. అశ్వమేధములు పలుమాఱు లొనరించినఫల మాతనికిం గల్గును. వహ్నివాయువులవలె నాతఁడు పరిశుద్ధుఁ డగు. భాస్కరతుల్యతేజశ్శాలి యగు. ఆతఁడు యమదూతనుగాని యమునింగాని స్వప్నమునందైనం జూడఁడు. వాఁడు వైకుంఠమునఁ బార్షదుఁడై హరి

తోఁగూడి యానందించుచుండును హరిసేవియగు విప్రుఁడాలోకమునుండి భూతలమునఁ బుట్టఁడు.

* విష్ణుమంత్రోపాసకుఁ డగువాఁడే వైష్ణవుఁ డనంబడు. బ్రాహ్మణుఁడై అందును విష్ణుభక్తుఁడై ప్రాజ్ఞుఁడైనచో నాతనికంటె నధికుఁడు లేఁడు. వేదోక్తమైనను బురాణోక్తమైనను దంత్రోక్తమైనను శైవుఁడుగాని శాక్తుఁడుగాని వైష్ణవుఁడుగాని విచారించినఁ బరిశుద్ధుఁడగును. గురుముఖమునుండి విష్ణుమంత్రమెవ్వనిచెవిలోఁ బ్రవేశించునో వాఁడు వైష్ణవుఁ డనంబడు. మహాపూతచిత్తుఁ డాతఁడు. ఆమంత్రగ్రహణమాత్రముననే జీవన్ముక్తుఁడగును. ఆతఁడు బ్రహ్మాండమును భేదించుకొని శ్రీహరిపదము నొందును. విష్ణుమంత్రోపాసకుఁడు తనకంటెఁ బూర్వుల నేడుపురను, దనతరువాతివారి నేడుగురను, మాతామహవంశమున నేడుగురను, దత్సుతులను, దత్పుతులను సముద్ధరించుచు శ్రీహరిపదము నొందును. సాధుక్షేత్రమున శ్రీనారాయణుని బురశ్చరణపూర్వకముగా నుపాసింపవలయును. పురుషులు వేయిమందిలో నొక్కఁ డట్టివాఁడుండును. వాఁడు విలాసముగాఁ ద న్నుద్ధరించుకొనఁగలఁడు. మంత్రమును గ్రహించినమాత్రమున నీఫలముగలుగును. ఉపదేశమునొందినవారిలో నూటికొక్కఁడు పురశ్చర్యాతత్పరుండగు. ఏకాంతికుఁ డగువైష్ణవుఁడు లక్షకొక్కఁడుండు. విష్ణుపదమునందు మది నునుపఁదగు

---

*విష్ణుమంత్రోపాసకశ్చ సఏవ వైష్ణవో ద్విజః, బ్రాహ్మణో వైష్ణవః ప్రాజ్ఞో న హి తస్మా త్పరః పుమాన్. అని మూలము.

సంకల్పములు తొలఁగింపవలయును. ద్విజులు సురలు నాప్రాణములు. భక్తుఁడు ప్రాణాధికుఁడు. ప్రపంచమునందుఁ బ్రీతిపాత్రులయందు భక్తులకంటెం బ్రియతముఁడు లేఁడు. తేజీయాంసుండగుగురువును గాంచి యతఁ డెల్లవిధముల రక్షకుండని నమ్మి మంత్ర మాతనినుండి గ్రహింపవలయును. వయోహీనులు జ్ఞానహీనులు విద్యాహీనులు జాతిహీనులు నగు వారివలన మంత్రము నుపదేశముగా గ్రహింపరాదు. ఒకానొకప్పుడైనను మంత్రము విలాసార్థముగా గ్రహింపరాదు. మూర్ఖుఁడు, ఆశ్రమహీనుఁడు, తంద్రి, సన్యాసి, రోగి, వంశహీనుఁడు భార్యలేనివాఁడు, మంత్రత్యాగి యనువారివలన మంత్రమును గ్రహింపరాదు. విష్ణుభక్తిహీనునుండి విష్ణుమంత్రమును గ్రహింపరాదు. శైవుఁడు శాక్తుఁడు విష్ణుమంత్రము నుపదేశింప నర్హులుకారు. విష్ణుభక్తుఁడే దాని నుపదేశింప నర్హుఁడు. వయోహీనుఁడు, అల్పాయువుగలవాఁడు, జ్ఞానహీనుఁడు, అపండితుఁడు, విద్యాహీనుఁడు, ననువారినుండి యుపదేశముపొందిన మూఢుఁడగు. జాతిహీనునినుండి మంత్రమును గ్రహించిన క్షయించును. మూర్ఖునుండి గ్రహించిన మూర్ఖుఁడగును. ఆశ్రమహీనునుండి గ్రహించిన దుఃఖియగు. తంద్రివలన గ్రహించిన యశోహాని కల్గును. సన్యాసివలనగ్రహించిన మృతిగల్గును. రోగినుండి గ్రహిం రోగముగల్గును. కులహీనుఁడు గురువయిన వంశము అపత్నీకునివలన నుపదేశమందిన భార్యాహీనుఁ డగును. త్రత్యాగివలన మంత్రమును గ్రహించిన భార్య నశించును.

విష్ణుభక్తివిహీనునుండి గ్రహించిన భక్తి నశించును. శైవుని నుండియు శాక్తునినుండియు విష్ణుమంత్రము గ్రహించిన విష్ణుభక్తి చలించును. బ్రాహ్మణుఁడు, అందు వైష్ణవుఁడు, అంతియగాక పరిశుద్ధుఁడు నగువాఁడు పక్వాన్నమునీయ నర్హుఁడు. వారికిడినపక్వాన్నము నిరుపమఫలం బిచ్చును. ఇతరులు పక్వాన్నమున కర్హులు కారు. *ఓంకారము నుచ్చరించినను, అగ్నియందు హోమముచేసినను, సాలగ్రామశిలను బూజించినను, పక్వాన్నమును నాకు నివేదించినను బ్రాహ్మణేతరుఁడు పతితుఁడగు. ఉదాసీనుఁడగు పురుషునినుండియు, దురాచారనిరతునినుండియు బుద్ధిమంతుఁడు మంత్రమును గ్రహింపరాదు. విధివశమున గ్రహించినచో ధనహాని కలుగును. బ్రాహ్మణులు మాంసవిహీనమగు హవిష్యము భుజింపఁదగినది. మాంసమును బరిహరించినచో సూర్యతుల్యతేజస్సు గలుగును. వంట ప్రతిదినము క్రొత్తపాత్రమునందే చేయఁదగినది. ఒకప్పుడు పదునైదు దినము లొకపాత్రమునందే వంటచేయవచ్చును. ఆవల దానిని బరిహరింపవలయును.

తొలుతఁ జోటును బరిశుద్ధముచేసి తర్వాతఁ బాకమును జేయవలయును. స్థానము సత్కృతముకాఁగా బ్రాహ్మణుఁడు వంటకమును నాకొఱకు కర్పించి యతిథికిఁ దనియఁబెట్టి యావలఁ దాను భుజింపవలయును. నాకు నివేదింపక యెవఁడు

---

*ఓంకారోచ్చారణాద్ధోమాచ్ఛాలగ్రామశిలార్చనాత్, మహ్యాం పక్వాన్నదానాచ్చ విప్రావన్యో ప్రజేదధః. అని మూలము.

భుజించునో వాఁడు సురాపానము చేసినపాపమును బొందును. చంద్రసూర్యగ్రహణములయందును జాతమృతాశౌచముల యందును, అశుచిస్పృశించినపుడును బాకభాండము పరిత్యజింప వలయును. అన్నమును ధౌతవస్త్రములు కట్టుకొని పాదప్రక్షా ళనము చేసి పరిశుద్ధమగుస్థలమునఁ గూరుచుండి భుజింపవ లయును. సూర్యుఁడుండఁగా రెండుపర్యాయములు భుజింప రాదు. అట్లు భుజించిన బ్రాహ్మణుఁ డొనరించుకర్మములు నిష్ఫలములగును. అంతియకాక నరకము కలుగును. యాత్ర, యుద్ధము, నదీతీరము, రెండవమాఱు భుజించుట, భార్యాసంగతి యనువీనిని శ్రాద్ధదివసమున వర్జింపవలయును. హవిష్యమును భుజించి సంయతేంద్రియుఁడై యుండవలయును. ద్విజుఁడై విష్ణుభక్తుఁడై పండితుఁడు నగువానికి దాన మీయ వలయును. వృషలీపతికిని, శూద్రయాజకునకు దాన మీయ రాదు. సంధ్యావందన మాచరింపక దుష్టుఁడై వృషభము నెక్కి చిలుకలంబట్టి యమ్ముకొనుచు దేవలుఁడై యుండు విప్రునకు దానమీయరాదు. ఇందేదియు నుత్తమము కాదు. ఇట్టివారి కిచ్చినదాతకు నరకము తప్పదు. శ్రాద్ధాన్నమును భుజించి భార్యంగూడిన నరకము గల్గును.

కన్యకను శుల్కమును గొని యిచ్చువాఁ డందఱికంటెఁ బాపి యనంబడు. కన్యాదానము చేసెదనని ముందు మూల్యముం గొనువానికి మహారౌరవనరకము గల్గును. కన్యారోమకూప సంఖ్యావత్సరములు నరకమున నాతఁ డుండఁగలఁడు. వానిపిత

రులకు నరకము గల్గును. వానిసంతతియుఁ గుంభీపాకనరకమునఁ బడు. పురోహితుఁడు నట్టినరకమునే యనుభవించును. కావున యోగ్యుఁడగువరునకుఁ గన్యకను దానము చేయవలయును. శూద్రులవలెనే బ్రాహ్మణులకు నీధర్మము సమానము. విప్ర వైష్ణవధర్మము లిట్టివని వచించితిని. ఈధర్మములు నాల్గువేదములయందును బురాణములయందును బ్రతిపాదితములే. క్షత్రియులకు ద్విజపూజయు దేవతాపూజయుఁ జేయఁదగినవి. రాజ్యపాలనము యుద్ధమున భీతిలేకుండుటయు, విప్రులకు సదా దానముచేయుటయు, శరణాగతుల రక్షించుటయు, పుత్రతుల్యులనుగాఁ బ్రజలను జూచుటయు, దుఃఖితులను గాపాడి దుఃఖమును దొలఁగించుటయు, శస్త్రాస్త్రములయందు నైపుణ్యము, రణమునందుఁ బాటవము, తపస్సు, ధర్మకార్యకరణము ననువిని రాజులు ముఖ్యముగాఁ జేయఁదగినవి. పండితుఁడై నీతిశాస్త్రవేత్తయగువానిని గణుతించి సదా కాపాడవలయు. అట్టివానిని సభ్యుల యనుమతినొంది ధర్మనిర్ణయమునందు నియోగింపవలయును. హస్త్యశ్వరథపాదాతమగుచతురంగబలమును జక్కనిస్థితియం దునుపవలయును. కీర్తివంతుఁడై ప్రతాపశాలియుగా నుండవలయును. రణమునందుఁ బ్రయత్నపరుఁడనై తినని దానవిముఖుఁడు కాఁగూడదు. ఎవ్వఁడు యుద్ధరంగమునఁ బ్రాణముల వదలునో వానికి స్వర్గము కరతలామలకము.

నందరాజా! ఇఁక వైశ్యధర్మముల నాలకింపుము. వైశ్యులకు వాణిజ్యము, కృషి, పశురక్షణము, విప్రదేవపూజనము,

దానము, తపోనిరతి, వ్రతసేవనము ననునివి ప్రధానములు. పాదజులకు ద్విజసేవ ప్రధానధర్మము. ద్విజధర్మముల నాచరించుచు వారిద్రవ్యము నపహరించినచోఁ జండాలుఁ డగును. బ్రాహ్మణిని గామించినశూద్రుఁడును మాతృగామియు సమానులగుదురు ఇఁక సన్న్యాసిధర్మముల నాలకింపుము. దండమును విధిమీఱ గ్రహించినవరుఁడు నారాయణుండగును. పూర్వకర్మముల స్మరించి పరకర్మములను బోఁద్రోలి నన్నుఁ దలంచుచు నున్న నామందిరమున కరుదెంచును. సన్న్యాసిపాదస్పర్శమున భూమి పవిత్రమగు. సకలతీర్థములు పావనములగు. సన్న్యాసిని స్పృశించినరుఁడు నిష్పాపుఁడగును. సన్న్యాసులకు భిక్షయొసరించిన నశ్వమేధఫలము గలుగును. వారికి నమస్కరించినను, కోరి వారిని దర్శించినను రాజసూయఫలము గలుగును. యతులను బ్రహ్మచారులను దర్శించినను సన్న్యాసిదర్శనతుల్యఫలము గల్గును. సాయాహ్నమువఱకు వేచియుండి యాఁకలి బాధింప నేసన్న్యాసి గృహస్థునింటికిఁ బోవునో మంచి యన్నముగాని, కదన్నముగాని గృహస్థువు భక్తితో నిడిన నాసన్న్యాసి పరిగ్రహింపవలయును. మిష్టాన్నమును గోరరాదు. కోపము నొందరాదు. ధనమును గ్రహింపరాదు. ఏకవస్త్రుఁడై యుండవలయును. ఆశావర్జితుఁడు కావలయును. గ్రీష్మమును శీతమును దుల్యముగా భావింపవలయును. లోభమోహములఁ జెంతఁ జేరనీయరాదు.

సన్న్యాసి యొక్కనియింట నొకరాత్రిమాత్ర ముండి

ప్రాతఃకాలమున మఱొకతావునకుఁ బోవలయును. *వాహనము నెక్కి గృహస్థులనుండి ధనము చేకొని గృహము కట్టుకొని యేసన్న్యాసియుండునో యతఁడు పతితుఁడగును. [1]కృషిచేయించుచు, వ్యాపారమూలముగ ధన మార్జించుచు, నీచవృత్తి నవలంబించుచు నుండుసన్న్యాసి యాచారశూన్యుఁ డనఁబడుటయేగాక స్వధర్మపతితుఁడగును. స్వకర్మ మశుభముగాని శుభముగాని యెవఁ డాచరించునో వాఁడు శుద్ధుఁడగును. స్వధర్మమును మానినఁ బరిహాస్యుఁ డగును.

పతిహీనయగునారి నిష్కామినియై యేకవారము భుజించి దినాంతమున హవిష్యమాహారముగా నియమముగా నుండవలయును. దివ్యవస్త్రము గట్టరాదు. గంధద్రవ్యములను గాని సుగంధితైలమును గాని యుపయోగింపరాదు. పూలమాలికను గాని చందనమును గాని శంఖసిందూరాద్యలంకారములను గాని వదలవలయు. మాసినచీరఁగట్టిసదా నారాయణు స్మరించుచు భగవత్సేవచేయుచుఁదన్నామజపము జేయుచు ననన్యభక్తి గలిగియుండవలయును. పురుషులను బుత్రతుల్యులనుగా భావించుచుమిష్టాన్నమును భుజింపక విభవము ననుభవింపక యేకాదశి యందుపవసించి కృష్ణజన్మాష్టమియందు శుష్కోపవాసమును జేసి

* యానమారోహణం కృత్వా గృహీత్వా గృహిణోధనమ్, గృహం కృత్వా గృహీరమ్యాశ్చస్వధర్మాత్పతితో భవేత్. అని మూ. 1 కృత్వాచ కృషి వాణిజ్యం కువృత్తిం కురుతేచ యః, ససన్న్యాసీ హ్రుతాచారః స్వధర్మాత్పతితోభవేత్. అని మూ.

శ్రీరామనవమీ శివరాత్రి చంద్రసూర్యగ్రహణములు ననువీని యందు నియతులరాలై వేయించిన వస్తువును ద్యజించి భుజించు నపుడు జాగరూకత గలిగి యుండవలయును. విధవలు యతులు బ్రహ్మచారులు తాంబూలమును వదలవలయును. తాంబూలము సన్న్యాసులకు గోమాంససురాతుల్యమని చెప్పఁబడినది. రక్త శాకము మసూరము జంబీరపర్ణము వర్తులాకారాలాబువు (సొర కాయ) అను వీనిని వదలిపెట్టఁదగు విధవ పర్యంకమున శయ నించి పతిని భ్రష్టపుణ్యునిగాఁజేయఁగలదు. వాహనము నెక్కిన విపతిక నరక మొందును. వెండ్రుకల దువ్వరాదు దేహమును నూనెచే సంస్కరింపరాదు. తైలాభ్యంగము చేయరాదు. అద్దము చూడరాదు. పరపురుషముఖమును, యాత్రను, నృత్యమును, మహోత్సవదర్శనము, గానమును సాగుచోటికిఁ బోరాదు. అలం కృతపరపురుషుని జూడరాదు. ఇవి సామవేదప్రతిపాదితధర్మ ములు. పరమపురుషార్థమును వచించెద. ఆలకింపుము.

## సత్పురుషధర్మములు.

వేదముపఠించుట, పాఠము చెప్పుట, శిష్యులను బాలిం చుట, గురువులసేవించుట, ద్విజదేవార్చన మొనరించుట, సిద్ధాంతశాస్త్రనైపుణ్య మలవఱచుకొనుట మనస్సంతోషకర విషయముల భావించుట, వ్యాఖ్యానము చేయుట, గ్రంథపరి శీలనము, ఆచారవ్యవస్థచేయుట, వేదసమ్మతవిషయవిచారము చేయుట, శాస్త్రార్థచర్య చేయుట, దేవాహ్నికనైపుణ్యము,

ఈప్సితవేదాచరణము, వేదోక్తవస్తుభక్షణముచేయుట, పవిత్రాచారనిరతి యనునవి సత్పురుషు లాచరింపఁదగుపద్ధతులు.

## పతివ్రతాధర్మములు.

ఇఁకఁ బతివ్రతాధర్మముల నాలకింపుము. సదా పతియందు నౌత్సుక్యము, దత్పాదజలమును సేవించుట, భక్తిభావమునఁ దదనుమతి భుజించుట, వ్రతాచరణము, తపోనిరతి, దేవతాపూజ, యనువానికన్న నెక్కుడుగ భర్తృసేవను దలంచుట, పతిని సంతోషింపఁజేయుట, తదాజ్ఞారహితకర్మమును మానుట, నారాయణునికంటెఁ బరదైవము భర్తయని భావించుట, పరపురుషముఖమును బరికింపకుండుట, యాత్రోత్సవముల నాసక్తి లేకుండుట నృత్యనర్తకగానములయెడఁ బరాఙ్ముఖత, పరక్రీడను జూడకుండుట యనునివి పతివ్రతలకు ముఖ్యధర్మములు. భర్తకేపదార్థములు భక్ష్యములో వానినే తా భుజింపవలయు. క్షణమాత్రమైన భర్త నెడఁబాయరాదు. పతిమాటకు విరుద్ధము పలుకరాదు. కోపము మానరాదు. సదా శుద్ధిగలిగి భర్త కోపమునఁ దన్నిన నోర్చుకొని యాకలిగొన్నపుడు పతిని భుజింపఁజేసి నిద్రపోవుతఱి నాయనను మేల్కొలుపక యీకార్యమొనరింపుమా యని పురికొలుపక పుత్త్రులయం దనుచుప్రీతి కన్న నూఱుమడుంగులు పతియందుఁ బ్రేమమునిచి యుండవలయు. పతియే బంధువు, సుగతి, దైవము నని భావింపవలయును. సంతోషించునపుడు తాను నానందించుచుఁ జిఱునవ్వు దొలకాడ మాటలాడవలయును. పతివ్రత పురుషసహస్రము

లొనరించు పాతకములఁ దొలఁగింపఁగలదు. అట్టిసతులకుఁ గర్భ భోగములేదు. అట్టిభార్యంగూడి తత్పతి హరిమందిరమున సంతోషించుచుండును.

పృథ్విలోఁగలసమస్తతీర్థములు పతివ్రతలపాదములయందుండును. మహర్షులతేజస్సు లాపతివ్రతయందే యుండును. మహర్షులతపస్సు, వ్రతపరాయణులవ్రతఫలము, దాతలదానఫలము ననునివియెల్ల సాధ్వీమణులయం దుండును. హరిహరవిరించులు సకలదేవతలు మునులు పతివ్రతలకు భయపడుదురు. వారిపాదధూళిచే భూమి పవిత్రయగును. బతికి నమస్కరించిన సకలపాపములు నశించును. ముల్లోకములను నిమేషమాత్రమున భస్మము చేయుశక్తి పతివ్రతలకుఁ గలదు. స్వతేజస్సుచేతనే పతివ్రత ప్రకాశించును. దేవతలవలనను, యమునివలననామెకు భయముగలుగదు. నూఱుజన్మములనుండి పుణ్యమొనరించువారియింట పతివ్రత జన్మించును. ఆమెను గన్నతల్లిదండ్రులు జీవన్ముక్తు లగుదురు. సాధ్వి ప్రభాతమున మేల్కాంచి రాత్రిధరించినవస్త్రమును వదలి వేఱువస్త్రమును గట్టుకొని భర్తకు నమస్కరించి యవ్వల గృహకార్యములఁదీర్పఁ జనవలయును. పిదప స్నానమొనరించి ధౌతవస్త్రమును ధరించి తెల్లని పుష్పముల భర్త నర్చింపవలయును. మంచినీటిచేఁ బతిని స్నానముచేయించి ధౌతవస్త్రములనిచ్చి వారిపాదములఁ దడియొత్తి పీఠమునఁ గూరుచుండఁజేసి ఫాలమునఁ జందన మిడి సర్వాంగములఁ జందనచర్చితములుగా నొనరించి కంఠమున మాల్య మిడి

సామవేదోక్తమంత్రములచేఁ బూజించి, నమస్కరింపవలయును. ప్రణవ మాది నుడివి పిదప నమఃపద ముచ్చరించి "కాంతాయ శాంతాయ సర్వదేవాశ్రయాయ" యనుపదములఁ బలికి యగ్నిభార్యను గొసయం దుచ్చరించి యీమంత్రముచేఁ బుష్పమును జందనము నిడవలయును. పాద్యార్ఘ్యధూపదీపనైవేద్యములను సువాసితశుద్ధజలములను దాంబూలవర్యమును సమర్పించవలయును. ఆవల * స్తోత్రరాజములఁ బఠింపవలయును. కాంతరూపుఁడై సకలలోకభర్తయై శిరశ్చంద్రస్వరూపియై శాంతుఁడై దాంతుఁడై సర్వదేవాశ్రయుండై యలరు భగవంతునకు నమస్కారములు. అనుమొదలగుస్తుతులను బఠించి యారాధింపవలయు. ఈస్తోత్రమును బతివ్రత యాలకించిన సర్వవాంఛితము లొనఁగూడును. అపుత్త్రునకు సంతతిగలుగు. నిర్ధనుఁడు సధ

---

*స్తోత్రరాజము.

ఓం నమః కాంతాయ భర్త్రేచ శిరశ్చంద్రస్వరూపిణే, నమశ్శాంతాయ దాంతాయ సర్వదేవాశ్రయాయ చ. ౧. నమో బ్రహ్మస్వరూపాయ సతీప్రాణపరాయ చ, నమస్యాయ చ పూజ్యాయ హృదాధారాయ తే నమః. ౨. పంచప్రాణాధిదేవాయ చక్షుషస్తారకాయ చ, జ్ఞానాధారాయ పత్నీనాం పరమానందరూపిణే. ౩. పతిర్బ్రహ్మా పతిర్విష్ణుః పతిరేవం మహేశ్వరః, పతిశ్చ నిర్గుణాధారో బ్రహ్మరూప నమోఽస్తుతే. ౪. క్షమస్వ భగవన్ దోషం జ్ఞానాజ్ఞానకృతం చ యత్, పత్నీబంధో దయాసింధో దాసీదోషం క్షమస్వ మే. ౫. ఇదం స్తోత్రం మహాపుణ్యం సృష్ట్యాదౌ పద్మయా కృతం, సరస్వత్యా చ ధరయా గంగయా చ పురా వ్రజ. ౬. సావిత్ర్యా చ కృతం పూర్వం బ్రహ్మణే చాపి నిత్యశః, పార్వత్యా చ కృతం భక్త్యా కైలాసే శంకరాయ చ. ౭.

నుఁ డగు. రోగి రోగవిముక్తుఁ డగు. నందరాజా! పతివ్రతాధర్మములను వచించితిని. ఇంక గృహస్థులధర్మముల నాలకింపు మని శ్రీహరి యిట్లు పలికెను.

మహాభక్తులారా! ఎల్లర కనుష్ఠేయములగుపద్ధతుల నాలకించితిరి. ఈపద్ధతు లెల్లయెడల ననువదింపఁబడినవేకాని క్రొత్తవిగావు. వీనింగూర్చి విశేషించి వ్రాయ నవసరములేదు. ఐన నొకటిరెండువిషయములంగూర్చి నాలుగుమాటలు వ్రాసెదను. విధవాధర్మములు సుంత తీవ్రములుగాఁ గానంబడియెడిని. కాని వానిని బరమకృపాళువులగు మహాత్ము లనువదించిరి కాన వానియం దేమో యపూర్వశక్తి గలదని మన మూహింపవచ్చును. విధవ నియతవ్రతయై యొంటిపూట భుజించి తైలాభ్యంగాది గాత్రసంస్కరణముల నొనరింపక యుండవలయు ననుమొదలగు ధర్మము లిందుఁ జేర్కొనంబడినవి. కొందఱు వీనిం దలంచి కఠినపద్ధతు లందురు. వారియం దేలయిట్టి నిర్దయ చూపవలయు నని యందురు. మనపూర్వు లీవిషయమునఁ గఠినాత్ము లందురు. కాని సామాన్యబుద్ధి నాలోచించినచో నించుక కఠినపద్ధతులనియే తోఁచెడిని. సూక్ష్మతరముగా నాలోచించిన నవి దయారసమునే చూపించుచున్న ట్లగపడును. ఎట్లనఁగా నాలకింపుఁడు. భర్తమృతినొందగనే యానారీచిత్తమునకు లోకమంతయుఁ బాడుగాఁ దోఁచును. తన కీలోకమున దిక్కెవ్వరును లేరనియు, మృతినొందుదాఁక నిట్టికష్టముల నెన్నియో గుడువక తప్పదనియుఁ దోఁచును. అంతియకాక యీలోకమునఁ దన కెవ్వరి

తోఁసు బనియే లేదని తోఁచును. తన కిఁక దిక్కు సర్వేశ్వరుఁడే యని పొడకట్టును. భూషణాదులయందు నైరాశ్యము గలుగును అజ్ఞాన మెంతదనుక నుండును? అది యెట్లు తొలఁగును? అని యించుక యోజింపుఁడు. అజ్ఞానము నిలుచుటకు దగు మార్గము లేవి? క్రమక్రమముగా నవి మనమున దృఢముగా నాటుటకు సాధనము లేవి? అనియు నూహింపుఁడు. విధవ లట్టి నియమములకు లోఁబడియుండిన మేలా? లేక సువాసినుల ధర్మముల నాశ్రయించుట లోకమున కుపకారమా అనియుఁ దలపోయుఁడు. ఏల మనపూర్వుల కీపక్షపాతమని లేనిదయను వెల్లడింపఁబూనక యించుక భగవద్దత్తబుద్ధి నుపయోగింపుఁడు.

విధవ మరల వివాహము చేసికొనఁ గోరుచో నావిషయము వేఱుగ నుండును. ఆచర్చ యిచట చేయఁబూనను. నివృత్తిమార్గము నవలంబింపఁబూనువిధవకే యీధర్మము లగునని నాయాశయము. భగవదనుగ్రహముచేతనో, తాత్కాలిక దుఃఖావేశముచేతనో,యొకవిధమగు వైరాగ్య ముదయించును. దానిని బెంపొందింపఁ బ్రయత్నింపవలయు. ఎట్టియోగికైనను దేహపోషణము, అలంకారాదులచేఁ దనువును గైసేసికొనుటయు నించుక ప్రవృత్తిమార్గప్రదర్శకములే యగు. ఇఁక స్త్రీజాతి కట్టివి కాకుండునా. వాని నడంచు టెట్లు? అనునదియే గట్టిప్రశ్నము. వైరాగ్య మేకారణమున నుదయించిన నేమి? ఆకారణమును వెదకుపని మనది కాదు. అది కాకదంతపరీక్షవంటిది. నిరర్థకమే యని నాయూహ. దానికిఁ దోడు ప్రవృత్తి

మార్గనిరోధకాచారముల నవలంబించుట ప్రధానము. సుగంధి తైలమున నభ్యంగకృత్యమును జరపి దివ్యచందనాదుల నలంది పుష్పహారముల వేణిగై చేసి దిట్టముగా రెండుపూటలు భుజించి యిష్టానుసారముగఁ దిరుగుచుండువిధవకుఁ గలిగినయాశ్మశాన వైరాగ్యము త్రుటికాలమునఁ జెడదా. మనకీప్రపంచముతోఁ బనిలేదనుభావము నభివృద్ధిచేయుమార్గము లేవియని యించుక యోజింపుఁడు. దేహప్రసాధనము మదనోద్దీపకమని పూర్వుల భావము. దానిని మానినంతనే కామము తగ్గునా యని ప్రశ్నింప రాదు. తగ్గుటకు సాధనమని చెప్పుట తప్పుగాదు కొంతదనుక దేహపోషణమును మానిన మనోవాంఛలు తగ్గుననుట సార్వజనీనము. కాయికసుఖేచ్ఛకు దేహపోషణాలంకరణాదు లుద్దీపకములనుట నిర్వివాదాంశము. మఱియు వానిని దగ్గించుటయే కాక నియతవ్రతముల నాచరించుచు బ్రహ్మచారిణియై యుండవలయుననియే స్మృతులు ఘోషించుచున్నవి. కాననే పూర్వులతికరుణార్ద్రహృదయు లయ్యు విధవల కేకవారాశనమును శాసించిరి. సకలవ్రతముల నుపవాసమే వారికి విధింపఁబడినది. దాన దేహము కృశించును. మనోవాంఛలు కృశించునా యనకుఁడు. శరీరపాటవము తగ్గుకొలఁది యెట్టిపట్టుదలలైనను వరుసగా తగ్గుచుండును. కానఁ దత్కార్శ్యమునకు నిదియొకమార్గమని నిర్ణయింపఁబడినది. అందఱకు నీనియమము చెల్లునా యనరాదు. తత్ప్రయత్నము కుమార్గము కాదని సారము తత్ప్రయత్న మొనరించి భగ్నమగుచో వారిప్రారబ్ధ మనుకొనవలసి

నదియే. కావున విధవలగుస్త్రీలు బ్రహ్మచారిణు లయి దేహపోషణము చేసికొనకుండుట చాలమంచిమార్గ మనక తప్పదు. సన్న్యాసులధర్మములలోఁ జాలభాగము విధవలకు ధర్మములు విధింపఁబడినవి. కారణము దాన లోకమున కుపకారము కలదనియే కాని మహర్షులు కఠినాత్ములై కాదు. ఇంకను దీనిం జర్చింపరాదు.

సువాసినీధర్మములవిషయమున నాలుగుమాటలు మాత్రము వ్రాసి వదలెదను. పతిసేవకంటె నెక్కుడుగ నేధర్మము వారికి విధింపఁబడలేదు. ఏల? చిత్తమేకాగ్రత నొందవలయుననియే. భర్తయందుఁ బ్రీతి, భగవంతునందు భక్తి, ఇవి రెండును సమములుగా విధించినచో మనస్సు నిలకడఁ గాంచదు. భగవంతుఁ డనఁగా భర్తయే యని నియమించినచో నది త్వరగాఁ గలుగవచ్చునని విధించిరి. సకలధర్మముల నాచరింపవచ్చును. కాని వానిలో మొదటిది పతిసేవయే యనుటంబట్టి గట్టిగా నాలోచింపఁగాఁ జిత్తైకాగ్రత ప్రధానమని తెల్పుటకే కాని వేఱుగాదు. తక్కుంగలధర్మము లన్నియు సాధారణములు గాన వానివిషయమై పెక్కుతావుల వ్రాయఁబడియుండుట నిట వదలెదను.

## గృహస్థగృహిణీశిష్యాదిధర్మములు.

* నందభూపాలకా! గృహస్థులు, గృహిణులు శిష్యులు

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదినాల్గవ యధ్యాయమునుండి సంగ్రహింపఁ బడినదని యెఱుంగవలయును.

లోనగువారిధర్మముల నించుక యాలకింపుఁడు. ద్విజదేవార్చ్చ నము గృహస్థుపు సదా చేయవలయును. స్వధర్మాచరణము చతుర్వర్ణములకు సహజము. ప్రతిదినము చేయఁదగినది. అందఱికి నాధారము గృహస్థువు గావున నాతనిం గాపాడ దేవతలం దఱు సంసిద్ధులైయుందురు. ఏగృహస్థు వతిథిపూజ చేయఁడో వాఁడు సదా యశుచియనంబడు. కర్మకాలమునఁ బితృదేవతలు అతిథిపూజాకాలమున దేవతలు గృహస్థువు నాశ్రయించి యుం దురు. ఆతనియింటికి వచ్చి చూచుచుందురు. ధేనువులు డప్పి గొని తొట్టియొద్ద నిలిచియున్న ట్లాతురులై పితృదేవతలు దేవ తలు నుందురు. వెదకుచు నాకలిగొన్న యతిథి సాయంకాలమున గృహస్థువును గానవచ్చి యాతనిపూజం గొని యాశీర్వదించి వెడలిపోవును. అట్టియతిథి వచ్చినపు డాతని నారాధింపనిగృహ స్థువు పాతకి యనంబడును. సకలపాపము లాతఁడు చేసినట్లే యగును. ఏయింటినుండి యతిథి భగ్నాశుఁడై వెనుకకు మర లునో యాయింటినుండి పితృదేవతలు, దేవతలు నిరాశులై యాయతిథులం గలిసి వెడలిపోవుదురు. బ్రహ్మహత్యాదిదో షము లాగృహస్థువునకుఁ గల్గును. కాన నతిథిపూజ యవశ్యము చేయఁదగినది. నిరాశుఁడై వెడలిపోవునతిథి తనపాతకమును గృహస్థువున కొసంగి యతఁడుచేసియున్న పుణ్యమును గైకొని పోవును. కావుననే పొరపడక యతిథిపూజచేసి దేవతలఁ బూ జించి శుభాశయుఁడై సేవకుల నుపచరించి పిదప గృహస్థువు భుజింపవలయును. ఏగృహస్థునింట నతనితల్లి యుండదో భార్య

కులటయగునో ఆగృహస్థువు వనమున కరుగవలయు. ఇంటికంటె నరణ్యమే మేలని సాధువు లనిరి. ఏనారి పతితోఁ గలహించుచు నతనిని విషతుల్యముగాఁ జూచునో, భర్తకుఁ దగినయాహారము నొసఁగి తృప్తునిం గావింపదో, సదా తిరస్కరించుచుండునో యాస్త్రీ పాపాత్ము రా లనంబడును. తక్కినపూజ లెన్ని చేసినను వ్యర్థము లగును. పతిని తృణముగా భావించి ధిక్కరించుచు నున్నభార్యం గూడి ధిక్కారాగ్నిదగ్ధుఁడై వసించినగృహస్థువు మృతతుల్యుఁడే యనంబడును. దుష్టవంశమునఁ బుట్టినస్త్రీని వివాహమాడిన నట్టివాఁడే యగును. ఇంక గృహిణు లాచరింపఁ దగు సదాచారముల వినుము.

నందమహీజానీ! గృహిణి పతిభక్తిగలిగి దేవబ్రాహ్మణుల నర్చించుచు నుండవలయును. ఆమె శుద్ధాత్మ యనంబడు. ప్రాతఃకాలమున లేచి పతికి వందనమాచరించి దేవతుల్యునిగాఁ దలంచుచు ముంగిలిని గోమయమున నలికి జలము ప్రోక్షించి యింటిపనులెల్లం దీర్చి స్నానమొనరించి గృహదేవతలం బూజించి పతిని భుజింపఁజేసి యతిథికి భోజనము పెట్టి పిదపఁ దా భుజింపవలయును. పుత్త్రులచేఁ దండ్రియు శిష్యులచే గురువును బూజింపఁబడఁ దగుదురు. వారియాజ్ఞలనందియే పుత్త్రశిష్యులు కార్యారంభ మొనరింపం దగుదురు. శిష్యుఁడు భృత్యునివలె గురుసేవ చేయవలయును. పుత్త్రుఁడు శిష్యుఁడును దండ్రిని గురువును ఈకార్యము చేయవలయునని యాజ్ఞాపింపరాదు. తమసర్వస్వమును వారి కర్పింపవలయును. వారియందు

మనుష్యులనుబుద్ధి నునుపక దేవతలనుబుద్ధి నునుపందగు. మనుష్యమాత్రులనుగా వారిం దలంచినయెడల మహత్తరపాపము లభించును. తల్లిని దండ్రికంటె నెక్కుడుగాఁ బూజింపవలయును. తల్లికంటె నెక్కుడుగా గురువు నర్చింపవలయును. తండ్రియుఁ దల్లియు గురువు నను వీరొక్కరికంటె నొక్క రధికులు. భార్యయు, శిష్యుఁడు, కొడుకు, ఓర్పు, అనాథయగుతోఁ బుట్టువు, కన్యకయు నను వీరు సదా పోషింపం దగినవారు. తండ్రీ! నందభూపాలా! ఇవి ధర్మపద్ధతులు. విస్తరించి వచించితి.

స్త్రీజాతి యొక్కటియే. అందుఁ బతివ్రతలు పూజార్హాలు. స్త్రీలందఱు ప్రకృత్యంశసంజనితలు. స్త్రీలెల్లఁ బవిత్రలు పండితులకంటె నెక్కుడు మర్యాదకుఁ దగినవారు. కేదారకన్యాశాపమున వారిధర్మము నశించినది. బ్రహ్మకోపావేశమున కృత్యచే స్త్రీని నిర్మించెను. ఆస్త్రీజాతి మూఁడువిధములుగా నుండును. ఉత్తమమధ్యమాధమభేదములు గలది. పతిభక్తి గలనారి ఉత్తమజాతి యనంబడు. ప్రాణాంతమందును జారుని నామె మదియందును స్మరింపదు. పతినిఁ బూజించినట్లే దేవద్విజుల నర్చించును. వ్రతోపవాసము లొనరించును. తండ్రిచే రక్షితయై జారుని గన్నెత్తియైనం జూడక యుండును. సుంతగాఁ బతిని బూజించునారి మధ్యమజాతి యనంబడు. కృత్రిమ యనియుఁ జెప్పంబడును మిగుల దుర్వృత్తిగలనారి యధమజాతి యనందగు అసద్వంశప్రసూత యనియుఁ జెప్పందగు. అధర్మముల నాచరించుచు దుశ్శీలనుం దాసక్తి గలిగి కలహప్రి

యు రాలై పతిని సదా తిరస్కరించుచు జారుని సేవించుచుఁ బతికి దుఃఖమును గలిగించుచుఁ బతిని విషమువలెఁ గాంచుచు జారుని ద్వారా పతిని జంపించి స్వేచ్ఛగాఁ దిరుగునదియే యధమజాతి స్త్రీయనంబడు. అదియే పుంశ్చలి యనియుఁ జెప్పంబడును. ఆనారి పతికిఁ దగినయాహార మిడక విషతుల్యోక్తులం బల్కుచు నధర్మమునే గోరుచు జారునే ప్రేమించుచు గురువులచే దూషింపంబడియుండును. ఆస్త్రీని గాపాడ నెవ్వరును సమర్థులు గారు. దానికి జారుఁడు తప్పఁ దక్కినవా రెవ్వరును బ్రియులు కారు. అట్టిస్త్రీలు క్రొత్తతృణమును గోవులుకోరునట్లు నవనవ ప్రియులనే కోరుచుందురు. మెఱపుఁదీఁగయు, జలముల లిఖించిన రేఖయు నెంతయస్థిరమో యంతకంటె దానిప్రీతి యస్థిరము. ఇది స్త్రీజాతిచరిత్రము. ఇంకఁ ద్రివిధభక్తులలక్షణముల నాలకింపుము.

భక్తుఁడు తృణశయ్యారతుఁడై మన్నామగుణకీర్తనమునం దాదృతిగలిగి సంసారసుఖములను గోరక తత్ప్రియకార్యములం ద్యజించి నాపాదారవిందముల ధ్యానించుచు నన్నే పూజించుచు సంకల్పరహితుఁడై సర్వకర్మముల నాచరించుచు నెట్టిసిద్ధులను గోరక యణిమాదులఁ దృణములుగా భావించుచు సుఖకారణమగు దేవత్వమును బ్రహ్మత్వమును గూడ నాశింపక యుండును. సదా నాదాస్యమునే కోరును. సాలోక్యాదిచతుష్టయమును గోరఁడు నిర్వాణముక్తిని, అమృతపానము నాశింపఁడు. నిష్కల్మషమగుభక్తిని గోరును. భక్తికి స్త్రీపురుషభేదము లేదు. కులభేదములు లేవు. క్షుత్పిపాసలు నిద్రాలోభమోహా

దులు వదలి రేయింబవళ్లు నన్నే తలంచుచుండును. దిగంబరు లుగ నుందురు. వాఁడు నా భక్తులలో నుత్తముఁడు. మధ్యమ భక్తునిలక్షణముల నాలకింపుము. గృహస్థుఁడై కర్మములయం దాసక్తుఁడు గాక పూర్వకర్మనికృంతనకర్మము నాచరించుచు సంకల్పరహితుఁడై సర్వము కృష్ణార్పణము. నే నిందులకు గర్తను గాను అని మనోవాక్కాయములఁ దలంచుచు నుండువాఁడు మధ్యమభక్తుఁడు. ప్రాకృతికుఁ డనువాఁడు తద్భిన్నుఁడని యెఱుంగుము. వాఁడు యముని గాని, యమదూత నుగాని స్వప్నమందైనఁ జూడఁడు. పురుషసహస్రములఁ దొలుత చెప్పినభక్తుఁ డుద్ధరింపఁగలఁడు. మధ్యముండు శతము నుద్ధరింపఁగలఁడు. ప్రాకృతుఁ డగుభక్తుఁడు శతచతుర్భాగసంఖ్యల నుద్ధరింపఁగలఁడు. తండ్రీ! నీ కోరిక ననుసరించి త్రివిధ భక్తులం దెల్పితిని. బ్రహ్మాండరచనాఖ్యానమును వివరించెద. సావధానుఁడవు కమ్ము.

బ్రహ్మాండరచనాఖ్యానమును భక్తు లారయఁగలరు. మును లు దేవతలు కష్టపడిన నించుక తెలియఁగలరు. ప్రపంచము సర్వార్థవంతము. దీనితత్త్వమును బ్రహ్మయు. ననంతుఁడు, మహేశ్వరుఁడు, ధర్ముఁడు, సనత్కుమారుఁడు, నరనారాయణమునులు, కపిలుఁడు, గణేశుఁడు, దుర్గయు, లక్ష్మీసరస్వతులు, వేదములు, వేదమాతయు, సర్వజ్ఞయగురాధికయు ననువీరు మాత్రమే చక్కఁగా నెఱుంగఁగలరు. తక్కంగలవా రెఱుంగరు. వైషమ్యము బుద్ధియందుఁగలవారలొట బుద్ధిమంతులయ్యు నెఱుంగఁ

జాలరు ఆత్మ యెట్లునిత్యమో ఆకాశ మట్లే నిత్యము. దశదిశలు నిత్యములు. ప్రకృతియెట్లు శాశ్వతమో యట్లే విశ్వగోళము నిత్యము. గోలోకమేలాగు నిత్యమో వైకుంఠ మట్లే.

ఒకానొకదినమున గోలోకమున నేను రాధికం గూడి రాసోత్సవమునం దేలుచుంటిని. అత్తఱి నావామాంగమునుండి పదాఱువత్సరముల బాలిక యావిర్భవించెను. శ్వేతచంపక వర్ణము గలిగి శరత్పార్వణశీతాంశునిభముఖ మలరార మిగుల సుందరాంగియై రమణీగణమున నుత్తమురాలై యాయతివ పొడకట్టెను. ఆమెమోము చిఱునవ్వున నలరుచుండెను. కోమలాంగము మనోహరముగాం గనుపట్టుచుండెను. వహ్నివలెం బరిశుద్ధమగునంబరము ధరించి సర్వాభరణభూషితయై బలాకాభిభూషితయగు మేఘుపంక్తివలె నొప్పారుచుండెను. సిందూరబిందు వామె భాలభాగమున నలరుచుండెను. పరిమళచారుచందనచర్చ లాయతివతనువునకుం గ్రొత్తరంగునిచ్చుచుండెను. ఇట్లు సకలలక్షణముల విలసిల్లుచు మత్తదంతిగమనమొప్ప నాకామిని కటాక్షముల నన్నుం గాంచెను.

ఆమె రమణోత్సుకియై యుండెను. రాసమండలమున కరుదెంచి నన్నుం గాంచుచు నాపురోభాగమున నుండెను. ఆకారణమున రాధయనుపే రామెకుం గల్గెను. ప్రకృష్టప్రకృతికలది గావునం బ్రకృతి యనంబడియె. సర్వకార్యనిర్వహణమున శక్తి గలది కావున శక్తి యనంబడియెను. సర్వమున కాధారభూతయై సర్వరూపిణియై మంగళోచితయై సర్వమంగళదక్షయై యుండు

కతన సర్వమంగళ యనంబడియెను. ఆమెయే వైకుంఠమున మహా లక్ష్మియనియు, నవతారభేదమున సరస్వతి యనియు, వేదములఁ బ్రభవింపఁజేయుట వేదమాత యనియు,సావిత్రి యనియు, గాయత్రి యనియుఁ, ద్రిజగద్ధాత్రియనియుఁ బ్రఖ్యాతింగాంచెను. పూర్వము దుర్గమరాక్షసులను జంపి దుర్గయనం బరఁగెను. సకల దేవతాతేజస్సులం గైకొని పూర్వ మొకపరి జనించెను. కాన నాద్యప్రకృతి యనియుఁ బ్రఖ్యాతిం గాంచెను. సర్వానందస్వరూపిణియు, సర్వదుఃఖదారిద్ర్యనాశినియు, శత్రుభయదాత్రియు, భక్తభయహారిణియు నయి, యామెయే దక్షకన్యకయై సతియనియుఁ బర్వతపుత్రియై పార్వతియనియు, సర్వాధారస్వరూప యనియుఁ గీర్తింపఁబడు. ఆమెయే యొకకళచే వసుంధర యయ్యెను ఒక్కకళచేతనే తులసి యనియు గంగయనియు నాఖ్యం గాంచెను ఆమె సాయముననే కదా నేను సృష్టి చేయుదును ఆమెను రాసమధ్యభాగమునఁ గాంచి ముదము నొంది యామెం గూడి నూర్వురు బ్రహ్మలుండునంతకాలము క్రీడించితిని. అత్యద్భుతమగు కౌతుకమున శృంగారక్రీడ సలుపఁబడియెను. వారియిద్దఱినుండి రాసమండలమున స్వేదజలము ప్రసవించెను.ఆజలమే వేరున నాకారసరోవరమనం బ్రథితం బయ్యెను. ఘర్మధారాధోభాగమునందు విశ్వగోళకములు వెలసెను. బ్రహ్మాండగోళకమున నది కీర్తింగాంచెను. జలపూర్ణంబగుట నందు సృష్టిశూన్యమై యుండెను.

శృంగారాంతమున నా రాధాదేవియందు వీర్యాధాన

మొనరించితిని. ఆగర్భము చిరకాలము వృద్ధియగుచుండెను. ఒకానొకతరుణమున నారాధ పరమాద్భుతుఁడగు బాలునిం గనియెను. ఆశిశువుం గాంచి కోపావేశమున నారాధ రోదన మొనరించెను పాదమున విశ్వగోళకమునఁ బ్రేరేపించెను దాని యందు సర్వాధారుఁడగు విరాట్టువు పడెను. అట్లు జలములం బడిన సంతానము గాంచి నేనాతరుణీమణిని శపించితిని. దాన నారాధ యనపత్య యయ్యెను. ఆవిరాట్టువునుండి క్రమముగా దుర్గాలక్ష్మీసరస్వతు లుదయించిరి. వారినుండి పెక్కుమంది కాంత లుద్భవిల్లిరి. వారు తమకళలచే నెందఱినో పుట్టించిరి. ఏకళచే శిశువుగా విరాట్టువు జనించెనో ఆతనికి నమ్రుతాంగు ష్ఠపీయూషము నొసంగితిని. దాని నాతఁడు త్రాగెను. జలము నందు స్థావరరూపమున నిజకర్మవశమునఁ బరుండెను. యోగ బలమున నాతనికి జలమాధార మయ్యెను. ఆతనిలోమకూప ములు సదా జలపూర్ణములని యెఱుంగుము. ఆకూపములనుండి యల్పవిరాట్టువు లెందఱో పుట్టిరి. అందొక్కనినాభి సహస్రదళ పద్మాకార మయ్యెను. అందుండి బ్రహ్మ యుదయించెను. కావు ననే కమలోద్భవుం డనంబడియె.

ఆబ్రహ్మ పుట్టినంతనే చింతాగ్రస్తుఁ డయ్యెను. ఈ దేహ మెక్కడినుండి వచ్చెను? నాకు మాత యెవ్వతె? తండ్రి యెవఁడు? బాంధవుఁ డెవఁడు? అని చింతించుచుఁ జిరకాలమందే తిరుగుచుం డెను. ఐదులక్షలవత్సరములు తపస్సుచే నన్ను స్మరించెను. నేనతని యెదుటఁ దోఁచి యొకమంత్రము నాకమలోదరమునందే యుప

దేశించితిని దాని నందే నియతుఁడై చిరకాలము జపించెను. అపుడు నేనాతనికి వరమిచ్చితి. సృష్టికార్యమున నతఁడు ప్రవర్తించెను. మాయచేఁ బ్రతిబ్రహ్మాండమందును బ్రహ్మావిష్ణుమహేశ్వరులును, దిక్పాలకులు, ద్వాదశాదిత్యులు, నేకాదశరుద్రులు, నవగ్రహములు, అష్టవసువులు, మూఁడుకోట్లదేవతలు, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు, యక్షగంధర్వకిన్నరులు, భూతములు, రాక్షసులు, మొదలగు నీచరాచరరూపజంతువులుదయించెను. ప్రతివిశ్వమునందును స్వర్గము లేదు కల్పింపఁబడియెను. సప్తసాగరములు సప్తద్వీపములు గలపృథ్వియు నిర్మింపఁబడియెను. కాంచనీభూమిసంయుక్త యగునది పృథ్వి. దానియం దలిస్థలము తమోయుక్తము. సప్తపాతాళములు నిర్మింపఁబడియె. వీనిచే బ్రహ్మాండ మావృతంబగు. ప్రతివిశ్వమందును జంద్రసూర్యులు గలరు. భారతవర్షము పుణ్యక్షేత్రంబగు. దీనియందు గంగాదిపరమపావనతీర్థరాజములు గలవు. మహావిష్ణువున కెన్నిరోమకూపములు గలవో యన్ని విశ్వములు కలవని యెఱుంగుము. కాన విశ్వము లసంఖ్యాతములని యెఱుంగుము. విశ్వములకు నూర్ధ్వభాగమున వైకుంఠము నిరాశ్రయమై యలరు. దానిమహిమమును వేదములు వచింపఁజాలవు. కుమతుల కీవిషయ మగమ్యము. ఆవైకుంఠమునకు నూర్ధ్వభాగమున గోలోకము గలదు. దానివిస్తృతి యపారము. దానిని వాయువు ధరించి యుండును. విచిత్రరీతి నది పొల్చును. పరమాశ్రయమై యది యుండు. రత్ననిర్మాణముల

నది పొల్చి నాయిచ్ఛచే శాశ్వతమై గోలోక మమరియుండును. అందే శతశృంగపర్వతము గలదు. బృందావన మందే కానంబడు. అది పరమపావనము. రాసమండల మాగోలోకమున నలంక రించియుండు. విరజానది యందుఁ బ్రవహించుచుండు. దాని యొడ్డున రత్నమందిరముల బృందము లానందదాయకములై కనుపట్టుచుండును. దానిచుట్టు ప్రాకారమును విశ్వకర్మయే యలరించెను. గోపికాగోపకులు కామధేనువులు నందుండు. కల్పవృక్షము లందుఁ గిక్కిరిసియుండు. సరోవరములు కన్నుల పండువు చేయుచుండును. రాసమండలముచుట్టును బుష్పో ద్యానము లలరారుచునుండు. దానిచెంతనే శతశృంగపర్వ తము కనంబడును. ఆపర్వతము గోలోకప్రాకారమో యన నొప్పుచునుండును.

బృందావన మాలోకమునందే చందనపాదపసమన్వితమై కల్పవృక్షసాంద్రం బై కామధేనునిబిడం బై పుష్పోద్యాన మనోహరం బై విరాజిల్లుచుండు. విరజానదీశీతలవాతపోత ములచే నావనము సుఖాకరంబుగఁ జేయఁబడుచుండును. ఆబృందావనమున రాధాదేవి విహరించుచుండును. ఆమెః నాప్రాణాధిదేవత. ఆరాధయే శ్రీదామునిశాపవశమున నిపుడు వృషభానుపుత్రిక యైనది. బ్రహ్మాదిదేవతాపూజితాంఘ్రిసరోజ యగు నారాధాదేవియే యీవృషభానుకూఁతురని యెఱుం గుము. తండ్రీ! ఆరాధ సర్వప్రకారములచేతను నావలె వంద

నార్హ. నాకుఁదగిన ప్రియురాలని యెఱుంగుము. ఇది బ్రహ్మాండ వర్ణనము. ఇంక నీవేమి వినఁగోరుదువో వివరింపుము.

*భక్ష్యాభక్ష్యవస్తునిర్ణయము.

శ్రీకృష్ణమూర్తియుపదేశమున కలరి నందుఁడు మరలఁ బ్రశ్నించువాఁడై చతుర్వర్ణములవారికిని భక్ష్యాభక్ష్యవస్తువుల నెఱింగింపుము. సర్వప్రాణులకుఁ గర్మవిపాకమును దెలుపుము. కారణములకుఁ గారణమునెల్లఁ దెలియఁ బల్కుము. నీకంటె మఱి యొక్కని నెవ్వనిఁ బ్రశ్నింతును? నీవు భగవంతుఁడవు కదా! అని నందుఁడు ప్రశ్నింప శ్రీహరి యాప్రశ్నములకు బదులిడువాఁడై భక్ష్యాభక్ష్యముల విషయ మెఱింగించెద. అవధరింపుము. నాల్గుజాతులవారును ఈధర్మమురీతి మెలంగవల యును. సామవేదోక్తమగు నీవిషయము నాలకింపుము. ఇనుప పాత్రమున నావుపాలను ద్రాగుట, యందే యన్నమును దినుట, మధుగుడములను, కొబ్బెరకాయనీరు నాపాత్రము నుండి త్రాగుట, ఫలమూలముల నందునుచుకొని భక్షించుట పనికిరాదు. అందునిచినవస్తువు లభక్ష్యములని మనువు చెప్పెను. దగ్ధాన్నము, తప్తసౌవీరము భక్ష్యము కాదని సాధువాదము. కంచుపాత్రమున నాళికేరజలము, తామ్రపాత్రమున మధువు, పాలు నునిచినచో నవి సురాతుల్యము లగును. నెయ్యి మాత్రము కాంస్యపాత్రమున నుంచవచ్చును. రాగిపాత్ర

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదియైదవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని తెలియందగును.

మున నున్నపాలు త్రాగుట, ఎంగిలినేతి నుపయోగించుట' పాలతో లవణమును జేర్చుట యనునవి చేయరానిపనులు. అట్టివాని భక్షించిన గోమాంసమును దిన్నట్లే యగును. తేనె గలిపిన ఘృతతైలగుడము లభక్ష్యములు. అల్లము బెల్లమును గలిపినచో నది భక్షణార్హము కాదు. ఇది శ్రుతిసమ్మతము. ఒకరు త్రాగఁగా మిగిలినజలము, మాఘమాసమున ముల్లంగి, పండుకొని జపముచేయుట వీనిని బ్రాహ్మణుఁడు వదలవలయును.

పగటిపూట రెండుపర్యాయములు భుజింపరాదు. సంధ్యాకాలములం దన్నము తినరాదు. తెల్లవాఱుజామున భక్షించుట యనునవి చేయరానిపనులు. పానీయము, పాయసము, చూర్ణము, ఘృతము, లవణము, స్వస్తికము, గుడకము, క్షీరము,మజ్జిగ, తేనె యనునవి యొకరిచేతనుండి తీసికొని భక్షించిన గోమాంసమును భక్షించినట్లు యగును. వెండిపాత్రమున నునిచినపచ్చకప్పురము నుపయోగింపరాదు. పరిషేచనానంతరము భుజించువాని నెవ్వఁడేని స్పృశించిన నాయన్నము భక్ష్యము కానేరదు. ఇదిసర్వసమ్మతము. నకులగండకమహిషపక్షిసర్పసూకరగర్దభ మార్జారసృగాల కుక్కుట వ్యాఘ్రసింహములమాంసము త్యజింపఁదగినది. జలౌకసములు, నక్రములు, గోధికములు, మండూకములు, కర్కటికలు, చుంచుకములు, గోవులు, చమరీమృగములు అను నీజంతువులమాంసము కలియుగమున భక్షింపరానిదగును. హస్తిఘోటకరాక్షసమాంసములు నట్టివే యగును. దంశమశకమక్షికాపిపీలికాదినిషేధ

జంతుమాంసము వర్జింపవలయును. వానరభల్లూకశరభమృగ నాభిగర్ధభమాంసము నిషిద్ధము. మహిషీ క్షీరదధిఘృతములు భక్షణార్హములు కావు. అందు మంగళప్రదమగు పదార్థము నవనీతము. ఈపూర్వోక్తములు వర్ణము లన్నింటికి భక్ష్యములు కావు.

ఆదివారమునందు అల్లము భక్షింపరాదు. పర్యుషిత జలము, నట్టియన్నము, నట్టిదుగ్ధము విప్రులకు నిషేధము. పతి పుత్త్రులు లేనిదానిచేతియన్న మన్నివర్ణములువారును భక్షింప రాదు. ఆయన్నము సురాతుల్యము. గోమాంసమునకంటె నెక్కుడు దూష్యము. జ్ఞానదుర్బలుఁడగు నేబ్రాహ్మణుఁడు పతి పుత్త్రులులేనిస్త్రీ చేసినయన్నము భుజించునో ఆతఁడొనరించిన పితృదేవార్చనము నిష్ఫలముగాఁ బరిగణింపఁబడునని మనువు చెప్పెను. బ్రాహ్మణులకు నందును విష్ణుభక్తులకు మత్స్యమాంసము భక్షింపఁదగనిది. తక్కినవారి కామత్స్యమాంసము పంచ పర్వములయందు మాత్రము నిషిద్ధము. ఏమాంసము పితృదేవావశేషమో యది దూషితము కాదు. అదియుఁ బంచపర్వము లందును దూష్యమని మనువు శాసించెను. అసంస్కృతమగు లవణము తైలము నివి రెండును నభక్ష్యములే. వహ్నిసంస్కృత వ్యంజన మందఱకుఁ బవిత్రమే యగు. ఒంటిచేతితోనిడినజలము ఘృతము గ్రహింపఁదగవనుట సర్వసమ్మతము. నిర్మలజలము కూడ కృమియుక్తమై కలుషముగా నున్నయెడల నపరిశుద్ధ మగును. ఆజలమును బ్రాహ్మణులు నందును విశేషించి వైష్ణ

పులును ద్రాగరాదు. హరికి నివేదింపఁబడనిపదార్థము యతులకు బ్రహ్మచారులకును భక్ష్యము కాదు. పిపీలికామిశ్రమగు మధువు, గవ్యము, గుడము భక్షింపరాదు. పక్షులు దినినది కీటములు దినినది శుద్ధమగు పక్వఫలమైనను దినరాదు. కాకభక్షితమగువస్తు వందఱకు నభక్ష్యము.

ఘృతపక్వము, తైలపక్వము, శూద్రపక్వమగు మిష్టాన్నము ననునివి బ్రాహ్మణులకు భక్షింపరానిది. అశుచులగునెల్ల వారిజలము నన్నము పరిత్యజింపఁదగినది. కర్మముల విపాకము దుష్కరము, శ్రుతిసమ్మతము. నందరాజా! భక్ష్యాభక్ష్యవస్తువుల నెఱింగించితిని. నాల్గువేదములయందు ననువదింపఁబడిన మతచతుష్టయము సర్వసారభూతమును వచించెద. తండ్రీ! శ్రద్ధగా వినఁదలంపుము.

కర్మమనునది యనుభవింపక నశింపదు. ఎన్నికల్పములకైన నది వెంటనంటియే యుండును. తాఁజేసికొన్నకర్మము శుభాశుభరూపము ననుభవింపక తప్పదు. తీర్థములు దేవతలు తద్విషయమున సాహాయ్యము చేయఁజాలరు. కాయవ్యూహముచే నించుక సాహాయ్యము కలుగును. ఎన్నిప్రాయశ్చిత్తములు చేసినను మత్పరాఙ్ముఖునిఁ బవిత్రునిజేయ శక్యము కాదు. ఎన్నినదులలో ముంచినను సురాభాండము పవిత్రము గానియట్లు మద్భక్తిశూన్యుఁడు పవిత్రుఁడు కాఁడు. పవిత్రమగు ప్రాయశ్చిత్తమున మానవులు పరిశుద్ధులు గారు. సర్వదానము లాతనిఁ బవిత్రుఁ జేయఁజాలవు. శుభాశుభరూపమగు స్వకృతకర్మము

ననుభవింపక పవిత్రులగుటకు మార్గము లేదు. భోగమున నవి నశింపఁగా నవ్వాల మధ్భక్తి గలుగ ముక్తి లభించును. * దుష్కృతకర్మము సుకృతకర్మమున నశింపదు. సుకృతకర్మము దుష్కృతకర్మమునను నశింపదు. యజ్ఞములు, తపము, నిరశనవ్రతములు, తీర్థస్నానములు, దానములు, జపములు, నియమములు ననునివి యెన్ని చేసినను బూర్వకర్మమనుభవింపక నశింపదనియెఱుంగుము. భూప్రదక్షిణము చేసినను, పురాణముల వినినను, పుణ్యోపదేశములఁ బొందినను, గురుదేవతలఁ బూజించినను, నవి నశింపవు. ఎన్నిధర్మము లాచరించినను, అతిథులఁ బూజించినను, విప్రపూజలొనర్చిన, ననుభవింపక సుకృతదుష్కృతములు. నశింపవు. దానము బీజరూపము. బ్రాహ్మణుఁడు క్షేత్రరూపుఁడు. తగినట్లు ఇవ్విరెండలరెనేని దానము ఫలించును.

† తండ్రీ! నియతిమై నొక్కసత్కర్మ మొనర్చినను స్వర్గము లభించును. కర్మ మాచరించిన మోక్షము లేదు. నాసేవ చేతనే యది లభించును. సుకృతముచేతనే స్వర్గము లభించును. పాపముచే నరకము గల్గును. కుత్సితకర్మముచేతనే వ్యాధియు జన్మము కల్గును. గర్భనరక మనుభవింపవలసియుండును. ఆకుత్సితకర్మము నశింపఁగాఁ బరిశుద్ధుఁ డగును. విప్రులలో నెవ్వఁడు

* న నష్టం దుష్కృతం కర్మ సుకృతేన చ కర్మణా, న నష్టం సుకృతం కర్మ కృతేన దుష్కృతేన చ. యజ్ఞేన తపసా వాపి వ్రతేనానశనేన చ, తీర్థస్నానేన దానేన జపేన నియమేన చ. అని మూలము.

†కర్మణా న హి మోక్షం చ తదేవ మమ సేవయా. అని మూలము.

గోహత్య నొనరించునో, కోరికచే నుపపాతకముల నొనరించునో వాఁడు క్రూరసర్పమై గోలోమసంఖ్యాసమవర్షము లాజన్మములనే యనుభవించుచుండును. మరల జన్మించి భీకరసర్ప గరళజ్వాలలచే దగ్ధుఁడై క్షుత్తృష్ణాభిభూతుఁడై నిరాహారుఁడై యుదరము కృశింపఁ జిరకాల ముండును. అవలఁ గుష్ఠరోగము బాధింపఁ జాండాలుఁడై యుండును. పిదప విప్రజన్మమెత్తి కుష్ఠ రోగపీడితుఁ డగు. సద్విప్రుల లక్షమందిని భుజింపఁజేయ వ్యాధి రహితుఁ డగు.అకాముఁడై యట్టి పాపమొనరించినక్షత్రియుఁడు తదర్ధపాపము నొందును.వైశ్యుఁడట్లె యొనరించినఁ దదర్ధపాపము గల్గును. తదర్ధపాపమును శూద్రుఁడు పొందును.ఇందులకు సంశయము లేదు. శూద్రుఁడు ప్రాయశ్చిత్తము చేసినను భోగమునఁ గాని కర్మఫలము చెడదు.శూద్రునకుఁ జెప్పఁబడినగోహత్యవలని పాపము నాల్గింతలు బ్రాహ్మణుఁ డనుభవించును. బ్రహ్మఘ్నదోషమును విప్రుఁడుగాని యితరుఁడుగాని యనుభవింపక ప్రాయశ్చిత్తములచేఁ దొలఁగింప వలనుపడదు. నాలుగువర్ణములలో స్త్రీహత్య చేసినవాఁడు పాతకి యనఁబడును. కాలసూత్రనరకమునను౦డి చిరకాలము తత్పాపఫల మనుభవింపవలయును.అంతియ గాక మరల ననేకజన్మము లెత్తి యీలోకమునను దత్ఫల మనుభవించుచుఁ గ్రమముగా శుద్ధుఁ డగును. గర్భమును, ఛేదించినవాఁడు మహాపాపి యనంబడు. శునకజన్మ మెత్తును. క్షత్రియుని యుద్ధమునఁ గాక వేఱుచోట వధించినవిప్రుఁడు తప్తశూలనరకమునఁ బడియుండును. వైశ్యుని వధించినవైశ్యుఁడును,

శూద్రుని వధించిన వైశ్యుఁడును, వైశ్యుని వధించిన శూద్రుఁడును, బాపము సమానమని యెఱుంగవలయును. కృమికుండ నరకము తత్పాపానుభవమునకుఁ దగినది. తెలిసిగాని తెలియకగాని శూద్రుని వధించిన విప్రుఁడు సావిత్రీమంత్రలక్షజపము చే శుద్ధుఁడగు. దానియం దర్ధము చేసినఁ దెలియక చేసినపాపము శాంతించును.

నాల్గువర్ణములవారును గుక్కుటముల వధింపరాదు. పాపముద్దానిం జేసిన రౌరవనరకము గల్గును. మార్జారమును జంపినవారికి గంగాస్నానము ప్రాయశ్చిత్తము. విప్రునకు లవణదానము చేసిన శుద్ధుఁడగును. సర్పములఁ జంపినయెడల నెల్లరకు బ్రహ్మహత్యయందు నాల్గవవంతు పాపము గల్గును. సర్పఫణమున నాపాదచిహ్నము కలదు కదా. ఆపాపఫలము ననుభవింపనసిపత్రవనమునాఁబడు నరకము గలదు. పిదప రౌప్యదానము చేసిన మిగిలియున్నపాపము నశించును. క్షుద్రజంతువుల వధించినఁ దత్సమానజన్మము గల్గును. సాధువులు హింసాస్వభావములేనిజంతువులపై దయగలిగి యుండవలయును. హింసాస్వభావముగలజంతువులకు హింసవలనఁ బాపము లేదు గుఱ్ఱమును వధించినయెడల బ్రహ్మహత్యాపాపమున నాల్గవపాలు పాపము గలుగును. అసిపత్రనరకమద్దాని ననుభవింప నిర్ణయింపఁబడినది. వ్రణవ్యాధి తుదకు లభించును. స్వర్ణదానమున నది నశించును. అబద్ధపుసాక్ష్యము చెప్పువాఁడు, కృతఘ్నుఁడు, విశ్వాసఘాతకుఁడు, మిత్రఘ్నుఁడు, విప్రధనహారకుఁడు, శూద్రశ్రాద్ధాన్న భోక్త

శూద్రశవదాహకుఁడు, శూద్రసూపకారకుఁడు, వృషభవాహనాధిరూఢుఁడు, ధావకుఁడు, దేవలుఁడు ననువీరు పాతకులని పరిగణింపఁబడినది. వీరికీపాపము ననుభవింపఁ గుంభీపాకము నిర్ణయింపఁబడినది. అజీర్ణవ్యాధి తుదకుఁ గల్గును. నూఱుపలములు బంగారుదానము చేసిన నాపాపము నశించును. వస్త్రములను పాలు పెరుగు నెయ్యి యను నీమూఁడింటిని హరించువారును, వెండిని ముత్తైములను దొంగిలించువారును, శూద్రద్రవ్యమును దొంగిలువారును, కొంగలై పుట్టుదురు. మూత్రకుండ మీపాపానుభవమునకు నరకము. కుష్ఠవ్యాధి తుదకుఁ గల్గును. ఆఱుపలములబంగారు దానమీయ నివర్తించును. కోశాపహారకుఁడు ఫలముల హరించువాఁడును, భూమియందు యక్షుఁడై పుట్టి చిరకాల మాపాపము ననుభవించును. పక్వపదార్థముల నపహరించువాఁడు పశుయోనిం బుట్టువును గాంచును.

ధాన్యము నపహరించినవాఁడు సదా దుఃఖియగు. బంగారు దొంగిలువాఁడు కుష్ఠరోగి యగు. అగమ్యాగమనము చేసినవాఁడు రౌరవనరకమునఁ బడు. సాలగ్రామప్రతిమను దొంగిలినవాఁడు కాలసూత్రమునఁ బడును. పిదపఁ గాటుకపిట్టయై పుట్టును. లోహమును దొంగిలించినవాఁడు వంశహీనుఁడగు. విప్రద్వేషియు గురుద్వేషియు శిరస్సునఁ గ్రిములు బాధింప బాధపడువాఁడగును. పుంశ్చలిని బొందువాఁడు మహాపాపాత్ముఁ డగు. వానికినరకము రౌరవము. కడపటిజన్మమునముక్తులేనివాఁడగును.

ద్రవ్యమును దొంగిలువాఁడు రక్తదోషాన్వితుం డగు. ఆచార హీనుఁడు యవనుఁ డై పుట్టును. అహంకారము గలవాఁడు తత్పాపమున మఱుసటిజన్మమునఁ గర్ణహీనుఁ డగు. వేదనిందకుఁడు బధిరుఁడై పుట్టు. ఇతరులమాటలాడనీయనివాఁడు మూఁగవాఁ డగు. మిథ్యావాది శ్మశ్రుహీనుఁ డగు. దుర్వాక్కులు పలుకు వాఁడు దంతహీనుఁ డగు. సత్యము పలుకకుండ నిలుపు వాఁడు జిహ్వాహీనుఁ డగు. దుష్టుఁ డంగుళిహీనుఁ డగు. గ్రంథముల నపహరించువాఁడు మూర్ఖుఁడగు. గజాపహారి తత్సేవకుం డగు. ఘోటకాపహారకుఁడు ఘోటక మయి పుట్టును.

యజ్ఞముకానిచోట ఛాగమును జంపువాఁడును, ఛాగమును దొంగిలి దానమిచ్చిన గ్రహించువాఁడును, పూయకుండ నరకమునఁ బడుదురు. శత్రుశస్త్రమున మృతిఁ గని చిరకాలము జన్మముల నెత్తుచు దుఃఖపడి యవ్వల నఘముక్తుఁ డగును. దానమిచ్చి యావస్తువుల నపహరించినను, వాగ్దానము చెల్లింపకున్నను నీచజాతియందుఁ బుట్టి నరకమునఁ బడుచుండును. ఒంటరిగాఁ గూరుచుండి మిష్టమును భుజించువాఁడు కాలసూత్రమునఁ బడును. తుదకు మఱి కాజన్మము గలుగు. నూనె దొంగిలువాఁడు తైలముదీయువారియింటఁ బుట్టును. స్వర్ణకారుఁడుగా బంగారువ్యాపారముచేయువాఁడు జన్మించును. తరువాతఁ గాయస్థుఁడై జన్మించును. మనుష్యులలోఁ గాయస్థులు ధూర్తులు. కృపాహీనులు. వారిహృదయము ఖడ్గధారాసమానము. వారిలో నూఱుమందిలో నొకఁడు సజ్జనుఁ డుండిన నుం

డును. వారియందు విశ్వాసమునుపరాదు. పొలిమేరను జరపు వాఁడును, భూమిని దొంగిలువాఁడును, భూదానము నపహరించువాఁడును, కాలసూత్రనరకమునఁ బడుదురు.

సంధ్యావందనము చేయనివాఁడును, ప్రాతఃకాలమున నిద్రించువాఁడును, సాయంసమయమున శయనించువాఁడును, దివాస్వాపకుఁడు, యజ్ఞసూత్రాపహారకుఁడు, పరిశుద్ధుఁడు గాక సంధ్యావందన మాచరించువాఁడును, వేదవేదాంగముల నిందించువాఁడును, పతితు లగుదురు. అశుచియై దేవతకు నైవేద్య మిడువాఁడును, సకేశమగు పార్థివలింగమును బూజించువాఁడును, యవనజాతిం బుట్టుదురు. శివలింగము మృద్భస్మగోమయములచేఁ జేయఁదగినది. దానినర్చింప ననంతపుణ్యాఫలము లబ్బును. * పెక్కుజన్మములయం దొనరించినతపస్సుచే భారతవర్షమున జన్మించుభాగ్యము కలుగును. అందలితీర్థములు పవిత్రులనుగాఁ జేయును. జీవన్ముక్తులగువైష్ణవు లందుండుదురు వారు తమతమవంశస్థులను వేయిమందిని దరింపఁజేయుదురు. బ్రాహ్మణుఁడు పాపకార్యముల నొనరించిన వైద్యుఁడై జన్మించును. దుష్టచికిత్సలఁ జేయుచుండును.ఆతఁడు పాములవాఁడై పుట్టును. పరకీయతటాకమును, సుప్తసస్యమును దానమిచ్చువాఁడు నక్రజాతియందుఁ బుట్టును. కచ్ఛపముగాఁ దశ్వాతఁ బుట్టును. మత్స్యమాంసము నాసక్తిచే నకారణముగాఁ దినువిప్రుఁడు

* అనేకజన్మపుణ్యేన జాయతే భారతే భువి, తస్యాం ప్రిస్పర్శనేనైవ పద్యః పూతా వసుంధరా. అని మూలము.

మీనమై పుట్టును. తర్వాత మృగజన్మ మెత్తును. ఏకాదశీవిహీనుఁడు పతితుం డగును. భక్షించినవస్తువును రెండింతలు దానమీయ నా పాపము తొలఁగును. నా జన్మదినమున నెవఁడు భుజించునో యా మానవాధముఁడు మహాపాప మనుభవించును. శివరాత్రియందును, శ్రీ రామనవమియందు నుపవసింప సమర్థుఁడై యుండినవాఁడు హావిష్యమును దినవలయు. అందులకు నశక్తుఁడై దుర్బలుఁడునై యుండిన భుజించి తత్కథాశ్రవణనిరతుఁ డైన మదీయదినోపవాసచ్యుతిజనితపాపము నశించును. కావున యత్నమూని నానామసంకీర్తనము చేయ వలయును.

చిత్రవస్త్రముల నపహరించువాఁడు మయూరమైపుట్టును. తేజఃపాత్రము నపహరించువాఁడు కారండవ మయి చిరకాల ముండును. సువర్ణప్రతిమాచోరుఁడు గ్రుడ్డివాఁడై యెన్నియో జన్మము లుండును. స్త్రీతైలమధుమాంసముల నాదివార ముపయోగించిన వజ్రదంష్ట్ర నరకమునఁ బడును. దేవద్విజవర్యులను జూచి యెవఁడు నమస్కరింపఁడో వాఁడు యవనుఁడై యశుచి యగును. విప్రుఁడు వచ్చుచుండ నభ్యుత్థానము చేయనివాఁడు దుఃఖపడును. జ్ఞానదుర్బలుఁడై పితృదేవార్చనమునకు విఘాతము చేయువాఁడు నరకప్రాప్తుఁడగును. గురుసేవ చేయక వారికన్న మిడక యుండువాఁడు దేవలుఁ డగు. అఖండమగుదీపము నార్పిన వాఁడు మిణుఁగురుపుర్వగును. మత్స్యమాంసము నాదృతిచే నవిధిగా భక్షించిన మార్జార మగును. కన్యను విక్రయించు

వాఁడు తామిస్రనరకమునం బడును. నా నామమును విక్రయించి జీవించు విప్రునకుఁ బాపవిముక్తి లేదు. నా నామస్మృతిచేతనే యమలోకమునకుఁ బోవకుండఁ గలఁడు. లేనికళంకముల నారోపించువాఁడును, దేవబ్రాహ్మణనిందకుఁడు స్వర్ణకారుఁడై గాని రజకుఁడై గాని పుట్టును. కామాతురుఁడై నారీపాణులశ్రోణీభాగములఁ గాని ముఖవక్షోరుహములను గాని యెవ్వఁడు చూచునో వాఁడు దృష్టిహీనుం డగును. పరజన్మమున నపుంసకుఁ డగు శాస్త్రజ్ఞానము కలిగి దైవజ్ఞుఁడయ్యును మిథ్యావాక్యముల నెవఁడు పల్కునో వాఁడు వానర మగును.

నదులయందు గంగానదియుఁ, దీర్థములయందుఁ బుష్కరము, పురములయందుఁ గాశియు,జ్ఞానులయందు శంకరుఁడును, శాస్త్రములయందు వేదము, వృక్షములయం దశ్వత్థము, తపస్సులయందు నా పూజయు, వ్రతములయం దనశనవ్రతము, నెల్లశ్రేష్ఠములో అల్లె యందఱియందును బ్రాహ్మణుఁ డుత్తముఁడు. వారియాశీర్వచనము శుభదాయకము. కావున నోనందరాజా! నీ ప్రశ్నమునకు బదు లిచ్చితిని. ఇంకేమి వినఁగోరెదవో యని శ్రీహరి పలికి యూరకుండెను.

ఆర్యులారా! భక్షింపఁదగినట్టియుఁ దగనివియు నగు వస్తువులఁ దెలుపునీవిషయమును జదివితిరి కదా. దీనింగుఱించి విశేషించి వ్రాయఁదగినవిషయములు లేవు. కాని యొక్కటి రెండువిషయములను గూర్చి కొలఁదిపంక్తులు వ్రాయక తప్పదు. భక్షింపఁదగినవస్తువు లివియని, వాని భక్షించినచోఁ బాపము

కలుగుననని, శాస్త్రము లిట్లనుశాసించినవని వచించిన నవ్వాని నమ్మువారికేగాక యితరులకీ మాటలు పనికిరావు. శాస్త్రముల నమ్మునట్టియాస్తికులకే యీ విషయమునుగుఱించి వచింపవలయు. భక్షింపరాని వనఁగా నర్థమేమి? మనస్సునకుఁ జాంచల్యమును గల్గించునని. తద్ద్వారా సత్కర్మాచరణమునకు బాధకమని వచింపవలయు.

శ్లో. ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు. ౭.
ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః.
కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. ౯.
యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. ౧౦.

భగవద్గీత. ౧౭. అ.

దీనియవతారికయందు శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు "ఆహారాదీనాం చ రస్యస్నిగ్ధాదివర్గత్రయరూపేణ భిన్నానాం యథాక్రమం సాత్త్వికరాజసతామసపురుషప్రియత్వప్రదర్శనమిహక్రియతే. రస్యస్నిగ్ధాదిషు ఆహారవిశేషేషు ఆత్మనః ప్రత్యతిరేకేణ లింగేన సాత్త్వికత్వం రాజసత్వం తామసత్వం చ బుద్ధ్వా రజస్తమోలింగానా మాహారాణాం పరివర్జనార్థం సత్త్వలింగానాం చోపాదానార్థం. తథా యజ్ఞాదీనామపి సత్త్వాది గుణభే

దేన త్రివిధత్వప్రతిపాదనం. ఇహ రాజసతామసాన్ బుద్ధ్వా కథం ను నామ పరిత్యజేత్. సాత్త్వికానేవానుతిష్ఠేత్. ఇత్యేవ మర్థం చాహ." అని వ్రాసిరి. అభక్ష్యము లనఁగాఁ దమోగుణమును రజోగుణమును వృద్ధినొందఁజేసి తద్ద్వారా అసత్కార్యములను జేయించునవి. అట్లుచేసినచోఁ బరమగతికిఁ బ్రతిబంధక మగును. అనుకారణము నూహించియే మనపూర్వులాహారనియమములఁ గల్పించిరి. సత్వగుణమును వృద్ధిచేయునవి సాత్వికములని, వానినే గ్రహింపవలయునని శాసించిరి. ప్రతివిషయమునుండియు మనస్సు నిర్మలతఁ గాంచవలయునని ముఖ్యభావము. ఆహారమునుబట్టి బుద్ధియూహాలు మాఱుచుండును. అవి సత్పథమునుండి తొలఁగించునవియు నగును. కావున నట్టియాహారములఁ గొనరాదని మనవారిభావము. ఈ విషయమే మనుస్మృతియందును

శ్లో. లశునం గృంజనం చైవ పలాండుం కవకాని చ
అభక్ష్యాణి ద్విజాతీనా మమేధ్యప్రభవాణి చ. ౫
లోహితాన్ వృక్షనిర్యాసాన్ వృశ్చనప్రభవాం స్తథా,
శేలుం గవ్యం చ పేయూషం ప్రయత్నేన వివర్జయేత్. ౬
౫ అధ్యా.

అని యనేకవస్తువులు పరిత్యాజ్యములని వ్రాసిరి. జ్యోతిశ్శాస్త్రమునందు జాతకప్రకరణమునం దాయుర్దాయము నిర్ణయించుఘట్టమున గణితాయుర్దాయమును జెప్పి కేశవదైవజ్ఞులు "స్యాద్ధర్మిష్ఠసుశీలపథ్యసుభుజాం న స్యాదిదం పాపినామ్."

అని యనువదించిరి. పథ్యవస్తువు లనఁగా మనోమోదకరములు. అనఁగా మనోదోషమును గల్పించునవి కావు. అట్టివస్తువులను భుజించిన మృతి తీవ్రముగాఁ గల్గును. ఏల? వానివలన మనస్సు తమః ప్రధానకార్యతత్పర మగు. దాన దోష మూపాదిల్లు. దాన నాయువు క్షీణించును. కావున పనికిరావని శాసించిరి.

"ఆలస్యాదన్నదోషాచ్చ" అని మనుస్మృతి వచించెడిని. భక్షణార్హవస్తువుల మాని భక్షింపఁదగనివస్తువులం దినుటవలన మృత్యువు గల్గునని వ్రాసిరి. వీనింబట్టి గట్టిగా నాలోచింపఁగా నాయువుక్షీణించుట కనేకమార్గములు కలవనియు నందు నభక్ష్యభక్షణ మొకపాపమనియుఁ దేలుచున్నది. కావుననే శ్రీకృష్ణమూర్తి యీవిషయమును జెప్పెను. ఇంకొక్కవిషయమును గుఱించి కొలఁదిపంక్తులు వ్రాయవలసియున్నది. మనలోఁ గొందఱు మందమతులు దోషము పుణ్యముచేత నశించుననియు, పుణ్యము విశేషదుష్కృతమున నశించుననియుఁ జెప్పుదురు. అదిసాధువాదము కాదని శ్రీకృష్ణమూర్తి యిందు శాసించెను.

శ్లో. న నష్టం దుష్కృతం కర్మ సుకృతేన చ కర్మణా,
న నష్టం సుకృతం కర్మ కృతేన దుష్కృతేన చ.

పాపకర్మము సత్కర్మముచే నశింపదు. పుణ్యకర్మము పాపకర్మముచే నశింపదు. తప్పక చేసికొన్నకర్మమంతయు ననుభవింపక నశింపదు. అని దీనిభావము గోవును జంపి వేసవికాలమునందుఁ బాదరక్షలు దానముచేసినచో నవి పుచ్చుకొన్న బ్రాహ్మణులు "దిగ్విజయప్రాప్తిరస్తు." అని దీవించిన నాపాప

మనుభవింపక తొలంగునని యూహించుటకంటె వెఱ్ఱితన మిం కొక్కటి లేదు. మంచియుఁ జెడుగు ననునివి తాననుభవింపక తొలఁగునని యూనిచెప్పుట లోకమునఁ బాపము నభివృద్ధిచేయఁ బూనుటయే గాని వేఱుగాదు. ఈసందేహము శ్రీకృష్ణపర మాత్మవాక్యమునఁ దొలఁగినది. కావున మనముచేసికొన్న పుణ్యపాపముల మన మనుభవింపక తప్పదని నిశ్చయించుకొని సత్కార్యము లొనరించి పుణ్యలోకమున కరుగవలయును. దానికి ముందు భగవన్నామసంకీర్తనము భగవత్కథాశ్రవణము లోనగునవి సాధనములు. ఇంక నీ విషయమును మాని తర్వాతి విషయము వ్రాయఁ గడంగెదను.

## కేదారరాజకన్యోపాఖ్యానము.

ఇట్లు శ్రీకృష్ణుఁడు పలికిన విని నందుఁ డానంతపరవశుఁడై శ్రీకృష్ణా! కేదారకన్యాప్రస్తావమునఁ గర్మమును గీర్తించితివి. ఆ విషయమును జక్కఁగా నాకుం దెలుపుము. కేదారకన్యక యెవ్వతె? కేదారభూపతి యెవ్వఁడు? ఆతఁడే వంశమునఁబుట్టెను? ఈ విషయమును విస్తరించి వచింపుమని యడుగ భగవంతుఁడు శ్రీకృష్ణుఁ డిట్టులనియెను. తండ్రీ ! ఆలకింపుము. పూర్వము బ్రహ్మపుత్రుఁడు స్వాయంభువు మను వుండెను. ఆతని నారీమణి శతరూప యనునది. యోషిన్మహానాయకమణి యనం బ్రఖ్యాతిఁ గాంచెను. ఆమెకొడుకులు ప్రియవ్రతోత్తానపాదులు. ఉత్తా నపాదునికుమారుఁడు ధ్రువుఁడు. ఆతఁడు మహాకీర్తిశాలి. ఆతని కుమారుఁడు. నందసావర్ణి యనువాఁడు. ఆతనికుమారుఁడు

కేదారుఁడు. ఆ కేదారుఁడు సప్తద్వీపాధిపతి. విష్ణుభక్తుఁడుం మహాభాగ్యశాలి. ఆధర్మాత్మునిరక్షణార్థ మాతనిసభయందు భగవంతునిసుదర్శన ముండును క్రొత్తగా నీనినయావులు లక్ష సంఖ్య యాతనికడ నుండును. వానిశృంగములు స్వర్ణభూషితములు. దివ్యవస్త్రములను గోవులను వరుణుఁ డాతని కొసంగెను. ఆతనికాలమున వసుంధర సర్వసస్యాఢ్యయై యుండెను. మణులను, మౌక్తికములను, హీరమణులను, ఘోటకరత్నములను, గజరత్నములను, రౌప్యప్రవాళములును, మిష్టాన్నమును బ్రతిదినము విప్రుల కిచ్చుచు నారాజు మిగులఁ గీర్తిని గడించెను. కోటిబ్రాహ్మణులను భుజింపఁజేసెను. జలపాత్రములను భోజనపాత్రములను బంగారముతోఁ జేయించి యిచ్చెను. సువర్ణయజ్ఞసూత్రమును, రత్నాంగుళీయకములను, స్వర్ణరత్నమయాసనములను దానముచేయును. ఆతని వంటయింట లక్ష మంది వంటచేయువారు కలరు. ప్రాతఃకాలము మొదలు సాయంకాలమువఱకు బ్రాహ్మణభోజనము సాగుచునే యుండును. దుఃఖితులకు భిక్షుకులకు యథోచితముగా ధనదానము చేయును. రాజు ఫలమూలాశనుఁడై విష్ణుభక్తుఁడై జితేంద్రియుఁడై సర్వము మదర్పణముచేయుచు సదా నన్ను జపించుచు నుండును.

ఒకానొకకాలమున సూపకారుఁడు రాజచంద్రుని గాంచి యిట్లు పలికెను. పదిలక్షలు బ్రాహ్మణులు భోజనమున కరుదెంచిరి. బ్రాహ్మణులు భుజించుచున్నారు. మిగిలినవస్తువులనే

భుజింపనిండు. నాల్గుయోజనములవఱకు నేవని యధికారము సాగునో ఆతఁడు నృపుఁ డనంబడు. ఆతని రాజ్యమునకు శతగుణరాజ్యముగలవాఁడు మండలేశ్వరుఁ డనంబడు ఆతని కంటెఁ బదింతలు రాజ్యముకలవాఁడు రాజేంద్రుఁ డనంబడు. అట్టివారు పంచలక్షసంఖ్య లాకేదారభూపాలుని సభయందుఁ గొలువుచేయుచుఁ గప్పమిచ్చి యమూల్యరత్నాభరణములు కానుకలుగా నిత్తురు. మహాలక్ష్మి కళచే నగ్నికుండమునుండి యుదయించి వహ్నిశుద్ధాంబరమును ధరించి రత్నభూషణ భూషితయై మహారాజా! నీకు నేఁ గొమరితనై తిననియె. ఆరాజామాటలు విని సంతసిల్లి భక్తిచే నామెను బూజించెను. భార్య కావాక్యము నెఱింగింప నామెయుఁ బ్రేమమునఁ బెంచెను.

ఆ కుమారిక కేదారభూపతిని దండ్రిగను దద్భార్యను దల్లిగను భావించి కొంతకాలము నివసించి యవ్వల మనోహరమగువనమునకుఁ దపం బొనరింప యమునాంతికమున కరిగెను. ఆమె తప స్సొనరించిన యావనమే బృందావన మనఁ బరఁగె నని యెఱుంగుము. ఆమె తపస్సునందు నుత్తమవరమును బడయఁగోరి బ్రహ్మ ప్రత్యక్షముకాఁగా శ్రీకృష్ణుఁడు భర్త యగు నట్లు వరమిమ్మని యడుగ నట్లే యగునని వరమిచ్చెను. ఆకేదారకన్యక యొకానొకప్పుడు నదీతీరమునందు వసంతకాలమున సస్మితయై పుష్పశయ్యయందుఁ బరుండి రత్నభూషణము లలరార నుండెను. బ్రహ్మయు మనోహరాంగియగు నామెఁ బరీక్షించుట

కచ్చటికిం బోయెను. రహస్యస్థలముననున్న యాకన్య ప్రాయ మున విఱ్ఱవీఁగు నా పురుషునిం గాంచెను. ఆతఁ డతిశయలా వణ్య మలరార సస్మితుఁడై కాముకుఁడై రమణీమణులు కోరఁ దగినట్లుండెను. పదాఱువత్సరము లాయనవయ స్సని పరిగణిం పఁబడఁదగిన ట్లుండెను.

ఆ కుమారుం గాంచినంతనే లేచి తనసన్నిధిం గూరు చుండ వేఁడి భక్తిమైఁ బూజించి ఫలమూలముల నర్పించి సువాసితోదకము నిచ్చి మహానందమున నమస్కరించెను. ఆకు మారుఁడును బూజను గ్రహించి సాదరముగా నామెతో నిట్లు మాటలాడెను. ఆ తరుణమున నా కుమారుఁడు బ్రాహ్మణ రూపమును ధరించియుండెను. బ్రహ్మతేజ స్సుట్టిపడుచుండెను. ఆతని యప్పటివాక్కు సతులకు దుష్కరముగను గాముకులకుఁ గామ్యమునై యుండెను. పూజ్యచరితా! నీ వెవ్వరికన్యకవు? నీ మనోహరనామ మెయ్యది? ఈ రహస్థ్సలమున నేమిచే యుదువు? నా కెఱింగింపుము. మఱియు నేమికోరి తపస్సుచేయు చున్నదానవు? నీ వాంఛిత మెయ్యది? నీ మదిఁ గలవాంఛిత మును గోరుము. అన విని బృందాదేవి యిట్లులనియెను.

బ్రాహ్మణోత్తమా! కేదారరాజకన్యకను. నా పేరు బృందయందురు. బృందావనమునఁ దపస్సుచేయుచున్నదానను. రహస్యముగాఁ జేయుచున్న దీతపస్సే. శ్రీహరిని భర్తనుగాఁ బడయఁగోరి యున్నదానను. ఈ వరము నిచ్చుటకు సమర్థుఁడ వైనచో నా వాంఛితము నొసంగుము. అసమర్థుఁడవైనఁ బొమ్ము.

ఈ ప్రశ్నమున నేమిలాభము? అన నతఁ డిట్లనియె. ఏ వస్తువునం దిష్టము లేక యూహింపనైన శక్యముగానియట్లు వర్తిల్లుచుఁ బరమాత్మయనియు, నీశ్వరుఁడనియుఁ బ్రఖ్యాతిం గాంచి, నిర్గుణుఁడై,నిర్వికారుఁడై, భక్తానుగ్రహవిగ్రహుఁడై యుండువానిని భర్తగాఁ గోరిన నేమిలాభము? లక్ష్మియు సరస్వతియు నాయనకుఁ గలరు గదా. చతుర్భుజుఁ డగువైకుంఠవాసున కిద్దఱు భార్యలు గలరు. వారిని వదలి నిన్నుం గోరునా! ద్విభుజుఁడును, మురళీహస్తుఁడు నగు గోలోకనాయకునకుఁ గిశోరగోపవేషునకుఁ బరిపూర్ణతమునకు రాధ భార్యయగు. ఆమెయే పరాత్పరయనంబడుమహాలక్ష్మి. ఆలోకజనని బ్రహ్మాత్వరూపిణియై పరమాత్మయై యీశ్వరుండై తనరు శ్యామసుందరుని సదా సేవించుచుండును. ఆకృష్ణమూర్తియే రెండురూపముల నలరు. ద్విభుజుఁడుచతుర్భుజుఁడు నని. గోలోకమందుద్విభుజుఁడయి, వైకుంఠమునఁ జతుర్భుజుఁడయియు నుండును. పదునలుగు రింద్రులు గతింపఁగా బ్రహ్మ కొకపగలగు. రాత్రియు నంత పరిమితిగలది. ఇట్టివిముప్పదియైన నొకమాసము. పండ్రెండునెలలొకసంవత్సరము. అట్టివి నూఱువత్సరములైన బ్రహ్మ కాయుష్యము ముగియు. అట్టిబ్రహ్మను బుట్టించిన భగవంతు నెన్నికోట్లకల్పముల నుండియో సనకాదులు సేవించుచున్నవారు. ఇప్పటికి నసాధ్యుఁడయి యున్నవాఁడు.

వేయితలలు గలశేషుఁడుకూడ సదా సేవించుచున్నవాఁడు. రేయింబగల్లాతఁడు కోటికోటికల్పములు సేవించినను

గానరాఁడు. అసాధ్యుఁ డగునతని సాధింప శక్యమా. బ్రహ్మ యుఁ బరబ్రహ్మమగు నామహాత్మునిఁ బ్రతిజన్మమునందును భజిం చుచుండును. నాల్గుమోములను వేదవాక్కుల నుతించుచుం డును. వేదకర్తయగు నాబ్రహ్మ సర్వసంపత్ప్రదాతయు ఫలదా తయు నగుంగదా. కాలకాలాంతకాంతకుఁడగుపరమేశుని సాధిం పఁజాలక యున్నవాఁడు. ఆపరబ్రహ్మమే కళచే సంహారకర్త యగు రుద్రుఁడయ్యెను. ఆరుద్రుఁ డైదుమోములచే నుతించు చుండును. ఇఁకఁ దక్కినవారిమాట యిటనేటికి? భగవంతున కాబ్రహ్మకంటెఁ బ్రియుఁడు లేఁడు. దుర్గతినాశనియు సర్వశక్తి స్వరూపయు నగుదుర్గ మూలప్రకృతియని, యీశ్వరియని, బ్రహ్మస్వరూపయని, పరాపరరహస్యయని, నారాయణియని, విష్ణుమాయయని, సనాతనియని పొగడ్తగాంచును. ఆమాయ చేతనే యనిత్యమగు నీజగత్తు నిత్యమను భ్రాంతిగల్గినవి. ఆదుర్గ సదా భగవంతు నుతించుచున్నది. గజవక్త్రుఁడు కుమారస్వా మియు నుతించుచునే యున్నవారు. ఆగణపతికంటె విద్వాం సుఁడు లేఁడు కదా. ఆతనికే ప్రథమపూజ కలదు. జ్ఞానులలో నుత్తమోత్తముఁడు. గురువులకు గురువు. సరస్వతియు నాపర మేశ్వరు నుతింపఁజాలకున్నది. అట్టి భగవంతుని శక్తిచేతనే సూర్యుఁడు లోకము వెలిఁగించుచున్నవాఁడు. మేఘము వర్షిం చుచున్నది. అగ్ని దహించుచున్నది. సకలబ్రహ్మాండములు నిశ్చ లములై యున్నవి. అట్టిభగవంతునిశక్తిఁ బొగడఁదరమా. పైఁ జెప్పఁబడినవారుగాక తక్కినదేవతలు దేవేశులు మునులు

పరమేశ్వరు భజించుచున్నవారు. అట్టిభగవంతుని బతిగాఁ గోరుచున్నదానవే. ఆతఁడు ప్రకృత్యతీతుఁడుగదా. గోలోకమున రాధికకే సాధ్యుఁడు. తక్కినవారికి సాధ్యుఁడుకాఁడు. మహామతీ! నన్ను భజింపుము. దేవతలకంటె బలవంతుఁడను. దైత్యులకంటె బలశాలిని. ముల్లోకముల నేయేసుఖములుకలవో వాని నెల్ల ననుభవింపుము. నాయనుగ్రహమున నవియెల్ల దొరకును. సంశయములేదు. సప్తసాగరముల కవ్వలఁ గాంచనపురీవతంసము గలదు. దేవతలు క్రీడింప విశ్వకర్మ దాని నిర్మించెను. అచ్చటికింబొమ్ము. నాతో విహరింపుము. అందు ఇంద్రాదులకుఁ బ్రీతినిగల్గించు పుష్పోద్యానము కలదు. స్వర్ణసౌధపరిశోభిత మగు లంకానగరము కలదు. అచ్చటి కరుగఁగోరుదువే నరుగుము. అందు నన్నుంగూడి విహరింపుము. మఱియెన్నియో రమ్యోద్యానములు గలవు. అచ్చటికిఁ బోవ నిచ్చపొడమిన నరుగుము. అందు సుఖమనుభవింపుము. సుమేరుగహ్వరమునఁగాని, పాలసంద్రమునఁగాని, విహరింప నిచ్ఛగల్గిన నరుగుము. నేనును వచ్చెదను. బ్రహ్మకు నివాసమగు సత్యలోకమును జూడఁగోరినఁ జనుము. నన్నుంగూడి యట విహరింపుము. మలయపర్వతము కలదు. అందుఁ జందనవనములనుండి పరిమళవాయువు వీచుచుండును. మఱియు దిక్పాలకులనగరములు గలవు అందుఁ గ్రీడింప నిచ్ఛగలదేని పోదము రమ్ము.

అని యిట్లుపలికి తత్పాతివ్రత్యమును బరీక్షింపఁగోరి వ్యాజమునఁ బలుకు ధర్మదేవతరూపమున నలరు బ్రహ్మను జూచి

యాకేదారరాజకన్యక రోషారుణితనేత్రయై హితముగను, సత్యసమ్మతముగను, యోగయుక్తముగను, యశస్కరముగ నుండునట్లు ఈరీతిఁ బల్కఁజొచ్చెను. మహాత్మా! ధీరుఁడవు కమ్ము. బ్రాహ్మణుఁడు జాతులయం దుత్తముఁడు. వారికిఁ దపస్సు ప్రధానము. సత్యము వేదవ్రతము ధైర్యము ప్రధానములు. అధర్మాత్ములకుఁ బరస్త్రీవాంఛ గలుగును. అధర్మముచేతనే దుష్టుఁడవై యశుభఫలముల ననుభవింపఁ జూచుచున్నవాఁడవు. సమూలముగా వంశము నాశనము చేయఁజూచెదవు. పతివ్రతలను బలాత్కరించిన మాతృగామి యగును. బ్రహ్మహత్యాశతము గల్గును. కుంభీపాకమునఁ బడియుండఁగలఁడు. పరదారగమనమున క్షణకాలము సుఖము. చిరకాలము కష్టముల ననుభవింపవలసియుండును. అగమ్యాగమనము దుఃఖహేతువనియే సాధువు:లద్దానిం గోరరు. బ్రాహ్మణుఁడా! జ్ఞానదుర్బలుఁడవు. క్షమింపుము. ఇఁకఁబొమ్ము, నీకు మేలయ్యెడు; దీపజ్వాలంగాంచి కీటము పడిపోవును. ఆహార ముండుటం గాంచి దానిం దిన వలలో మృగము పడుచున్నది. బుభుక్షితుఁడు విషాన్నమును దినును. పయోముఖవిషకుంభమును దుష్టుఁడు పరిగ్రహించి యనుభవించును. అట్లే పరస్త్రీలముఖపద్మము మనోహరముగాఁ గనఁబడుచు దుష్టఫలము నిచ్చునది. వినాశబీజమగుదానిం దెలియక లంపటుఁడు భ్రాంతుఁడగు. స్త్రీలనుఖము రుచిరము. శ్రోణియుగ్మము, వక్షోజయుగళము, మనోహరతమము. కామాధారము. నాశబీజము. అధర్మస్థలము. రహస్యముగా, నిన్నలు

ముకొనఁజూచు నాపదలం దెలియఁజాలకనన్ను భ్రమింపఁజేయఁ గోరుచున్న వాఁడవు. ఇచటనే సర్వదేవతలు, లోకపాలకులు, జాజ్వల్యమానుఁడగు ధర్ముఁడు సాక్షులై యున్నవారు. వారే నిన్ను శిక్షింతురు. దండకర్తయగు యముఁడు, శ్రీహరిచే స్థాపింపఁబడియెను. జ్ఞానరూపుఁడు శ్రీకృష్ణుఁడు. మహేశ్వరుఁడు జ్ఞానరూపుఁడు, బుద్ధియే దుర్గ, మనస్సు బ్రహ్మ, ఇంద్రియములు దేవతలు, వీరు సర్వప్రాణులయందుందురు. సకలకర్మసాక్షులై యున్నవారు. గోప్య మెట్లు? రహస్యమేది? జ్ఞానదుర్బలుఁడవగునో బ్రాహ్మణుఁడా! క్షమింపుము. ఇఁకఁజాలుఁ బోమ్ము. నీకు శుభమగుఁగాక. బ్రాహ్మణులు వధ్యులుగారు. నిన్నిచటనే భస్మము చేయనేఁజాలుదు. ఐన క్షమించితి. వత్సా! ఇఁక నిష్టానుసారమరుగుము. నే నీతపస్సు చేయుచుండఁగా నూటయెనిమిదియుగములు గడచినవి. నాతండ్రివంశమే లేదు. ఇఁక దల్లిదండ్రులెట్లువత్తురు ? సర్వాంతర్యామియగు భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు నన్నుఁ గాపాడుచున్నవాఁడు. కృష్ణునిచే ధర్మము స్థాపింపఁబడినది. నన్ను నాకృష్ణుఁడే కాపాడుచున్నవాఁడు. ఆదిత్యులు,చంద్రుఁడు, వాయువు, హుతాశనుఁడు, బ్రహ్మయు, శంభుఁడు, భగవతి దుర్గయు, నన్ను సదా కాపాడుచుందురు. ఏభగవంతునిచే హంసలు తెల్లగాఁ జేయఁబడినవో చిలుకలు పచ్చగాఁ జేయఁబడినవో, మయూరములు చిత్రములుగాఁ జేయఁబడినవో ఆభగవంతునిచేతనే నేను రక్షింపఁబడుచున్నదానను. అనాథులగు బాలవృద్ధులకు దేవతలు రక్షకులు. నారీ

బుద్ధిచే నన్నుఁజూచుట నీకు ధర్మముకాదు. త్వరగాఁ గద లుము. తల్లినగు నన్ను వదలి వత్సా! యథాసుఖముగాఁ బొమ్ము. అని యిట్లుపలికి యాకన్యక యూరకుండెను. అంత నాతఁడు తన్ను బలాత్కరింపవచ్చుచున్నట్టు లెఱింగి యామె శపించెదఁ జూడుమని మహోగ్రహమున నోయి బ్రహ్మబంధూ! క్షయమునుగాంచుమూ. దురాచారుఁడా! నశింపుమూ. పాపా త్ముఁడా! పొడవడంగుమూ. అని మరల నింకనేదో శాప మీయఁబూనఁగా సూర్యుఁడు వారించెను.

అంతలో నచ్చటికి బ్రహ్మ విష్ణు శివాదు లతిసంభ్రాం తులై యరుదెంచిరి. కలారూపముననున్న ధర్ముం గాంచిరి. దేవ తలు దుఃఖించిరి కృష్ణపక్షాంత్యభాగముననున్న చంద్రునిభంగి క్షీణించియున్న ధర్మునిం గాంచిరి. సతీకోపాగ్నిదగ్ధునిగా నెఱిం గిరి. అపుడు భగవంతుఁ డిట్లనియె. బృందాదేవీ! క్షమింపుము. జన్మమృత్యుజరలను హరించు నాభక్తురాలవు. నాభక్తుఁడగు నీధర్ముని బ్రదికింపుము. ధర్మరక్షణ మొనర్పుము. అన బ్రహ్మయు నిట్లు పలికెను. ధర్మహీనమగుప్రపంచము నశించినట్లే యగు. కాన ధర్ముని బ్రదికింపుము. నీకు మేలయ్యెడు. మహాదేవుఁ డపు డిట్లనియె. ధర్ముండులేని యీలోక మంధకారపరిపూర్ణము. చంద్రుఁడు సూర్యుఁడు వడఁకుచున్నవారు. అనంతుఁడు భూమియు నట్లే. కావున క్షమింపుము. అపుడు సూర్యుఁ డిట్లని యెను. పతివ్రతా! వరముగోరుము. నీకు మేలయ్యెడుఁగాక. మనోవాంఛఁ దెలుపుము. ధర్ముని బ్రదికించి సృష్టిని గాపాడుము.

అంత ననంతుఁ డిట్లుపలికెను. తపస్సుచేత ధర్మము చేయుచున్న దానవు. నీవెట్లు ధర్ముని హింసించెదవు. కావున నీధర్ముని బ్రదికింపుము. నీకు శుభమగుంగాత. అనునంతఁ జంద్రుఁ డిట్లనియె. సాధ్వీమణీ! ద్విజరూపమును దాల్చి ధర్ముఁడు నిన్నుఁ బరీక్షింప నరుదెంచెను. బ్రహ్మయే యీతనిఁ బ్రోత్సహించెను. నిర్దోషుఁ డయ్యుఁ హింసింపఁబడెను. అంతలో నింద్రుఁ డిట్లనియె. తపస్సుచే ధర్మ ముపార్జింపఁబడినది. ధర్మముచేతనే మనుజులకు ఫలముగలదు. తపఃఫలము నెట్లు క్షయమునొందఁజేసెదవు? వరుణుఁ డపు డిట్లు పల్కెను. ధర్మాత్మురాలా! ధర్ముని బ్రదికింపుము. సనాతనధర్మమును గాపాడుము. ధర్ముఁడులేకున్న కర్మరతు లొనర్చుకర్మములు నిష్ఫలములు. అనునంత వాయుదేవుఁ డిట్లుచెప్పెను. శుభాంగీ! జగమును బావనముచేయుము. ధర్ముని గాపాడుము. ధర్ముఁడు నశింప నీతపఃఫలము నశించును. అన నగ్ని యిట్లు వచించెను. స్వధర్మోపార్జనముచేయ నిచటికి వచ్చితివి. ధర్మునెఱుంగక హింసించితివి. మరల బ్రదికింపుము అన యముఁ డిట్లనియె. ఈవిశ్వమున వేదోక్తకర్మకర్తలకు నేనే ధర్మానుసారముగా ఫలము నిచ్చువాఁడను. ధర్ముని వేగంబ బ్రదికింపుము.

అని యిట్లు దేవోత్తములు పలుభంగులఁ బలుకఁగా నా రాజకన్యక లేచి వారికి నమస్కరించి తపస్విని గావున నిట్లు పలికెను. మహానుభావులారా! నేనేమియు నెఱుంగను. బ్రాహ్మణరూపధారియగు ధర్ముఁ డీతఁడని యెఱుంగను. కోప

మున శపించి నాశమందఁజేసితిని. ఈతఁడు నన్నుఁ బరీక్షింప వచ్చిన శ్లైలుంగను. మీయనుగ్రహాతిశయమున ధర్ముని మరల బ్రదికింపఁగలను. అనిపలికి వారెల్ల వినుచుండ నాబృందాంగన యిట్లు పలికెను. నేను దపస్సునందు సత్యమునందు నాసక్తురాలనైనచో విష్ణుపూజానిరతచిత్త నగుట నిజమైనచో నా యీపుణ్యముచేత నీధర్ముఁడు విజ్వరుండగుఁగాక. నాకు సత్యవ్రతతపస్సు లభిముఖములై యున్నయెడల నాపుణ్యముచే నతఁడు జీవించుఁగాక. సర్వాత్మరూపుఁడగు నారాయణమూర్తి నిత్యవిగ్రహుఁడగుట సత్యమేని జ్ఞానాత్మకుఁ డగుశివుఁడు వెలయుట సత్యమేని యీవిప్రుఁడు విజ్వరుండగుఁగాక. పరబ్రహ్మము సత్యమూర్తిగలదేని, ప్రకృతి నిరుపమాకృతికలదేని యజ్ఞతపస్సులు సత్యములేని ద్విజుఁ డీతఁడు విజ్వరుఁ డగుఁగాక.

అనిపలికి యాబృందాంగన ధర్మునెత్తుకొని తొడపై నిడుకొని కలారూపుఁడగు నాతనిం గాంచి విలపించెను. ఇంతలో ధర్మభార్య మూర్తిదేవి దుఃఖాకులచిత్తయై విష్ణుపాదములఁ బడి శిరస్సువంచి యిట్లు పలికెను. కరుణాసింధూ ! దీనబంధూ ! కృపసేయుము. నాకాంతుని బ్రదికింపుము. పతిహీనయగునారి పాపాత్మకురాలు. భవార్ణవనిమగ్నురాలగు. దానిముఖము నేత్రవిహీనము. దేహము ప్రాణహీనము. తల్లిదండ్రులు సోదరులు కొడుకులు బంధువులు మితముగానిత్తురు. పతి సర్వదాతయే యగు. అని పలుకుచు లేవకుండెను. విలపించు

చుండెను. అంతఁ బ్రకృత్యతీతుఁడగు భగవంతుఁడు బృందను జూచి యిట్లుపలికెను. తపస్సుచే బ్రహ్మకు నెంతయాయువు గలదో యంతయాయువు నీచే సంపాదింపఁబడినది. ఆయాయుస్సు నీధర్మన కొసఁగి గోలోకమున కరుగుము. ఈతనువునుగూడియే పొమ్ము. వెనుక నన్నుఁ బతిగాఁ బడయఁగలవు. గోలోకమునకువచ్చి రాధాచ్ఛాయచే వృషభానునకుఁ దనయవై పుట్టఁగలవు. రాసమండలమున రాధంగూడి గోపికలు గొలువ నాసేవ చేయఁగలవు. రాధాదేవి శ్రీదాముని శాపమున వృషభానుపుత్త్రిక యెప్పుడగునో ఆరాధయే సత్యమగురాధ. నీవుఛాయాస్వరూపిణివి. నాకళవలనఁబుట్టిన రాయాణుఁడు వివాహకాలమున నీఛాయను గ్రహింపఁగలఁడు. నిన్నొసఁగి వాస్తవమగురాధ యంతర్హితురాలగును. గోకులమున రాధయే యని మూఢులు గాన భ్రమింపఁగల్గుదురు. స్వప్నమునందును రాధాపాదాంభోరుహమును జూడఁజాలరు. రాధ మదంకమందును, ఛాయ రాయాణసన్నిధి నుండఁగలదు.

అనుమహావిష్ణువచనముల విని యాబృందాకన్య తనయాయువు నొసంగెను. ధర్ముఁడు సర్వాంగశోభితుఁడై లేచెను. పరాత్పరునకు నమస్కరించెను. అంత బృంద యెల్లవారు విననిట్లు పల్కెను. దేవతలారా! నామాట నాలకింపుఁడు. ఇది దుర్లంఘ్యము. నావాక్యము మిథ్యగాదు. కోపభీతురాలనగు నాచేత "క్షయింపుమా" యని చెప్పఁబడినది. భాస్కరుని మూఁడువరములు గోరితిని. సత్యయుగమున ధర్మము పరిపూర్ణముగ

నుండును. త్రేతాయుగమునఁ ద్రిపాదముల నుండును. ద్వాపరమున రెండుపాదముల నుండును. కలియుగమున నేకపాదమున నుండును. కలాషోడశాంశము మిగిలియుండును. ఇట్లే నాల్గుయుగములయందు నగుచుండు. మూఁడుమాఱులు క్షయింపుమంటిని. మరల ననఁబూనఁగా భాస్కరుఁడు వారించెను. ఆకారణమున నీధర్ముఁడు కలిశేషమునఁ గళామయుఁడై యుండఁగలఁడు.

అని యాబృందాదేవి పలుకునంతలో దేవత లంబరము నుండివచ్చు దివ్యరథమును గాంచిరి. అది గోలోకమునుండి వచ్చుచుఁ గనుంగొన నతిసుందరముగా నుండెను. బృంద శ్రీహరికి నమస్కరించి బ్రహ్మను సర్వదేవతలను బ్రార్థించి యారథము నెక్కి గోలోకమున కరిగెను. దేవతలు తమతమనివాసముల కరిగిరి. ఇంక నేమి వినఁగోరుదువని శ్రీకృష్ణమూర్తి నందునింగాంచి ప్రశ్నించెను.

ఆర్యమహాశయులారా! కేదారరాజకన్యా దివ్యచరితమును వింటిరి. దానిసారము వినఁదగినది. దానినుండి నేర్చుకొనఁదగినవిశేషములు పెక్కులుగలవు. కేదారరాజకన్య మహాలక్ష్మీ యపరస్వరూపిణి యని తెల్లమాయెను. అగ్నికుండము నుండి యుదయించి రాజా! నేను నీకుఁ బుత్త్రికనైతినని పలికెను. కొలఁదికాలమున నాకన్య తపమొనరింప వనమున కేగెను. ఈకాలమునందు నట్టియాచారము రూపుమాసిపోయినను ఆకాలమునందు స్త్రీలుకూడ బ్రహ్మచర్యవ్రతమూని తపస్సుచేయుట యాచారమై యుండెనని దీన స్పష్టమగును. ఆమె తపస్సు

దృఢమనస్సుతోఁ జేయఁబడుచున్నదా లేదా యని బ్రహ్మపురి కొల్వ ధర్ముఁడు పరీక్షింపఁబోయెను. ఆమె మనోనియతి నరయు పూనిక్మై నెన్నియోరీతులఁ బ్రశ్నించెను. నిష్కల్మషస్వాంత కావునఁ దనవాంఛ నెఱింగించె. అవాంఛను దొలఁగించినఁ దొలఁగునో లేదో యని భగవంతుఁడు నీకు భర్తగా దొరకుట యసాధ్యమని యనేకభంగులఁ జెప్పెను. వాని కామె చిత్తము చలింపలేదు. తుదకామెను బట్టుకొనఁ బ్రయత్నించెను. కోపాగ్ని యామెచిత్తవేదికయందుఁ బ్రజ్వరిల్లె. ఆజ్వాల లాధర్మునిపైఁ బ్రసరింప వానితాఁకున నాతఁడు కలామాత్రశేషుఁ డయ్యెను. ఆతనిశక్తి యీకన్యక తపశ్శక్తి ముందు శక్తిగలదికాదయ్యెను. అనఁగానాకన్యక మనోవాంఛ న్యాయమైనది. సామాన్యమానవునింగోరక యైశ్వర్యమునుగోరి యింద్రాదులను వాంఛింపక యిహాపరములనిచ్చు భగవంతునే ప్రార్థించి నియతురాల య్యెను. ఆమెమనస్సు నిర్మలమైనది. దానియం దించుకయు లోపలేశములులేవు. భగవంతునితేజ మూమె మది నిలిచియుండెను. కావున ధర్మునంతవాని నిశ్శక్తునిగాఁ జేయఁజాలినద య్యెను. దీనింబట్టి యాలోచింపఁగా నేదుర్వాంఛలఁగోరక భగవత్ప్రీతినిమాత్రము పడయఁగోరి చేయుతపస్సు పరమోత్కృష్టమనియుఁ గార్యార్థముచేయుతపస్సు దానిముందు నిలువఁజాలదనియు స్పష్టమగును. ఈవిషయము,

"త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః. ౨౦

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్." ౨౧
భగవద్గీత ౪ అధ్యా.

అని శ్రీకష్ణభగవంతుఁడు వాక్రుచ్చెను. కావున ఫలమును గోరక చేయుతపస్సు వీర్యవంతమైనది. దానిని మీాఁజాలు తపస్సు వేఱొక్కటి కానరాదు. అందుననే కేదారకన్యకశాపము ధర్ముని భీతునిం జేయఁజాలెను. భగవంతు ననుగ్రహము నిష్కామతప స్సొనరించువారియం దెక్కుడుగ వ్యాపించునని తోఁచెడిని. భగవద్గీతయందు,

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః."
౧౮అ. ౬౬శ్లో.

అని శ్రీకృష్ణు లుపదేశించిరి. కావున సకలవిషయములకు భగవంతునే నమ్మినవారియం దాపరమేశ్వరున కెక్కుడను గ్రహము గలుగుననుట నిర్వివాదాంశము. కేదారకన్యకాచరిత్ర మీావిషయమునే మిక్కిలి యుపదేశించుచున్నది. కావున నేవాంఛలులేక భగవదారాధనము చేయవలయుననిదీనిసారము. స్త్రీలు తపస్సుచేయరాదన్నవాదము దుర్వాదమనియు దానిం బాటింపరాదనియు మన కీగాథ తెలుపుచున్నది. పురుషులు చేయుతపస్సునకంటె స్త్రీలు చేయుతపస్సు తీవ్రమనియు నది త్వరఁగా ఫలించుననియు స్పష్టమగుచున్నది. ఇంద్రియచాపల్యమెక్కుడుగాఁగలవారుకదా స్త్రీలు. అట్టివారే జితేంద్రియత

నభ్యసించి తపస్సొనరించిన నది శీఘ్రఫలప్రదముకాదని యెవ్వ రందురు? కాఁబట్టి మానినులు భగవంతు నర్చింపరాదనియుఁ, దపస్సు నేకాంతముగ నుండి చేయరాదనియు, వాదించుట మొండివాదమని యీభగవద్వాక్యమునుబట్టి స్పష్టము కాక మానదు. భగవదారాధన మొనర్ప నందఱ కధికారముగలదు. భగవంతుని భజించి తనదుర్గతిని దొలఁగించుకొనుట కెల్లవారి కిని స్వత్వము కలదు. దాని నాక్షేపించు నధికార మెవ్వరికిని లేదని నిరాఘాటముగాఁ జేయియెత్తి చెప్పవచ్చును. ఇట్టి యపూర్వవిషయముల నీగాథ మనకు బోధించుటయేగాక దుర్వాదముల నెన్నింటినో తూలఁగొట్టినది. కావున నీగాథను బఠించుటమాత్రమునఁ దృప్తినొందక కేదార రాజకన్యవలె భగవత్సేవచేయ నేర్చుకొని యామెవలె భగవంతునికృపకుఁ బాత్రు లగుటకుఁ బ్రయత్నింపవలయును. భక్తోద్ధరణమే భగవంతుని కృత్యమాట భక్తులమొఱ్ఱ యెపుడు వినఁబడునా యని యాపరాత్పరుఁడు వేచి యుండును. ప్రార్థించుటయే తడవుగాని సర్వేశ్వరుఁడు సాయపడ నాలసింపఁడు. ఆప్రార్థనము కార్యార్థము కాఁగూడదు. కార్యార్థమైనచో సంపూర్ణభగవత్కారుణ నొందుటకు భక్తుఁ డర్హుఁడు కాఁడు. నిష్కల్మషస్వాంతమున నారాధించు భక్తులకు సర్వేశ్వరుఁడు చేయూఁత యొసఁగ సిద్ధముగ నున్నవాఁడు. స్వాంతము నిర్మలము గానిచో నాస హాయము దొరకదు. ఆపదలయందు భక్తి నాశ్రయించుట యల్ప మతిలక్షణముగాని భక్తలక్షణము కాదు. ఏభక్తునిస్వాంత మెట్టి

దో భగవంతుఁ డెఱుంగును. కావున నిష్కల్మషమనస్సుతో నిర్వ్యాజభక్తితో నేకర్మములాచరించినను వాని ఫ్రతిఫలమును గోరక పరమేశ్వరార్పణము చేయుచుండ వలయును. అతఁడే భక్తుఁడు. వాఁడే సత్కార్యాచరణార్హుఁడు. వాఁడే పరమయోగి. వాఁడే భగవత్సేవ కర్హుఁడు. వానినే కృపానీరధి కటాక్షించును. అపుడు ముక్తి కరతలామలకము. ఈవిషయమును నమ్మి శ్రీకృష్ణ పరబ్రహ్మమును సేవింపుఁడు. సదాభగవన్నామము నుచ్చరింపుఁడు. భగవంతునియర్చారూపమును ధ్యానింపుఁడు. భగవంతుని విచిత్రకృత్యము లగుభక్తరక్షణాదుల స్మరింపుఁడు. కృతకృత్యు లగుదురు. ఇది నిక్కము. సత్యము. యథార్థము. పరమార్థము.

ఓం తత్సత్. శ్రీకృష్ణార్పణమస్తు.

మహిమప్రదర్శనమనుపష్ఠప్రకరణము సమాప్తము.

---

శ్లో. ఆతామ్రాయతలోచనాంశులహరీలీలాసుధాప్యాయితైః
గీతామ్రేడితదివ్యకేళిభరితైస్స్ఫీతం వ్రజస్త్రీజనైః
స్వేదాంభఃకణభూషితేన కిమపి స్మేరేణ వక్త్రేందునా
పాదాంభోజమృదుప్రచారసుభగంపశ్యామి దృశ్యంమహః.
పాణౌ వేణుః ప్రకృతిసుకుమారాకృతౌ బాల్యలక్ష్మీః
పార్శ్వే బాలాః ప్రణయసరసాలోకితాపాంగలీలాః
మౌళౌ బర్హం మధురవదనాంభోరుహే మౌగ్ధ్యముద్రే
త్యార్ద్రాకారం కిమపి కితవం జ్యోతిరన్వేషయామః. 30

శ్రీ శ్రీ శ్రీ

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1927.